ఓం

# శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి


గ్రంథకర్త:

డాక్టర్ కె. యమ్. రుద్రప్ప

L. M. S., L. C. P. S., D. P. H.,



ప్రతులు ౧౦౦౦

"పంచాక్షరి" (ప్రింటింగ్ వర్క్సు) నందు సుముద్రితము.

హైద్రాబాద్ దక్కన్.

వెల ౨రూ. మే. 1938

ఓం

# శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి

గ్రంథకర్త:


డాక్టర్ కె. యమ్. రుద్రప్ప

L. M. S., L. C. P. S., D. P. H.,



ప్రతులు ౧౦౦౦

"పంచాక్షరి" (ప్రింటింగ్ వర్క్సు) నందు సుముద్రితము.

హైద్రాబాద్ దక్కన్.

[illegible] మే. 1938

# పీఠిక

ఈ వీరశైవ మతగ్రంథము వివిధ ప్రమాణములచేత వీరశైవమత తత్వములను, ఆచారములను సిద్ధపరచి సరళ భాషయందు శ్రమవహించి వ్రాయబడినది. ఈ గ్రంథమును వ్రాయుటయందు యెట్టి పక్షపాతబుద్ధియు గల్గకుండ, సద్వివేకము నుపయోగించి విశాలహృదయముతో ఆలోచించి, అనేక ప్రమాణములు సంగ్రహింపబడినవి. కపోలకల్పితము లిందేమియు లేవు. ఆగమసిద్ధాంతములను ముఖ్యవీరశైవ మత ప్రామాణ్యములుగా నమ్మి తన్మత ప్రతిపాదనకై అనేక ప్రామాణ్యములు వేదోపనిషత్పురాణేతిహాసములనుండి కూడ జూపింప బడినవి. ఈ గ్రంథావలోకన వలన వీరశైవమతము బహుసులభముగా దెలియనగును. ఇందు ప్రతిపాదింపబడిన ప్రతి అంశము సూక్ష్మ రూపముగ వివరించిన గ్రంథ సజతత్వము తెల్లమగునని ఈ ప్రస్తావన వ్రాయబడినది.

౧ వీరశైవమత ప్రాచీనత:— వీరశైవులు శివ సృష్ట్యారంభము నాఁడే ప్రమథ గణములై యుద్భవించి రనియు, తద్గణ మహారాజులే ఆచార్యులనియు, తదాచార్య పరంపరయే భక్త మాహేశ్వరులనియు, భక్తమాహేశ్వరు లందు భేదబుద్ధి కల్పిత మనియు నిశ్చయింప బడినది. ఇదియే అప్రాకృత సృష్టియనఁ బడుచున్నది. వీరియందు గురుశిష్య తారతమ్యమే కాని వేరులేదు.

౨ వీర శైవమత గ్రంథములు:— శివోక్త శివాగమములే ముఖ్య ప్రామాణ్యములు. ఇతర గ్రంథములు తన్మతాభిప్రాయ ప్రతిపాదితము లనియే ఒప్పబడుచున్నవి. లేకున్న ఆధార గ్రంథములుగా గ్రహింపబడవు.

౩ వీరశైవమత దేవత:— వీరశైవులు అద్వితీయుడైన శివుని మాత్రమే ధ్యేయుడని నమ్మి అర్చింతురు. శివేతర దేవతార్చనాదులను నిషేధింతురు.

౪ వీరశైవసిద్ధాంతము:— శివుడు శక్తివిశిష్టుడు కనుక శక్తివిశిష్టాద్వైతమే వీరిమతము. సర్వప్రమాణ సిద్ధమైన ఈ ప్రకృతిరూప ప్రపంచము శివుని పరిణామ భూతమైయున్నందున శివస్వరూపమనియే నమ్ముదురు. ఈ ప్రమాణముగాన మిథ్యావాదమును నిషేధింతురు.

౫ వీరశైవగోత్రములు:— వీరశైవులకు ఆచార్యఋషిగోత్రములు లేవు. శివప్రతాపాదిగుణములె మూర్తిమంతములై నంది, భృంగి, వీర, వృషభ, స్కంద యనువారు ఐదుగురు గోత్రాధిపతులైరి. వీరిగోత్రోద్భవులే పంచాచార్యులు కనుక వీరశైవులకు సంద్యాములే మూలపురుషులని సిద్ధమగుచున్నది.

ధ శైవమతమును శివుడు పార్వతికి మరియు స్కందునకు బోధించి యున్నాడు. స్కందుడు నంద్యాదులకు మరియు నంద్యాదుల వలన ఇతరాచార్యులకు బోధ యయిన దని తెలియుచున్నది.

౬ వీరశైవమతాచార్యులు:— ప్రతియుగమందు శివాంశ సంభూతులైన పంచాచార్యులు వీరశైవ మతోద్ధారము కై వేరువేరు నామములచే నవతరించి శివభక్తిని విశ్వమునందంతట వ్యాపింపజేసిరి.

౭ వీరశైవము:— శివుని బోధించు మతమే శైవము. తన్మతము నాచరించు వారే శైవులు. ఈ శైవుల యందు శివవ్రతమును దీక్షాపూర్వకముగా నాచరించువారే వీరశైవులు. వీరవ్రతముగా నాచరింపబడిన శైవమే వీరశైవమన బడుచున్నది ఇదియే సర్వోత్కృష్టమైన మతము.

౮ వీరశైవమతధ్యేయము:— శివైక్యమను మోక్షమే ముఖ్యధ్యేయము వీరశైవుడు క్షణిక సుఖప్రదమైన స్వర్గాది సుఖముల నాశింపడు.

౯ వీరశైవలక్షణములు - వీరశైవుడు:— శివుడు నిరాకార మూర్తి యైనందున మోక్ష ప్రాప్తికొఱకు సాకార వస్తువుచే నిరాకారమూర్తిని భావించి శివలింగ రూపమున పూజించును. శివలింగము నెల్లప్పుడు ధరించును శివదీక్షయే అతని సంస్కారము లింగార్చనయే. అష్టావరణ, పంచాచారములే నియమిత ధర్మాచరణములు. షట్స్థలమే షడంగ యోగము భక్తి జ్ఞాన, వైరాగ్యములే సాధన మార్గములు. ఇదియే శివవ్రతము. ఈ వ్రతమును ఆజీవాంతము పాలించుటయే వీరశైవుని లక్షణము.

౧౦ శివుడు:— శివునకు బ్రహ్మము, ఓంకారము, ప్రణవము, లింగము, మొదలగునవి పర్యాయ వాచకములు అనేక నిగమాగమ ప్రమాణములచే శివుడే జగదుత్పత్తి స్థితిలయ నిగ్రహానుగ్రహ సమర్థుడనియు, బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వర సదాశివాది దేవతలకు సమస్తచరాచర ప్రపంచమునకు జనకుడనియు, సర్వోత్కృష్టుడనియు ప్రతిపాదింప బడినది

౧౧ శివపూజ సనాతనత్వము:— బ్రహ్మాదిమనుష్య పర్యంతము శివుని లింగరూపముగా పూజించి తమతమ పదవులను బొందిరి. వీరిలో కొందరు స్థావర లింగమును ప్రతిష్ఠించి పూజించిరి. మరికొందరు శరీర త్రయములందు లింగత్రయ ధారణము గావించుకొని మలత్రయములను వదలి సదా లింగార్చకులై మోక్ష

మును పొందిరి. ఈ లింగధారులే వీరశైవులు. బ్రహ్మవిష్ణ్వాది దేవతలు, గౌతమాది ఋషులు మొదలైన వారు శివలింగ ధారణ శివార్చనాదుల వలన తమ ఇష్టార్థములను పొందిరి యని అనేక ప్రమాణములు చూపింప బడినవి. కనుక శివపూజ ఆదికాలమునుండియే రూఢిలోయున్నదని అవగతమగుచున్నది.

౧౨ శివాధిక్యము:— వేదములు రుద్రనామము చేతనే శివుని స్తోత్రము చేయుచున్నవి. ఉపనిషత్తులు పర శివ బ్రహ్మమునే బోధించు చున్నవి పురాణములు సాకార శివ లింగపూజనే చాటుచున్నవి. బ్రహ్మవిష్ణ్వాదులు శివస్తుతి చేయుచు శివునే అధికునిగా జెప్పిరి. ముముక్షువులు శివునియందే మోక్షమును గాంచిరి కనుక శివుడే సర్వశ్రేష్ఠుడని ప్రతిపాదింప బడినది.

౧౩ శివతత్త్వము:— చిచ్ఛక్త్యాత్మకుడైన శివుడు సృష్టి జేయ సంకల్పించు కొని చిచ్ఛక్తిని విస్తరింపజేసి తానందు ప్రవిష్ఠ మానుడై శివ, శక్తి, సదాశివ, ఈశ్వర. శుద్ధవిద్యాయను ౫ శుద్ధతత్త్వములను, మాయా, కలా, అశుద్ధవిద్యా. రాగ, కాల, నియతి, పురుష, యను శుద్ధాశుద్ధ తత్త్వములను, ప్రకృతి, బుద్ధి, అహంకార, మనస్సులను అంతఃకరణ పంచ జ్ఞానేంద్రియ, పంచ కర్మేంద్రియను పంచ తన్మాత్రలు, పంచ భూతములను, ఇరువది నాలుగు అశుద్ధ తత్త్వములను మొత్తము ౩౬ శివ తత్త్వములను నిర్మించెను ఈ ౩౬ తత్త్వములచే కూడినదే చరాచరాత్మక ప్రపంచము. ఇది శివునికన్న భిన్నమైనది గాదు ఇది శివుని వలెనే సత్యమైనది. ఈ తత్త్వములందు మార్పులు గలుగు చుండును గాని నాశము గలుగదు.

౧౪ శివసృష్టి:— శివునకు సృష్టింప బడిన ప్రపంచమునకు వస్తుతః అభేదము వ్యక్తితః భేదము సూచింప బడును. అనగా బంగారము చేతనే సొమ్ములు బంగారము యొక్క వికారములే కాని అన్యము కానట్లు, ప్రపంచము శివస్వరూపమనియే వీరశైవులు భావించు చున్నారు. లేనిది పుట్టదనియు సమస్తము బీజరూపముగ శివునియందు అడగియున్నదనియు వీరి అఖండ మత సిద్ధాంతము.

౧౫ శివకర్మలు:— వీరశైవులు ప్రాకృత కర్మోపాసకులు గారు. అనగా స్వర్గాద్యల్పసుఖ ప్రదములైన అగ్నిష్టోమాది కర్మలనాచరింపరు లింగార్చనాది సతి కర్మలనే శివార్పణ బుద్ధిచే జేయుచుందురు. వీరశైవునకు శివార్చన

రూప శివయోగము శివజ్ఞానము రెండును ముఖ్యమైనవి యోగము లేని జ్ఞానము, జ్ఞానముగలుగని యోగము రెండును వ్యర్థములు.

౧౭. లింగము:— "లీనంగమయతీతి లింగం" ఏపరశివబ్రహ్మము నందు సమస్తము లయించి మరల పుట్టుచున్నదో అదియే లింగము. అనగా చరాచరాత్మక విశ్వమే లింగమని తెలియవలెను. లింగ బాహ్యము ఏమియు లేదు. కనుక అట్టి విశ్వమయ శివలింగమే వీరశైవులకు పూజనీయమైనది ఈపర శివలింగమునే వేదములు ఉపనిషత్తులు ఆగమములు పురాణములు పూజకు యోగ్యమని బోధించుచున్నవి. బ్రహ్మాదులు పూజించుచున్నారు. కనుక లింగ పూజ సనాతనత్వము సిద్ధించుచున్నది.

౧౮ లింగధారణము:— వీరశైవులు సర్వకాలావస్థల యందు గురుదత్త లింగమును శరీరముపై ధరింతురు లింగధారణమే వీరిధర్మము ఆ లింగమును త్రికాలములందు కరపీఠమునందు మాత్రమే పూజింతురు. స్థావరలింగ పూజాదు లను వీరశైవులు నిషేధింతురు లింగధారణయుక్త లింగార్చనమే వీరశైవధర్మము.

౧౯ లింగాంగ సామరస్యము:— అంగమే జీవుడు, లింగమే శివుడు ఈరెండిటి ఐక్యసంబంధమే లింగాంగ సామరస్యము. అనగాజీవుడు శివస్వరూపు డైనను అజ్ఞానమను మాయా శక్తి చేత ఆవరింపబడి దేహమే నేనని తెలిసి సుఖ దుఃఖాదులను తాపత్రయాదులను లోబడి తననిజస్వరూపము మరచి యుండి జీవ త్వముపొందును. గురుముఖమువల్ల తననిజజ్ఞానము గలిగినంతనే జీవగుణముల బాసి "అహంశివోహం"యను దృఢనిశ్చయ మనస్కుడై శివైక్యము పొందును. ఇదియే శివజీవైక్యము. ఇదియేవీరశైవుల సిద్ధాంత రహస్యము.

౧౯ శివదీక్షా:— వీరశైవులను గురువునాశ్రయించుట, తన్మూలముగ అజ్ఞాననాశనము గావించుకొని జ్ఞానమును ప్రాప్తించుకొనుట యనునదే దీక్షా సంస్కార మనబడుచున్నది అట్టిగురుకారుణ్యము గాకున్న లింగపూజాదులు నిర ర్థకమగుచున్నవి. వీరశైవులందు ఈ జ్ఞానైకదీక్షను బొందుటయందు లింగధారణ లింగార్చనాది శివ కర్మలయందు స్త్రీ పురుషులిద్దరికి సమానాధికారము గలదు.

౨౦ అష్టావరణములు:— గురు, లింగ, జంగమ, భూతి, రుద్రాక్ష. మంత్ర, తీర్థ, ప్రసాదములను నవే అష్టావరణములు ఇవి గలవాడే వీరశైవుడు.

౨౧ పంచాచారములు:— మనోబుద్ధిచిత్తాహంకారములను కుదుచుమా
మార్గములు.

౧ లింగాచారము. శివదీక్షనుపొంది ఓంకారాత్మకమైన లింగమును పూజించుట లింగమును తనప్రాణముగా భావించుట.

౨ సదాచారము. ఎల్లప్పుడు శుచిర్భూతుడై పవిత్రమనో భావముతో వర్తించుట.

౩ శివాచారము. శివుని యందే ఐక్యమగుట. శివేతర దేవతలను పూజించకుండుట

౪ గణాచారము. కుల శీలములను పాలించుట.

౫ భృత్యాచారము. గురు లింగ జంగమాదు లందు భక్తి, లింగాంగు లందు అనురక్తి, దుర్గుణములందు విరక్తి, సమస్త ప్రాణి సమూహమునందు అనురక్తి కలిగియుండుట.

ఈ పంచాచారముల ప్రతి వీరశైవుడు తనకర్తవ్యమని ఆచరించును. లింగైక్యమును గావించు ఉమేట్లే షట్స్థలములు. ప్రతివీరశైవుడు కర్మజ్ఞానోభయాత్మకమైన ఆరు స్థలములను బొంది మోక్షమును లింగైక్యమును పొందవలెను. లేకున్న జన్మ సార్థకము గాకుండును

ఈ ప్రకారము శాస్త్రానుభవ వేద్యమైన శైవతత్వము నానేర్చినంతవరకు సర్వజన సుగ్రాహ్యము గావలయునను తలంపుతో కృషి జేసి సమకూర్చినాడను. ఈ సందర్భమున బ్రహ్మశ్రీ కావ్యతీర్థాది బిరుదాంకితులైన చిదిరమఠము వీరభద్ర శర్మ గారు 3-4 ప్రకరణములు పరిశీలించి ప్రకటనార్హతను తెలిపి నందుల కెంతయు కృతజ్ఞుడను "పంచాక్షరీ" ముద్రణాలయమువారు అచ్చుతప్పుల దిద్దుటలో ఎంతయో కృషి జేసి యుండిరి. వారికి గూడ నాకృతజ్ఞతనుదెలుపుచు, శైవ మహా జనులు ఈ గ్రంథమును లెస్సగ ఆదరింతురని విశ్వసించుచు విరమించుచున్నాను.

డాక్టర్. కె యమ్. రుద్రప్ప,
చుడీ బజారు, హైద్రాబాద్ ద.

# విషయసూచిక.

౧ ఆగమ పరిజ్ఞానము ౧



౨ వీర శైవము ౨౯



౩ శివ తత్త్వము. ౫౩



౪ లింగతత్త్వము. ౧౧౭



"పంచాక్షరీ" (ప్రింటింగ్ వర్క్సు) మహారాజగంజు, హైద్రాబాద్ ద.

ఓమ్

శ్రీ శివాయ నమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి.

## ఆగమ పరిజ్ఞానము

### మొదటి ప్రకరణము.

శ్లో॥ యద్బ్రహ్మ ప్రవదంతి సిద్ధి మతయః సర్వాంతరస్థం శివం
యస్మాజ్జాత మనేకతత్త్వ నిచయం యస్మిన్పునర్లీయతే
యేనేదం ప్రతిభాంతి తం బాహ్యాంతరం విశ్వం జగస్థీయతే
తత్త్వం సతతం భజేఽమృతమయం తేజోమయం చిన్మయం
నమశ్శివాయ గురవే గురవే శివరూపిణే
శివలింగాయ గురవే శివాయ గురవే నమః॥

శ్లో॥ వందే శంభు ఉమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిం
వందే సూర్య శశాంక వహ్ని నయనం వందే ముకుంద ప్రియం
వందే భక్త జనాశ్రయంచ వరదం వందే శివం శంకరం॥

వీరశైవము ఉత్కృష్టమైన శైవమతము. ఇది శైవమత మంథనము నందు జనించిన నవనీతమని కూడ జెప్ప వచ్చును. ఈమతము శివసాంప్రదాయము ననుసరించినది. ఈమతము నందు ప్రాముఖ్యముగ శివజీవైక్య సంధానము గలుగ జేయునట్టి మార్గములే బోధింపబడినవి. సంసారవిషయసుఖభోగములు తుచ్ఛములుగా నెంచబడినందున కామాది వికారములు జీవుని సంసారార్ణ్ణమునందే త్రోయునట్టివని తెలిసి, ఈఅల్ప సుఖముల నిచ్చునట్టి కామ్య కర్మల నాశ్రయించక శాశ్వతానందమును గలుగ జేయు శివసాన్నిధ్యమునే వీరశైవులన్వాదించిరి. ఇట్టిపశు పాశ నివృత్తి గలుగ జేయునట్టి శాస్త్రము అతిదుర్లభమైనందున శివుడు ఆగమ రూపకములుగ పార్వతీ దేవికి బోధించి యున్నాడు. తచ్ఛివ సాంప్ర దాయక శాస్త్రములు శివాగమములనియే పరిగణింప బడుచున్నవి. ఆ ఆగమముల యొక్క పరిజ్ఞానమే సమస్తశైవ సాంప్రదాయకులచే విచారణీయమైనది.

# మోక్ష శాస్త్రము.

సామాన్యముగ నేవస్తువు యొక్క గుణ ధర్మముల లేక స్వభావ నియమముల వ్యవస్థితి మరియు పూర్ణ వివేచనమే ఆ వస్తువు యొక్క శాస్త్ర మనబడును. శరీరశాస్త్రమనగ శరీరము యొక్క ఉత్పత్తి స్థితిలయ రచనా వివరము. అనగా ఆరోగ్య అనారోగ్యాదుల వివేచనము. మానవ శాస్త్రమనగ మనస్సు యొక్క గుణధర్మముల మరియుమనస్సుయొక్క అహంకారము, స్మరణశక్తి,బుద్ధిశక్తి, భావనాశక్తి,సంకల్పశక్తి, మొదలైనవాని జాగ్రత్స్వప్న సుషుప్తులయు,సమాధిఅవస్థల యొక్కయు, వ్యవస్థిత వివేచనము. అదేరీతి ఆత్మయొక్క మూల స్వరూపము, స్వభావము, అజ్ఞాన వశమున ఆతనికి బంధము. జ్ఞానము వలన ఆతనికి ముక్తి ముక్తిని పొందు సాధనమార్గము. ఈసంబంధముగల అనుభవపూర్ణ వివేచనమే అధ్యాత్మ శాస్త్రమన బడును. మోక్ష ప్రాప్తియే ఈ శాస్త్రము యొక్క ఇష్టధ్యేయమై యున్నందున దీనిని మోక్ష శాస్త్రమని కూడ యందురు. వేదముల యొక్క అంత్యభాగమైన ఉపనిషత్తులందు ఈశాస్త్రము ప్రతిపాదింప బడి యున్నందున దీనికి వేదాంత శాస్త్రమని కూడ సార్థక నామము గలదు.

శైవాగమ శాస్త్రజ్ఞులు ఈవేదాంత నామక అధ్యాత్మ శాస్త్రమునే షట్స్థల శాస్త్రమని యందురు సాధకుడు భక్తస్థితినుండి ముక్తస్థితిని జెందువరకు ఆరు స్థలములు గలవని శాస్త్రజ్ఞులు భావించిరి. ఈఆరు స్థలములు లేక అవస్థలే షట్ స్థలములన బడును. కనుక షట్స్థల శాస్త్రమనగ ఆరుమెట్లు గల అధ్యాత్మ శాస్త్రము.

ఇక మోక్షశాస్త్రమననేమి? దాని మహత్వమేమి? విచారించుట అత్యావశ్యకము. మనము మననావరించుకొని యున్న సృష్టి జడము చేతనము యని రెండు భాగములుగా విభాగింప వచ్చును. జడసృష్టి స్వసంవేదరహితమైనందున దానికేవిధమైన ఎరుక అనగఎచ్చరిక లేకయున్నందున దానికి బంధమోక్షములు రెండు సమానమే ఐనను చేతన సృష్టి విచారము జేయు నప్పుడు మాత్రము బంధము మోక్షము యను సంగతులను మనము విమర్శింప వలసి వచ్చును. "నేను ఉన్నాను"అను ఎరుకయే సందేహముల యొక్కయు జ్ఞానముయొక్కయు మూలాధారము సమస్త జ్ఞానమునకు అనుభవ సర్వస్వమునకు మూలభూతమైన ఎరుకను దీసివేసిన జ్ఞానమునకు అథవా అనుభవమునకు ముందు అవలంబ

నము లేక ఆశ్రయము మిగిలి యుండదు. "నేనుఉన్నాను" ఈ వాక్యములోని "నేను" అను వ్యక్తి యొక్క యదార్థ స్వరూపమును తెలిసికొని ఆ తెలివినే స్థిరము జేసుకొని ఆ తెలివి ప్రకారమే ఆచరించు చుండుట ఆత్మజ్ఞాన ఆధ్యాత్మిక ఆచరణములన బడును. తననుతాను తెలిసిననే తానుగురువగును. ఆత్మనిశ్చయ మునందే కైలాసము గలదు. "నేను"అను చిన్న శబ్దమునందు గూఢమై యున్న గహనార్థమును తెలుసు కొనుటయే జ్ఞానముయొక్క పరమావధి యనబడును మన జ్ఞాన జీవనము "కోహం" నేనెవరు? యనిప్రారంభమై "సోహం" అతడే నేను అనగా ఆత్మగాక దేహధారిని నేనుగాను అనువరకు ముగియును. ఇట్టిజ్ఞానమును గలిగించు శాస్త్రమే ఆధ్యాత్మ శాస్త్రమనబడును. ఆత్మను సంబంధించినదగుట వలన అధ్యాత్మ శాస్త్రమనబడును. మోక్షపరిణామియు, మోక్ష పర్యవసాయి యైనందున మోక్ష శాస్త్రమన బడును.

సామాన్యముగ "నేను" అనగానే ప్రతివానికి తన పాంచభౌతిక దేహము యొక్క బోధయే యగుచున్నది. కాని విచారాంతము నందు ఈ పాంచ భౌతిక దేహముగాని దేహధారక ప్రాణముగాని సంకల్పవికల్పాత్మక మనస్సుగాని, వ్యవసాయాత్మక వాసనాత్మిక బుద్ధిగాని "నేనుగాను" "నేను ఇవియన్నిటిని మీరిన చిద్రూపసాక్షినై యున్నాను" అను తెలివి గలుగును. ఈ తెలివియేఆత్మజ్ఞానము దేహాదులే తాను అను కల్పన యుండు నంత వరకు మనుష్యునకు దుఃఖాదులు ద్వంద్వములు వదలవు. నేను దేహాదుల గాను. నేను కేవలము చిన్మయాత్మను అను తెలివి దృఢమైన అతనికి దుఃఖము సంభవించదు. అతని ద్వంద్వములు ముట్టకుండును. క్షణికములైన బాల్యకౌమారాది మరియు జరా మరణాద్యవస్థలకు లోబడి యున్న ఈ దేహమే తానని మనుష్యుడు వాడుకగ తెలియు చుండును. మరియు నేనల్పుడను, పాపిని, బద్ధుడను, అజ్ఞాని నని భావించు చుండును. అందు వలన అనేక కామవికారములచే పీడితుడౌచుండును. కాని నేను చిన్మయాత్ముడను, పూర్ణుడను, కామాతీతుడను, సుఖిని, అవ్యయుడను అనాదిని, నాకు జనన మరణాదులు లేవు. అను భావము దృఢమై నంతనే తన యందు ఆంతరిక సమాధానము కుదురును. ఇట్టి వానినే నిజసుఖార్థి లేక మోక్షసుఖార్థి యన వచ్చును. ఈపరమ సుఖ స్థితి కోరని వారెవరు? ఇది మానుష స్వాభావికేచ్ఛ యని తెలియ వలెను.

అర్థ శాస్త్రము, రాజనీతి శాస్త్రము, ఆయుర్వేద శాస్త్రము, సమాజ శాస్త్రములే మొదలైన వాటి వలన కేవలము క్షణభంగురమైన దోష యుక్త పరావలంబ విషయ సుఖమే ప్రాప్తమగును. కాని నిత్య నిర్దోష స్వతంత్రమైన ఆత్మసుఖము దొరకదు. ఈ బాహ్య సాధనములతో మనుష్యునకు పూర్ణతృప్తి దొరకుట అసాధ్యము. అతనికి అమృతత్వము లభించదు. స్త్రీ, సంపత్తు, రాజ్య భోగముల వలన నిజమైన ఆంతరిక సుఖతృష్ణ తీరదు. కనుకనే అందరును ఆత్యంతిక సుఖమును నిజమైన ఆనందమును కలుగ చేయ కంకణ బద్ధమై యున్న మోక్షశాస్త్రమునే ఆశ్రయించ వలసి వచ్చును. ఇందు చేతనే మోక్ష శాస్త్రము సర్వశాస్త్రముల శిరోభూషణమై యున్నది.

మోక్షము యొక్క ఉత్కటేచ్ఛయే ఈ శాస్త్రము యొక్క బీజము ఇది మొదలు దివ్యదృష్టి గలిగిన ఋషులయందు మొలకలెత్తెను. కేవల విషయ సుఖములు అవి స్వర్గ లోకము యొక్క సూక్ష్మ సుఖములైనను నశ్వరములు మరియు దోషయుక్తములైనవని యను జ్ఞానము మొదలు గలిగి అక్షయ సుఖ శోధన ప్రారంభమాయెను.

స్వర్గము మరియు మోక్షము వీటి కీడు మేలుల విచారము వేదము యొక్క అంత్య భాగములైన ఉపనిషత్తుల యందు కన్పట్టుచున్నది. యజ్ఞ యాగాది కర్మముల వలన స్తుతి స్తోత్రాదుల వలన వేరువేరు దేవతలను సంతోషింప జేసి ఇహపరసుఖములను లభింప జేయుటకే వేదములందు అధిక మహాత్మ్యము ఇవ్వబడినది. ఐనను ఇట్టి సుఖములు క్షణభంగురములని వాటిని తుచ్ఛముగ నెంచి ఉపనిషత్కారులు అక్షయ సుఖమునే తమ గురిగా జేసుకొనిరి. యజ్ఞ యాగాదులు మరియు ఇష్టిపూర్త్యాది కర్మలు కొంత వరకు అనగా పుణ్య కర్మపూర్తి యగు వరకు స్వర్గ వాసమును అనగా సుఖజీవనమును లభింప జేసినను అవి జరా మృత్యువుల తప్పించ నేరవు. ఐనను తపస్సు, శ్రద్ధ, బ్రహ్మచర్యము, ఏకాంతవాసము ఇవి సాధకుని తేజోమార్గము చేత అనగా జ్ఞానమార్గము చేత అమృత లోకమునకు తీసుకొని పోవును. అని ముండకోపనిషత్తు చాటుచున్నది. అపరా మరియు పరా విద్య కర్మమార్గము మరియు జ్ఞానమార్గము పితృయాగము మరియు దేవయాగము ఇట్లే ఉపనిషత్కారులు జేసిన భేదముకూడ స్వర్గ మరియు మోక్షములను రెండు మానవ ధ్యేయముల ననుసరించియే యున్నవి

వీటిలో అపరావిద్య మరియు సకామ కర్మ మార్గము ఇవి మనుష్యుని పితృ యాన మార్గము నుండి హీనమైన స్వర్గ లోకమునకు తీసుకొని పోవును. మరియు పరావిద్యయు, జ్ఞాన సహాయము చేత సాధకుని దేవయాన మార్గము నుండి శ్రేష్ఠమైన అమృతమైన బ్రహ్మ లోకమునకు తీసుకొని పోవును అని ఉపనిషత్తులలో ఋషులు స్పష్టముగా బోధించు చున్నారు. మన అత్యంతిక ధ్యేయము స్వర్గము గాదు, మోక్షమే యని మొదలు నిర్ధారణ చేసుకొని నుండుటకు ఏకాంత వాసము, శ్రద్ధ, తపస్సు, బ్రహ్మచర్యము, ధ్యాన, యోగ, నిష్కామ కర్మ, ఆత్మ జ్ఞానము, ఈ మొదలైనవియే దాని సాధనము లని వారు నిర్ణయించిరి. ఇట్లు అక్షయ సుఖ శోధనను జేయు ఋషులు మునులు అనేక చర్చలచేత, ధ్యానము చేత, ప్రయోగాంతరములచేత, స్ఫూర్తి చేత, మరియు స్వానుభవము చేత, అంత్య నిశ్చయమును చేసిరి. ముందుకు గీతా కారులు మరియు వీరశైవ సాంప్రదాయక మహావిచార పరులు, మోక్షమును ఉపనిషత్కారుల ఆత్యంతిక ధ్యేయమును నప్పి యుంచి ఆ కాలము వరకు ప్రతిపాదింప బడిన లేక ప్రచారమునకు వచ్చిన సమస్త అధ్యాత్మ మార్గముల సమన్వయమును చేసి, వాటికి భక్తిభావము యొక్క ఒప్పిదమును కల్పించి సర్వార్పణమను సులభసరళ సంపూర్ణ మరియు సమస్తులకు ముక్తద్వారమై యున్న సాధన పథమును ఏర్పరచిరి.

ఈ అధ్యాత్మ శాస్త్రము సమస్తమునకు శ్రేష్ఠమైన మానవీ ధ్యేయమును తత్సాధనమైన విశిష్ట ఉపాసనా మార్గమును లోబరచుకొని యున్నది. ఈ శాస్త్రమునకు శైవాగమములు ప్రత్యక్షముగ, మరియు వేదోపనిషత్తులు అప్రత్యక్షముగ మూలాధారములై యున్నవి. హిందూ అధ్యాత్మ శాస్త్రము నందు ఈ శైవాగమముల స్థానమును తెలియుట ఆవశ్యకము.

## వేదములు.

హిందూ ధర్మమునందు వేదములే సమస్తమునకన్న హెచ్చు ప్రమాణభూత గ్రంథములు స్వయం ప్రమాణములు స్వయం సిద్ధములని చెప్పుట వాడుకగలదు. వేద శబ్దార్థము జ్ఞానము, తెలివియని అగుచున్నది. వేదములు శబ్దరూపము

చేత సృష్టితోడనే ఉత్పన్నమైనవని ఇవి పురుషకృతము కానందున అపౌరుషేయములని కొందరి మతము. శుద్ధసత్త్వులైన కవిశ్రేష్ఠులు దేవదేవతలను మరియు ఆత్మ పరమాత్మలను గురించి దైవీస్ఫురణము చేతనో లేక దైవోన్మాద స్థితియందుండు సమయమునందో వ్రాసిన సత్కావ్యములని కొందరి మతము. ఆగమ జ్ఞానసంపన్నులైన వీరశైవులు వేదములు శివునియొక్క శ్వాస నిశ్వాసములనుండి వెడలినవనియే నమ్ముదురు. జ్ఞానము అనంతమైనందున దానిని బోధించు వేదములుకూడ అనంతములుగ ఉండవలయునని భావనగలదు. ఐనను సద్యః ఋక్-యజు-సామ మరియు అధర్వములను ఈ నాలుగు వేదములే ఉపలబ్ధమై యున్నవి. వీటియందుకూడ మొదటి మూడే మహాత్మ్యము గలవి. ఏలనన నాల్గవదైన అధర్వణ వేదము, యంత్ర, తంత్ర, మంత్ర, జారణ, మారణ, అభిచారాదులే మొదలైన సంగతులచే నిండియున్నదని కొందరందురు. మొదటి మూడు వేదములకు త్రయీవిద్యా, వేదత్రయీ, లేక త్రయీ, యని యను పరిపాటి గలదు. వివిధదేవతల స్తుతిస్తోత్ర, యజ్ఞయాగాది కర్మములు మరియు వాటి విధివిధానము, యజ్ఞ మంత్రములు, మొదలైనవే ఈ మూడు వేదముల ముఖ్య విషయములు. వేదములయందు, బంగారపు రాశియందు మెరయుచుండు వజ్రగోళములవలె మాత్రము అక్కడక్కడ అధ్యాత్మవిషయిక మంత్రములు కన్పట్టుచున్నవి.

## ఉపనిషత్తులు.

నిజమైన అధ్యాత్మ శాస్త్రము, ఉపనిషత్తుల యందు ప్రతిపాదింప బడినది. ఇవి వేదముల అంత్య భాగములైనను వీటియందు అధ్యాత్మ శాస్త్రము ఉపాసనా మార్గము ప్రధానముగా చెప్పబడినందున వీటికి ధార్మిక వాఙ్మయము నందు స్వతంత్ర స్థాన మివ్వబడినది. అందువలననే వేదోపనిషత్తులని ప్రత్యేకించు రూఢి ప్రచలితమై యున్నది. ఉపనిషత్తులు అనేకములై యున్నను, ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, మరియు బృహదారణ్యకములను ఈ దశోపనిషత్తులే ముఖ్యములు మరియు ప్రమాణభూతములని తెలియ బడినవి. ఆత్మానాత్మ విచారము, ఆత్మ స్వరూపము, మోక్షస్వరూపము, బ్రహ్మజ్ఞాన మార్గము, ఇవే విషయములు ముఖ్యముగ

ఉపనిషత్తులయందు చర్చింప బడినవి అందు వలన వేదములు, ఉపనిషత్తులు, క్రమముగ కర్మజ్ఞాన మార్గములను ప్రతిపాదించు నని చెప్ప వచ్చును. వేదము లందు గల కేవల కర్మమార్గమును, సకామ యజ్ఞ యాగాదులను తత్ఫలమైన స్వర్గాది భోగలోకములను ఉపనిషత్తులు హేయముగా జూచు చున్నవి. పశు వధకు కారణమైన యజ్ఞయాగాదులను నిలుపుటకే జ్ఞాన మార్గము సహాయ మైనది. వేదోక్తానేక దేవతలకు యెట్టి మహత్వము నివ్వక ఉపనిషత్తులు బ్రహ్మనే అథవా పరమాత్మునినే పరమ దైవతముని తమ ధ్యేయముగా జేసి కొని యున్నవి. సకామ కర్మమునకు బదులు నిష్కామ ఉపాసనను ముఖ్య ముగా జెప్పి "అకామ హాతుడు" అనగ కామముల చేత పీడితుడు కాక యుండు జ్ఞాని పరమ బ్రహ్మనందమును పొందును, అని ఉపనిషత్కారులు విధా నము చేసి యున్నారు. మిత్ర వరుణ ఇంద్ర అగ్ని మరుద్గణాది వైదిక దేవతలకు ఉపనిషత్తులందు స్థలమే లేదనిన చెల్లును.

నిర్గుణ, నిరాకార, అనాది, అనంత, సర్వవ్యాపి, సచ్చిత్స్వరూపుడైన ఏక మైన పరమాత్ముడే సమస్తమునకు మూల వస్తువు. ఆతని ఇచ్ఛా మాత్రము చేతనే అనేకత్వము ఐనను తత్వతః అతడే ఎల్లెడల గలడు ఓంకారాది ప్రతీ కముల చేత అతడుపాస్యుడు. శ్రద్ధ, తపస్సు, ధ్యాన, ధారణసమాధి, ఏకాంత వాసము, బ్రహ్మచర్యము, ఇత్యాది సాధనములచేత చిత్తమును శుద్ధి చేసి దానిని పరమాత్ముని యందు ఏకాగ్రము చేసి చిత్త లయమును సాధించి జననమరణరహిత బ్రహ్మైక్యమును పొందుటయే సమస్తమున కన్న శ్రేష్ఠమైన ధ్యేయమని ఉపనిషత్తులు ప్రతిపాదించు చున్నవి

# ఆగమములు.

ఇకముందు వేదోపనిషత్తుల పరంపరనే బోధించు మరియు వాటినుండి స్వల్ప ముగా వేరై యున్నను వాటికత్యంత అవిరోధి యనునట్లు ప్రతిపాదించు జ్ఞాన కర్మ ఉపాసనలను లోబరచుకొని ఆగమములు అస్తిత్వమును పొందినవి తత్వజ్ఞాన ప్రతిపాదనముకన్న ఉపాసన క్రమములే వీటియందు అధిక విస్తారముగ చెప్ప బడినందున వీటిని తంత్రములని యనుటకూడా కలదు. ఈఆగమ గ్రంథ ములందు శైవాగమ, శాక్తాగమ, మరియు వైష్ణవాగమ లేక పాంచ రాత్రా

గమ యను మూడు ముఖ్యవిధములు గలవు. ఆయా ఆగమములందుక్తమైన ఇష్టదేవతలు అటులే విశిష్ట ఉపాసనాక్రమములు నీటిమూలముననే మూడు విధములై యున్నవి. ఇదియేకాక వైదిక అవైదికములనియు, దక్షిణాచార వామాచారములనియు, మంచిచెడ్డ ఆచారములను జెప్పుచున్న గ్రంథములును ఈ ఆగమములందు అంతర్భేదముగా గలవు ఐనను యిక్కడ మనకు ప్రస్తుతము వైదికములనబడు యిరువది యెనిమిది శైవాగమములే విచారణకు యోగ్యమై యున్నవి.

ఆగమ మనగా జ్ఞానము, శాస్త్రము అని అర్థమవును. శైవాగమము లన్నను శైవాగమములు అథవా పరతత్త్వమైన శివుని విషయమగు జ్ఞానశాస్త్రము. "ఆగమ" ఈ సంస్కృత శబ్దముల యర్థము "వచ్చిన" యని యున్నది. ఇక్కడ ఆగమ గ్రంథములనగ పరంపరమునుండి వచ్చిన శాస్త్రమని ఈ శబ్దముల అర్థమై యున్నది అయినను "గమ" ఈ ధాతువు "గత్యర్థ"మై యున్నందున అది సంస్కృత వ్యాకరణ నియమముల ప్రకారము "జ్ఞాన"మను అర్థము నిచ్చుచున్నది దానికి "ఆ"యను ఉపపదమును కూర్చిన, పూర్ణజ్ఞానమని యగును "ఆప్తోక్తి రాగమస్యాపి" ఆప్తుని ఉక్తియే ఆగమమని సౌష్కరసంహిత వచనము గలదు. ఇక్కడ ఆప్తుడనగ పరశివుడని యర్థము. ఈ ఆగమములను తంత్రము లని కూడ అందురు. వేదాగమ, నిగమాగమ, శృతి, తంత్రములని సూక్ష్మాగ మమునందు ఉల్లేఖనము గలదు.

"తనతే విస్తార్యతే జ్ఞానం అనేనత్రాయతేచ ఇతి తంత్రమ్" ఈశాస్త్రము చేత జ్ఞానము ప్రసారమై మనుష్యుని యొక్క ఉద్ధార మవుచున్నందున దీనికి తంత్రమనిపేరు, యని దీనికి నిరుక్తము చెప్పబడినది. కామికాగమము యొక్క తంత్రాంతర పటలమునందు.

తనోతి విపులానర్థాన్ తంత్రమంత్ర సమన్వితాన్
త్రాణంచ కురుతే యస్మాత్ తంత్రమిత్యభిధీయతే॥

తంత్ర మంత్రరూప వాక్యగతములైన విశేషార్థములను వివరించునట్టి, శ్రవణమన నాది నిరతులను తరింపచేయునట్టి ఈ ఆగమ శాస్త్రమే తంత్రమని పిలువబడు చున్నది. యని వ్యాఖ్యగలదు ఈ తంత్ర శాస్త్రమునకే సిద్ధాంత శాస్త్రమని శైవదర్శనమని ఆగమములని పర్యాయ నామములు గలవు ఈ తంత్రములు

కొన్నిచోట్ల శ్రుతులనికూడ చెప్పబడినవి. "వైదికీ తాంత్రికీ చైవ ద్వివిధా శ్రుతి కీర్తితా" వైదిక తాంత్రికమను రెండువిధముల శ్రుతి ప్రసిద్ధమై యున్నది యని మనుస్మృతి భాష్యకారుల మతము.

వేదము ప్రతిపాదించు తత్త్వములను అనుభవ సిద్ధముజేయ సమర్థమై యున్న ఆచార విచారములను సాధనములను శివాగమములు బోధించుచున్నవి. ప్రసిద్ధ శైవసిద్ధాంతుడైన నీలకంఠుడను బ్రహ్మసూత్ర భాష్యకారుడు "వయం తు వేదశివాగమయోః భేదం న పశ్యామః" యని వేదములు శివాగమములు ఏకరూపమైనవి. వాటియందు ఏమిభేదము లేదు యని స్పష్టముగ నుడివిరి.

ఇహపరములందు పరమ సుఖమును, నిత్యనిరంతర సుఖమును, అథవా ముక్తి లేక మోక్షమును పొందుటయే మనుష్యుని ముఖ్యధ్యేయమై యున్నది. దీనిని స్వానుభవము చేసికొనే నిర్ణయించి ఆ స్థితిని పొందుటకు ఈ శివాగమోక్త నిత్యానుష్ఠానమును [illegible] ప్రతిపాదించిరి. విశిష్ట సాధన మార్గము ననుసరించి శివయోగి సాంప్రదాయమును సారముగనే నడచిరి. వీరశైవుల తత్త్వజ్ఞానము విచారము, ఆచారము, నీతినియమములు వీటినన్నిటిని పరిశీలించినచో శైవాగమములనుండి శిలప్రమాణమైన అటుయిటు కదలినట్లు కన్పించదు. వారు చెప్పిన ప్రత్యేక ముఖ్యసంగతిని ఆగమములనుండి తీసి చూపించ వచ్చును. ఆగమములయందు వేదములో లేని వేదసమ్మతమైన కొన్ని సంగతులు క్వచిత్ మార్పులు గలిగినను అవి కలియుగమునకు సరిపోవునట్లు చేయబడిన సర్దుబాటులుగాని వేదబాహ్య సంగతులు గావు యని ఆగమ మరియు ఆగమ భాష్యకారుల అభిప్రాయమై యున్నది శైవసిద్ధాంత పరిభాషయందు, "శ్రూయతే హి వేదసారః శివాగమః" యను వాక్య మీ అభిప్రాయమునే చెప్పుచున్నది ఇట్టి మార్పులు ప్రత్యేక ధర్మాచారమునందు పూర్వము అయినవి. మరియు ముందు కూడ గావలసినవై యున్నవి. ఇట్లు మార్పులు గలుగుటయే జీవత్ ధర్మము యొక్క లక్షణమని చెప్పవచ్చును.

కృతే శ్రుత్యుక్తా ఆచారా స్త్రేతాయాం స్మృతి సంభవాః
ద్వాపరే తు పురాణోక్తాః కలౌ ఆగమ సమ్మతాః॥

యని శివాగమ శ్లోకముగూడ ఈ అభిప్రాయమునకే సాక్షియై యున్నది.

# ఆగమములు స్వతః ప్రామాణ్యములు.

సిద్ధాంత శిఖామణియందు శ్రీరేణుకాచార్యులవారు అగస్త్యమునిచంద్రునకు వీరశైవ సిద్ధాంతముల బోధించునప్పుడు సిద్ధాంతమనునదే శివాగమమనియు శివజ్ఞానకరమైనది వేదసమ్మతమైనది యని బోధించియున్నారు.

"సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
ఏతాని మానభూతాని నోపహన్యాని యుక్తిభిః॥

ఈ సాంఖ్యాది పంచవిధ సిద్ధాంతములకు వేదము ముఖ్య ప్రామాణ్యమై యున్నందున అవి ఎట్టి యుక్తుల చేతనైనను ఖండించబడవు

వేదైకదేశ వర్తిత్వం శైవం వేదమయం మతం
వేదైకదేశ వర్తిభ్య స్సాంఖ్యాదిభ్యో మహామునే॥
సర్వవేదానుసారిత్వా చ్ఛైవ తంత్రం విశిష్యతే
శైవతంత్ర మితి ప్రోక్తం సిద్ధాంతాఖ్యం శివోదితం॥
సర్వవేదార్థ రూపత్వా త్ప్రామాణ్యం వేదవత్సదా
ఆగమా బహుధా ప్రోక్తా శ్శివేన పరమాత్మనా॥

ఈ పైనుదహరించిన ఐదు సిద్ధాంతములలో పాశుపతము ముఖ్యమైనది దానిలో శైవము వేదమయమైన మతము ఇది శివునిచే చెప్పబడినందున సిద్ధాంత మనబడినది. ఈ సిద్ధాంతము ఆగమరూపకముగ శివునినుండి వచ్చినందున వేదమునకు విరుద్ధముగ లేకున్నందున ఇది వేదమువలె ముఖ్యప్రామాణ్యముగ గణింపబడుచున్నది.

వేదధర్మాభిదాయిత్వా త్సిద్ధాంతాఖ్య శివాగమః
వేదబాహ్య విరోధిత్వా ద్వేదసమ్మత ఉచ్యతే।

కనుక శివాగమములు సిద్ధాంతము లనబడుచున్నవి అవి వేదధర్మములను స్పష్టీకరించుచున్నవి.

సిద్ధాంతాఖ్యే మహాతంత్రే కామికాద్యే శివోదితే
15/a నిర్దిష్టముత్తరే భాగే వీరశైవ మతంపరం॥

ఈ సిద్ధాంతములను నామముగల కామికాది శివాగమ మహాతంత్రముల యొక్క ఉత్తరభాగమునందు వీరశైవమతము వివరింప బడియున్నది. అనగా పూర్వభా

గమునందు శైవమతము యొక్క అనేక భేదముల వివరించి తుదకు వీరశైవ మతము చెప్పబడినది. మరియు నీలకంఠ బాష్యమునందు.

ఆగమానాంతు సర్వేషాం స్వతః ప్రామాణ్య ముచ్యతే
ఏకొనత్రింశతో పునరుపదేశే సమాసతః॥
కామికాద్యావాతులాంతాః శివేనోక్తాశ్శివాగమాః
ఈశాన వక్త్ర సంజాతా స్సాక్షాద్దేవస్యశూలినః॥

కామికాద్యాగమములు శివ ాదితమాలు, అందువలన అవి స్వతః ప్రమాణములు బడినవి. అనగా ఇవి ఇతర ప్రామాణ్యముల నపేక్షించవు ఆగమవిరుద్ధ ప్రామాణ్యవాక్యములచే ఇవి ఖండింప బడవని యర్థము. అందువలన ఆగమములు స్వతస్సిద్ధములు.

అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీ సుతః
కామికాది ప్రభేదానాం యథా దే ా మహేశ్వరః॥
ఆదికర్తా శివ స్సాక్షా చ్ఛూలపాణి రితి శ్రుతిః॥ సూత సం॥

అష్టాదశ పురాణములను రచించుటకు సత్యవతీ సుతుడైన వేదవ్యాసుడెట్లు కర్తయో అట్లు కామికాది ఆగమములకు కర్త సా ాత్ శివుడేననియు ఇది శ్రుతి వాక్యమునియు స్కాందపురాణాంతర్గత సూతసంహితయందు విశదీకరింప బడినది.

అష్టాదశానా మేతాసాం విద్యానాం భిన్నవర్త్మనాం
ఆదికర్తా శివః సాక్షా చ్ఛూలపాణి రితి శ్రుతిః
సద్యోజాతేన ఋగ్వేదం వామదేవేన యాజుషం
అఘోరేణ తథా సామ పురుషేణ త్వథర్వణం॥
ఈశానేన ముఖేనైవ కామికాద్యాగమాం స్తథా
జనయామాస విశ్వేశః సర్వసిద్ధిప్రదాయకః॥ ఇతి స్మృతిః॥

అష్టాదశ విద్యలకు శివుడే ఆదికర్తయైనందున వేదాగమములకు కూడ శివుడే కర్తయని సిద్ధాంతమగుచున్నది. పరమ శివునియొక్క సద్యోజాత ముఖము నుండి ఋగ్వేదము, వామదేవ ముఖమునుండి యజుర్వేదము, అఘోరముఖము నుండి సామవేదము, తత్పురుష ముఖమునుండి అథర్వణ వేదము, ఈశాన్యముఖమునుండి కామికాది అష్టావింశత్యాగమములు పుట్టియున్నవి.

శివాగమస్తు ద్వివిధః శ్రౌతోఽశ్రౌతశ్చ సంస్కృతః
శ్రుతిసారమయః శ్రౌతః స్వతంత్ర స్త్వితరో మతః॥
స్వతంత్రో దశధా పూర్వం తథా ష్టదశధా పునః
కామికాది ప్రభేదేన సిద్ధసిద్ధాంత సంజ్ఞకః।
శ్రుతిసారమయోఽన్యస్తు శతకోటిప్రవిస్తరః॥ వాయవీయ సం॥అ. ౨౮

ఈ శివోదితశివాగమములు శ్రౌతములనియు అశ్రౌతములనియు రెండువిధములు. శ్రుతిసారమయములే శ్రౌతములు. స్వతంత్రములే అశ్రౌతములు. ఈస్వతంత్రాగమములు మొదలు పదిభాగములై తర్వాత యిరువదియెనమిది భాగములైనవి. అవే కామికాది ఆగమములు వాటిని స్వతంత్రములనెదరు. ఇవియే వీరశైవులకు ప్రామాణ్యగ్రంథములు. శ్రౌతాగమములు శతకోటి భాగములై యున్నవి అవి వీరశైవులకు ప్రామాణ్యములుగావని యర్థము.

అథవా శివనిశ్వాస శ్రుతయస్తే శివాగమాః
అధికా శివవక్త్రాత్తు సాక్షాదేవ వినిర్గతాః॥
పరస్పరా విరుద్ధార్థాః శ్రుత్యుక్త నిగమాగమాః
అల్పబుద్ధిభి రన్యోన్య్య విరోధః పరికల్ప్యతే॥ క్రియాసారః

శివునియొక్క నిశ్వాసమునుండి వేదములు వెడలినవి. సాక్షాత్ శివునియొక్క ముఖమునుండియే శివాగమములు పార్వతికి ఉపదేశించబడినవి. కనుక నిగమాగమములు పరస్పర విరుద్ధములుకావు అల్పబుద్ధిగలవారు వాటియందు విరోధత్వము. అభిప్రాయ భిన్నత్వము కల్పింతురుయని క్రియాసారమునందు వ్రాయబడినది కనుక ఆగమ ప్రామాణ్యములు స్వతస్సిద్ధములని సిద్ధమగుచున్నవి. ఇంతియేకాక శ్వాసోచ్ఛ్వాసములద్వారా వెడలిన వేదములకు కొందరు తమతమ ఇష్టానుసారము భాష్యముల వ్రాసి పూర్వాభిప్రాయమును మార్చివేసిరి, కాని శివోదిత ఆగమములు సరళభాషయందు స్పష్టముగా చెప్పబడినవి. వాటియందు కృత్రిమ కల్పితమునకు చోటులేదని స్పష్టముగా చెప్పవచ్చును. కనుక ఆగమ సిద్ధాంతములే ప్రాముఖ్య గ్రంథములు.

సుప్రసన్నేంద్రియగ్రామః సర్వజ్ఞ స్సర్వగోచరః
యోగయోగీశ్వర స్స్వామీ స్వతంత్రః పశుపాశహా॥

తస్యోక్తిః పౌరుషైః స్థూలైః ప్రమాణైర్న ప్రబాధ్యతే
ప్రమాణ మేకం తద్వాక్యం తథ్య మీశ్వరభాషితం॥

తా॥ సర్వజ్ఞమూర్తియై స్వతంత్రుడై పశుపాశహరుడైనట్టి శివునియొక్క వదనమునుండి వెడలిన వాక్యములే శివాగమములు, కనుక అవి స్థూల పౌరుషేయ ప్రమాణవాక్యములచేత అబాధితములైనవి, మరియు స్వతః ప్రమాణములైనవి యని మతంగపారమేశ్వరాగమమునందు స్పష్టముగా చెప్పబడినది.

శివాగమేషు చాఽద్వైతం బభాషే పరమేశ్వరః॥

శివుడు శివాగమములందు అద్వైతమును చెప్పెనని బ్రహ్మగీత యందును గలదు.

శ్రీకంఠేన శివేనోక్తాః శివాయై చ శివాగమాః
శివాశ్రితానాం కారుణ్యాత్ శ్రేయసా మేకకారణం॥ శివ పు॥

శివపురాణాంతర్గత వాయవీయసంహిత యందు ఉపమన్యు ఋషియు శ్రీ కృష్ణునికి బోధించిన దేమనగా శివాగమములు శివాశ్రితులైన శివభక్తులకు శుభములు గలుగ జేయుటకై శివునిచే జెప్పబడినవి. కనుక అట్టి ఆగమోక్తులే శ్రేయస్సును గలిగించుట యందు సమర్థములు.

సాంఖ్యం యోగం పాశుపతం నోపహన్యాని యుక్తిభిః॥ మహా భా॥

పాశుపతమును బోధించునట్టి శైవాగమములు యుక్తులచే బంధింపబడునవి కావని మహాభారతమునందు కూడ చెప్పబడినది కనుక శివాగమములు స్వతఃప్రమాణములు అని యనేక శాస్త్రాధార యుక్తి ప్రయుక్తులచే సిద్ధ మగుచున్నది.

"సర్వవేదేషు యద్దృష్టం తత్సర్వం తు శివాగమే॥"

యను వీరాగమ ప్రమాణానుసారముగ వేదశాస్త్రము మరియు సిద్ధాంత శాస్త్రము ఈ రెండున్ను ఒకే అర్థమును ప్రతిపాదించు నంతటి వనియును పండితులు యీ రెండింటికి ఒకేవిధమైన ప్రామాణ్యమును బోధించిరి.

కామికాది వాతూలాంతమైన సిద్ధాంతనామక మహాతంత్రము యొక్క ఉత్తరభాగమునందు పరమపవిత్రమైన వీరశైవ మత స్వరూపము చెప్ప బడి యున్నది యని పై సిద్ధాంతశిఖామణి యొక్క శ్లోకముచే సిద్ధ మగుచున్నది.

# శివాగమములు వైదికములు.

శివాగమములు శ్రౌత, అశ్రౌత యని రెండువిధములు ——

"శ్రౌతాశ్రౌతవిభేదేన ద్వివిధా స్తు శివాగమాః॥"

యను వచనము గలదు. తాత్పర్య మేమనగా:-

శైవ, శాక్త, వైష్ణవ మొదలగువాటియందు కొన్నిటిని వైదికములని మరికొన్నిటిని అవైదికము లనియు పిలువనారంభించిరి. ఆ యా ఆగమములందు ఆచార విచారములు వేదసమ్మత, మరియు వేదబాహ్యమైనవి యని చెప్పుటకే యిట్లు పేరులు పెట్టిరని యభిప్రాయము. ఐనను ఏ యొక్క ఆగమమందుగల ఆచార విచారములు వేద సమ్మతములుగ గలవో లేక వేదబాహ్యములుగ గలవో యిది నిశ్చయము జేయు టెట్లు? మరియు ఎవ్వరు? అవైదికములనబడు ఆగమములకుకూడ తత్త్వభాగమందు వైదికతత్త్వము లేయను మాన్యతగల్గజేసి, వైదికమైన పరమాత్మ సాయుజ్యమునే తమ ధ్యేయముగ జేసికొని యున్నారు? భేదము గలిగినది ఆచారముల యందును, సాధనమార్గములయందును గాని ధ్యేయమునందు గాదు. అందువలన యే ఆగమములు సామాన్యనీతికి విరుద్ధమైన మరియు హేయమైన ఆచారములను లేక సాధనమార్గములను ప్రతిపాదించుచున్నవో ఆ వామాచార ప్రతిపాదక ఆగమములు అవైదికములనియు, మరియు మిగిలిన దక్షిణాచారప్రతిపాదక ఆగమములు వైదికము లనియు జెప్పుట సమంజసమై యున్నది.

ఇప్పుడు ఇక్కడ ప్రస్తుతమై యున్న వైదికము లను శైవాగమముల విచారమును జేయుపూర్వము ఆగమము, అథవా తంత్రశాస్త్రము ఎందుకు మరియు ఎట్లు అస్తిత్వములోనికి వచ్చియుండవచ్చును? జన సామాన్యమునకు మోక్షసాధన మార్గమును జూపించుటకే నని వ్రాయబడియున్న వనునది వేరె వేరె ఆగమములందు ఉక్తమైన ఉద్దేశము చేతనే వ్యక్తమవుచున్నది. ఉపనిషత్తు లందున్నట్లు ఆగమములందు ఆధ్యాత్మిక విషయముల తత్వ చర్చయు విశేషముగ లేదు. ఉపనిషదుక్త తత్వములనుండి గృహీతములని తెలసి తదనుసారముగ నిశ్చయింపబడిన ధ్యేయమైన మోక్షమును సాధించు సాధన

మార్గముల చర్చయు వాటియందు హెచ్చుగలదు. జన సామాన్య మందు ఆచరించుటకు యోగ్యమైన ఆచారములే వాటియందు చేర్చబడినవి. అందు వలననే సాధనమార్గములను హెచ్చు ప్రచారము జేయుటకే అవి అస్తిత్వ మును పొందిన వనునది స్పష్టమయినది.

వైదికులు తమ ఆచారములను సర్వులకు ముక్త ద్వారమును పెట్టి నట్లు కనుపడుటలేదు. ఏయే జనాంగముల తోడనే తమకు సంబంధము గలిగెనో వారందరు వైదికాచారములకు అధికృతు లని వారు తెలిసికొ నలేదు. అదే రీతి ఔపనిషదిక నిర్గుణ బ్రహ్మ ఉపాసనము సమస్తులకు సులభసాధ్య మైనది గాకుండెను. అందువలన వైదికాచార మరియు నిర్గు ణోపాసన యివి రెండు యెవరికి శక్యము గాకుండెనో అట్టి బహుజన సమాజమునకు ముక్తియొక్క మార్గమును కల్పింపవలె నన్న, వైదికతత్వము లను విడువక వైదిక ధ్యేయమును ముట్టు సాధన మార్గమును కల్పించుట ఆవశ్యక మాయెను. ఈ ఉద్దేశ సాఫల్యమునకయి జాతి, పంథ, వయ, లింగ ముల నిర్బంధములేక సమస్తులకు అధికారము గలదని చాటుచు, సులభ భాషయందు వ్రాయబడిన ఆగమములు అస్తిత్వమందు వచ్చియున్నవి.

అవి వైదిక ధ్యేయమునే సగుణ ఈశ్వరుని భక్తిచేత మరియు తదను రోధముతో నిర్ణయము జేయబడిన ఆచారముల చేత పొందుటకు అనువయి యున్నవి. సమస్త ఆగమములు ఉపనిషదుక్తమైన ముక్తిని తమ ముఖ్యధ్యే యముగ నుంచుకొని యున్నవి. వాటి మార్గము భుక్తి ముక్తి ప్రదాయక మైనది. సమస్త ఆగమములు పరమాత్మ, ఆత్మ, సృష్టిరచన మొదలైన విషయములపైన విస్తారముగ వివేచనముజేసి, ఈ సృష్టిని "మిథ్యా" యని యనక ఈశ్వరుని "మాయా శక్తి" యని బోధించు చున్నవి; ఇదియే శక్తివిశిష్టాద్వైత మతము.

## శివాగమములు.

"అష్టావింశతి తంత్రాణి మూలభేదాః ప్రకీర్తితాః॥"

మూలము అనగా: ఆగమముల యాద్యంతము, అట్టి మూలము ఇరువదియె నిమిది తంత్రము లాయె ననియు, మరియు—

ఈశానవక్త్రాదూర్ధ్వస్థాత్ జ్ఞానం యత్కామికాదికం
దశాష్టాదశ భేదేన శివరుద్రావతారకైః॥

శివుని ఈశానవక్త్రమునుండి వెడలిన జ్ఞానము, కామికాది దశాష్టాదశ (౨౮) ఆగమము లాయెను యని కామికాగమమునందు స్పష్టీకరింపబడినది. కనుక శివాగమములు యిరువదియెనిమిదే యనియు, ఆ ఆగమములే తంత్రముల నియు, శైవసిద్ధాంత సంహితలనియు కూడ స్పష్టమగుచున్నది.

## శివాగమవివరము.

కామికం యోగజం చింత్యం కారణం త్వజితం తథా
దీప్తం సూక్ష్మం సహస్రం చ అంశుమ త్సుప్రభేదకం॥
విజయం చైవ నిశ్వాసం స్వాయంభువ మథాఽనలం
వీరం చ రౌరవం చైవ మాకుటం విమలం తథా॥
చంద్రజ్ఞానం చ బింబం చ ప్రోద్గీతం లలితం తథా॥
సిద్ధసంతాన శర్వోక్తం పారమేశ్వర మేవ చ
కిరణం వాతులం త్వేతా స్త్వష్టావింశతి సంహితాః॥

ఈ ఇరువదియెనిమిది శివాగమములే వీరశైవులకు ప్రమాణములు. ఆగ మేతర గ్రంథములు శివాగమోక్త జ్ఞానమును ప్రతిపాదించు నట్టివయిన వీర శైవులకు మాననీయములు; లేకున్న అప్రమాణ్యములు.

కామికాది వాతులాంతము ముఖ్యము ఇరువదియెనిమిది ఆగమములు గలవు. ఇదిగాకను ఉపాగమములు కూడ గలవు. ఇవికూడ వేదముల వలె అపౌరుషేయవాణి యనియే శైవుల నమ్మిక గలదు. ఇది దైవస్ఫూర్తి చేత నిర్మాణమైన శాస్త్రము. తత్వజ్ఞానముసకన్న ఆగమ గ్రంథములందు సాధన విషయమే హెచ్చుగా గలదు. పరశివుడు తన విమర్శా శక్తిచేత ఈసృష్టిని మరియు తదంతర్గత భూతములను నిర్మించెను. ఇట్లు నిర్మించుచుండగ సూక్ష్మ స్నమైన మాయ వలన జీవుడు తన స్వజ్ఞానమును మరచి సంసార చక్రము నందు దుఃఖముచేత తిరుగుచుండును. అందువలన యీ ప్రవృత్తి పూర్ణ సృష్టి యందు ఆతడు నివృత్తి మూలకమైన వైరాగ్య, భక్తి, జ్ఞాన, నిష్కామ కర్మ,

ఈ సాధనముల చేత శివైక్యమును పొందు ప్రయత్నము చేయవలెను పరమ ధ్యేయమైన యీ శివైక్యమును పంచాచారపాలన, అష్టావరణము మొదలయిన వానితో సాధించవలెను; మరియు ఆ యా స్థలములందు యుండగ షట్స్థలములకు యోగ్యమైన ఆచారములను నిష్ఠచేత ఆచరించవలెను; అని యిట్లు శైవాగమములు ఉపదేశించుచున్నవి అద్వైత తత్వ జ్ఞానము, శివ సర్వోత్తమత్వము, శివైక్యమను ధ్యేయము; సర్వభావము చేత పరశివునికి సర్వార్పణము, ఇష్టలింగ పూజ ద్వారా ధ్యాన సాధన, నీతియుక్త సదాచరణ, ఇవే మొదలైనవి శైవాగమములందు గల ఉపదేశముల ముఖ్య లక్షణములు. ఈ శివాగమాచారముల చేతనే మనుష్యుడు జీవత్వమును వదలి శివత్వమును పొందును; అట్టి శివ జీవైక్య రూప ముక్తియు శీఘ్రకాలములోనే లభించును.

శృణు దేవి ప్రవక్ష్యామి శీఘ్రముక్తి ప్రదాయకం
భగవన్నాసికోచ్ఛ్వాసా త్సర్వే వేదా స్సముత్థితాః॥
అష్టావింశత్యాగమా స్తే వదనా దేవ నిర్గతాః
వేదోక్తమార్గతో ముక్తి స్తారతమ్యానుసారతః॥

తస్మా ద్వదనసంభూతా ఆగమా శ్శీఘ్రముక్తిదాః
కర్మకాండయుతానాం తు శతజన్మని ముక్తిదాః॥

ఇట్టి శివ వదన సంభూతాగమ మార్గాను వర్తనులకు మోక్షము శీఘ్రముగా సిద్ధించును; అనగా: అదే జన్మము నందే ప్రాప్తించును. కాని ఈశ్వర శ్వాసోద్గతములైన వేదమార్గము ననుసరించిన వారలకు తారతమ్యముగా అనేకజన్మముల తరువాత మోక్షము సిద్ధించును. ఇంతియే గాక వేదపూర్వభాగమైన కర్మకాండ ప్రకారము కామ్య కర్మల అనగా: పశుకర్మల జేయు వారలకు నూరుజన్మలకు ముక్తి దొరకును. కనుక ఆగమమార్గము ననుసరించి శీఘ్రముగా ముక్తిని గలిగించుకొనుట శ్రేయస్కరము కనుక శివాగమములు శివునిచే బోధించ బడిన వనియు, శివతత్వమును బోధించు నంతటి వనియు, ముక్తిసాధన మార్గ ప్రతిపాదకములనియు, సిద్ధాంతమగు చున్నది.

# ఆగమబోధ.

౧ ఆగమములు తంత్రములని కూడ పిలువబడు చున్నవి. ( వాతూలాఖ్యే మహాతంత్రే) అవి ముఖ్యముగ సాధన విధానమునే చెప్పుచున్నవి

౨ శివాగమముయందు శివుడే ముఖ్య ఉపదేశకుడైయున్నాడు.

3 సర్వలోకహితార్థమై, యోగులరక్షణార్థమై, సాధకుల హితార్థమై, పురుషార్థ ప్రసిద్ధికై శివుడు ఈ ఉపదేశములను చేసెనని స్పష్టమవుచున్నది.

౪ "భుక్తి ముక్తి ప్రదాయకం" యన్నట్లు భుక్తి ముక్తి యనురెండును మానవ ధ్యేయములనియే చెప్పబడినవి.

౫ ఆగమములు వేదముల మాహాత్మ్యమును శ్రేష్ఠత్వమును కొనియాడుచున్నవి.

౬ బౌద్ధ, సౌగత, చార్వాక, జైన మరియు ఆర్హత యను వేదబాహ్యమైన మరియు శూన్యార్థక మంత్రముల నుపదేశించు మతముల ఉల్లేఖ కూడ పారమేశ్వరాగమమందు గలదు. దానియందే వీరశైవ, వైష్ణవ, శాక్త, సౌర, వినాయక, కాపాలికము లను షడ్దర్శనముల పేరులు కూడ గలవు. వీరశైవాది భేదములతో శైవము సప్తవిధమైనది; అనగా: అనాది శైవ, ఆది శైవ, అను శైవ, మహా శైవ, యోగ శైవ, జ్ఞాన శైవ మరియు వీరశైవ మను యీ యేడు భేదములు జాత్యనుక్రమముచేత జెప్పబడినవి ఆచార భేదము వలన సూక్ష్మాగమము నందు సామాన్య, మిశ్ర, శుద్ధ మరియు వీర యను నాల్గు శైవ భేదములు చెప్పబడినవి.

౭ అన్యమతముల కన్న శైవమతమే శ్రేష్ఠము; శైవ మతము కన్న వీరశైవ మతము ఉత్తమోత్తమము యని ఆగమ కారులు చెప్పి యున్నారు. శివుని యందు పూర్ణ విశ్వాసము భక్తి యుండవలెననియు, శివ నింద వినకూడ దనియు, శివ నిందకుల సంగము దోష మనియు, అన్య దేవ పూజకులందరు భవులనియు, భవుల సంగము చేయకూడ దనియు యీ ఆచారమును మీరిన తమనిష్ఠకు బాధ గలుగు ననియు స్పష్టముగ జెప్పిరి.

౮ ఈ ఆగమములందు "శివుడు" నిష్కళుడు, పరమాత్ముడు, సూక్ష్ముడు, నిత్యుడు, అవ్యయుడు, సర్వగతుడు, అనిందితుడు, అనౌపమ్యుడు, అప్ర

మూణుడు, అనామయుడు, కారణకారణుడు సచ్చిదానంద లక్షణుడు, స్వతఃసిద్ధుడు, నిరంజనుడు, శుద్ధుడు, నిర్మలుడు, నిర్గుణుడు, నిరుపాధికుడు, పరంజ్యోతి, సనాతనుడు, శాశ్వత పురుషుడు, వేద వేదాంత గోచరుడు యని వర్ణింపబడియున్నది.

లోకముల ఉత్పత్తికి కారణమైన మిగిలిన తత్వములను పుట్టించుట కయి పై లక్షణముల చేత యుక్తుడయిన శివుడు స్వేచ్ఛ చేత సంకల్పము చేసెను. అతని సహస్రాంశముచేత పరాశక్తియు, దాని సహస్రాంశము చేత ఆదిశక్తియు ఇటులే ముందు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులు ఉత్పన్నము లాయెను. ఈ పంచశక్తులు నిష్కళము లైనందున శివ సృష్టి యనబడును. ముందు సదాశివతత్వము అథవా సాదాఖ్యతత్వము, దాని చేత ఐదుతత్వములు సకల నిష్కలము లయినవి; కొనకు మహేశతత్వము సకలమైనది. మహేశుడు విరాట్పురుషు డనవచ్చును; ఏల ననగా అతని కోట్యంశముచేత బ్రహ్మ, విష్ణు, సోమ, సూర్య, అగ్ని, వాయు మొద లైనవాని ఉత్పత్తి యైనది. మొత్తము తత్వములు ౩౬ లేక ౨౫ అని వివరము గలదు. పరశివుని ఒక్క క్షుద్రాంశమునుండి ఈ సృష్టియు ఉత్ప న్నమవుచున్నది. జీవుడు ఈ సృష్టియొక్క అంశాంశుడు; ఇటు లొక్క దృష్టిచేత జీవుడు అత్యంత క్షుద్రుడు. సకలుడై యున్నను వానియందు ఆత్మతత్వము నిష్కలమైయున్నది. దేహముగలదే సకలము. దేహవర్జితమే నిష్కలము. దేహాత్మత్వబుద్ధి మూలకమున మనుష్యజీవము దుఃఖమునందు మునుగుచుండును. అహంకార మరియు కర్మములాదు లను పాశముచేత ముక్తుడై, "దేహవర్జిత నిష్కల ఆత్మనే నేను" అను భావనాయుక్తుడై ఆ స్థితిని అనుభవించుటయే జ్ఞాన మనబడును. జ్ఞానచక్షువుచేత అశరీరియైన ఆత్మను చూచుటయే పరమానుభవమని వర్ణింప బడినది. పాశ బద్ధుడై జీవుడు; పాశముక్తుడే సదాశివుడు అని ఆగమముల సిద్ధాంతమై యున్నది. ఇక ఈ పాశముచేత యీ కార్మిక మాయా మరియు ఆవరణములనుండి ముక్తుడవుటకు జీవునకు సాధనమేమి యను మహత్తరమైన ప్రశ్న గలుగును ముక్తికి అనుభవయుక్త సత్యజ్ఞానమే ముఖ్య సాధన మనుట యందు సంశ

యము లేదు. సగుణశివభక్తిచేత ఆ జ్ఞానము ప్రాప్తించవచ్చునని ఆగమజ్ఞుల మతము. నిరపేక్ష భక్తి, అనన్యపూజ, స్మరణ, కీర్తన, ధ్యాన మరియు భావపరిశీలనములే ముఖ్యవీరశైవ వ్రతములు. శివ భక్తి నాచరించవలెను. సద్గురువు శివభక్తుడు శివజ్ఞాని కూడ అయి యుండవలెను ముముక్షు ఈశ్వరభక్తుడై యుండవలయును. శంకరుడు భక్తకాయము నందుండును. నవవిధ భక్తులందు ఆత్మనివేదనమే అథవా ఆత్మార్పణమే అన్నిటిని మించినది. దేహాదులను శివునకు సంపూర్ణముగ అర్పించుట భుక్తపీతాదు లన్నిటిని శివ ప్రసాద మని సేవించుట, సమస్త ఇంద్రియ క్రియలను శివసేవకై జేయుట, జపాదులను కూడ శివార్పణ భావముచే జేయుట ఇదియే సర్వార్పణ మన బడును. జ్ఞానము లేని యోగము, యోగము లేని జ్ఞానము వ్యర్థమని ఆగమకారులు నుడివిరి.

౧౦ ఈర్ష్య, పిశునత్వము, దంభ, రాగ, మాత్సర్య, కామ, క్రోధ, భయ, శోకాదులను వదలి నిర్ద్వంద్వుడైనవాడే సర్వజ్ఞుడగును. క్షమ, శాంతి, సంతోష, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, వైరాగ్య, సర్వసంగ నివృత్తి, భూతదయ, అహింస, శమ, దమ, ఔదార్య, భక్తి, గురు శుశ్రూష, శివజ్ఞానము ఇవి సాధకుడు పాలించ దగినవి అని పారమేశ్వరాగమమునందు స్పష్టముగా జెప్పబడినది.

౧౧ సాధనములు: ఆగమ కారులు పరమాత్ముని "ఏక మేవ ప్రతీక" మని లింగపూజను చెప్పుదురు అటులే "ఓం నమశ్శివాయ" యను పంచాక్షరి (పంచాక్షరీ) మంత్రమును ఉపదేశించిరి లింగము శివుని ప్రతీకము; "తస్మాత్ లింగం పరం బ్రహ్మ" యనియు చెప్పబడినది

నాదరూప శివుడు మరియు బిందురూప శక్తియు కూడి యీ శివలింగము శివ శక్త్యుభయాత్మకమైనది దీనిని పూజించవలెను; ధ్యానించవలెను. మరియు భుక్తి ముక్తుల పొందవలెను. లింగముయొక్క నిజస్వరూపము జూచిన అది నిరామయము, నిరాకారము, నిర్గుణము, నిర్మలము, శివము, జ్యోతిర్మయము, నిరాలంబము, సర్వాధారము, సర్వకారణము, అనుపమము, కేవల సచ్చిదానంద లక్షణము; ఈ రీతిని సాక్షాత్

శివ ప్రతీకమైన లింగము ఇష్ట ప్రాణ భావ మని మూడువిధములైనది. గురువు బాహ్యాపూజాది కర్మములకై అనుగ్రహించినదే ఇష్ట లింగము. ప్రాణమే లింగ మని భావించి ప్రాణమునందు లింగధ్యానమును జేయుటయే ప్రాణ లింగము. సాధకుడేలింగమునందు ధ్యానస్థుడై నందున ఆతని మనోవృత్తులు లయమగు చున్నవో అదే భావలింగము. ఈమూటిని ఏకభావముచేత పూజింపవలయును. భూతదయ, శివభక్తి, ఎల్లెడల శివదర్శనము, మరియు లింగ ధారణము ఈ నాలుగు "ముక్తిరేషా చతుర్విధా" యని పారమేశ్వరాగమము నందు వర్ణింప బడినవి. అంగలింగముల యందు సతిపతి న్యాయమే నిశ్చయము. కరతలమందే లింగమునుంచి పూజింప వలయును. అహింస, ఇంద్రియ జయము, సర్వ భూత దయ, క్షమ, ధ్యాన, తప, జ్ఞాన, సత్యము, ఈ ఎనిమిది విధములైన పుష్ప ముల చేతనే లింగము యొక్క మానసిక పూజ సలుప వలయునని ఆగమము లందు చెప్పబడినది. దీనిచే ఆగమకారుల ఉన్నతమైన ఆధ్యాత్మిక ధ్యేయము నిశ్చలమై కనబడుచున్నది.

౧౨ లింగము పరాత్పర శివుని పార్థివ ప్రతీకమైనట్లు "నమః శివాయ" అథవా "ఓంనమశ్శివాయ" యనుమంత్రమాతనివర్ణ ప్రతీకమై యున్నది లింగము నందు మరియు మంత్రము నందు భేదము లేదు. లింగము పంచాక్షర మయము. పంచాక్షరము లింగమయము అను రెండు ప్రతీకముల ఐక్య భావము స్పష్టముగ వివరింప బడినది. (పారమేశ్వరాగమము శ్లో॥ ౧౦౧) ఈ ప్రణవ సహిత ప్రణవ రహిత మంత్రము వేదాగమములందు వివరింప బడి యున్నది. అటులే సమస్త ఫలదాయకమైనది. మననము త్రాణము యను ఈ రెండు ధర్మములు దాని యందుండి యున్నందున ఆశబ్దమునకు అథవా శబ్ద సముచ్చయము నకు మంత్రమని పేరుగలిగినది. మంత్ర ప్రయోగము చేత శివుడు స్వతః సన్ని హితుడగును పవిత్ర స్థానమందు కూర్చుండి మంత్రమును నిర్మలము, నిశ్చ లము అయిన మనస్సు చేత జపించ వలయును. మంత్ర జపము వాచిక, ఉపాంశ, మానస మని మూడు విధములైనది మానస జపమే అన్నిటి కన్న శ్రేష్ఠ మని వేరె చెప్పుటనావశ్యకము. ఇక లింగము తోడ విభూతి రుద్రాక్షలే శైవ లాంఛనము లని తెలియ వలెను. లాంఛన మనగ బాహ్య చిహ్నము లేక గురుతు. లింగదీక్షాకాలమందు గురువు విభూతి రుద్రాక్షలను

శిష్యున కనుగ్రహింప వలెనని సూక్ష్మాగమమునందు జెప్పబడినది.

౧౩ ఈ ఆగమము లందుదాహరించిన సాధన మార్గము లందు ఆయా సాధకుని విశిష్టప్రగతి మరియు లక్షణములను జూచి ఆగమకారులు ముఖ్యముగ భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్య, అను ఆరు స్థలముల కల్పించిరి. ఇవి అంగ స్థలములన బడును. వీటి వలెనే గురులింగ, ఆచార లింగ, ప్రసాదలింగ, చరలింగ, శివలింగ, మహాలింగమని ఆరు లింగస్థలములు గలవు. ఈస్థలముల భేదము ఈముందు వివరింపబడు సామాన్య లక్షణములచే గలిగినది. దేహాదుల అభిమానము వదిలినవాడు భక్తుడు, అమలచిత్తము గలవాడు మహేశుడు, శుద్ధ చిత్తుడైనవాడు ప్రసాదియు, జీవభ్రమవదలి లింగమే ఆత్మయని తెలిసిన వాడు ప్రాణలింగియు, శివతత్త్వము తెలిసి నిశ్చితుడై ఆనందము ననుభవించు వాడే శరణుడు, మరియు శివ జీవుల ఐక్యమనుభవించువాడే ఐక్యుడని సూక్ష్మాగమమునందు వర్ణన గలదు. మరియు పారమేశ్వరాగమము నందు గురు లింగ జంగమమును తారతమ్యము చేత పూజించు వాడే భక్తుడు. గురుశాసనము వలెనే లింగ జంగమ పూజ చేసి స్వమతాచార ప్రకారము ఆచరించు వాడే మహేశుడు నిత్యజంగమ పూజ సల్పుచు, శివార్పిత వస్తువులను గ్రహించు వాడే ప్రసాదియు ప్రాణ లింగ శివ ఈ మూడు నేకమను ఏక బుద్ధి గల వాడే ప్రాణలింగి ఈషణత్రయముచేత ముక్తుడై ఏకాంత సేవియై శివ ధ్యాన నిరతుడైనవాడే శరణుడు. మరియు పూజాధ్యానాదుల అవశ్యకతయే లేక సోహంభావపూర్ణుడైనవాడే ఐక్యుడని వర్ణన గలదు. భక్తుడాయారు స్థలములను పొంది ఐక్యుడు కావలయునను నదే దీని యభిప్రాయమై యున్నది.

౧౪ వైదిక కర్మలు జేయుటకధికారము గలుగ వలయు ననిన ఉపనయనమెట్లావశ్యకమో అట్లే తంత్రములందు పూజాదిక్రియలు చేయుట కన్న దీక్షాసంస్కారమత్యావశ్యకమైనది. దీక్ష అవశ్యమైనందున దీక్ష ఇచ్చు గురువు అవశ్యుడు. దీక్షాక్రియ కర్మసంచయమును నాశనము గావించును.

"దీయతే లింగసంబంధః క్షీయతే కర్మ సంచయః ॥ సూక్ష్మ.

దీక్షఐనవెంటనే పరమార్థ సాధనము ప్రారంభ మగును. ఇష్ట ప్రాణ భావ లింగములకు అన్వయించునట్లు క్రియా మాంత్రీ వేధా యను మూడు దీక్షలు గలవు సాధకుని ధర్మజీవనమునందు దీక్ష, శిక్ష, అనుభవము అను మూడు మెట్లు

గలవు. పైనజెప్పినదేదీక్ష, ధర్మజ్ఞానమును శివజీవసంబంధ జ్ఞానమునుపొందుటయే శిక్ష; మరియు ముందు సాధనముచేతను, స్వప్రయత్నము చేతను ఆ జ్ఞానము ననుభవించునదే అనుభావము; అని సూక్ష్మాగమాభిప్రాయము.

సద్గురువు నిరహంకారి, సత్యవాది, శాంతుడు, దాంతుడు, నిర్మత్సరుడు, స్వదార మాత్ర నిరతుడు, అధీత వేద వేదాంగుడు, సంప్రదాయ విశేషజ్ఞుడు, ఇంగితజ్ఞుడు, ఆత్మజ్ఞుడు, సదాచారసంపన్నుడు, వాగ్మియు, శివతత్వబోధకుడు, గంభీరుడు మరియు కరుణాళుడు నగు యుండవలయు నని సంక్షేపముగ చెప్పవచ్చును. అట్టి గురువునే ఆశ్రయించి సాధకుడు మోక్షమార్గమును అవలంబించవలయును. శిష్యుడుకూడ సువినీతుడు సుశాంతాత్ముడు నగు యుండి పునఃపునః శంకలను అడిగి సమాధానము చేసుకొనవలెను. దీక్ష పొందిన తరువాత గుర్వాజ్ఞ ప్రకారము నడువ వలెను. "గు" కార మనగా: అంధంతమస్సు; దానిని "రు" కార మను భాస్కరోదయము పారదోలుచున్నం దున "గురు"వు మోక్షదాయకు డనబడుచున్నాడు. నేనే గురువునై అనన్య శరణాగతులయిన భక్తుల నుద్ధరించెదను; అని శివుడు సూక్ష్మాగమమునందు వచించియున్నాడు. అందువలన గురుసేవ, గుర్వాజ్ఞ పరిపాలన, గురుపూజ, గురుధ్యానములే అనన్య సాధన లనబడును. గురు కృప పరమాత్ముని కృప వలనే మాహాత్మ్యము గలది గనుకనే ఆవశ్యకమై యున్నది.

గాధకునియందు విశిష్టజాతి, వర్ణ, లింగ, వయ సీటిని జూచుటకు కారణము లేదు. అతని గుణ, కర్మ, ఉద్దేశములు యోగ్యమైనవాలును. అతనికి ఆగమమార్గము ముక్తిద్వారమైయున్నది.

శివజ్ఞానముచేత శూద్రాదులు సహా శివత్వమును పొందుదురు. ఎవడు శాంభవదీక్షను పొందెనో అతని పూర్వ జాత్యాదులను లెక్కింప కూడదు. అని సూక్ష్మాగమముయొక్క ఆజ్ఞగలదు. (మ గి శ్లో॥ ౬౩, ౬౪) వీరశైవులు లింగధారణకన్న మొదలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అథవా శూద్రయను వేరువేరు జాతి వారలైయున్నను, వారు స్త్రీ, బాల, వృద్ధ, కుంటి, గ్రుడ్డి వైశ్య, ఛండాల యను వార లయి యున్నను, ఒకసారి లింగధారణ మైనంతనే వారందరు సారూపము గలవారలే యని పారమేశ్వరాగమము నందు (ప ౧) శ్లో॥ ౫౬,౫౭) శివుని వచనము గలదు. ఈ వీర శైవ మతము సర్వాతీతమై

యున్నది దీనియందు స్త్రీపురుషభేదముగాని, వర్ణాశ్రమముల భేదముగాని, గణన చేయబడదు. (పార. ప. ౫ శ్లో॥ ౮౧)

గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, విభూతి, రుద్రాక్ష, మంత్ర యీ అష్టావరణముల చేత కూడిన శివ యోగులందరు వీర మాహేశ్వరులు వీరియందు జాతిభేదము, లింగభేదము వీటిని యెంచకూడదు (పా. ప ౫౩, ౫౫) ఇంతయేకాక లింగధారణమైనందున శివభక్తులకు అప్రాకృతత్వము కలిగి దృష్టి దోషాదులు, స్పర్శదోషాదులు నష్టమవుచున్నవి అట్టివారు భుజించి విడచిన ఉచ్ఛిష్టము కాదు వారు భుజించిన పాత్రను గూడ కడుగకూడదు; యను మాటలుకూడ చెప్పబడినవి. జన్మ మరణాదుల ఆశౌచముకూడ లింగధారులకు తగులదు యని అదేఆగమమునందు (౫౮, ౫౫) ఉల్లేఖ గలదు. లింగధారులు తిథి, నక్షత్ర, యోగ, కరణ ఇత్యాదులను మన్నించ కూడదు. సమస్తము శివమయ మని భావించుటయే వారికి మోక్షసాధనము.

## ఆగమ సిద్ధాంతము.

వేదములు, ఆగమములు యని వాఙ్మయ దృష్టిచే విభాగింప బడుట నిజము. ఐనను వేదాగమములు ఏకార్థబోధకములే కాని పర్యాయవాచకశబ్దములు మాత్రము గావు. రెండును ఈశ్వరప్రణీతము లయినందున స్వతఃప్రమాణము లైనవి; అనగా: స్మృతీతిహాసపురాణములవలె ఏదోయొక విషయమును ప్రతిపాదించునప్పుడు ఇతరవాక్య ప్రమాణమును అపేక్షించవు. ఇదియేగాక ఎట్లు వేదములు స్వతః ప్రమాణములో అట్లు ఆగమములుకూడ స్వతః ప్రమాణములు విషయమును సిద్ధాంతీకరించుటయందు పరస్పరప్రమాణత్వము నపేక్షింపవు; అనగా: ఇవి రెండు అపౌరుషేయములేయని తెలియవలెను వేదాగమములు ఏకార్థబోధకము లనబడుచున్నవే గాని అవి పరస్పరము ఆధారాధేయములుగావు. ఈ రెండింటికి శృతియను పేరుగలదు. ఈశ్వరుని యొక్క ఉపదేశమే శృతియనబడుచున్నది. ఇదిగాక సద్ధర్మస్వరూపమును తెలియుటకు ముఖ్య సాధన మయి యున్నది.

౨౮ కామికాది వాతూలాంతమైన ౨౮ దివ్యతంత్రములు సిద్ధాంత రూపము లై యున్నవి వీటి యందు జ్ఞాన, క్రియ, అనుష్ఠేయ, అధికారి, సాధన,

సాధ్యములను తత్పదార్థములయొక్క బోధయే ముఖ్యమైనది. ఋగాదిసంహితలందువలె అభిచార కర్మ ప్రతిపాదనకు స్వల్పమైన ఆస్పదము లేదు. కామికాది సిద్ధాంతసంహితలందు మందులు మొదలైన దుష్టకృత్యులయొక్క గాలిగూడ తగులదు. మాంత్రికములు, ఔషధములు, చేతనాచేతనరూపములైన విష ప్రతిక్రియలు, భూతబాలగ్రహ నివారణాదులు, అపస్మారోన్మాద చికిత్సలు, జ్వరాదినానావిధ రోగప్రతీకారములు, స్తంభన, వశీకరణ, ఉచ్చాటన, మారణాదులను కృత్యములు స్వతంత్రముగ ప్రతిపాదింపబడిన తంత్రములు వేరెయున్నవి. అవి విజ్ఞాన కేవలమను ఆత్మవర్గమునందుగల ఆ యా నామధేయముల చేత ఉక్తమైయున్న గారుడ, దక్షిణ, వామ, భూతము లని ప్రసిద్ధమై యున్నవి. ఈ వామాచరణములైన అవైదిక క్రియలను ప్రతిపాదించునట్టి తంత్రములు శివ ప్రణీతములు గావు కనుక అవి శివాగమము లనబడవు.

వైదికీ శృతి వలెనే కామికాద్యాగమరూపమైన తాంత్రికీ శృతియు కూడ పరశివునివలన జగదుత్పత్తియొక్క సమయమునందే వ్యక్తము జేయ బడిన దని తాంత్రికీ శృతియందె జెప్పబడినది. మృగేంద్రాగమ విద్యా పాదమునందు —

సృష్టికాలే మహేశానః పురుషార్థప్రసిద్ధయే
విధత్తే విమలం జ్ఞానం పంచస్రోతాభిలక్షితమ్॥

సృష్ట్యారంభము నందు మహేశ్వరుడు భుక్తిముక్త్యాత్మక పురుషార్థ సంపత్తి కొరకు తన ముఖములైన సద్యోజాతాది పంచ మంత్రప్రవాహముల చేత విమల జ్ఞానమును దివ్యాగమరూపమున అనుగ్రహించుచున్నాడు. అనగా: పరమేశ్వరుడు అవబోధ (స్ఫురణ) రూప జ్ఞానమును సృష్టియొక్క మూలారంభము నందే భోగమోక్షాత్మకమైన పురుషార్థ సిద్ధికొరకు మొదలు నాదరూపమున ప్రకాశింపజేసి, తర్వాత అధికారావస్థను పొంది అనగా: సదాశివాదిరూపుడై శబ్దరూపజ్ఞానమును విద్యేశ్వరాదుల కుపదేశించెను.

నాదరూపతయా పూర్వం శివేనాఽవిష్కృతః పునః
సదాశివాదిరూపేణ తేనైవాఽసౌ పృథక్ పృథక్॥
కామికాదిప్రభేదేన శిష్యేభ్య స్సంప్రకాశితః
అష్టావింశతిసంఖ్యోఽసౌ సిద్ధాంత ఇతి సంజ్ఞితః॥

యను వచనానుసారము పరశివుడు తనయందు నిత్యసిద్ధమైయున్న విమలజ్ఞానమును సృష్టియొక్క మూలారంభమునందు నాదరూపము చేత ప్రకాశింప జేసి దానినే సదాశివరూపముచేత దశ శివులకు అష్టాదశ రుద్రుల నుద్దేశించి వేరె వేరె బోధించినందున కామికాది వాతూలాంతములైన ౨౮ సంహితలచే ప్రసిద్ధమైన ఆ విమలజ్ఞానమే సిద్ధాంత మను సంజ్ఞ గలదై యున్నది

ఆ కామికాది ౨౮ తంత్ర (సిద్ధాంత) సంహితలు మొట్టమొదలు సదాశివుని చేత విద్యేశ్వరులకు, ప్రణవ, శుద్ధ, దీప్తాది దశ శివులకు, అనాది రుద్రాది అష్టాదశరుద్రులకు బోధింపబడినవి అందువలననే కామికాది సుప్రభేదాంతములైన దశసంహితలు శివసంహిత లనియు, విజయాది వాతూలాంతములైన ౧౮ సంహితలు రుద్రసంహిత లనియు ప్రసిద్ధి గాంచినవి. ప్రత్యాగమమునందు విద్యాపాద, యోగపాద, చర్యాపాద, క్రియాపాద మను నాల్గు భాగములుండును ఈ నాల్గు పాదములందు తత్వవివేచనము సంపూర్తిగా జేయబడుచున్నది

వేదములు పశుపాశార్థబోధకములు, స్వర్గాది భోగరూపాస్థిర ఫలాభిరుచిని గలుగజేయునట్టివి. "త్రైగుణ్యవిషయా వేదాః" యను భగవదుక్తి ప్రకారము వేదములు విశేషముగ ప్రాకృత విషయములనే ప్రతిపాదించుచున్నవి కాని శివాగమములు పతిరూపుడయిన పరశివుని భక్తి, అర్చన, వ్రత, ధ్యాన, జ్ఞాన మను శివయోగ సాధనములను బోధించి, ఆత్మలకు శివత్వాభివ్యక్తి యను మోక్షమును గలుగజేయుచున్నవి. కనుక ఈ శివాగమములే మోక్షార్థికి పరమోపాదేయములని తెలియవలెను.

దూషయంతి శివజ్ఞానం యే సర్వార్థప్రసాదకం
సుమహాత్పాతకం తేషాం నిరయార్ణవగామినామ్॥

యను శ్రీ పౌష్కరోక్తి ప్రకారము పురుషార్థ సాధనీభూతములైన దివ్యాగమ సమూహమును దూషించు పాపిష్ఠులు శివజ్ఞానమును పొందక నరకార్ణవమును పొందుచున్నారు.

సిద్ధాంతః సేవ్యతే సద్భిః శక్తిపాత పవిత్రితైః
కామకాలితయాఽన్యైస్తు నింద్యతే పశుశాస్త్రవత్॥

ఈ శివాగమ వచన బృందమైన సిద్ధాంతము కూడ శక్తిపాతానంతర భావియైన దీక్ష వలన పవిత్రులైన సత్పురుషుల చేతనే సేవింప బడును గాని పశు శాస్త్ర మోహితులకు (అనగ వేద కామ్యానుసారులకు) ఈసిద్ధాంతములందు శ్రద్ధయె పుట్టకుండును. కనుక పాశబద్ధ జన నింద చేత సిద్ధాంతరూప శివాగమ సమూహమునకు ప్రామాణ్య వ్యాహతి కూడ సంభవించ కుండును.

వైదిక శ్రుతివాఙ్మయము అతిగూఢార్థమయమైనందున జన సామాన్యమునకు సులభసాధ్యము గాదు. కనుక నానా వాదీయుల సంశయముల కు ఆస్పదమై యున్నది. కాని సిద్ధాంత శృతియు సరళముగ ఉన్నందున వైదికీ శృతులకు విరోధముగాని అర్థములనే స్వతంత్రముగ సర్వ జన సామాన్య వేదితముగునట్లు జెప్పుచున్నందున యెట్టి సంశయములకాస్పదము గాదు. అనగ సమస్త విషయములు సిద్ధాంతమునందు స్పష్టముగ ఉపదేశింప బడినవి.

"వేదార్థ సార సంగ్రహాత్మకానాం క్వచి దపి దోషశంకా కలుష రహితానాం శైవాగమానామేవ సర్వాగమేభ్యో బలవత్త్వ వ్యవస్థితేః ॥"

వేదములందు గల సారమైన అర్థ మేది గలదో తదర్థమునే సక్రమముగ సుస్పష్టముగను జెప్పుచున్నట్టి, స్వల్పమైనను దోషయుక్తము గానట్టి ఏవిధమైన సంశయమునకాస్పదము గానట్టి, పవిత్రములై యున్న శైవాగములకు బలవత్తరమైన ప్రామాణ్యము గలదని అప్పయదీక్షితులు ప్రాకృతుల కండ్లు తెరచుటకు ఘంటాఘోషముగా జెప్పి యున్నారు.

వేదములు, ఆగమములు రెండును ఈశ్వర ప్రణీతములైనందున నిత్య ప్రమాణములైనవి. పరమేశ్వరుడు తన యందు గల నిత్య సిద్ధ జ్ఞానమును పరాపర భేదము చేత వ్యక్తము జేసి యున్నాడు. ఈపరాపర జ్ఞాన ద్వయమే ముండక శృతియందు పరావిద్య, అపరావిద్య యని జెప్పబడు చున్నది.

పరైః శైవాదిభిర్దివ్యై రాగమైః పాశమోచకైః
విశిష్ట భోగ విభవ శివత్వ ఫలదాయిభిః ॥
అపరైరపి వేదాద్యైరాగమైః స్వముఖోద్గతైః
స్వర్గాది ఫలసిద్ధ్యర్థం పశుజ్ఞాన ప్రకాశకైః ॥

జీవాత్మల యొక్క పాశమునుతొలగించి శివత్వాభివ్యక్తియను ఫలప్రదములైన కామికాద్యాగమ సంహితలు పరజ్ఞాన (పరావిద్యా) రూపములైనవి. స్వర్గాది

ఫలముల సిద్ధి కొరకు పశుజ్ఞాన ప్రకాశకములయిన ఋగాద్యాగమ సంహితలు అపరజ్ఞాన (అపరావిద్యా) రూపములయినవి; కామికాదిసంహితలు ఒకే పరమేశ్వర ముఖారవిందమునుండి వెడలినవి యని గలదు కనుక ఆగమములు పతిజ్ఞానమును, వేదములు పశుజ్ఞానమును బోధించుచున్నవనే సిద్ధమగుచున్నది ఇదే అభిప్రాయమును ఈశానశివాచార్యులు తన "పద్ధతి" యను గ్రంథమందు

స శివ స్స్వముఖోద్భూతై రాగమై స్తు పరాపరైః
అనుగృహ్ణాతి హి జగ ద్భోగ మోక్ష ప్రసిద్ధయే॥

ఆ శివుడు జగత్తునందు జీవులకు భోగమోక్షములు సిద్ధించుకొరకు తన ముఖములనుండి పరా (కామికాది) అపరా (ఋగాది) ఆగమములను పుట్టించి సర్వలోకముల ననుగ్రహించుచున్నాడు. మరియు,—

అనాది స్స శివో ముఖ్యో యథాఽన్యేభ్యో విలక్షణః
తథా తద్వదనోద్గీర్ణా వాచోఽన్యేభ్యో విలక్షణాః॥
శివాగమా శ్చ వేదా శ్చ నిత్యా ఏవ ప్రమాణతః
నిత్యా శ్శివాగమా వేదైః శివేనాఽదావభేదతః॥
నిత్యస్థితా స్స్వభివ్యక్తా స్తస్మిం స్తేఽనాదయో యతః॥

అనాదియైన ఆ శివుడు ఎట్లు అన్యులకన్న విలక్షణుడై యున్నాడో అటులే ఆతని ముఖోద్భవములయిన వాక్యములుకూడ అన్యుల వాక్యములకన్నను విలక్షణమైనవి. అందువలన శివవచనము లనబడుచున్న శివాగమములు, వేదములు నిత్యప్రమాణములే యయ్యున్నవి. ఏల ననగా: శివుడు అనాది సంసిద్ధుడు, నిత్యుడు. అతనినుండి అభేద (అనబోధ) రూపముచేత శివాగమములు వేదములవలె అనాదినిత్యసిద్ధములే గావలెను. ఇటులే అనాదియు, నిత్యుడు నగు శివునినుండి అభివ్యక్తములయిన ఆగమములు, వేదములు అనాది నిత్యప్రమాణములయినవి.

"తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" యను భగవదుక్త్యనుసారము స్వతఃప్రమాణములైనందున నెల్లరికి దత్పరిజ్ఞానమావశ్యకము

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి శ్రీ వీరశైవసిద్ధాంతశిరోమణియందు ఆగమ పరిజ్ఞానమను మొదటిప్రకరణము సమాప్తము.

ఓమ్

శ్రీశివాయనమః

# శ్రీ వీర శైవ సిద్ధాంత శిరోమణి.

# వీర శైవము.

## రెండవ ప్రకరణము.

యత్కృపా లేశమాత్రేణ వాంఛితం లభతే పుమాన్

తం వందే గిరిజానాథం పరబ్రహ్మ శివాభిధమ్ ॥

శ్రీ వీరశైవసిద్ధాంతము శివతత్త్వజ్ఞానమును ప్రకాశము జేయునది. సద్ధర్మాచరణములను వివరించునది కామికాది వాతూలాంతమైన శైవాగమములచే సకల పురాణముల చేతను కొనియాడ బడినది. వేదమార్గమునకు విరుద్ధము గానిది. జైన బౌద్ధాది నాస్తిక మార్గములను నిరాకరించునది. వేదాగమజ్ఞులగు పండితులకు సంతోషము గలిగింపజేయునది. వీర శైవులకు సకల పురుషార్థ ప్రకాశకమైనది. నిర్మలచిత్తులయిన సత్పురుషుల ప్రీతికి పాత్రమయినది. పూర్వము పరశివునిచే పార్వతికి షణ్ముఖునకు ఉపదేశింపబడినది. ఆ శివసాంప్రదాయస్థుడయిన మహా రేణుకగణాధీశ్వరునిచే భూమియందు అగస్త్యమహాఋషులకు బోధింపబడినది. సకలశైవసిద్ధాంతములకన్నను శ్రేష్ఠమైనది. శివాగమాదులలోని సర్వరహస్యార్థములు గలది. శివాద్వైతజ్ఞానమును ప్రకటించునది. లింగాంగ సమరస భావానుగ్రహము చేత కూడినది వేదాగమజ్ఞులచే శ్లాఘింపబడినది. పాశుపతసిద్ధాంతమునందు శ్రేష్ఠమయినది యని అనేక పండితోత్తములచే శ్లాఘింపబడినది. ఈ వీరశైవసిద్ధాంతము పరిణామవాదమును, జగత్సత్యత్వవాదమును ఘంటాఘోషముగా చాటించు చున్నది. అందువలననే వీరశైవమతము శక్తివిశిష్టాద్వైతమనబడు చున్నది. శక్తివిశిష్టాద్వైత మనగా: శక్తివిశిష్టజీవునకు శక్తివిశిష్ట శివునకు సామరస్య మనియే అర్థము. "శక్తిశ్చ-శక్తిశ్చ శక్తీ, తాభ్యాం విశిష్టౌ జీవేశౌ, తయోః అద్వైతం శక్తివిశిష్టాద్వైతమ్" అని పూర్వాచార్యులు శక్తివిశిష్టాద్వైతపద

మురియొక్క ప్రవృత్తిని చూపించిరి. కించిత్కర్తృత్వ కించిద్ జ్ఞాతృత్వములు జీవుని శక్తులు; సర్వజ్ఞత్వ సర్వకర్తృత్వములు శివశక్తులు. ఈ ఉభయ విధ శక్తులచే యుక్తులయిన జీవ, శివుల అద్వైతమే (సామరస్యమే) శక్తి విశిష్టాద్వైత మన బడుచున్నది.

శివాద్వైతసిద్ధాంతమే వీరశైవసిద్ధాంతము; ఇదియే సర్వసిద్ధాంతముల కన్న శ్రేష్ఠమయినది. కపిల, పతంజలి మొదలగు నానాఋషుల మనఃప్రీతి భిన్నతచేత అనేకవిధాచారములచే కూడియున్న వివిధాభిప్రాయములు గల సిద్ధాంతములు అనేకప్రకారములయియున్నవి సాంఖ్య, యోగ, పాంచరాత్ర, వేద, పాశుపతము లనునవే ఐదు ముఖ్యసిద్ధాంతములు.

౧ సాంఖ్యశాస్త్రము కపిలఋషి ప్రణీతమైనది; అది ప్రకృతి పురుష లక్షణ సమస్తన్యాయనిరూపకమై ఈశ్వరుడు లేడని చెప్పుచున్నది.

౨ యోగశాస్త్రము పతంజలిముని ప్రణీతమైనది; అది కష్టతరమైన యమ నియమాద్యష్టాంగయోగమును నిరూపించుచు ఈశ్వరుడు గలడని చెప్పుచున్నది.

౩ పాంచరాత్ర శాస్త్రము వాసుదేవ ప్రణీతమైనది; విష్ణుదీక్షాంగభూతమైన తప్త శంఖ చక్రాది ధారణమును నిరూపించి, చిత్ - అచిత్ - ఈశ్వర-మను త్రిపదార్థములను ప్రతిపాదించునట్టి వైష్ణవమతపరమైనది.

పాశుపతశాస్త్రము ఆగమరూపమున్న శివప్రణీతమైనది; అది పశు-పాశ-పతి యను త్రిపదార్థములను ప్రతిపాదించు శైవపరమైనది.

౪ వేదములు శివునియొక్క నిశ్వాసరూపముగ నిష్ప్రయత్నముగ అవతరించినందున, అకృత్రిమములయి ఋగ్యజుస్సామములను పేరు గలిగియున్నవి ఋక్, యజు, సామ వేదముల పూర్వకాండానుసారమై, జైమిని మహాఋషుల చేత విరచితమైయున్న పూర్వమీమాంసా శాస్త్రము యాగాదికర్మలను ప్రతిపాదించునట్టిదయి అనీశ్వరవాదమైయున్నది.

ఈ శాస్త్రములన్నియు ప్రమాణభూతములైనవి. యుక్తిప్రయుక్తులచే ఖండింప నలవిగానివి యని రేణుకాచార్యులవారు అగస్త్య ఋషులకు బోధించినట్లు శ్రీ శివయోగి శివాచార్యులవారు "సిద్ధాంతశిఖామణి" యను

గ్రంథమునందు వ్రాసియున్నారు. ఈసాంఖ్యాది సిద్ధాంతముల కన్నిటికి వేదము ముఖ్య ప్రమాణము. ఏలననగా; వేదము అపౌరుషేయము; ఇతరసిద్ధాంతములా వేదము ననుసరించియున్నవి.

సాంఖ్య, యోగ, పాంచరాత్రములు మూడును వేదమునందు యేదో యొక భాగమునందు ప్రతిపాదింపబడి యున్నందువలన వేదైకదేశవర్తములనియు శైవము సకలవేదప్రతిపాదిత మయి యున్నందున వేదమయ మనియు వేదాగమజ్ఞులయిన పండితుల యభిప్రాయమై యున్నది. అందువలన శైవము సర్వశ్రేష్ఠమని చెప్పబడినది. శైవతంత్రములను శివాగమములు పరశివోక్తములైనట్టి సిద్ధాంతములని చెప్పబడినవి. ఆ పరమాత్ముడైన శివుడు శైవ, పాశుపత, సోమ, లాకుళములను భేదముల చేత అనేకప్రకారములైన ఆగమములను బోధించెను. వానిలో శైవాగమము వామ, దక్షిణ, మిశ్ర, సిద్ధాంతమని నాలుగు భేదములు గలదయియున్నది. వామాగమము శక్తిపరమైనది. దక్షిణాగమము భైరవపరమైనది. మిశ్రాగమము సప్తమాతృకా పరమైనది. సిద్ధాంత మను శైవాగమము వేదార్థపరమైనది. ఈ సిద్ధాంతమను పేరు బడసిన శివాగమము వేదోక్త భస్మరుద్రాక్ష లింగధారణాది ధర్మములు ప్రతిపాదించుచు, వేదబాహ్యమైన జైన, చార్వాకాది ధర్మములను ఖండించుచున్నందున, వేద సమ్మతమైనది. వీరాగమ వచనానుసారము వేద సిద్ధాంతములు రెండును ఒకే అర్థమును ప్రతిపాదించుచున్నవి. ఈ శివోక్త సిద్ధాంతమని ప్రసిద్ధిబొందిన కామికాది శివాగమముల ఉత్తరభాగములందు ఉత్కృష్టమైన వీరశైవము సూచింపబడినది; అనగా: పూర్వ భాగమునందు శైవము, ఉత్తర భాగమునందు వీరశైవమును ప్రతిపాదింపబడినవి. అందువలన శివాగమ వచనము లన్నియును వీరశైవులకు ప్రామాణ్యములు గావు; ఇందుకు సిద్ధాంత శిఖామణి యందు గల ప్రమాణము:—

37 సిద్ధాన్తాఖ్యే మహాతంత్రే కామికాద్యే శివోదితే
నిర్దిష్ట ముత్తరే భాగే వీరశైవ మతం పరమ్॥

ఈ సర్వోత్తమ మయిన వీరశైవము ఇక విస్తరించి చెప్పబడును. మొదలు శివాగమోక్త పాశుపతము చెప్పబడుచున్నది.

# పాశుపతము.

పారమేశ్వరాగమము॥ ప. ౧ - ౧౦౩—

అతో మహారహస్యం హి మత మేత న్మహా త్తరం
శైవం పాశుపతం చేతి య దేకం నామభేదతః॥

శైవమనినను పాశుపతమనినను యేకార్థ ప్రతిపాదకములనియె తెలియ వలెను; గాని వేరనిగాదు; అనగా: శైవము పాశుపతము యను నివి రెండును పర్యాయనామములు. శంకరసంహితయందు:—

పరబ్రహ్మాభిధం లింగం పశుపాశవిమోచకం
యో ధారయతి సద్భక్త్యా స పాశుపత ఉచ్యతే॥

జీవుల సంసారబంధమునుండి విడిపించునట్టి పరబ్రహ్మాత్మక లింగమును సద్భక్తి చేత ధరియించువాడే పాశుపతు డని చెప్పబడినది. కనుక పాశుపతులు లింగధారులయిన శైవు లనియె నిశ్చయ మగుచున్నది.

లింగాంగసంగినాం చైవ పునర్జన్మ న విద్యతే
యేషు పాశుపతో యోగః పశుపాశనివృత్తయే॥
సర్వవేదాంతసారో౽యం అత్యాశ్రమ ఇతి శ్రుతిః॥

ఈ పునర్జన్మ రహితమైన మరియు మోక్షప్రదమైన లింగ ధారణమువలన పశుపాశనివృత్తి గలుగును కనుక ఇదియె పాశుపతయోగము. ఈ లింగ ధారణమే సమస్తవేదాంతములయొక్క సారము. ఇదియే అత్యాశ్రమ మని శ్రుతులు ఘోషించుచున్నవి.

శరీర త్రితయే భక్త్యా లింగం పరశివాత్మకం
యో ధృత్వా విచరే ద్భూమౌ స పాశుపత ఉచ్యతే॥
లింగం శివో భవే త్క్షేత్ర మంగం సంయోగ ఆశ్రయః
తస్మా ల్లింగాంగ సంయుక్తో యో పి సో త్యాశ్రమీ భవేత్॥
బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థో యతి స్తు వా
య స్తు లింగాంగసంయుక్తః స ఏవా౽త్యాశ్రమీ భవేత్॥

పరబ్రహ్మాత్మకమైన ఈ శివలింగము ఆణవ, మాయా, కార్మికములను మల పాశములను నివారించుటయందు సుసమర్థమైనది స్థూల, సూక్ష్మ, కారణ

ములను శరీర త్రయములందు ఇష్టలింగ, ప్రాణలింగ, భావలింగము లను పర శివాత్మకములైన త్రిలింగములను సద్భక్తిచేత ఎవడు ధరించునో, ధరించి ఎవడు ఈ భూమియందు వర్తించునో, అతడే పాశుపతు డనబడును. లింగ మనగ శివుడు, అంగమనగ జీవుడు, ఈ రెంటి ఐక్యమే సంయోగము. ఈ లింగాంగియే అత్యాశ్రమియనియు, పాశుపత వ్రతము, శాంభవవ్రతము, పాశుపత దీక్షా, శాంభవదీక్షా, శివలింగదీక్షా, భస్మరుద్రాక్ష, శివలింగధారణ, శివపూజనాత్మకములనియు వ్యాసమహాఋషులు స్వవిరచిత శివపురాణము లందు స్పష్టముగా వాకుృచ్చియున్నారు. అందువలన పాశుపతదీక్షయే శివదీక్ష యనవచ్చును. మరియు ఆదిత్య, లైంగ్య, స్కాంద పురాణముల వలన పాశుపతవ్రతము ఆత్యాశ్రమవ్రతము, లింగధారణవ్రతము లనునవి ఏకాభిప్రాయవ్రతములే గాని వేరు వేరు వ్రతములుగావని తెలియుచున్నది. "వ్రత మేతత్ పాశుపతం పశు పాశవిమోక్షాయ వ్రతమేతచ్ఛాంభవం తత్ సమాచరేత్ ముముక్షు ః పునర్భవాయ"యని కైవల్య, అధర్వణశిరస్సు, కాలాగ్నిరుద్ర, ముండకాది ఉపనిషత్తు లందుకూడ పాశుపత వ్రతాచరణము గలవానికే బ్రహ్మాధికారము గలదని ప్రతిపాదింప బడినది.

స్కాందపురాణాంతర్గత కేదారఖండము అ. ౬ పు ౧౧-౧౨ యందు:- "రుద్రునిచే చెప్పబడిన శివధర్మములు అత్యంత ప్రాచీనములైనవి. వీరభద్ర, నంది, భృంగి, వృషభ, స్కంద యను ఐదుగురు గురువు లనబడుదురు ఈగురువులచే యుత్పన్నులైన వారు మూడులోకములందు సుప్రసిద్ధ గురువులై వెలసిల్లిరి. శివలింగమహిమను యథార్థముగా శిలాద పుత్రుడైన నందీశ్వరుడు తెలుసుకొని ఆశివధర్మముల నున్నది యున్నట్లుగా బోధించెను.

శ్లో॥ లింగేనసహ పంచత్వం లింగేన సహజీవితం।
ఏతేధర్మాః సుప్రతిష్ఠాః శైలాదేన ప్రతిష్ఠితాః॥ ౪౨
ధర్మః "పాశుపత" శ్రేష్ఠః స్కందేన ప్రతిపాలితః॥ ౪౩

శివలింగము తోడనే జీవించుట, శివలింగము తోడనే మరణించుటయే ముఖ్యమైనట్టి యీ పాశుపతధర్మములు (వీరశైవ మతములు) శిలాదపుత్రుడైన నందీశ్వరునిచే స్థాపింపబడినవి. అతిశ్రేష్ఠమైన ఈపాశుపత

(వీరశైవ) ధర్మము స్కందునిచే రక్షింపబడినది. పంచాక్షరీ మంత్ర విద్యయు శుద్ధపంచాక్షరి యనియు, ప్రసాద పంచాక్షరి యనియు నానావిధములైనది. ఆ పంచాక్షరీ షడక్షరీ విద్యయు మొదలు స్కందునిచేత మహిమాశాలి యైన అగస్త్య మహాఋషికి బోధింపబడినది. అటుతరువాత ఆచార్య భేదమువలన ఆగమములు అనేకములాయెను.

స్కందాత్తత్ప్రాప్త మగస్త్యేన మహాత్మనా
పశ్చాదాచార్య భేదేన హ్యాగమా బహవోఽభవన్॥ ౯౫

"అనగ ఆదియందు కైలాసమున పాశుపతము వీర నంది భృంగి వృషభ స్కందులను గురువర్యులచేత ప్రతిపాదింపబడి ఆగమరూపమును పొందెను"

యోగాత్మానో మహాత్మానో బ్రాహ్మణా వేదపారగాః
ప్రాప్య మాహేశ్వరం యోగం విమలా హ్యూర్ధ్వరేతసః॥ ౧౩౨
రుద్రలోకం గమిష్యంతి పునరావృత్తిదుర్లభమ్
ఏతే పాశుపతాస్సిద్ధా భస్మోద్ధూళితవిగ్రహాః॥ ౧౩౩
లింగార్చనరతా నిత్యం బాహ్యాభ్యన్తరత స్థితా
భక్త్యా మయి చ యోగేన ధ్యానవిష్ఠా జితేన్ద్రియాః॥ ౧౩౪
సంసారబంధచ్ఛేదార్థం జ్ఞానమార్గ ప్రకాశకమ్
స్వదేహజ్ఞానసిద్ధ్యర్థం యోగం పాశుపతం మహత్॥ అ౯ ౧౩౫

అనలింగపురాణాను సారముగ పాశుపతులనగా లింగధారులైన శైవులనియు సిద్ధమగుచున్నది సంసార ముక్తికొఱకై జ్ఞానసంపాదనమె వారియోగమైనది.

సారాంశమేమనగా శైవమతమే మొదలు పాశుపతమని పిలువ బడుచుండెను. ఇప్పుడు అది పాశుపత వ్రతమని పిలువబడుచున్నది. పాశుపతులు లింగధారులుగారని కొందరి అభిప్రాయమై యున్నందున వారు లింగధారులేయని సప్రమాణముగ జూపింప నైనది.

వయం బ్రహ్మాదయః సర్వే పశవః పరికీర్తితాః
త్వమస్మాకం పతిర్యస్మాత్ తస్మాత్పశుపతి శ్శివః॥ లైంగ్యే॥

బ్రహ్మాదులే మొదలైన మేమందరము పశువులము మాయందరికి శివుడవైన నీవే పతివైనందున పశుపతివనియు, దేవతలందరు శివలింగ ధారణము గలవా

రులై పాశుపతు లనబడిరనియు లింగపురాణమునందు చెప్పబడినది కనుక శివుని సంబంధించిన మతమే పాశుపత మనఁబడుచున్నది.

పద్మపురాణాంతర్గత శివగీతయందు:—

ధర్మార్థ కామమోక్షాణాం పారం యాస్య న్నియేన వై
మునయ స్తత్ప్రవక్ష్యామి వ్రతం పాశుపతాభిదమ్॥ 36

ఓమునిశ్రేష్ఠులార! మునులు యేవ్రతము జేసి ధర్మము, అర్థము, కామము, మోక్షమను చతుర్విధ పురుషార్థముల మేరనారయుదురో పాశుపతమను నావ్రతమును జెప్పెదను. అని సూతుండు శౌనకాది ఋషుల గురించి పాశుపత వ్రతము అతిశ్రేష్ఠమైనదని ఉపదేశించి యున్నాడు. ఈ పాశుపత వ్రతము వలననే జీవుడు మాయాబంధము నుండి వదలి మోక్షమును పొందును.

## షడ్దర్శనములు.

మనుష్యుని సుఖదుఃఖములు కర్మానుసారముగ ఐహికములని ఆముష్మికము లని రెండు విధములు. ఈ లోకమునందు వనితాది విషయములందు గలుగు ఆనందమే ఐహికసుఖము. యజ్ఞాది సత్కర్మానుష్ఠానము యొక్క సంస్కార బలముచేత దేహానంతరము స్వర్గాది పుణ్యలోకములయందు లభించు ఆనందమే ఆముష్మిక సుఖము. చోరవ్యాఘ్రాదుల చేతను, రోగోపద్రవముల చేతను, క్షామడామరాదుల చేతను, సంభవించు దుఃఖమే ఐహిక దుఃఖము. దుష్కర్మాచరణముచేత దేహానంతరము గలుగు నరక యాతనమే ఆముష్మికదుఃఖము. మనుష్యుడు ఐహికాముష్మిక సుఖముల ననుభవించినను

"క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి"

"పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం"

"జాతస్య హి ధ్రువోమృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ॥"

ఇత్యాది ప్రమాణములచేత ఐహిక సుఖమైనను ఆముష్మిక సుఖమైనను జనన మరణములను తప్పించలేవు. జననమరణ ప్రవాహమునకే సంసారమని పేరు. మోక్షము తప్ప ఈ సంసారమునకు నాశము గలుగదు. సుఖము నిత్యమని అనిత్యమని రెండు విధములు. ఐహికాముష్మికసుఖములు రెండును్ను అనిత్యములే. మోక్షసుఖమే నిత్యమైనది. అజ్ఞాన దుఃఖము లెల్ల అడగిన తరువాత

కలుగు అవిచ్ఛిన్నానందమే మోక్షమనబడును. అట్టి స్థితియు సాధన బలము చేత ఈ దేహముండగనే గలిగిన అది జీవన్ముక్తి యనియు, దేహానంతరము గలిగిన విదేహ కైవల్యమనియు సిద్ధాంతమగును.

వేదవేదాంగాది విద్యాధికారులు, జ్ఞానాధికులు, కర్మ మార్గమునందు నడచి పరిపక్వాంతఃకరణులై మోక్షమార్గమును విచారించి తాము జీవించి యుండగనే దుఃఖస్పర్శములేని సహజానందానుభవమను జీవన్ముక్తిని పొంది ఆ మార్గమునే ఇతరులకు బోధించి వారిని ఆ మార్గమునందే ప్రవర్తింప జేసిరి. ఇవియే మతములని ప్రఖ్యాతి జెందినవి. ఏమతము ననుసరించినను తదభ్యాస స్వానుభవములచే గలుగు ఫలము మాత్రము ఒక్కటియే యని తెలియనగును. ఆ మతము లేవనగా:—

శ్లో॥ శ్రీవీరశైవమత వైష్ణవ శాక్తసౌర వైనాయకాని మహితాని శివాగమేషు
కాపాలికేన సహితాని వదంతి సంతష్షడ్దర్శనాని విదితాగమ సంప్రదాయాః॥
తేష్వాద్య దర్శనమిదం కిలవీరశైవం తత్సృథా భవతి తత్క్రమశో వదామి
యద్జ్ఞానతః పశుజనోపి భవేద్విముక్తః పాశాన్మహేశ పదపంకజ భక్తిలాభాత్

వీరశైవము, వైష్ణవము, శాక్తము, సౌరము, వైనాయకము, కాపాలికములనునవి ఆరు మతములు. ఇవి వేద సమ్మతములైన వైనందున ఆస్తికమతములనబడుచున్నవి. ఈ ఆరు మతములు షడ్దర్శనములనియు, ఆగమ సంప్రదాయకములనియు, ఆమతములలో వీరశైవమతమే సర్వోత్కృష్టమనియు, మరియు ఆమతాను సారవర్తనులకు జ్ఞానబోధ వలన శివభక్తి యుత్పన్నమై అజ్ఞానమను పాశబంధము క్షీణించి మోక్షసంప్రాప్తి యగుననియు ఈసూర్యోక్తి శ్లోకద్వయముచే తెలియుచున్నది. కనుక మంగళకరుడైన శివుని అనుగ్రహము వలన మోక్షములభించుట సుప్రసిద్ధము. అట్టి మోక్షదాయకుడైన శివుని దెలుపు విద్యయే శైవము. ఆశైవమునందు విశేషముగ రమించుచుందు వారలే వీరశైవులు. ఈ విశుద్ధ జ్ఞాన సంప్రాప్తి సర్వులకు అత్యావశ్యకము దీనిచే మనుజులు కర్మ చక్రమునుండి తొలగింపబడుదురు.

శ్లో॥ వైనాయకం పదం ప్రోక్తం శాక్తం కటితటం స్మృతం
కాపాలం జఠరం ప్రోక్తం సౌరం హృదయముచ్యతే
వైష్ణవం స్కంధయుగళం వీరశైవం శిరస్స్మృతం॥ యోగజాగమే॥

పరమేశ్వరునకు వైనాయకము పదమనియు, శాక్తము నడుమనియు, కాపాలికము జఠరమనియు, సౌరము హృదయమనియు, వైష్ణవము భుజద్వయమనియు, వీరశైవము శిరస్సనియు, షడ్దర్శనవివరము యోగజాగమమునందు గలదు.

శ్లో॥ ఆద్యాత్తు సౌగత మతా దధికం ద్వితీయం
యద్వైదికం తదను సౌరమతః పరంతత్
యద్వైష్ణవం తదను శైవమిదం సమస్తా
దుత్కృష్ట మిత్యుపదిదేశ శివశ్శివాయై॥

సుగతమూర్తి యనగా బుద్ధుడు. ఆబుద్ధుని బోధించుమతమే సౌగతము (బుద్ధమతము) ఈబుద్ధమతము కన్నను రెండవదియైన వైదికమతము అధికమైనది. దీనికన్నను సూర్యుని బోధించు మతము (సౌరము) అత్యధికమైనది. ఈ సౌరమతము కన్నను తత్ప్రసిద్ధ విష్ణుమూర్తిని బోధించు వైష్ణవము అధిక మైనది. మరియు ఈవైష్ణవము కన్నను శివప్రోక్తమైన శైవము ఉత్కృష్టమనియు శివుడు పార్వతికి బోధించెను. అందువలన శైవము షణ్మతములలో అత్యుత్కృష్టమైనదని అవగతమగుచున్నది.

## శైవమత సప్తసోపానములు

ఈ వీరశైవము ప్రథమమున నేడువిధములుగా విభజింపబడినది. అనాది శైవము, ఆదిశైవము, అనుశైవము, మహాశైవము, యోగశైవము, జ్ఞానశైవము, వీరశైవము. వీటియొక్క వివరము పారమేశ్వరాగమ ప్రమాణాను సారముగ చెప్పబడు చున్నది.

(౧) అనాది శైవలక్షణము:— ఎవడు త్రికాలములందు శివపూజనము జంగమార్చనము జేయుటయందు సమర్థుడో, కర్మజన్యఫలము నందు ఆనందమును, విఫలమునందు శోకమును బొందునో, బంధ ముక్త్యోభయజ్ఞానము లేక ఒకేకర్మనే ముఖ్యముగా జేయుచుండునో, అతడు అనాది శైవు డనబడును ఇతడు ప్రమాదములందు ప్రాయశ్చిత్తమును గొనును. శుభాశుభములందు శుభకర్మలనే జేయుచుండును.

(౨) ఆది శైవలక్షణము:— త్రికాలములందు శివలింగపూజ, జంగమ మరియు అతిథి సత్కారము జేయుట, ఎల్లపుడు శివనామ స్మరణమునందు సంతుష్టుడగుట ఇవియే లక్షణములుగల జ్ఞానియే ఆదిశైవుడనబడును.

(3) అను శైవలక్షణము:— లింగార్చనము, జంగమార్చనము, అతిథి ఇష్టప్రదానము జ్ఞానాధిక్యము, కామ్యకర్మ పరిత్యాగము, నైమిత్తికము ఇవి అనుశైవుని లక్షణములు. అనగా అనుశైవుడు కర్మమును విడచినవాడై శక్త్యనుసారము శాస్త్రముల పఠించి మితిమీరకుండ వర్తించుననని అభిప్రాయము.

(౪) మహాశైవ లక్షణము:— ఈ మహాశైవుడు జంగమపూజలేక ప్రసాదము భుజింపకుండును. అతడు కరపంకజమునందె లింగమును పూజించును. ఇతనికి ఈవిశ్వమంతయు శివరూపమని తెలిసియున్నను "శివోహం" యను భావన యందు పూర్ణ దృఢత్వము లేక యుండును.

(౫) యోగ శైవలక్షణము:— యోగశైవుడు బహిఃపూజ సలుపడు. లింగపూజ చేయడు. అష్టాంగ సహితమైన యోగమున కాశ్రయుడై సకలేంద్రియాదులను జయించి చిదాత్మమైన శివునియందు హృదయమును నిలిపి స్వస్థుడై అనగా బాహ్య వ్యాపారోన్ముఖుడై ఆనందమయుడై యుండును. ఇక్కడ బాహ్య లింగపూజయు నిషేధింపబడినది.

(౬) జ్ఞానశైవలక్షణము:— సాక్షాత్ శివునిచే సులభమైన అనుష్ఠేయ ధర్మములు చెప్పబడినవి. వాటిని తెలిసినవాడే జ్ఞానశైవుడు, మరియు అతనిని సాక్షాత్ శివుడనవచ్చును. అట్టి జ్ఞాన శైవునకు సాకార యోగముతోడను, శివ జంగమ పూజాది కర్మములతోడను, స్వయం పరిపూర్ణత్వము వలన యే ప్రయోజనము లేక యుండును. అనగా ఇతడు ఎట్టికర్మలను జేయకుండను.

(౭) వీరశైవ లక్షణము:— యోగ జ్ఞానోభయమునందు భక్తి గలిగి జితేంద్రియుడై, నిస్పృహ గలవాడై శివోహమను భావమునందు అచలుడైన వాడె వీరశైవుడన బడును. దీని ముఖ్యాంశమేమనగా అనాది, ఆది, అను, మహాశైవులు శివకర్మలనే ప్రాముఖ్యముగా జేయు చుందురు. యోగ, జ్ఞాన శైవులు జ్ఞానమునే ప్రధానముగా సంపాదింతురు. కాని వీరశైవులు కర్మ జ్ఞానముల రెంటిని అవశ్యముగా నెంతురు.

# శైవభేద నిరూపణము.

దీక్షా హోమాదికం సర్వం సర్వత్ర సమమేవ హి
ఆచారాశ్చాపి భక్తిశ్చ సమాః సర్వ మతేష్వపి॥ 3౨
లింగస్య పూజనం నిత్యం జంగమానాంచ పూజనం
కర్తవ్యం నియతో భక్తిః సర్వభేదేష్వపి ప్రియో॥ 33
అనాదిశైవనిష్ఠస్య కర్మైవ పరమాగతిః
ఆదిశైవ మతస్థస్య స్మరణం సతతం విధిః॥ 3౪
అనుశైవ మతస్థస్య మననం ముఖ్యసాధనం
మహాశైవ మతస్థస్య నిశ్చయః పరమాగతిః॥ 3౫
యోగశైవ మతస్థస్య యోగస్స్యాష్టాంగ లక్షణాం
జ్ఞానశైవ మతస్థస్య జ్ఞానానాం భావనాఽఖిలా॥ 3౬
వీరశైవ మతస్థస్య జ్ఞానయోగో హి సాధనం
వినాజ్ఞానేన యోగః స్యాన్నజ్ఞానం యోగతో వినా॥ 3౭
నవినాజ్ఞాన యోగాభ్యాం వీరశైవ మతాశ్రయః
సంతారణాయ భవతి చ్యవతే నాత్ర సంశయః॥ 3౮

త్రైవిధదీక్ష, పంచాచారములు, శివభక్తి, లింగపూజ, భక్తిపూర్వకమైన జంగమార్చన ఇవి సమస్త శైవభేదములందు, సర్వమతములందు, సమానముగా సామాన్య కర్తవ్య ధర్మములై యున్నవి. ఇవిగాకను ప్రతి శైవభేదము నందు విశేష ధర్మములు కూడ యున్నవి అట్టి ధర్మములే ఆ మతభేద స్వరూపమును నిరూపించు చున్నవి. ఎట్లన అనాది శైవమునందు కర్మ నాచరించుటయే అనగా శివార్చన జేయుటయే ముఖ్యధర్మము. ఇదియే అనాది శైవము యొక్క ముఖ్య లక్షణము. ఇటులే స్మరణము ఆదిశైవము యొక్క ముఖ్య ధర్మము. మననము అనుశైవమునకు, నిశ్చయమే మహాశైవమునకు, అష్టాంగ యోగము నాచరించుటయే యోగశైవమునకు, జ్ఞాన మొక్కటే జ్ఞానశైవ మునకు, మరియు జ్ఞానము యోగము (క్రియాజ్ఞానము) రెండును వీరశైవ మునకు ముఖ్యలక్షణములు. జ్ఞానము లేక యోగము, యోగము లేక జ్ఞానము కుదరదు. యోగము జ్ఞానము రెండును లేక వీరశైవుడు సంసారమును తరించి

ముక్తిని బొందలేడు యని పారమేశ్వరాగమము ఏడవ పటలమునందు శైవ మతభేదములయొక్క ముఖ్యధర్మములు జెప్పబడినవి.

## శైవ భేదములు.

శ్లో॥ వామాః పాశుపతాశ్చైవ కాలాముఖ మహావ్రతాః
కాపాలా భైరవాశ్చోక్తా స్రావకా యోగధారణాః॥
శైవా బహువిధాశ్చైవ వైష్ణవాః పాంచరాత్రికాః,
వైఖానసాః కులాః కౌలా స్తత్సంభేదాస్తథా ఉమే॥
సాంఖ్యాశ్చ లాకులాశ్చైవ తథా హంసపరాయణాః
ఏతే సమయినస్సర్వే అన్యోన్య కలహప్రియాః
ఏతాన్ సర్వాన్ పరిత్యజ్య వీరశైవం వదస్వమే॥ వీరాగమము.

సామాన్యముగ శైవులనబడు వారిలో గొన్ని భేదములు గలవు. ఆభేదములు పాశుపతము, కాలాముఖము, కాపాలికము, మొదలగు పేర్లు గలవి శివుడే పరతత్వమని విశ్వసించు వారైనను వీరిలో బరస్పరము మత స్పర్థలు విరోధములు గలవు. కనుక వీరాగమమునందు ఈ అనేక భేదములు గలిగి పరస్పర కలహప్రియులైయున్న శైవులను వైష్ణవులను విడచి వీరశైవమును బోధించుమని పార్వతి శివుని వేడుకొనినట్లు వ్రాయబడి యున్నది ఈ శైవ సాంప్రదాయులు వర్ణాశ్రమ భేదములను విడనాడిన వారుగారు. పాశుపత వ్రతము అథర్వ శిరోపనిషత్తునందు జెప్పబడినది. బ్రహ్మప్రణవ పంచాక్షరీ ప్రసాదాది మంత్రములు, పశు, పతి, పాశాది వస్తువ్యవహారము, భస్మోద్ధూళన త్రిపుండ్ర ధారణ లింగార్చన రుద్రాక్ష ధారణాది ధర్మములు పాశుపతులకు గలవని శ్రీకరభాష్యము వలన దెలియునగును. పాశుపతులు అద్వైత మతమును మిక్కిలి గర్హించిరి. వారు జీవేశ్వరులకు భేదము చెప్పుదురు. పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచే పాశమయిన సంసారమునుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. పాశుపతులు విశిష్టాద్వైత సిద్ధాంతము వారు. విశిష్టాద్వైతుల వలె వీరును శ్రౌతస్మార్త కర్మలతో సమానముగా శైవాగమోక్తములయిన కర్మములను గూడ నాచరింతురు.

వాతులాగమమునందు మరల ఆచారభేదమువలన శైవము నాలుగు విధము లుగ విభజింపబడినది.

శైవం చతుర్విధం జ్ఞేయం సమాసా చ్ఛృణు షణ్ముఖ
సామాన్య మిశ్రకం చైవ శుద్ధం వీరం యథాక్రమం॥

సామాన్య, మిశ్ర, శుద్ధ, వీర యని శైవము నాలుగు విధములు.

## సామాన్యశైవము.

తత్రాదౌ సంప్రవక్ష్యామి శైవ సామాన్య లక్షణం॥
శివలింగం యదా పశ్యే త్తదా కుర్యా త్సమర్చనం॥
ప్రదక్షిణం వా ప్రణతిం దర్శనం వాఽత్ర కారయేత్
భస్మధారణ మాత్రేణ శుద్ధోభవతి సర్వదా॥
శివతీర్థే తదాలాపె ప్రీతిమాంశ్చైవ భక్తకె
ఏతేషాం నియతి ర్నాస్తి యథాలబ్ధం సమాచరేత్॥

సామాన్యశైవుడు లింగము నెప్పుడుదర్శించినో అప్పుడే పూజించును, అనగా లింగము లభించునప్పుడె ప్రదక్షిణము, నమస్కారము, దర్శనము గావించును. నియమప్రకారము పూజించుట, లింగమును ధరించుట, అతని నేమము గాదని తెలియవలెను. భస్మధారణ మాతనికి ప్రాముఖ్యము. ఎల్లప్పుడు భస్మము ధరించి తత్ప్రభావముననే శుద్ధుడగును, అనగా ఇతడు శివకీర్తన శివ వచన శివభక్తులయందు ప్రీతిగలవాడైయున్నను శివార్చనయందు మాత్రము నియమము లేనివాడని అర్థము.

## మిశ్రశైవము.

సామాన్యం లక్షణం ప్రోక్తం వక్ష్యే మిశ్రస్య లక్షణం
శైవంచ వైష్ణవం శాక్తం కౌమారం గాణపత్యకం॥
సౌరం చాఖిల దైవత్యం పూజనం చ సమాచరేత్
ఏతేషూక్తేషు సర్వేషు తన్మంత్రేషు మిశ్రణాత్॥
సమభక్తిం సమాయుజ్య సర్వాః లింగేషు భావయేత్
మిశ్రశైవమితి ప్రోక్తం శుద్ధశైవ మథ శృణు॥

శివ విష్ణు శక్తి కుమార గణపతి సూర్య ఇత్యాద్యఖిలదేవతల పూజించు వాడే మిశ్రశైవుడు, ఇట్టి మిశ్రశైవుడు శివుడు సర్వోత్తముడని తెలిసియుండి శివధర్మ ములను అన్యధర్మములను సహ ఆచరించును. సమస్తదేవతలందు సమభక్తి గలిగినవాడైనందున సమస్తదేవతలు శివలింగమునందు గలరని భావించి లింగ మును పూజించుచుండును. కనుక ఆతడు మిశ్రశైవు డన బడును.

## శుద్ధశైవము.

శుద్ధత్వం శివముద్దిష్టా చ్ఛినజాతాత్తు శైవకం
శుద్ధశైవ సమాయోగాచ్ఛుద్ధ శైవమితి స్మృతం॥

శివుని ఒక్కనినే దేవుడుగాభావించి మిగిలినదేవతలను అతనిభక్తులు, అతనిలో జన్మించిన వారలని తెలిసి శివునినే పూజింతురు గనుక శుద్ధశైవు లన బడు దురు. వారిమతమే శుద్ధశైవమనబడును. ఇక వీరాగమమందు:——

శుద్ధశైవా న్మహాసేన తస్మాజ్జాతః శివద్విజః
శివద్విజాస్తు విప్రేంద్రా ఆదిశైవాః ప్రకీర్తితాః॥
కౌశికః కశ్యపశ్చైవ భారద్వాజోఽ త్రిరేవచ
గౌతమశ్చేతి పంచైతే పంచవక్త్రేషు దీక్షితాః॥

శుద్ధశైవులే శివద్విజులన బడుదురు. వీరలే ఆదిశైవులు. కౌశిక కశ్యప భార ద్వాజ అత్రి గౌతమయను పంచఋషులే పంచవక్త్రములనుండి దీక్షను పొందిరి.

కామికాదిషు తంత్రేషు చాష్టావింశతిషు క్రమాత్
వేదశాస్త్రాది సర్వేషు కృతాభ్యాస శ్శివవ్రతీ॥

ఈకౌశికాది పంచఋషులు కామికాది ఆగమములందు వేదశాస్త్రములందు అధికాభ్యాసము గలిగినందున ఆ ద్విజులను శివవ్రతులని కూడ పిలుతురు.

మంత్రయంత్రక్రియా ముద్రా న్యాసా వాహన కాదిభిః
ఉపచారై ర్బహువిధై ర్లింగం సింహాసనే యజేత్॥

మంత్ర యంత్ర క్రియలు జేయుట, ముద్రలు న్యాసములు జేయుట, ఆవాహ నము జేయుట, బహువిధోపచారములతో శివలింగమును సింహాసనమునందు పూజించుట, ఇట్టి యాచారములు గలవాడు శుద్ధశైవుడు. ఇతడు లింగ మును కరస్థలమునందు బూజించడు; ఇదియోగాక శుద్ధశైవుడైన శివద్విజుడు

స్వార్థము కొరకు సాలగ్రామ లింగమును పూజించును. పరార్థము కొరకు గ్రామ్య లింగముల బూజించును.

శివావరణ దేవాం శ్చ సర్వా న్సంపూజయే ద్గుహ
పృథ క్థ్సానస్థితా స్సర్వా న్నార్చయే దన్యదేవతా॥

ఓ షణ్ముఖా! ఈ శుద్ధ శైవు డయిన శివద్విజుడు శివసంబంధమైన దేవతలను అనగా: దుర్గ, పార్వతి, గణపతి, కుమార, వీరభద్ర ఇత్యాదులను పూజించును; కాని అన్యస్థానములందు వేరుగాగల శివేతర దేవతలను పూజించడు. అనగ: శివ, శివదారాపుత్రాదులను విడచి ఇతర దేవతలను పూజించని వాడే శుద్ధ శైవు డని యర్థము.

మంత్రలింగ శ్శరీరం స్యా త్స ఏవ శరమ శ్శివః
శుద్ధ శైవ మిదం ప్రోక్తం వీరశైవ మథ శృణు॥

గురుదత్తలింగమును బాహ్యపీఠము నందుగాని, కరపీఠమునందు గాని పూజించుచు, గురూపదిష్ట వ్రతముల నాచరించుచు, లింగలోపమునందు ప్రాయశ్చిత్తముల పొంది, మరియొక లింగమును పొందుచు, వ్రతాదులు లోపములైన మూల పంచాక్షర జపముచేత ప్రాయశ్చిత్తమును పొంది శుద్ధుడగును. కనుక అతడు మాంత్రలింగశరీరు డనబడును. అతడు సాక్షాత్ పరమశివునకు సమానుడనవచ్చును. ఇక వీరశైవమును వినుము.

## వీరశైవము.

ఏక ఏవాఽయ మస్మిన్ హి సర్వేఽస్మిన్ జగతీతలే
విశేష ఈరతే యస్మా ద్వీర ఇత్యభిధీయతే॥
శివేన సహ సంబంధం శైవ మిత్యుదితం బుధైః
ఉభయో స్సంపుటీభావా ద్వీరశైవ మితి స్మృతమ్॥
శివార్థార్పితజీవత్వా ద్వీరతంత్రసముద్భవాత్
వీర శైవ సమాయోగా ద్వీరశైవ మితి స్మృతమ్॥ వాతులే॥

భూతలమునందంతటను శివు డొక్కడే యను వీరవ్రతము గలిగియుండుటను, శివునితో ఆత్మకు నికట సంబంధము గలిగించుకొని యుండుటను, జీవత్వమును శివున కర్పించి శివజీవైక్య యుక్తు డయియుండుటను, వీరతంత్రముల ననుసరించిన

ఆచారము గలిగినందునను, ఈ మతము వీరశైవ మనబడినది. ఇదియే శైవ మతములందు ఉత్కృష్టమైనది. ఎవడు శివదీక్షాపూర్వకమైన గురుదత్తలింగ మును తల, మెడ, రెట్ట, పొట్ట, ఎద, చెయ్యి వీటియందు ఏదో యొకస్థాన మునందు ధరించి, త్రికాలములయందు వామహస్తపీఠమునందు పూజించుచు, శివ పాదోదక శివ ప్రసాదములను సేవించుచు, లింగలోప, వ్రతలోపము లందు ప్రాణత్యాగమె ప్రాయశ్చిత్తముగా నెంచి, శివైక్యుడగువాడె వీరశైవు డన బడును. అందువలననే ఈతని వ్రతము వీరవ్రత మనబడును.

ప్రాణలింగవ్రతే లుప్తే ప్రాయశ్చిత్తం న విద్యతే
ప్రాణత్యాగాత్పరం తస్మాత్త్వవధానేన ధారయేత్॥
ప్రాణలింగే చ విచ్ఛిన్నే లింగే ప్రాణా పరిత్యజేత్
ప్రతిదీక్షాం ప్రాప్య తిష్ఠే ద్రౌరవం నరకం వ్రజేత్॥

వీరశైవులు "శివలింగం కరాద్యంగే వీరశైవస్తు ధారయేత్" అను విధి చొప్పున లింగధారణము చేసుకొందురు. వారు ధరించిన ఆ లింగమునకు ప్రాణలింగ మనియు ఇష్టలింగ మనియు పేరు. అది లోపించెనేని ప్రాణత్యాగము చేతురు.

ఇష్టలింగ మిదం స్థూలం యద్బాహ్యే ధార్యతే సదా
ప్రాణలింగం తు తత్సూక్ష్మం యదంతర్భావనామయమ్॥
బాహ్యపీఠార్చనా ద్దేవ కర పీఠార్చనం వరమ్॥

సిద్ధాంతశిఖామణియందు ప్రాణలింగ మనగా నంతర్లింగమనియు, కరపీఠార్చ నము ఉత్తమ మనియు గలదు. కనుక లింగార్చకు లందరు వీరశైవులు గారు. కరపీఠమందు ఇష్టలింగము నర్చించి తన శరీరముపై యెల్లప్పుడు ధరించుకొను లింగధారులే వీరశైవులని అనఁగఁ బడుచున్నది.

దేహే హస్తపీఠే నిజలింగ మిష్టం విన్యస్య తల్లీన మనః ప్రచారః
బాహ్యక్రియా సంకుల నిస్పృహాత్మా సమ్పూజయ న్త్యంగ స వీరశైవః
ఎవడు తన వామహస్తమునందు ఇష్టలింగమును ధరించి, తల్లింగమునందే తన మనస్సును లయముచేసి, మరియు తత్పూజాకాలమున బాహ్యక్రియాదు లందు మనఃపరివర్తనము లేక ఏకాగ్రచిత్తుడయి లింగపూజ చేయుచున్నాడో అతడే వీరశైవుడని వీరాగమము చెప్పుచున్నది. కనుక కరపీఠమునందు లింగమును పూజించువారే వీరశైవులని సిద్ధాంతమగుచున్నది

శ్లో॥ విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్య బోధికా
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తేమతాః॥
వేదాంత జన్యం యద్జ్ఞానం విద్యేతి పరికీర్తితా
విద్యాయాం రమతే యః స వీరఇత్యభిధీయతే॥
విద్యాయాం శివరూపాయాం రమంతే యే విశేషతః
తస్మాదేతే మహాభాగా వీరశైవా ఇతి స్మృతాః॥

శివజీవైక్యమును బోధించునంతటి విద్యయందు రమించు నంతటి వారలే వీర శైవులనియు, వేదాంత జన్యమైనట్టి ఏవిద్యగలదో అట్టి విద్యయందు ఆనంద మును పొందువారే వీరశైవులనియు, శివస్వరూపమైన ఏ జ్ఞానము గలదో అట్టి జ్ఞానసంపన్నులే వీరశైవులనియు సిద్ధాంత శిఖామణియందు ఉల్లేఖింప బడి నది. మరియు వీరాగమమందు:—

విశబ్దో వా వికల్పార్థో రశబ్దో రహితార్థకః
వికల్ప రహితం శైవం వీరశైవం ప్రచక్షతే॥

సంకల్ప వికల్పములులేని శైవమే వీరశైవమనబడును యని గలదు. మరియు ఇదే విచారమును శ్రీనీలకంఠ శివాచార్యుని బ్రహ్మసూత్రము యొక్క వీర శైవపర భాష్యమునకు కారికారూపముగ సంగ్రహించిన నీలకంఠాచార్యుడు కూడ తన క్రియాసారమునందు వీరశైవమును శివజీవైక్య బోధ రూపమైనదని బోధించి యున్నారు. ఇక వీరశబ్దముయొక్క నిరూపణము పారమేశ్వరా గమ వచనానుసారము సంక్షేపముగా వివరింప బడును.

వీరశైవునకు వీరయను శబ్దము అతని గుణవిశేషముల వలననే గలిగినదిగాని అన్యథాగాదు. భటుడు రణమునందు వీరుడైనట్లు వీరశైవుడు భక్తిచేత మతము నందు వీరుడనబడును. ఈషణత్రయములు వదిలినవారు జ్ఞాన విజ్ఞాన తత్పరులు, మరియు దృఢవైరాగ్యసంపన్నులే వీరులనబడుదురు. ఈ వీరులని బిరుదుగల శివయోగులు పరస్త్రీదర్శనమునందు అంధులవలె వర్తింతురు. పరదూషణము జేయుటయందు మూగవారగుదురు. పరకాంతలయందు షండులు, అన్యుల పీడించుటయందు అశక్తులు, రసాస్వాదమునందు జిహ్వాలేని వారగుదురు. వీరి యందు అభిమానము, దంభము, హింసా కృత్యము, అశాంతి, అహంకారము,

యనునవి యుండకుండును. వీరు సర్వత్ర సమచిత్తము గలిగి శివునియందు విశుద్ధభక్తి గలిగియుందురు. సత్యవ్రతము, అస్తేయము, అపరిగ్రహము, వీరులయొక్క శీలమైనది. అద్వేషము, అనసూయ, అతిరస్కారము ఇవియే ఈ వీరుల భూషణములైనవి.

## వీరశైవ భేదములు.

వీరమాహేశ్వరం తంత్రం జ్ఞాతవ్యం త్రివిధం స్మృతం
సామాన్యంచ విశేషం చ నిరాభారం క్రమా ద్భవేత్॥

వీరశైవము సామాన్యము, విశేషము, నిరాభారమని మూడు విధములైనదని వాతులాగమునందు విస్తరింప బడినది.

## సామాన్య వీరశైవ లక్షణము.

తత్రాదౌ చ ప్రవక్ష్యామి వీర సామాన్య లక్షణం
హస్తమస్తక సంయోగా ద్భూతిపట్టస్య ధారణాత్।
శివదేహీతి విజ్ఞేయ స్సర్వపాపైః ప్రముచ్యతే
గురుణా దత్తలింగంతు సావధానేన ధారయేత్॥
మూర్ధ్ని కంఠే భుజే హస్తే హృత్స్థలె నాభిమండలే
ఏతేషా మేకదేశే తు ధారయే చ్ఛివలింగకం॥
ఏకకాలం ద్వికాలం వా త్రికాలం వా సమర్చయేత్
గురౌ లింగే సదా భక్తిం కుర్యా త్తద్భసిత ప్రతీ॥

గురువుయొక్క హస్తమస్తక సంయోగమైనందు వలన అనగా శివదీక్షా పూర్వక లింగాంగ సామరస్య జ్ఞానోపదేశమైనందున విభూతి ధరించినందున, శివదేహి యగును. సర్వపాపములనుండి ముక్తుడగును. ఇట్టివాడు గురుదత్త లింగమును ఎల్లప్పుడు తలపైనను, కంఠమునందైనను. భుజహస్తములందైనను, వక్షస్థలమునందైనను, ధరించుకొనును. ఒకసారియైనను, రెండుసారులైనను లేక మూడు సారులైనను లింగార్చనము జేయుచు గురులింగ జంగమాదుల యందు భక్తి యుంచువాడే సామాన్య వీరశైవుడనబడును. అనగా సామాన్య వీరశైవునకు భస్మ లింగ ధారణాదులు ముఖ్యధర్మములు.

సత్యం భూతదయాఽహింసా శమో దమ ఉదాహృతః
వివిక్తాపేక్షయా భక్తి రద్వంద్వం మమ పూజనం॥ ౩౫
స్మరణం కీర్తనం ధ్యానం మద్భావ పరిశీలనం
మద్భక్తేషు పరాభక్తిః మదైకాత్మ్య మమాయయా॥ ౩౬
గురోః శుశ్రూషణం భక్త్యా మతిభేదేన సర్వదా
త్రికాల మర్చాలింగస్యా హింసయా భక్ష్యజీవనం॥ ౩౭
ఇత్యాదీని పురోక్తాని పూర్ణా న్యంగాని తస్య తత్
సామాన్య వీరశైవస్థం లింగినో వీరయోగినః॥ ౩౮

సామాన్య వీరశైవుడు ఈ పైధర్మముల నాచరింప వలెను. ఎల్లప్పుడు సత్యమునే పలుకవలెను. ప్రసంగవశాత్తుగ నైనను అసత్యమాడదగదు. సమస్త ప్రాణులయందు అనగా పిపీలికాది బ్రహ్మపర్యంతము దయగలిగియే వర్తింప వలెను. ఇదియే సర్వభూత దయాళుత్వము. మనస్సుచేతను, వాక్కుచేతను, లేక కాయిక కర్మల చేతనైనను, ప్రాణిమాత్రులను హింసించ గూడదు. కామ క్రోధ లోభ మద మోహ మత్సరములను వదలి శాంతిబొంది యుండుటయే శమమన బడును. బ్రహ్మచర్యాది క్లేశముల సహించి అంతరింద్రియ నిగ్రహము గలవాడగుటయే దమమన బడును. దానప్రదానమునందు, అతిథి సత్కారమునందు, పరహితోపకర్మలందు విశాలమైన ఉదారబుద్ధి గలిగియుండ వలయును. విశేష భక్తిభావము గలిగి శివపూజయందు మగ్నుడై యుండ వలెను. పరశివునియొక్క స్మరణము, కీర్తనము, ధ్యానము, భావపరిశీలనము త్రికాల లింగార్చనము, అహింస, సాత్వికాహారము ఇత్యాదులు గలవాడె సామాన్య వీరశైవుడన బడునని పారమేశ్వరాగమము నందు చెప్పబడినది.

ఈ సామాన్య వీరశైవుడు గ్రామమందేగాని వనమందేగాని యుండ వచ్చును. దైవవశాత్ లింగలోపమైనను వ్రతలోపమైనను గురుకృపాపాత్రుడై మరల ధరించుకొన వచ్చును.

## విశేష వీరశైవ లక్షణము.

శేషాణి సర్వకర్మాణి దీక్షాం విధ్యుక్త మాచరేత్
దేహప్రాణం సమాయోజ్య ప్రాణంలింగే ప్రకల్పయేత్॥

గురువు విధియుక్తముగా దీక్షగావించి మలత్రయములు నశించుటకు దేహ త్రయములయందు లింగత్రయధారణము చేయును. శిష్యుడు అట్టి ప్రాణలింగ మును తన ప్రాణముతో సమానము జూచుకొనును. శుద్ధద్రవ్యములచే లింగ పూజ సలుపును. ఇతడే విశేషవీరశైవుడని వాతులాగమమందు చెప్పబడినది.

శుద్ధద్రవ్యం సమాదాయ లింగానాంచ సమర్పణం
ఇతివ్రతి సమాయుక్తో వీరశైవో విశిష్యతే॥

ఈ విశేష వీరశైవులు దీక్షా సంపన్నులైనందున షట్స్థల జ్ఞానసంపన్నులగు దురు. శివజీవైక్యబోధమే షట్స్థల శాస్త్రము కనుక వీరికి జ్ఞానసంపాదనము మరియు లింగార్చన కర్మయనునవి రెండును ప్రాముఖ్యధర్మములు.

మౌనీ నియతచేష్టః స్యాదతిరోధం జనుష్మతాం।
నాత్మనః క్లేశజనన మాచరే దర్థ విభ్రమాత్॥ ౪౭
పూజాధ్యానం మత్స్మరణ మహింసా కామ లోభిషు।
వ్రతాని వీరశైవస్య సత్యం ప్రాణిదయా శివే॥ ౪౮

మౌనవ్రతము, అర్థము పోయినందున దుఃఖము ఇత్యాదులు లేక యుండును. లింగపూజ, శివధ్యానము, పంచాక్షరీ స్మరణము, అరిషడ్వర్గములందు అస హ్యము భూతప్రాణియందు దయాళుత్వము ఇవియే విశేష వీరశైవునియొక్క ధర్మములని పారమేశ్వరాగమ మందు చెప్పబడినది.

ఈ విశేష వీరశైవులు గ్రామముయొక్క బహిర్భాగమునందే యుండ వలయును. వీరికి గ్రామవాసముతోడను, గ్రామవార్తలతోడను, స్త్రీసంగము తోడను, ఎట్టి సంబంధము యుండకుండును. భిక్షాటనమే వీరివృత్తి. దైవవ శాత్ లింగలోపము గలిగినను తనదేహమునే ఇష్టలింగముగ భావించుకొని పునఃలింగధారణము గావించుకొన కూడదు.

## నిరాభార వీరశైవ లక్షణము

విశేష వీరమాఖ్యాతం నిరాభారం తతశ్శృణు।
సర్వసంసార సౌఖ్యాని త్యక్త్వా చిత్తం శివేలయేత్॥
దండ కౌపీన కాషాయ జటా వల్కల ధారకః
ముండీ వా శివచిహ్నాని ధారయే దజినాదికం॥

భిక్షాశీ నియతాహార స్సుఖసంసారవర్జితః
నిరాభారీ తి విజ్ఞేయ స్స ఏవ పరమ శ్శివః॥

సకల సంసార సౌఖ్యముల విడచి, తన చిత్తమును శివునియందు లయింపజేయువాడు; దండ, కౌపీన, కాషాయ, జటా, వల్కల, అజినాదుల ధరించినవాడు; భిక్షావృత్తిచే జీవించువాడు; మితాహారముగలవాడు; అకస్మాత్ లింగలోపము గలిగిన ప్రాణమును విడుచువాడు. ఇట్టి గుణములు గలవాడే నిరాభారవీర శైవుడని తెలియబడును. అతడే సాక్షాత్ పరమేశ్వరుడు; అనగా: సంసారమును లెక్కింపక శివుని యందు లయించినవాడే నిరాభారు డని అవగతమగుచున్నది. ఇదియే వీరశైవునికి అంత్యసోపానము. కనుక ప్రతివీరశైవుడు ఆజీవాంతము ఈ మూడు సోపానముల నధిరోహించి ముక్తిని బొందవలెను.

# వీరశైవ మతోత్కృష్ట.

వీరశైవమతం సద్యో భోగమోక్షైకసాధనం
సర్వోత్తమం మమ మతం యతః సర్వోత్తమోఽస్మ్యహమ్॥
న వీరశైవ సదృశం మత మస్తి జగత్త్రయే
సర్వభోగప్రదం పుణ్యం శివసాయుజ్యదాయకమ్॥ ౩౯ - ౪౧

పారమేశ్వరాగమము. ప ౧

యని పరమాత్ముడు "మూడులోకములందు వీరశైవమునకు సాటియైన మతము లేదు; ఈ మతము భోగమోక్షకరమైనది; నా వలెనే సర్వోత్కృష్ట మైనది." యని పార్వతినిగురించి చెప్పెను. మఱియు పారమేశ్వరాగమము ప. ౭—

కృపాణధారాగమనం వ్యాఘ్రకర్ణావలంబనం
వీరశైవ మతం దేవి సత్యం త్వవిదుషాం మమ॥ ౯౮

అవివేకులకు వీరశైవమతము నిశిత ఖడ్గధారా గమనమువలె, వ్యాఘ్రకర్ణావలంబనమువలెను కష్టతర మైనదని ఈ మతముయొక్క గాంభీర్యమును తెలిపియున్నాడు. మఱియు:— పారమేశ్వరాగమము. ప. ౮—

సర్వోత్తమా హి మనుజా స్తత్ర విప్రా మహోత్తమాః
వేదినః కర్మకర్తార స్తదర్థజ్ఞా విశేషతః॥ ౭౦

తతో వేదాంతసారజ్ఞా స్తత స్సన్న్యాసినః పరాః
తతః పాశుపతా శ్శ్రేష్ఠా లింగిన స్తు తతోఽధికాః॥ ౭౧
తతోఽధికా మహాశ్రేష్ఠా వీరమాహేశ్వరా శ్శివే
న తేభ్యో స్యాధికః కశ్చి ద్వీరశైవాశ్రయా త్పరః॥ ౭౨
తావ న్మహిమసంపన్నో వీరశైవః పర శ్శివః॥ —

ప్రాణులందు మనుష్యులు సర్వోత్తములు; వారియందు విప్రులు మహోత్తములు; ఆ విప్రులందు వేదపాఠయులకన్న వైదికకర్మల నాచరించు వారును, వారికంటె వేదార్థము తెలిసినవారును, వారికన్న వేదాంతసారమును తెలిసికొన్నవారును శ్రేష్ఠులు. వారియందు సన్న్యాసులు అధికులు. వారికన్నను పాశుపతులు అధికులు. వారికన్నను లింగధారులు అధికులు. వారికన్న వీరమాహేశ్వరులు ఉత్కృష్టులు. వీరు వీరశైవమును ఆశ్రయించిన వారైనందున వారికన్న మిగతవారు లేరు. అంతటి మహిమగల వీరశైవులు పరశివస్వరూపులే యగుదురు. అనగ విప్రులకన్న వీరశైవులు అత్యధికాధికులని చెప్పబడెను.

క్రిమికీటపతంగేభ్యః పశవః ప్రజ్ఞయాఽధికాః
పశుభ్యోపి నరా శ్శ్రేష్ఠా స్తేషు శ్రేష్ఠా ద్విజాతయః॥
ద్విజాతిష్వ ధికా విప్రా విప్రేషు క్రతుబుద్ధయః
క్రతుబుద్ధిషు కర్తారః స్తేభ్య స్సన్న్యాసినోఽధికాః॥
తేభ్యో విజ్ఞానినః శ్రేష్ఠా స్తేషు శంకరపూజకాః
తేషు శ్రేష్ఠా మహాభాగ మమ లింగాంగ సంగినః॥
లింగాంగసంగిష్వ ధికః షట్స్థలజ్ఞానవాన్ పుమాన్
స వంద్య స్సర్వదా పూజ్య స్సంసార విజిగీషుభిః
బహునోక్తేన కిం వత్స స ఏవాఽహం న సంశయః॥ స్కాందే॥

భూమియందు క్రిములకన్నను కీటకములు బుద్ధియందు శ్రేష్ఠమయినవి. ఆ కీటకములకన్న పక్షులు శ్రేష్ఠము. వాటికన్న పశువులు, వాటికన్న మనుష్యులు శ్రేష్ఠులు. ఆమనుష్యులలో ఉపనయనము పొందినవారు శ్రేష్ఠులు. వారికన్నను వేదాధ్యయనము జేయువారు శ్రేష్ఠులు. వారికన్న యజ్ఞవిధానమును తెలిసినవారు, వారికన్నను యజ్ఞమును జేయువారు శ్రేష్ఠులు, వారిలో సన్న్యాసులు శ్రేష్ఠులు. వారికన్న సహజజ్ఞానముగలవారు, వారికన్న శివపూజకులు శ్రేష్ఠులు.

వారికన్నను లింగాంగులే శ్రేష్ఠులు. వారిలో భక్తాది ఐక్యాంతమైన షట్స్థల జ్ఞానముగల నిరాభారియే శ్రేష్ఠుడు. అసగా నిరాభారిమైన జంగమమూర్తియే వందనీయుడు. ఓషణ్ముఖా ఆనిరాభారిమైన జంగమమూర్తియే నేను; ఇందు సంశయములేదని ఈశ్వరుడు షణ్ముఖునిగురించి చెప్పియున్నాడు. కనుక షట్స్థలాత్మకమైన వీరశైవమతమె సర్వోత్కృష్టమని సిద్ధమగుచున్నది.

తథా విద్ధి మతం దేవి మమ శైవం మహత్తరం
తన్మంథనోత్థితం సారం వీరశైవం పరం శివె॥ ౯౦ ప. ౭॥

శివుని సంబంధించిన మతమే శైవము. ఆశైవము మహత్తరమైనది. అట్టి మహత్తరమైన శైవముయొక్క సారమే వీరశైవమని శివుడు పార్వతికి బోధించి వీరశైవమతోత్కర్షను పారమేశ్వరాగమమునందు ప్రకటించెను.

రుద్రాక్షమాలాభరణో ధృతపాశుపతవ్రతః
అతి వర్ణాశ్రమీ యోగీ జీవన్ముక్తో జగద్గురుః॥ ౯౭

పాశుపత వ్రతస్థుడైన జీవన్ముక్త వీరశైవుడు రుద్రాక్షాదుల ధరించినను అతడు వర్ణాశ్రమ ధర్మముల అతిక్రమించిన వాడగును. అతడేయోగి అతడే జగద్గురువగును. యని స్కాందపురాణము శంకర సంహిత అధ్యాయము. లాగి నందు వీరశైవునియొక్క శ్రేష్ఠత్వము జగద్గురుత్వము చాటింపబడినది.

వీరశైవం మహాశ్రేష్ఠం సర్వ శాస్త్రేషు విశ్రుతం
శ్రీవీరశైవసిద్ధాంతం శాస్త్రం తు శ్రుతిపూర్వకం
సామవేద మహావాక్యం తత్త్వమస్యాది భాషితం॥

వీరశైవమతము మహాశ్రేష్ఠ మయినదని అనేక శాస్త్రములందు జెప్పబడినది. మరియు వీరశైవ సిద్ధాంతము శ్రుతి శాస్త్రముల ననుసరించియే యున్నది. సామవేద మహా వాక్యమయిన "తత్త్వమసి" యను వాక్యమునే వీరశైవ సిద్ధాంతము బోధించు చున్నది యని యున్నది. గనుక వీరశైవులు శ్రేష్ఠమైన వైదికులనియు అందరికన్న ఉత్కృష్టులనియు సిద్ధమగుచున్నది.

వీరశైవమతము గుణప్రధాన మైనది. శివాగమములందు దీని విషయమై కావలసినన్ని ప్రమాణములు గలవు. సిద్ధాంత శిఖామణియందు:—

శివసంస్కార యుక్తేషు జాతిభేదో న విద్యతే
కాష్ఠేషు వహ్నిదగ్ధేషు యథారూపం న విద్యతే॥

తస్మాత్ సర్వప్రయత్నేన శివసంస్కార సంయుతేః
జాతిభేదం న కుర్వీత శివభక్తే కదాచన॥ సి॥ శి.

ఇత్యాది ప్రమాణములచేత వీరశైవతత్వజ్ఞానము పారమార్థిక మార్గమునందు స్త్రీపురుషభేదమును ఒప్పనట్లు చాతుర్వర్ణ్యములనుకూడ ఒప్పకున్నది. వర్ణాశ్రమముల పక్షపాతము, యజ్ఞయాగాదుల ప్రాణహింసను జూచి విచారపరుల మనమునందు గలిగిన క్రాంతిఫలమే వీరశైవమని చూపట్టుచున్నది.

వీరశైవసిద్ధాంత మార్గమునందు చెప్పబడిన తత్వములే ముఖ్యమయినవి
(౧) శివదీక్షా. (౨) అష్టావరణములు. (3) పంచాచారములు. (౪) షట్స్థలములు. (౫) లింగాంగ సామరస్య స్వరూప మోక్షము.

జిజ్ఞాసువైన అంగము (జీవము) లింగమునందు లయించవలెనన్న (బ్రహ్మైక్య) శివదీక్ష యను పవిత్ర సరోవరమునందు స్నాతుడై ఆణవమల, కార్మికమల, మాయామలమను త్రిమలములను దాటి, వేధా, క్రియా, మను యను దీక్షాత్రయముచేత పవిత్రుడై, ఇష్ట ప్రాణ భావములను లింగత్రయములను స్థూలసూక్ష్మ కారణ శరీరములందు ధరించుకొని, శ్రీగురు ఆశీర్వాదమను ఆజ్ఞాపత్ర సహితుడై, గురు, లింగ, జంగమ, తీర్థ, ప్రసాద, భస్మ, రుద్రాక్ష మంత్రములను అష్టావరణ నామకోటియందు అనుభవజ్ఞుల మతము నాశ్రయించి వెళ్లి, లింగాచార, శివాచార, సదాచార, భృత్యాచార, గణాచారమను పంచాచారాత్మక రాజమార్గమునందు నడచి, భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యమను సోపానములనెక్కి లింగాంగ సామరస్యమను ద్వారమునుదాటి మోక్ష నామక స్థానమునుచేరి శాంతిసుఖము నందుండవలయును.

వీరశైవ శాస్త్రమునందు శివదీక్ష సంస్కార ప్రధానము, అష్టావరణము క్రియా ప్రధానము, పంచాచారము నీతిప్రధానము, షట్స్థలము జ్ఞానప్రధానము, సామరస్యము వైరాగ్య ప్రధానము, ఇట్లు వీరశైవము కర్మ, జ్ఞాన, భక్తియను త్రివేణీసంగమమై "న వీరశైవ సదృశం మత మస్తి జగత్త్రయే" యను ఆగమవచనమును సార్థకము జేయుచున్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి యందు వీరశైవ మను
రెండవ ప్రకరణము సమాప్తము.

ఓం

శివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి.

# శివతత్త్వము.

## మూడవ ప్రకరణము.

"జ్యోతిర్మాత్ర స్వరూపాయ నిర్మలజ్ఞాన చక్షుషే
నమః శివాయ శాంతాయ బ్రహ్మణే లింగమూర్తయే॥
నమః శివాయ నిశ్శేష క్లేశ ప్రశమ శాలినే
త్రిగుణగ్రంధి దుర్భేద్య భవబంధ విభేదినే॥"
సానంద మానందవనే వసంతమ్ ఆనందకందం హతపాపవృందమ్
వారాణసీనాధ మనాధనాథం శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే॥

వీరశైవులకు శివుడే పరమదేవత యైనందున ఆశివునియొక్క అస్తిత్వము, జగద్వ్యాపకత్వము, ఆనంద కల్యాణగుణైకత్వము, జగత్కారణత్వము, పరమపతిత్వము, ఇత్యాది గుణములయొక్క వర్ణనజేయుట మరియు అనేక గ్రంధరాజములనుండి ప్రమాణములచేత సిద్ధపరచుట ఇత్యాదులే ఈ ప్రకరణముయొక్క ముఖ్యోద్దేశమై యున్నది. ఈ ప్రకరణమునందు శివుడే బ్రహ్మమనియు మరియు ఓంకార స్వరూపుడనియు స్పష్టముగా జెప్పబడినది. మరియు వేద వేదాంగాగమోప నిషదులే కాక అనేక పురాణములు ఇతిహాసములు మొదలైన అనేక గ్రంథములు దేవదేవుడైన మహాదేవుడే పూజనీయుడని, ధ్యేయుడని ఘంటాఘోషగా జెప్పుచున్నందున అట్టి శివునియొక్క వర్ణన సవిస్తారముగ జేయబడినది. అనేక అద్వైతవాదులు శివుడు సత్యము శివకార్యమైన జగత్తు మిథ్యయని వాదించు మిథ్యావాదమును ఖండించుటకై శివశక్తి విశిష్టత్వము యను భాగము వ్రాయబడినది. శివుని యొక్క సర్వశ్రేష్టత్వమును మరియు ఇతర దేవగణమునకన్న అధిక్యతను మరియు సృష్టిస్థితిలయ నిగ్రహానుగ్రహ సమర్థతను వెల్లడిజేయుటయే ఈ ప్రకరణముయొక్క ముఖ్యోద్దేశమై యున్నది. శివునియందు భక్తిభావములు గలుగుటకు ఈ ప్రకరణము మిక్కిలి ఉపయోగమగుగాక యని సర్వమంగళ కరుడైన శివుని ప్రార్థించు చున్నాను.

# శివతత్వ స్వరూపము.

"శివః శామ్యతి పరమానందరూపత్వాన్నిరాకారో భవతీతిశివః"

బ్రహ్మానంద స్వరూపుడును, నిర్వికారుడును గనుక శమించువాడు, "శేరతే సజ్జనమనాం స్వస్మిన్నితివా" ఇతనియందు సజ్జనుల మనస్సుండును. "శేతే సజ్జన మనస్స్వితివా" సాధుల మనస్సునందు శయనించువాడు. "శివం కల్యాణం తద్యోగాద్వా" శుభములతో గూడినవాడు. "శివప్రదత్వాద్వా" శుభముల నిచ్చువాడును యని అమరమునందు శివశబ్దము శుభావహము మరియు శ్రేయస్కరమగు వస్తువాచకమని చెప్పబడి యున్నది అందువలననే శివశబ్దము బ్రహ్మవాచకమైనది. బ్రహ్మమే శివుడని సిద్ధమగు చున్నది. "శేతే అసౌశివః" శయనించువాడే శివుడు - అర్థాత్ మహా ప్రళయానంతరము ప్రకృతియొక్క కార్యములు నిలచి పోవును. ఆసమయములో నిశ్చేష్ట, శాంత, నిష్క్రియ, కేవల చేతన క్రియావిశిష్టమగు బ్రహ్మమును శివుడందురు మరియు:

"శయతి తనూ కరోత్య శుభమితి శివః ఇత్యోణాదికాత్ శయతేఃశివః॥"

ఏది అశుభ అకల్యాణమును హరించునో, ఏది సుఖస్వరూపమో, ఏదిమంగళ మయమో అదియే శివుడు అని అర్థము.

అనాదిమల సంశ్లేష ప్రాగభావాత్స్వభావతః
అత్యంత పరిశుద్ధాత్మే త్యతోయం శివఉచ్యతే।
అథవా ఽ శేష కల్యాణ గుణైక ఘనఈశ్వరః
ఆశ్రితాత్యంత శివదః శివ ఇత్యుచ్యతే బుధైః॥ శివపురాణం

స్వభావతః మలరహితుడు, అత్యంత పరిశుద్ధుడే శివుడనియు, అత్యంత కల్యాణైక గుణవిశిష్టుడు, ఆశ్రితులకు శుభములనిచ్చువాడే శివుడని శివపురాణము నందు శివునియొక్క అర్థము చేయబడినది.

ఏక ఏవ శివః సాక్షాత్ చిదానందమయో విభుః
నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్ప్రపంచకః॥
అస్తికశ్చిదపర్యాప్త రమణీయ గుణాశ్రయః
మహామాయాం జనాజాల వ్యతీత తనురీశ్వరః॥
జన్మమృత్యు జరామోహా కామక్రోధా భవోద్భవాః
నవిద్యంతే యతస్తస్మా చ్ఛైవం శివపదం తతః॥

శివం పరాత్పరం సూక్ష్మం నిత్యం సర్వగమవ్యయం
అనిందిత మనౌపమ్య మప్రమేయ మనామయం॥
శుద్ధత్వాచ్ఛివ మిత్యాహుః పరాదూర్ధ్వం పరాత్పరం
వ్యోమాతీతతయా సూక్ష్మం నిత్యంకారణ శూన్యతః॥
వ్యాప్త్యా సర్వగతం ప్రోక్త మక్షీణత్వేన చావ్యయం
అనిందితం నిర్మలత్వా దసాదృశ్యాద నౌపమం॥
ప్రమాణాదతి రిక్తత్వా దప్రమేయ మితిస్మృతం
అనామయం నిర్గుణత్వా దేవం లక్షణ వాంశ్ఛివః॥

శివుడు ఒక్కడు అనగా అద్వితీయుడు, జ్ఞాన స్వరూపుడు, ఆనంద మయుడు, ప్రభువు, నిర్వికల్పుడు, నిరాకారుడు, నిర్గుణుడు, నిష్ప్రపంచకుడు, రమణీయమైన గుణయుక్తుడు, జరామరణ రహితుడు, కామక్రోధాది విరహితుడు, అతిసూక్ష్ముడు, నిత్యుడు, సర్వవ్యాపీ, అవ్యయుడు, నిందారహితుడు, సాటిలేనివాడు, అప్రమేయుడు, అనామయుడు, శుద్ధతత్వములచే సంయుక్తుడై నందున శివుడనియు, పరముకన్న మించినవాడైనందున పరాత్పరుడనియు, ఆకాశము కన్న అతిసూక్ష్ముడైనందున సూక్ష్ముడనియు, కారణ శూన్యత్వము గలిగినందున నిత్యుడనియు, సమస్త వస్తుజాలమునందు వ్యాపించి యున్నందున సర్వగతుడనియు, క్షీణత్వము లేకున్నందున అవ్యయుడనియు, నిర్మలుడైనందున అనిందితుడనియు, అతనికి సాదృశుడు లేనందున అనౌపముడనియు, ప్రమాణములకు అతిరేకుడైనందున అప్రమేయుడనియు, నిర్గుణత్వము గలిగినందున అనామయుడనియు, పిలువబడుచున్నాడు. కనుక ఇట్టి లక్షణసంపన్నుడే శివుడని తెలియవలెను

ఈశానం పరమం విద్యాత్ ప్రేరకం బుద్ధిసాక్షిణం
ఆకాశాత్మక మవ్యక్త మోంకార స్వరభూషితం॥ బ్రహ్మోపనిషది

ఈశ్వరుడు పరమస్వరూపుడనియు, ప్రేరకుడనియు, బుద్ధిచే సాక్షి మాత్రుడనియు, ఆకాశాత్మకుడనియు, అవ్యక్తుడనియు, ఓంకారస్వరముచే నలంకృతుడనియు, చెప్ప బడుచున్నాడు.

సపర్యగాచ్ఛుక్రిమ కాయమవ్రణ మస్నావిరగ్ంశుద్ధమ పాపవిద్ధం
కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యా థాతథ్యతోర్థా వ్యదధా
చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥ యజు॥ అ.౪౦. మం౮

ఆపరమాత్ముడు సర్వవ్యాపకుడు, శీఘ్రకారి, అనంత బలవంతుడు, శుద్ధుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సనాతనుడు, స్వయంసిద్ధుడు, అనాది, అశరీరియు జననమరణాది రహితుడు, ఛిద్రరహితుడు, నాడిబంధములు లేనివాడు, పాపముజేయనివాడు, క్లేశరహితుడు, దుఃఖములేనివాడు, మరియు అజ్ఞాన సంబంధ రాగద్వేషాది గుణదూరుడు యనియజుర్వేదమునందు శివునియొక్క సగుణనిర్గుణస్తుతిగలదు.

"ఈశానః సర్వవిద్యానామీశ్వర స్సర్వభూతానాం బ్రహ్మాధిపతిః
బ్రహ్మణోధిపతిః బ్రహ్మ శివో మే అస్తు సదాశివోం॥

అను ఈశాన మంత్రార్థ ప్రకారము సర్వవిద్యా పదముచేత వివక్షితమై యున్న చతుష్షష్టికళలకును సదాశివుడే అధిపతియై యుండును. దీనిచేత శివునకు నిరంకుశ సర్వజ్ఞత్వము ఉక్తమైనది. మరియు "సర్వ భూతానాం" అనుశబ్దము చేత నుత్పత్తి స్వభావముగల చరాచరాత్మక సకలవస్తువులకు సదాశివుడే నియామకుడని చెప్పినందున శివునకు సర్వకర్తృత్వము ఉక్తమగు చున్నది.

మరియు ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతములను, పంచబ్రహ్మ మూర్తులకు సదాశివుడే అధిపతి యాయెను. ఇటులే తిరోధాన సంహార, స్థితి, సృష్టియను నాలుగు కార్యములయందు క్రమముగా అధికృతులై యున్న, "ఈశ, రుద్ర, విష్ణు, బ్రహ్మ"యను లుగురికి శివుడే యధిపతి యగును. ఏలననగా వీరికి కారణభూతుడైనందున వీరికితడే నియామకుడని పించును. సర్వ నియామకుడైనందువలన ఈశ్వరుడనబడుచున్న పరమాత్ముడే అనంత కల్యాణ గుణములకు ముఖ్యనిధియై యున్నందున మంగళ స్వరూపత్వము శివునియందే పరిపూర్ణమైయుండును. ఇదియే సదాశివునియొక్క చిద్రూపము.

"సదాశివ" యను శబ్దమునందు సత్-ఆ-శివః యను పదవిభాగము గలదు.

"సత్" యను పదముచేత పరమాత్ముని యందు నిరుపాధిక సత్తాశ్రయత్వము బోధింప బడుచున్నది

"ఆ" యను పదము చేత పరమాత్ముని యందు నిరుపాధికానంద స్వరూపత్వము బోధింప బడుచున్నది.

"శివ" యను పదముచేత అదే పరమాత్ముని యందు స్వాభావిక చిద్రూపత్వము బోధింప బడినది.

ఇటుల సద్రూపత్వ, చిద్రూపత్వ, ఆనంద రూపత్వములు గల పరమాత్మునకే ఈ సదాశివ శబ్దమునకు వాచ్యుడగును కాని మరొకరుగారు. "ఓం" యను నిర్దేశము పరమాత్మునకే అసాధారణమైనందున అట్టి "సదాశివోం" యను ఓంకారము పరమాత్మయైన శివునినే నిర్దేశించుచున్నది. అట్టి శివుని వేదాగమోపనిషత్పురాణ కారులు ఏకకంఠులై ఇట్లు వర్ణించుచున్నారు.

శివుడు అవ్యక్తుడు, స్తోత్రయోగ్యుడు, నిష్కలుడు, అద్వితీయుడు, స్వయంభువు, విభుడు, నిరంజనుడు, సచ్చిదానందుడు, నిత్య పరిపూర్ణుడు, మూలమూర్తి, మహాదేవుడు, వేదవేద్యుడు, సదాశివుడు, ఆదికర్త, ఉమాసహితుడు, కారణుడు, సర్వాసనుడు, సర్వవ్యాపి, సర్వగతుడు, భగవంతుడు, సర్వాంతర్యామి, మంగళకరుడు, ఒక్కడు, ఆది మధ్యాంత రహితుడు, అద్భుతుడు, పరమేశ్వరుడు, త్రిలోచనుడు, నీలకంఠుడు, ప్రశాంతుడు, పశుపతి, స్థాణువు, రుద్రుడు, వాచాతీతుడు, మనోతీతుడు, భావాతీతుడు, అగోచరుడు, సర్వశూన్యుడు, నిరాలంబుడు, నిశ్శబ్దుడు, పురాణ పురుషుడు, అకాయుడు, అవ్రణుడు, అస్నావిరుడు, అపాపవిద్ధుడు, సర్వజ్ఞుడు, తేజోమయుడు, చిన్మయుడు, మృత్యుంజయుడు, నిత్యుడు, అవ్యయుడు, పరాత్పరుడు, సనాతనుడు, ఈశానుడు, అపరాజితుడు, మహాత్ముడు, జగత్కారణుడు, ద్వంద్వ రహితుడు, అఖండుడు, అద్వయుడు, స్వతంత్రుడు, నిరాలంబుడు, నామరూప క్రియాతీతుడు, నిరవయుడు, నిర్లేపుడు, నిరంజనుడు, నాదబిందుకలాతీతుడు, విశ్వాతీతుడు, విశ్వతోముఖుడు, సూక్ష్ముడు, చైతన్యుడు, అనిందితుడు, అనౌపమ్యుడు, అప్రమేయుడు, కారణకారణుడు, స్వాత్మసిద్ధుడు, నిర్గుణుడు, నిరుపాధికుడు, పరంజ్యోతి, శాశ్వతుడు, వేదవేదాంతగోచరుడు, శక్తియుతుడు, ఓంకారుడు, అష్టమూర్తి, ఉరుక్రముడు (పరాక్రమశీలుడు), మిత్రుడు, వరుణుడు (సర్వోత్తముడు), ఆర్యముడు (న్యాయమార్గుడు), ఇంద్రుడు (సకలైశ్వర్యవంతుడు), ఈశ్వరుడు (సామర్థ్యవంతుడు), దేవుడు, స్వయం ప్రకాశుడు, శుద్ధుడు, బుద్ధుడు, ముక్తుడు, నిరాకారుడు, విశ్వేశ్వరుడు, కూటస్థుడు (ఆధారుడు), సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, అద్వైతుడు, విశ్వంభరుడు, జగదీశ్వరుడు, కాలుడు (చరాచరమును ఎంచువాడు), శేషుడు (మిగిలినవాడు), ఆప్తుడు, ప్రియుడు, కవి, విరాటుడు, అగ్ని,

( జ్ఞాన స్వరూపుడు ), విశ్వుడు ( విశ్వమయుడు ), హిరణ్య గర్భుడు, సృష్టి స్థితి సంహార నిగ్రహానుగ్రహ సమర్థుడు, మహా పండితుడు, అక్షయుడు, అజుడు, అమరుడు, మోక్షప్రదుడు, ధ్యేయుడు, త్రిలోచనుడు, భూతయోని, సాక్షిమాత్రుడు, త్రికాలాబాధితుడు, విశ్వాధికుడు, మహర్షి, ఉపాస్యుడు, యని అనేక నామములు గలవు. అట్టి పరమ శివుడే బ్రహ్మము, లింగము, ఓంకారము, ప్రణవము అను నామాంతరములచే పిలువబడుచుండును. ఈ పరమ శివుడే అందరికన్న గొప్పవాడైనందున బ్రహ్మ యనియు, సకలైశ్వర్య వంతుడైనందున ఇంద్రుడనియు, సర్వగుడైనందున అక్షగుడనియు, సర్వవ్యాపి యైనందునే విష్ణువనియు, జగత్ పదార్థములను జీవులను ఎంచుచున్నాడు కనుక కాలుడనియు, సమస్త అన్యాయములకు వైరివాడైనందునే యముడనియు; అగస్త్యాదులకు ఉపదేశము గావించి అవినాశి యైనందున గురువనియు, అందరి ఆనందము కలుగజేయు వాడైనందునే చంద్రుడనియు, చరాచరములను ప్రకాశపరచు వాడైనందునే సూర్యుడనియు, సమస్త జీవాది జగత్తునందు నిరంతరము వ్యాపకుడైనందునే ఆత్మ యనియు, సర్వ జీవాదులకంటె నుత్కృష్టుడు, జీవ ప్రకృత్యాకాశాదులకంటె నతి సూక్ష్ముడు, సమస్త జీవులకు నంతర్యామి యైనందునే పరమాత్ముడు యనియు, అతడు నిర్వ్యాపితుడును, జ్ఞానయుక్తుడును, సమస్త చరాచర జగత్తుయొక్క వ్యవహారము నందున్నట్లు తెలియువాడు నగుటచే ప్రాజ్ఞుడనియు, అందరికిని ప్రేమించుటకు యోగ్యుడగుటచే మిత్రుడనియు, అనంత పరాక్రమ యుక్తుడగుటచే ఉరుక్రముడనియు, సామర్థ్యవంతుడైనందున ఈశ్వరుడనియు, తా నెన్నడు జన్మము నొందనివాడు గనుకనే అజుడనియు అతని కాదికారణ మేమియు లేదు కాబట్టి అనాది యనియు, ఆనంద స్వరూపుడై జీవులకు ఆనందము నిచ్చువాడు గనుక ఆనందుడనియు, భూత భవిష్యత్ వర్తమాన కాలములచే బాధింపబడని వాడగుటచే "సత్" యనియు, చైతన్య స్వరూపుడై సమస్త జీవులను చెల్విత్తో గూర్చి సత్యాసత్యములను దెల్పు వాడగుటచే "చిత్" అనియు, ఈసత్, చిత్ ఆనంద యను మూడు శబ్దముల విశేషణములు కలవాడగుటచే సచ్చిదానంద స్వరూపుడనియు, నిశ్చలుడును, అవినాశియు నగుటచే నిత్యుడనియు, స్వయం పరిశుద్ధుడై అందరిని పరిశుద్ధులజేయువాడగుట

వలన శుద్ధుడనియు, అన్నిటిని చెలియువాడగుటచే బుద్ధుడనియు, ముముక్షువుల సందరిని క్లేశములనుండి తొలగించువాడగుటచే ముక్తుడనియు, ఎన్నడు శరీరమును ధరించకున్నందున నిరాకారుడనియు రాగద్వేషాదులను చక్షురాదీంద్రియముల విషయములనుండి వేరైనవాడు గనుక నిరంజనుడనియు, ప్రకృత్యాది జడములు సమస్త జీవములను నీ ప్రఖ్యాత పదార్థములకు స్వామియు, వీని పాలించువాడు నగుటచే గణేశ, గణపతి యనియు, రెండవదిగాక ఒక్కడే అయి యున్నాడు గనుక అద్వైతుడనియు, శబ్ద స్పర్శ రూపాది గుణ రహితుడగుటవలన నిర్గుణుడనియు, సర్వజ్ఞత్వము, సర్వ సుఖము, పవిత్రత, అనంత బలము, మొదలగు గుణములచేత యుక్తుడు కాబట్టి సగుణుడనియు, సమస్తమైన ప్రాణిరూపమును, అప్రాణి రూపమునగు జగత్తునందంతటను వ్యాపకుడై అన్నిటిని నియమించువాడు కాబట్టి అంతర్యామి యనియు, సమగ్రైశ్వర్య యుక్తుడైనందున భగవంతుడనియు, జగత్తునందంతట పూర్ణుడై యున్నందున పురుషుడనియు, కల్యాణము నగా సుఖమును గలుగజేయువాడు గనుక శంకరుడనియు, గొప్ప దేవతల కందరికి దేవుడు గనుక మహాదేవుడనియు, తనంతటనేయుండి, ఎవనినుండి యెప్పుడు నుత్పన్నమైనవాడు కాడు కనుక స్వయంభువనియు, వేదముల మూలముగ సమస్త విద్యలను ఉపదేశించువాడును, సమస్తము నెరుంగువాడును కాబట్టి కవి యనియు, కల్యాణ స్వరూపుడును, కల్యాణకారియు నగుటచే శివుడనియు, అనేకానంతనామములచే పిలువబడు చుండును. 19

## శివుడే ఓంకార స్వరూపుడు.

20 య ఓంకారః స ప్రణవః యః ప్రణవః స సర్వ వ్యాపీ యః సర్వ వ్యాపీ సోఽనంతః యో నంతస్తత్తారమ్ యత్తారం తత్సూక్ష్మం యత్సూక్ష్మం తచ్ఛుక్లం యచ్ఛుక్లం తద్వైద్యుతమ్ యద్వైద్యుతమ్ తత్పరం బ్రహ్మ సఏకో రుద్రః స ఈశానః స భగవాన్ మహేశ్వరః స మహాదేవః ॥

అథర్వోప నిషది:

అర్థము :— ఏది ఓంకారమో అదియే ప్రణవము. ఏది ప్రణవమో అదియే సర్వ వ్యాపి. ఏది సర్వ వ్యాపియో అదియే అనంత శక్తియుత స్వరూపి ఉమయు, ఉమయే తారక మంత్రమైన బ్రహ్మ విద్యా. ఏది తారకమో

అదియే సూక్ష్మ జ్ఞాన శక్తి. ఏది సూక్ష్మమో అదియే శుద్ధము. ఏది శుద్ధమో అదియే విద్యుత్ అధిష్ఠాతి) ఉమ యనబడును. ఏది ఉమయో అదియే పరబ్రహ్మము. అదియే అద్వితీయ రుద్రుడు అతడే ఈశానుడు అతడే భగవాన్ మహేశుడు. అతడే మహాదేవుడు.

ఈ వేదమాత్రమునందు ఓంకారముయొక్క వాచ్యము మరియు లక్ష్యము భగవాన్ మహాదేవుడు. ఓంయొక్క ఉపాసనవలన భగవాన్ శంకరునియొక్క సాకార మరియు నిరాకార రూపము ప్రత్యక్ష మగును.

"ఓమిత్యేవం ధ్యాయత ఆత్మానం స్వస్తివః పారాయ తమసః పరస్తాత్॥"

అర్థము:— ఓంకార రూపముతో తన ఆత్మను ధ్యానించుము. దీనిచే మీయొక్క కల్యాణముగా గలుగు. మరియు మీ అజ్ఞానాంధకారము విధ్వంసమై స్వయంజ్యోతి స్వరూపము గలుగును. దీనిచే ఓంకారమే శివ స్వరూపమని ముండకోపనిషత్తునందు సిద్ధము జేయబడినది.

# శివ సర్వాత్మకత్వము.

శివుడు ఒక్కడు, అద్వితీయుడు, సమస్త కల్పనా రహితుడు, శుద్ధ సంవిత్ రూపుడు అజరుడు, అమరుడు, కేవలుడు, నిష్కలుడు; తన మాయా శక్తిచేత విశ్వరూపమును ధరించి అనేక రూపుడగును. శివుడే సృష్టించుటకు బ్రహ్మయు; పోషించుటకు విష్ణువు. సంహరించుటకు రుద్రుడగును. శివుడే సూర్య రూపుడై బ్రహ్మాండమునకు ప్రకాశము నిచ్చుచుండును. అగ్నిరూపుడై అన్నమును పచనము గావించును. ఇంద్ర రూపముతో వర్షము గురిపించును. ధర్మరాజయి ధర్మాత్ములకు సుగతి నిచ్చును. యమరాజయి పాపాత్ములను దండించును. నైఋతియై దైత్యుల రక్షించును. వరుణుడై జలచరములను పాలించును. వాయువై సమస్త క్రియల జేయును. కుబేరుడై ధనాభిలాషులకు ధనము నిచ్చును. చంద్రుడై ఓషధులందు రసోత్పన్నము గావించును. ఈశానుడై సమస్తము నియమమునందుంచును. ఆదిశేషుడై పృథివిని ధరించియుండును. ధ్రువ రూపుడై నక్షత్రాదులను స్వస్థానమునందుంచును. బ్రహ్మయొక్క శక్తి బ్రహ్మాణి. విష్ణు శక్తి లక్ష్మి మరియు శివ శక్తి భవాని. ఇవి యన్నియు శివరూపములే అయి యున్నవి. శివుని నుండియే వెడలుచున్నవి. శివునియందే నిలుచుచున్నవి. మరియు అంత్యమందు శివునియందే లయమగుచున్నవి.

ఆకాశ, వాయు, అగ్ని, జల మరియు పృథివి ఇవి యన్నియు శివుని నుండియే వ్యాప్తమైనవి; కనుక శివస్వరూపములైనవి. శివుడొక్కడే నిత్యుడు. ఇతనికన్న అన్యము మిథ్య. శివ ధ్యానమే కైవల్య పదము. శివేతర ధ్యానము జన్మాద్యనంత దుఃఖకారణ మగును. ఎటులు శివుడు సమష్టి రూపుడో అటులే శివుడు వ్యష్టిరూపుడుకూడ యగును. సమష్టి వ్యాపారమును శివుడే జేయుచుండును. శ్రోత్ర రూపుడై శివుడు శబ్దములను వినుచుండును. త్వచరూపుడై కోమల కఠిన శీతోష్ణ స్పర్శములను గ్రహించును. నేత్రరూపుడై నీల పీతాది రూపములను జూచుచుండును. జిహ్వా రూపుడై షడ్రసస్వాదము గుర్తించును. నాసికయై సుగంధమును దుర్గంధమును ఆఘ్రాణించును. వాణియై శబ్దముల నుచ్చరించును. హస్తముచే గ్రహణము; పాదముచే చలనము; ఉపస్థుచే ఆనందము; వాయువుచే విసర్జనము జేయును.

శివుడే ప్రాణమై పైకి బోవును. అపానమై క్రిందికి బోవును. వ్యానమై భారమును లేపును. సమానమై అన్న రసమును సమలి అవయవములందు జేర్చును. ఉదానమై శరీరమును భూమిపై పడకుండ నిలుపును.

శివుడే మనస్సయి మననము జేయును. చిత్తమై ఆలోచించును. బుద్ధియై నిశ్చయించును. అహంకారమై అభిమానించును. ఈ ప్రకారము కర్త; భోక్త; మంత; ప్రమాత; విజ్ఞాత; అహంకర్త శివుడే యగును. సమస్త క్రియలు శివుడే జేయుచుండును. మరియు పరమార్థముచే ఏమియుచేయకుండును. ఇదియంతయు యతని మాయా శక్తి యొక్క ప్రభావమై యున్నది. మరియు కర్మ, భోగ్య, ప్రమేయ, విజ్ఞేయములుకూడ శివుడే. శబ్ద స్పర్శ, రూప, రస, గంధములు పంచ జ్ఞానేంద్రియ విషయములుకూడ శివుడే. వచన, ఆదాన, గమన, ఆనంద, విసర్జనముకూడ శివుడే. పంచ ప్రాణముల యొక్క క్రియకూడ శివుడే. మంతవ్యము; చింతితవ్యము; బోద్ధవ్యము; అహంకర్తవ్యముకూడ శివుడే. ఏలనన శివుడు నిర్వికారుడు. నిరాకారుడు; నిర్మలుడు, శుద్ధ బోధుడు; అప్రియుడు; అసంగుడు; అనంగుడు; ప్రపంచ రహితుడు; నిష్కలుడు; నిరవద్యుడు; నిరంజనుడు; ఏకమాత్రుడు; భేద వర్జితుడు; శోకమోహములులేనివాడు; జనన మరణ శూన్యుడు; అయినను అతని మాయయు నిర్వికల్పమునందుకూడ కల్పమును ప్రదర్శింపజేయుచున్నది. అందువలననే శివునిని అఘటనా ఘటన

సమర్థుడనియెదరు. అట్టి సమర్థుడైన శివుని నామ స్మరణముచేతనే మాయ దూరమగును. శివజ్ఞానములేక మోక్షముయొక్క ఫలము గలుగదు. కనుక శివ శివయని స్మరింప వలయు.

వేదములందు శివ సర్వాత్మ భావము స్పష్టముగ చెప్పబడినది.

సర్వాసన శిరోగ్రీవః సర్వభూత గుహాశయః
సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్ సర్వగతః శివః॥ 3-౧౧
"తదేవాగ్ని స్తదాదిత్యః తద్వాయు స్తదు చంద్రమాః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదాప స్తత్ప్రజాపతిః॥
త్వం స్త్రీ త్వం పుమానసి త్వం కుమార ఉతవా కుమారీ
త్వం జీర్ణో దండేన వంచసి త్వం జాతో భవసి విశ్వతోముఖః
నీలః పతంగో హరితో లోహితాక్షః తడిద్గర్భ ఋతవః సముద్రాః
అదృష్టమవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య
మేకాత్మ ప్రత్యయ సారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం
చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥ మా. ౭

సూక్ష్మాతి సూక్ష్మం సలిలస్యమధ్యే విశ్వస్య స్రష్టారమనేక రూపమ్
విశ్వస్యైకం పరివేష్టితారం జ్ఞాత్వాశివం శాంతి మత్యంత మేతి॥ శ్వేతా

శివ తత్వము సూక్ష్మము కన్న అతి సూక్ష్మమై దుర్విజ్ఞేయమైనది. సలిల (అవ్యాకృత ప్రభృతి ద్వైత ప్రపంచ) ము యొక్క మధ్యన అంతర్యామి రూపముచేత విద్యమానుడై యున్నాడు. సమస్త సంసారముయొక్క ఉత్పాదకుడు రక్షకుడు మరియు భక్షకుడై యున్నాడు. శివుడు సృష్టియందు అనేక విచిత్ర రూపములచే ప్రాదుర్భావమును బొందును. తథాపి యెపుడే సమగ్ర సంసారమును స్వయం ఏకమాత్రుడై పరివేష్టింప (వ్యాప్తము) చేసెను. ఇట్టి సర్వరూప కల్యాణమును, ఆనంద నిధియైన శివుని తన ఆత్మ స్వరూపముచే దెలసి అధికార క్లేశప్రద ద్వైత ప్రపంచమునుండి విముక్తుడై అక్షయ నిశ్చల శాంతిని పొందును.

విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహు రుతవిశ్వత స్పాత్,
సంబాహుభ్యాంనమతి సంపతత్రై ర్ద్యావా భూమీ జనయందేవఏకః॥

విశ్వపాలకుడను, విశ్వమే నేత్రములుగ, ముఖములుగ, బాహువులుగ, పాదములుగ గలవాడను, భూర్భువస్స్వర్గాదుల స్రష్టను నేనేయని శివగీత ౬-౪౭

యందు శ్రీభగవాన్ శంకరుడు శ్రీరాములవారికుపదేశించెను.

అహం తు నిర్మలః పూర్ణః సచ్చిదానంద విగ్రహః
అసంగో నిరహంకార శ్శుద్ధం బ్రహ్మ సనాతనం ॥

నేను నిర్మలుడను, పూర్ణుడను, సత్యజ్ఞానానంద శరీరుడను, సంగము లేనివాడను, అహంకార రహితుడను, శుద్ధుడను, శాశ్వతుడ ననియు,—

సత్యం జ్ఞానమనంతం యదానందం బ్రహ్మ కేవలమ్॥
సర్వధర్మ విహీనం చ మనోవాచామగోచరమ్
సజాతీయ విజాతీయ విరుద్ధానా మసంభవాత్॥
అత స్తద్వ్యతిరిక్తానా మద్వైతమితి సంజ్ఞితమ్
మత్స్వరూపమిదం రామ! శుద్ధం యదభిధీయతే ॥
మయ్యేవ దృశ్యతే సర్వం జగత్ స్థావర జంగమమ్
వ్యోమ్ని గంధర్వ నగరం యథాదృష్టం నదృశ్యతే ॥
అనాద్య విద్యయా విశ్వం సర్వం మయ్యేవ కల్ప్యతే
మమ స్వరూప జ్ఞానేన యదాఽవిద్యా ప్రణశ్యతి॥

ఇట్లని శ్రీసదాశివుడు శ్రీరామమూర్తికి ఆత్మజ్ఞానముపదేశించెను.

యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు యో రుద్రో
విశ్వాభువనావివేశ తస్మై రుద్రాయనమో అస్త్వితి॥ శృతిః

ఏరుద్రుడు అగ్ని, జలములు, ఓషధులు, భువనములందు వ్యాపించి యుండునో అట్టి రుద్రమూర్తికి నమస్కారమని యభిప్రాయము.

తమేవ భాన్తమనుభాతి సర్వం - తస్యభాసా సర్వమిదం విభాతి
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి - స్తత్తదాత్మవిదో విదురితి। శృతిః

ఆపరమాత్మ స్వరూపము స్వతః ప్రకాశించు నట్టిది; సర్వమును ప్రకాశింపజేయునట్టిది. ఈ చరాచరాత్మక జగత్తు ఆప్రకాశము చేతనే ప్రకాశించుచున్నది. ఆశివతేజము శుభ్రమైనది. సూర్యచంద్రాగ్ని జ్యోతిర్మయమైనది. మరియు ఆనక్షత్రములందంతర్యామి నలె యుండి ప్రకాశించు చున్నది.

"యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ విశ్వాధికో రుద్రో మహర్షిః ॥
హిరణ్య గర్భం పశ్యత జాయమానగ్ం
సనో దేవశ్శుభయా స్మృత్యా సంయునక్తు॥

యని శివునకు బ్రహ్మవిష్ణ్వాది జనకత్వము, ప్రథమత్వము సిద్ధించు చున్నది.

విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్
సర్వో హ్యేష రుద్రస్తస్మై రుద్రాయ నమో అస్త్వితి॥ శ్రుతిః

చిత్ర విచిత్రమైనట్టి ఈ చరాచర జగత్తు అనేక రీతుల పుట్టి యున్నది. మరియు పుట్టుచున్నది. ఈ సర్వము శివమయమైనది. కావున అట్టి సర్వాత్మభూతుఁడైన రుద్రునకు నమస్కారమనుచు శివునకే సర్వాత్మకత్వము ఒప్పబడి యున్నది.

ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ
యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాఽఽయతనం మహత్॥ కైవల్యే.

పంచభూతాత్మకమైన పరశివ బ్రహ్మమే విశ్వమందంతట నిండియున్నది

"తత్సృష్ట్వా తదేవాఽనుప్రావిశత్" శ్రుతిః.

ఈ రీతిగ మొదట బ్రహ్మాది స్తంభ పర్యంతము సృష్టించి, తదంతర్యామియై సర్వత్ర ప్రకాశించుచుండును యని యీ శ్రుత్యర్థము

ధ్యాయీతే శానం, ప్రధ్యాయితవ్యం, సర్వమిదం బ్రహ్మ, విష్ణురుద్రాస్తే సంప్రసూయంతే, సర్వాణి చేంద్రియాణి సహభూతై ర్న కారణం, కారణానాం ధ్యాతా, అథర్వశిఖ.

మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరం
తస్యాఽవయవభూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్॥

శివునియొక్క పరబ్రహ్మత్వము, త్రిమూర్తికారణత్వము, చరాచరప్రపంచకారణత్వము ప్రతిపాదింపబడినది. విష్ణుబ్రహ్మాదులు పుట్టువారలు కనుక జగత్కారణులుగారు. శివుడే పరమకారణుడు మాయయే ప్రకృతి మాయామయుడే మహేశ్వరుడు. ఆ శివునియొక్క అవయవభూతమైనదే యీజగత్తు యని జగత్సత్యత్వము, శక్తి విశిష్టత్వము నిరూపింపబడుచున్నది.

శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥ మాండూక్యే.

అణోరణీయా నహ మేవ తద్వ న్మహా నహం విశ్వ మిదం విచిత్రం
పురాతనోఽహం పురుషోఽహ మీశో హిరణ్మయోఽహం శివ రూప మస్మి॥ కైవల్యే.

ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే। శ్రుతిః

యని శివునియొక్క అనన్యసామ్యత్వము స్పష్టముగా చెప్పబడినది.

**"సర్వోహ్యేష రుద్రః" శివుని విశ్వాత్మకత్వము తేటపడుచున్నది**

**యదా తమస్తం న దివా న రాత్రి ర్న స న్నచాఽసచ్ఛివ ఏవ కేవలః**

**వేదాఽహ మేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥**

ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం

ధ్యాత్వామునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసఃపరస్తాత్।

తమసఃపరస్తాత్ - మహాప్రళయ సాక్షి శివునకు తమోరూప, ప్రకృతివిలక్షణత్వము, యని కైవల్యమునందు చెప్పబడుచున్నది.

ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా

కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణ శ్చ

శ్వేతాశ్వతరమున శివుని సర్వకర్మాధ్యక్షత్వము సర్వగతత్వము సిద్ధించుచున్నది.

స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం

ధ్యాత్వా తన్మృత్యు మత్యేతి నాఽన్యః పంథా విముక్తయే।

శివునియొక్క పరబ్రహ్మత్వ సర్వదేవతామయత్వము, తదుపాసనమే మోక్షసాధ్యమని చెప్పి, సర్వదేవతాస్వరూప పరబ్రహ్మమే శివుడని ప్రతిపాదింపబడినది.

## శివుడే బ్రహ్మము.

యద్బ్రహ్మ ప్రవదంతి విద్ధి మతయ స్సర్వాంతరస్థం శివం

యస్మా జ్జాత మనేకతత్వనిచయం యస్మి న్నుప ర్లీయతే

యేనేదం ప్రతిబింబితం బహుతరం విశ్వం జగ ద్దృశ్యతే

త త్తత్వం సతతం భజేఽమృతమయం తేజోమయం చిన్మయమ్।

సృష్టి స్థితి సంహార కర్త యైన శివు సర్వాంతర్యామి యనియు, బ్రహ్మమనియు అనేకమతములు బోధించుచున్నవి. అట్టి శివతత్త్వమునకు తేజోమయస్వరూపమునకు నమస్కారము.

వాచోతీతో మనోతీతో భావాతీతో హ్యగోచరః

సర్వశూన్యనిరాలంబో నిశ్శబ్దో బ్రహ్మ చోచ్యతే।

మనోవాక్కాయముల కగోచరమై, విషయాసక్తి లేక, ఆశ్రయరహితము నై

17 నిశ్శబ్దమైయున్న పరిపూర్ణవస్తువే పరబ్రహ్మము.

అస్తి నాస్తి ద్వయాతీతోఽ వాఙ్మనోగోచరాత్మకః

అవర్ణో వర్ణసంయుక్తో విరూపో విశ్వరూపభృత్॥

ఉండి లేనిదై, వాఙ్మనస గోచరాగోచరము, వర్ణసంయుక్తమై వర్ణము లేనిదై, రూపము లేక విశ్వరూపము ధరించినదైయున్నదే పరబ్రహ్మము. అది తానే తానైయుండును. అట్టి పరబ్రహ్మము శివుడని తెలియవలెను. ఇందుకు ప్రమాణము లనేకము లున్నవి.

శ్రు. ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయ వై నమః ॥

నిష్కల్మషమును, సత్యమును, తేజస్స్వాతమును, నీల పీత వర్ణము గలదియును, జితేంద్రియమును, విలక్షణ నేత్రము గలదియును, పరబ్రహ్మమును నగు విశ్వరూప శివధామమును నమస్కరించుచున్నాను.

తత్పరం బ్రహ్మేతి స ఏకః స రుద్రః స ఈశః స భగవాన్
స మహేశ్వర స్స మహాదేవః ॥ అథర్వశ్రుతి

బ్రహ్మమే రుద్రుడు, ఈశుడు, భగవంతుడు, మహేశ్వరుడు, మహాదేవుడు యని పర్యాయ నామములుగ చెప్పబడి యుండుటచే శివ బ్రహ్మలకు నొకే అభేదము సూచింపబడినది.

సత్యజ్ఞానానందం బ్రహ్మేతి. బ్రహ్మ శివ ఇతి.

అను శృతివచనానుసారము సత్యం-ఎల్లపుడు నిలుచునట్టిది. జ్ఞానం-చిదాకారమైనది. ఆనందం-సుఖప్రదమైనది. ఇట్టి త్రివిధ లక్షణములచే యుక్తుడయినవాడే బ్రహ్మమనియు, ఆ బ్రహ్మమే శివుడనియు సిద్ధమగుచున్నది.

శ్రు. తత్పరం బ్రహ్మ విభాతి న తత్ర దేవాః
ఋషయః న పితరో న ఈశతే ప్రతిబంధస్య
సర్వం బుద్ధ్యతే స శివ ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా

సర్వమును తెలియు నట్టివాడు ఏకమాత్రుడైన శివుడే సర్వభూతములయందు వ్యాపించి యుండును. సర్వాంతర్యామి యగును. అట్టి శివుడే పరబ్రహ్మ మనబడును. అతడే సర్వులయందు వ్యాపించియుండును; కాని ఇతర దేవతలు, ఋషులు వ్యాపించరు అని శృతి వాక్యముగలదు.

శ్రు. బ్రహ్మాధిపతిః బ్రహ్మణోధిపతిః సదాశివో దేవతా
బ్రహ్మ శివో మే అస్తు యనియు,

అద్వితీయాయ తస్మై తురీయం బ్రహ్మ యత్స్వయమ్
భూతాన్యాత్మని సంహృత్యాఽఽప్యేకో రుద్రో వసామ్యహమ్।

యను శ్రుతివచనముల ప్రకారము శివుడే బ్రహ్మాధిపతి యనియు, అతడే బ్రహ్మ మనియు, రుద్రుడనియు, మహాదేవుడనియు, ఒక్కడేననియు తెలియును.

శ్లో॥ దాతా చ భోక్తా చ భోగ్యం చ
ఏత త్త్రివిధం పరబ్రహ్మ మేతత్।

ఇచ్చువాడు, తీసుకొనువాడు, ఇవ్వబడిన పదార్థము యీ మూడును ఆ పరబ్రహ్మమే యని బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పబడినందున,—

"దాతా భోక్తా స్వయం శివః" యను శ్రుత్యంతర వ్యాఖ్య చేత ఆ పర బ్రహ్మము స్వయంశివుడె యని సిద్ధమాయెను.

ఓంకారప్రణవముచేత సచ్చిదానందస్వరూపుడైన పరశివుడే పరబ్రహ్మ మని ప్రకాశింపబడుచున్నాడు.

త్రైలోక్య సంపదాలేఖ్య సముల్లేఖన చిత్తయే
సచ్చిదానందరూపాయ శివాయ బ్రహ్మణే నమః। సిద్ధాన్తశిఖామణౌ॥

ఆ సచ్చిదానందరూపుడయిన శివుడే బ్రహ్మమునియు, అట్టి శివబ్రహ్మమునకు నమస్కారమనియు శ్రీ జగద్గురు పంచాక్షర శివాచార్య మహా స్వాములవారు హిందీ శివాంకమునందు నీ శ్లోకముతో శివబ్రహ్మ భేదమునే స్థిరీకరించిరి.

"సర్వో వై రుద్రః - సర్వం ఖల్విదం బ్రహ్మ"
ఆ రుద్ర స్వరూపుడైన పరమశివుడే సర్వము; అతడే బ్రహ్మము.

"న స న్న చాఽస చ్ఛివ ఏవ కేవలః" వేదవాక్యము.
సృష్టిపూర్వమునందు "సత్ — అసత్" యను రెండును లేని కాలమునందు కేవలము శివుడు మాత్రమే యుండెను. ఏ వస్తువు సృష్టికి పూర్వమునందు గలదో అదే జగత్సృష్టికి కారణ మగును; ఏది జగత్తునకు కారణమో అదియే బ్రహ్మ మనబడును. బ్రహ్మ యొక్క లక్షణమును ప్రతిపాదించు వేదము ఈ ప్రకారము చెప్పుచున్నది.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి-
యత్ప్రయన్త్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ - తద్బ్రహ్మ" శ్రుతౌ॥

అర్థాత్ ఈ భూతములు దేనినుండి పుట్టియున్నవో, పుట్టి యేకారణమువలన

జీవించియున్నవో, ప్రళయ కాలమునందు నే వస్తువు యందు ప్రవిష్టమగు చున్నవో, అదియె జిజ్ఞాసకు యోగ్యమగునది; అదియే బ్రహ్మము.

త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణ స్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః ॥
మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్॥

నేను బ్రహ్మమును, నాయందు సకలము పుట్టి పెరిగి లయమగుచున్నది. భోజ్యము, భోక్త, భోగముల మూడింటికి విలక్షణుడనై సాక్షిమాత్రుడనై యుండువాడను. జ్ఞానమాత్రుడనై యున్నాను అని పరమశివుడు తన బ్రహ్మత్వమును చాటించెను; కనుక సదాశివుడే బ్రహ్మమని సిద్ధము.

## శివాధిక్యము

"శివ ఏవ కేవలః"
"శివ మద్వైతం చతుర్థం"
"సర్వగత శ్శివః"
"తం దేవానాం పరమం చ దైవతం"
"తస్మా ద్దేవ శ్శివ స్సమృతః"
"జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి"
"ఈశం జ్ఞాత్వా అమృతా భవంతి"
"శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వ మన్య త్పరిత్యజ్య"

యను యీ అనేక శృతివాక్యములచేత పరమశివుడు ఒక్కడనియు, అద్వితీయుడనియు, సర్వవ్యాపియనియు, దేవదేవుడనియు, మంగళకరుడనియు, శాంతిస్వరూపుడనియు; అట్టి శివనామక దేవుడే ధ్యేయుడనియు, అతనిని తెలిసియే అమృతులగుదురనియు, ఇతరులు త్యాజ్యులనియు బోధపడు చున్నది. కనుక ఏకత్వము, సర్వవ్యాపకత్వము, శుభకారకత్వము శివునకే సిద్ధించుచున్నది; గాని యితరులకుగాదు.

"న చాఽస్య కశ్చి జ్జనితా న చాఽధిపః"
"న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే" శ్వేతాశ్వతరే।

ఆ పరశివునకు కారణభూతుడు మరొకడు లేడు. ఆతడే స్వయంభువు యన బడును. అతనికన్న అధికులైనను సమానులైనను లేరు; అనగా శివుడే సర్వశక్తిమంతుడని తెలియవలెను.

విశ్వేశ్వర ముమాకాంతం విశ్వాంతర్యామినం శివమ్
న బ్రహ్మాద్యై స్సమం బ్రూయా చ్ఛక్తిభి శ్చాఽపి పార్వతీమ్।
బ్రూయా ద్యది సమం శంభుం బ్రహ్మవిష్ణ్వాదిభి స్సురైః
యః కశ్చి త్తమసాఽవిష్టం కదాచి న్నైవ తం స్పృశేత్।
సర్వస్మా దధికం బ్రూయా ద్భగవంత ముమాపతిమ్

ఆ పరమశివుడు సమస్త విశ్వమునకు స్వామియు, అతడే "ఉమా" యను పార్వతికి వల్లభుడు, సమస్త విశ్వ ప్రపంచమునకు అంతర్యామి (అంతట వ్యాపించియుండువాడు.) కనుక అట్టి శివునకు బ్రహ్మాదిదేవతలు సమానులు గారు. ఆ శంభునకు బ్రహ్మ విష్ణ్వాదులు సమానులని చెప్పినట్టయిన ఎప్పుడైనను ఆతనిని పొందకుందురు, యనగా శివుని చేరరని యర్థము. ఆ ఉమాపతి యైన శివుడు సర్వదేవతలకన్న అధికుడనియే చెప్పబడు నను శృతి వాక్యము చేత శివుడు బ్రహ్మవిష్ణ్వాదిదేవతలకన్న అధికుడనియే సిద్ధమగుచున్నది.

"శివం స్వప్రకాశమ్"

శివుడు స్వప్రకాశుడని శృతివాక్యము గలదు. ఆ శివునివల్లనే సూర్యాగ్ని చంద్రాదులు ప్రజ్వలించుచున్నారు. అతని తేజస్సువలననే సమస్తతేజస్సులు గలుగుచున్నందున శివునియొక్క తేజస్సు స్వతస్సిద్ధమయినదే గాని అన్యము నపేక్షించు నట్టిది గాదు.

"విశ్వాధికో రుద్రో మహర్షిః" "సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఆ పరశివుడయిన రుద్రుడు విశ్వాధికుడు. మహర్షి యనబడుచున్నాడు. ఈ చరాచర ప్రపంచ మంతయు బ్రహ్మమే యని యున్నందున శివునియొక్క ఆధిక్యత వెల్లడి యగుచున్నది.

శివం విశ్వాధికం సాంబ మన్యసదృశం ప్రభుమ్
18 యోఽన్యథా మనుతే మోహా త్స భవే త్పుల్కసాధమః।
విప్రా విశ్వాధికో రుద్రో యది విష్ణు సమ స్తథా
శృతి ర్విశ్వాధికో రుద్ర ఇత్యేషా బాధితా భవేత్॥ శివరహస్యే।

సాంబమూర్తి యైన శివుడు విశ్వాధికుడు. (సమస్తదేవతాదులకన్న అధికుడు.) అతనికి సదృశు లెవరును లేరు. ఆతనికన్న సమానులు, లేక అధికులు గల రని భ్రమించిన అధములగుదురు. ఏలననగా రుద్రుడే విశ్వాధికు డని శృతి ప్రమాణము గలిగినందున శివాధిక్యము అబాధితమైనదని శివరహస్యమునందు స్పష్టముగా జెప్పబడినది. మరియు

యే మాం బ్రహ్మాదిభి స్తుల్యాం యే త్వాం లక్ష్మ్యాదిశక్తిభిః
గురుం యే ప్రాకృతై స్తుల్యాం సంస్మరం త్యల్ప బుద్ధయః
తేషాం పాపాని నశ్యంతి శివరాత్రిప్రజాగరాత్॥ స్కాందే।

శివునకు బ్రహ్మాదులు సమానులనియు, పార్వతికి లక్ష్మ్యాదులు సమానులనియు గురువునకు ప్రాకృతులు సమానులనియు అల్పబుద్ధిమంతులు తలంతురు; అట్టివారి పాపములు శివరాత్రి జాగరణము చేతనే నశించును. అనగా: బ్రహ్మ విష్ణ్వాదిదేవతలు శివునకు సమానులు గారని స్కాందపురాణము శివాధిక్యమును చాటించుచున్నది.

"త్ర్యంబకం యజామహే" యజుర్వేదే।

త్రియంబకుడయిన శివుడే యజుర్వేదమునందు పూజింపబడుచున్నాడు.

"నీలకంఠాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీ మహాదేవాయ నమః"

నీలకంఠుడైన సదాశివుడే మహాదేవుడు సర్వేశ్వరు డని శృతి ఘోషించుచు అట్టి దేవాధిదేవుడైన శివునకు నమస్కారము జేయుచున్నది.

"తవ శ్రియే మరుతో ర్చయంతః రుద్ర యత్తే జనిమ
చారు చిత్రం పదం యద్విష్ణో రుపమం న్యధాయి"

ఓ రుద్రుడా! బ్రహ్మాది దేవతలు నీ యొక్క ఐశ్వర్యము కొరకు విష్ణువు యొక్క వైకుంఠస్థానమును దృష్టాంతముగా యుంచుకొని నీ మనోహరమైన విచిత్ర సౌవర్ణ మణిమయరాజత తామ్ర కాంస్యకాది నానా ప్రకార లింగమును పూజించుచుందురు. యనియు, ఋగ్వేదమునందు దేవతలే శివార్చన జేయుదురని చెప్పబడినందున శివుడు దేవాదిదేవుడని సిద్ధమగుచున్నది.

సర్వాననశిరోగ్రీవః సర్వభూతగుహాశయః
సర్వవ్యాపీ చ భగవాన్ తస్మా త్సర్వగత శ్శివః॥ శ్వేతాశ్వతరే।

సర్వభూతాంతర్యామియై, సర్వవ్యాపియైన భగవంతుడు శివుడే యని, యీ

వాక్యమువలన అవగత మగుచున్నది. అట్టి శివుడు ఒక్కడే యయినందున అద్వితీయు డనబడును. ఈ మహావాక్యములచే శివునియొక్క సర్వాంతర్యామిత్వము, సర్వాత్మకత్వము సిద్ధించుచున్నది.

"రుద్రో ఏకత్వ మాహుః"

"ఏకో దేవో సర్వదా వినిష్టః"

"త త్పరం బ్రహ్మేతి, స ఏకో రుద్రః"

"స శివ ఏకో దేవః"

"ఏక ఏవ రుద్రో న ద్వితీయో యో న బ్రహ్మ న విష్ణుః

న సూర్యో నాఽగ్ని ర్న చంద్రతారకాః"

యను శృతివచనములు రుద్రనామక శివునికే ఏకత్వమును, సర్వ వ్యాపకత్వమును, బ్రహ్మత్వమును ప్రతిపాదించుచున్నవి. ఆ పరమశివుడు ఒక్కడే కాని అతనికి సమానులు లేరు. బ్రహ్మ విష్ణు సూర్య అగ్నిచంద్రి తారకాదులు ఆతనికి సమానులు కారు.

"తదాదిమధ్యాంత విహీన మేకం విభుం చిదానంద మరూప మద్భుతం

ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలగళం ప్రశాంతం

ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం సమ స్తసాక్షిం తమసః పరస్తాత్॥

ఆది మధ్యాంతరహితుడు, ఒక్కడు, చిదానందస్వరూపుడు, రూపరహితుడు, సమస్తమును మించిన వాడు, ఉమాసహాయుడు. శ్రేష్ఠమయిన ఈశ్వరుడు ప్రభువు, సూర్య సోమాగ్ని యను త్రిలోచనయుక్తుడు, నీలకంఠము గలవాడు, విశేషశాంతియుతుడు, అయిన శివుడే సమస్తచరాచరప్రపంచమునకు జనకుడు; సాక్షిమాత్రుడు. ఆ శివుడే సర్వులకు పూజనీయు డని శృతుల యందు శివాధిక్యము పొగడబడుచున్నది.

"వ్యోమ కేశో భవో భీమ స్థాణూ రుద్ర ఉమాపతిః"

శివుడే మూలస్తంభుడయిన దేవదేవుడనియు, బ్రహ్మాండమాదంతట నిండియున్న వాడనియు నామలింగానుశాసనము నందుగూడ శివాధిక్యము సిద్ధించుచున్నది.

వ్యాప్నోతి సర్వాన్ విదిశో దిశ శ్చ

త్వం విశ్వ మేవ పురుషం పురాణం

నష్టే పి తస్మిం స్తవ నాశహానిః

ఘనే వినష్టే నభసో యథైవ।

ఈశ్వరుడు విశ్వమయుడనియు, పురుషుడనియు, అతి ప్రాచీనుడనియు, ప్రళయకాలమునందు నశించనివాడనియు, ఆకాశమువలె ఎల్లప్పుడు శాశ్వతుడై యుండువాడనియు తెలియవలెను.

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్।

యను యజుర్వేదవచన ప్రకారము శివుడు సర్వశక్తియుతుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వాంతర్యామి, సర్వనియామకుడు, నిరవధి నిరంజన నిరాకారాది లక్షణయుక్తుడు. ఆతనికి తల, కొండెము, పాదములు, అవయవములులేవు. బ్రహ్మాండములోని సమస్తప్రాణస్వరూపములే ఆతడై యుండునని ఈ యజుర్వేదమంత్రమునకు శంకరాదిమహర్షులు అర్థము చేసిరి. ఇదే అర్థమును మహేశ్వరాచార్యులు గూడ సిద్ధాంతీకరించిరి. మరియు

అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః
స వేత్తి వేద్యం న చ తస్యాఽస్తి వేత్తా తమాహు రగ్ర్యం పురుషం పురాణమ్।

ఆ శివుడు కాళ్ళు లేకనే నడచును. చేతులు లేకనే పనిచేయును. కన్నులు లేకనే చూచును. చెవులు లేకనే వినును. మరియు అతడన్నిటిని తెలుసుకొనుచుండును. కాని యతనిని తెలియ సమర్థు లెవ్వరును లేరు. కనుక అతడు సర్వతశ్రేష్ఠుడనియు, పురాణపురుషుడనియు ముండకోపనిషత్తు వలన శివాధిక్యము ప్రతిపాదింపబడినది.

"న తస్య ప్రతిమాఽస్తి" యను వేదవచన ప్రకారము ఆ పరశివునకు ప్రతి గాని, ఉపమ గాని లేదని యర్థమగుచున్నది.

"అయం మే విశ్వభేషజోఽయం మే శివాభిమర్శనః"

అను ఋగ్వేదవచనము వలనను,—

"నమ శ్శివాయ చ శివతరాయ చ" యను యజుర్వేద వచనము,-

"అపి వా య శ్శ్చాండాల శ్శివ ఇతి వాచం వదేత్తేన సహ సంవదేత్"

యను సామవేద వచనమువలనను,—

"అచింత్య మవ్యక్త మనంతరూపం శివం ప్రశాంత మమృతం బ్రహ్మయోనిమ్" యను కైవల్యోపనిషద్వచనము వలనను,—

"శివతత్త్వం మహాదేవ నిష్కళం త్వితి కీర్తితమ్"

యను వాతూలాగమ వచనాద్యనంతాగమ వచనములవలనను,—

మహాపాతకవిచ్ఛిత్త్యై శివ ఇత్యక్షరద్వయం
అలం నమస్క్రియాయుక్తో ముక్తయే కల్పితో మనుః ॥

అను మొదలయిన స్మృతి వచనములవలనను మరియు అనేక సూత సంహితా వచనములు మొదలయిన పురాణవచనముల వలనను కూడ ప్రసిద్ధమైన శివుడు పరబ్రహ్మ ప్రకాశకు డగును. అతడే సర్వ శ్రేష్ఠుడు. అతని వలననే సర్వు లకు ముక్తి గలుగుచున్నదని తెలియవలెను.

శివం పరాత్పరం సూక్ష్మం నిత్యం సర్వగ మవ్యయమ్ శివాగమే

శివుడే పరమేశ్వరుడు. పరాత్పరుడు, సూక్ష్ముడు, ఎప్పటి కుండువాడు, సర్వ వ్యాపకుడు మరియు అవినాశి యని శివాగమములు కూడ శివుని యొక్క ఆధిక్యమును సర్వవ్యాపకత్వమును చాటించుచున్నవి.

"రుద్రో వై శాశ్వతం వై పురాణం" ఇతి.
"అజ మేకం లోహిత శుక్ల కృష్ణం" ఇతి. శృతౌ।

శివుడే నశింపులేక యెల్లపుడు నుండువాడు. ముప్పది మూడుకోట్ల దేవతల కన్న పురాతనుడు. జన్మాద్యంతములు లేనివాడు. మరియు ద్వంద్వరహి తుడై ఒకడే యైనవాడు. ఆతడు ఎరుపు, తెలుపు, నలుపు యను రంగులతో గూడియుండును. అనగా త్రిగుణాత్మకుడయి ప్రపంచనాటకమును సాగించు నని శృతి ప్రమాణములు గలవు.

"విశ్వాధికో రుద్రో మహర్షిః త్వం దేవేషు బ్రాహ్మణః
త్వం దేవానాం బ్రాహ్మణానా మధిపతిః-
విష్ణుః క్షత్రియాణా మధిపతిః"

శివుడు బ్రాహ్మణులయిన దేవతలకు అధిపతి యైనందున బ్రాహ్మణు డనియు, విష్ణువు క్షత్రియులకు దేవుడనియు స్పష్టముగా జెప్పబడినందున శివుడు దేవ దేవు డనియే అవగతమగుచున్నది.

సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
19 జ్ఞానా న్యేతాని పంచైవ జ్ఞేయ శ్చైకో మహేశ్వరః ॥
సర్వాకారో నిరాకారో మహాత్మా పార్వతీపతిః
తస్మాత్పరతరం నాస్తి జ్ఞానజ్ఞేయా త్సదాశివాత్ ॥

అను పద్మపురాణ వచన ప్రకారము పార్వతీపతియే మహేశ్వరు డనియు, నిరాకారు డనియు, సర్వకారణు డనియు, మహాత్ము డనియు, అతనికి మించినది మేమియు లేదనియు, సాంఖ్య యోగ పాంచరాత్ర వేద పాశుపతములను పంచవిధజ్ఞానశాస్త్రములు ఆతనినే తెలుపుచున్న వనియు స్పష్టమగు చున్నది. కనుక శివాధిక్యమే ఒప్పతగినది.

తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమం చ దైవతమ్
పతిం పతీనాం ప్రథమం పురస్తాత్
విదామ దేవం పరమేశ మీడ్యమ్। శ్వేతాశ్వతరే।

ఈశ్వరులకు మహేశ్వరుడు, దేవతలకు పరమదేవత, పతులకు పతియు అయి యున్న పరశివుని తెలిసికొంటిమి యను శ్రుతి వాక్యము వలన శివాధిక్యము సిద్ధించుచున్నది.

పరాత్పరతరం బ్రహ్మా తత్పరాత్పరతో హరిః
యత్పరాత్పరతో ఈశ స్తస్మై మహేశ్వసంకల్ప మస్తు। శ్రుతిః.

శివునియొక్క సర్వదేవతాధికత్వము వెల్లడి చేయబడుచున్నది. బ్రహ్మకన్నను హరియు శ్రేష్ఠుడు. అట్టి హరికన్నను శివుడే శ్రేష్ఠుడు. అట్టి పరాత్పరు డయిన శివునకు నమస్కారమని శ్రుతియందు గలదు.

న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమ శ్చాఽభ్యధిక శ్చ దృశ్యతే
న తస్య కశ్చి త్పతి రస్తి లోకే న చేశితా నైవ చ తస్య లింగమ్।
స కారణం కరణాధిపాధిపో న చాఽస్య కశ్చి జ్జనితా న చాఽధిపః॥

బ్రహ్మాదిదేవతాజాలం మోహితం మాయయా సదా
అశక్తం ముక్తిదానే తు క్షయాతిశయసంయుతమ్।
అనాదిముక్తో భగవా నేక ఏవ మహేశ్వరః
ముక్తిద శ్చేతి యో వేద స వై మాహేశ్వర స్స్మృతః॥

జననమరణబద్ధమైన బ్రహ్మవిష్ణ్వాది సమూహమంతయు పరశివుని మాయాశక్తి చేత యెల్లప్పుడు ఆవరింపబడియున్నది కనుక ఆ సమూహము మోక్షము నిచ్చుటకయి అశక్తి గలదయి యుండును. అనాదియైన పరశివుడే ముక్తి నిచ్చువాడు. అతడే మాహేశ్వరుడు. ఇట్లు దెలిసినవాడే మహేశ్వరస్థలుడు.

# శివుడే జగత్కారణుండు.

ధృతకాఠిన్యవన్మూర్తి స్సచ్చిదానందలక్షితః
మూలమూర్తి మహాదేవో వేదవేద్య స్సదాశివః
ఆదికర్తా జగన్నాథ శ్శూలపాణి రితి శ్రుతిః ॥

యీ జగత్తునకు మూలకారణుడై, సచ్చిదానందుడై, వేదవేద్యుడై యుండు పరమేశ్వరుడు శూలపాణియైన సదాశివుడే యని శ్రుతులు బోధించుచున్నవి; అని స్కాందపురాణమునందు చెప్పబడినది.

ఉమయా సహితో దేవ స్సోమ ఇత్యుచ్యతే బుధైః
స ఏవ కారణం నాఽన్యో విష్ణో రపి చ వై శ్రుతిః ॥

యని ఆదిత్యపురాణము ౨౮ వ అధ్యాయమునందుకూడ ఉమా సహితుడయిన సోమ యను నామముగల శివుడే విష్ణువునకుగూడ కారణుడనియు, అన్యులు గారనియు, ఇదియే శ్రుతివచనమనియు స్పష్టీకరింపబడినది. మరియు

వేదమాతా చ గాయత్రీ మంత్రమాతా షడక్షరీ
సర్వదేవపితా శంభుః భర్గో దేవస్య ధీమహి ।

యను శ్లోకరాజముగూడ సమస్తదేవతలకు శంభువు అనగా శివుడు జనకుడనియు మరియు అతడే శ్రేష్ఠుడనియు బోధించుచున్నది.

"సోమః పవనో జనితా మతీనాం జనితా దివః జనితా పృథివ్యాః
జనితాఽగ్నే ర్జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితాఽథ విష్ణోః"

సోమనామకుడయిన శివుడే సకల వేదాగమములకు, సకల మంత్రములకు, సకల దేవతలకు. మరియు సకల కరణములకు, స్వర్గ భూమి అగ్ని సూర్య ఇంద్ర విష్ణ్వాది దేవతలకు తండ్రి యని యజుర్వేదమున ప్రతిపాదింపబడెను.

త్వత్తో హ జాతం జగ దేత దీశ
త్వయ్యేవ భూతాని వసంతి నిత్యమ్
త్వయ్యేవ శంభో విలయం ప్రయాంతి
భూమౌ యథా వృక్షలతాదయో హి ।

ఈ భూమియందు వృక్షలతాదు లుత్పన్నమై ఎట్లు లయించుచున్నవో అట్లే ఈశ్వరునియందు జగత్తుయొక్క ఉత్పత్తి స్థితి లయములు గలుగుచున్నవి,

బ్రహ్మేంద్రరుద్రాగ్ని మరుద్గణా శ్చ
గంధర్వ యక్షా సుర సిద్ధ సంఘాః
గంగాదినద్యో వరుణాలయా శ్చ
వసంతి శూలే తవ వక్రయాత్రే।

బ్రహ్మ, ఇంద్ర, రుద్ర, అగ్ని, వాయువు మొదలగు దేవగణములు, గంధర్వులు, యక్షులు, సురలు, సిద్ధులు మొదలగు సంఘములు, గంగాది నదులు, సముద్రములు మొదలైనవన్నియు నీ కుక్షియందే వసించి యుండు ననియు జెప్పి, శివుడే విశ్వమయు డని జగద్భరితు డని ప్రతిపాదింపబడినది.

శివస్యాఽజ్ఞాబలా ద్విష్ణు ర్జాయతే మ్రియతే పిచ
బ్రహ్మా సర్వజగ త్కర్తా విరాట్ సామా ద్వరా దపి।
ఖరోష్ట్ర మవతే క్షుద్ర బ్రహ్మ విష్ణ్వాదయో భవేత్
బ్రహ్మణ శ్చ తథా విష్ణు ర్విష్ణో రంశస్య కస్య చ
ప్రవృత్తే శ్చ నివృత్తే శ్చ హేతు రిచ్ఛా పినాకినః।

అని సూతసంహితయందు కూడ ఈశ్వరుని ఆజ్ఞవలననే బ్రహ్మ విష్ణ్వాదులు ఉద్భవించి లయించుచుందు రనియు వీరికి పినాకియే హేతువనియు (కారణు డనియు) స్పష్టముగా జెప్పబడినది. మరియు

దక్షిణాంగభవో బ్రహ్మ వామత శ్చ జనార్దనః
నేత్రేభ్య స్తస్య సంజాతా సూర్యసోమాగ్నయ స్స్మృతాః॥

శివుని దక్షిణభాగమునుండి బ్రహ్మయు, వామభాగమునుండి విష్ణువు, మరియు నేత్రత్రయమునుండి సూర్య చంద్ర అగ్ని త్రయము పుట్టె నని లింగపురాణము చాటించుచున్నది. కనుక శివుడే జగత్కారణుడని సిద్ధమగుచున్నది.

సో సృజ ద్దక్షిణా దంగా ద్బ్రహ్మాణం లోకసంభవమ్
వామపార్శ్వా త్తథా విష్ణుం లోకరక్షార్థ మీశ్వరః
హృదయా త్కాలరుద్రాఖ్యా॥ ఇతి అనుశాసనికే

ఆ జగత్కర్తయయిన పరశివుడు తన దక్షిణాంగమునుండి జగత్సృష్టి కొరకు బ్రహ్మను, వామాంగమునుండి జగద్రక్షణార్థము విష్ణువును, మరియు హృదయమునుండి జగత్ప్రళయముకొరకు రుద్రుని పుట్టించెను. అని కలదు. గనుక త్రిమూర్తులుకూడ శివునివలననే పుట్టిరని తెలియుచున్నది.

త్రయ స్తే కారణాత్మానో జాతా స్సాక్షా న్మహేశ్వరాత్
చరాచరస్య విశ్వస్య సర్గ స్థిత్యంత హేతవః ।
పిత్రా నియమితాః పూర్వం త్రయో ఽపి త్రిషు కర్మసు
బ్రహ్మ సర్గే హరి స్త్రాణే రుద్ర స్సంహరణే పునః ।
తథాఽన్యోన్య మాత్సర్యా దన్యోన్యా తిశయార్థినః ।
తపసా తోషయిత్వా తం పితరం చంద్రశేఖరం
బ్రహ్మ నారాయణః పూర్వం రుద్రః కల్పాంతరే సృజత్ ।
కల్పాంతరే పునర్బ్రహ్మ బ్రహ్మాణం చ పునర్భవః
విష్ణుశ్చ భగవాం స్తద్వ ద్బ్రహ్మాణ మసృజ త్పునః ।

శైవ వాయవీయ సంహితయందు నీ పై విషయమే స్పష్టముగా చెప్పబడి నది. కనుక శివుడే బ్రహ్మ విష్ణు రుద్రులకు కర్త యగుచున్నాడు.

యత్ర యో వచనం వ్యాస శృణు మూఢ యథార్థవత్
యః కర్తా సర్వభూతానాం శివ ఏవ భవే త్సర్వతః ।
యజ్ఞకర్తా చ దేవేంద్రో వేదకర్తా చ వాక్పతిః
అహ మేవ జగత్కర్తా మమ కర్తా మహేశ్వరః ।
తస్య దేవాదిదేవస్య కర్తా కోఽపి న విద్యతే
దేవతానాం మహాదేవో దేవో స్మాకం మహేశ్వరః । స్కాందే ।

వ్యాసభుజ స్తంభనానంతరము వ్యాసుని గురించి విష్ణుభగవానుడు ఓ వ్యాసా! సమస్త భూతములకు ఎవడు కర్తయో అతడే శివుడు. యజ్ఞములకు దేవేంద్రుడు కర్త; వేదములకు బ్రహ్మ కర్త; నేను (అనగా విష్ణువు) జగత్తునకు కర్తను; నాకు మహేశ్వరుడు కర్త. ఆ దేవాదిదేవుడయిన మహాదేవునకు కర్త యెవ్వడును లేడు; అని స్కాందపురాణ కాశీఖండము నందు బోధించెను.

శివస్య పూజ్యతే లింగం సర్వై ర్దేవాసురై ర్నరైః
శివేన పూజితః కోఽన్యో వదంతు ప్రతిపాదినః ।
స్వనామ్నా బ్రహ్మణా లింగం మయా కృష్ణేశ్వరం మునే
20 సర్వాపేక్షిత సిద్ధ్యర్థం వారాణస్యాం ప్రతిష్ఠితమ్ ।

సమస్త దేవతలు నరులు, అసురులు వీరందరు ఇష్టార్థ సిద్ధికొరకు శివ లింగమును పూజించుచుందురు. శివుడు ఎవరిని పూజింపడు, అందువలననే నా

పేరుగల కృష్ణేశ్వరలింగమును వారణాసి (కాశి)యందు సమస్తజనుల యిష్టార్థసిద్ధికొరకు నాచే స్థాపింపబడినది యని విష్ణుభగవానుడు వెలిపెను, దీనిచే శివునియొక్క ఆధిక్యత వెల్లడి యగుచున్నది.

పూజ్యతే దేవదేవేశం పురాణం సర్వకారణం
ఆగమానాం చ సర్వేషాం ఇతి వేదాంతనిశ్చయమ్।

శివుడు అతిపురాతనుడు. సమస్తచరాచర జగత్తునకు కారణుడు. సమస్తాగమములకు కూడ కర్త. అట్టి దేవదేవుడయిన శివుని పూజింపవలెనని వేదాంతశాస్త్రముగందు నిశ్చయింపబడిన దని శివగీతయందు జెప్పబడినది,

అదృష్టపూర్వం తం దృష్ట్వా దేవా విష్ణుపురోగమాః
ప్రణిపత్య మహాదేవ మపృచ్ఛన్ కో భవా నితి।
సో బ్రవీ ద్భగవా న్రుద్రః పతీనాం పతి రీశ్వరః
సర్వజ్ఞ స్సర్వభూతానాం తత్త్వభూత స్సనాతనః।
అహ మేవ జగద్ధేతు రాసం ప్రథమ మీశ్వరః
వర్తామి చ భవిష్యామి న మత్తోఽ న్యోఽ స్తి కశ్చన।
మన్మాయా శక్తి సంక్లుప్తం జగత్సర్వం చరాచరమ్
ఇత్యుక్త్వా భగవాన్ రుద్రః పూర్వరూప మథావిశత్।
నాఽపశ్యం శ్చ తతో రుద్రం దేవా విష్ణుపురోగమాః॥ సూతసం:

ఒకానొక సమయమందు బ్రహ్మ విష్ణ్వాది దేవతలు అదృష్టవశాత్ పరశివుని జూచి సంశయనివృత్తికొరకు పరమేశ్వరు డెవడని ప్రశ్నించిరి; భగవంతుడైన యారుద్రుడు నేనె సర్వజ్ఞుడను; సనాతనుడను; నేనే భూత భవిష్యద్వర్తమానములును; నన్ను యెవరు తెలియలేరు. నా మాయాశక్తిచేత ఈ చరాచర జగత్తంతయు ఉద్భవించెను; యని చెప్పి అంతర్ధానుడాయెను. తర్వాత విష్ణ్వాదులు ఆతని చూడలేరైరి. ఈ ప్రకారమె లింగపురాణమందు:

త మపృచ్ఛం స్తతో దేవాః కో భవా నితి మోహితాః
సోఽబ్రవీ ద్భగవాన్ రుద్రో హ్యాహ మేకః పురాతనః॥

దేవతల సంశయనివారణార్థమయి శివుడు నేనె జగత్కర్తనని తెలియజెప్పెను.

కిం కారణం బ్రహ్మ కుత స్స్మ జాతా
జీవామ కేన క్వచ సంప్రతిష్ఠాః

అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే బ్రహ్మవిదో వ్యవస్థామ్। ౧
కాల స్స్వభావో నియతి ర్యదృచ్ఛా
భూతాని యోనిః పురుష ఇతి చింత్యం
సంయోగ ఏషాం నత్వాత్మభావా
దాత్మాఽప్యనీశ స్సుఖ దుఃఖ హేతోః॥ ౨
తే ధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢాం
యః కారణాని నిఖిలాని తాని
కాలాత్మయుక్తా న్యధితిష్ఠ త్యేకః। శ్వేతాశ్వతరే.

ఇత్యాది వాక్యములచేత దెలియుననేమనగా: పరమప్రాచీనులయిన యనేక బ్రహ్మవాదులు, బ్రహ్మస్వరూపము నిర్ధరించుట కుపక్రమించి, మొదలు నానావిధ సంశయములను బొందియుండిరనియు, మొదటి ఋక్కు చూపెట్టు చున్నది; దాని యర్థ మేమనగా:—

"సమస్తమైన కార్యవస్తువులకు కారణభూతమైన బ్రహ్మ వస్తు వనునది ఏది? మే మందరము యే వస్తువవలన ఉత్పన్న మైతిమి? పుట్టియున్న మేము యే వస్తువవలన సత్తును (స్థితిని) పొంది జీవించుచుందుము? ఇట్టి మేము చివరకు యే వస్తువునందు లయము పొందగలము? మరియు మేము యే వస్తువుచేత ఆక్రమింపబడినవారమై ప్రాపంచికమైన సుఖదుఃఖముల నను భవించుచు పడియుంటిమి?" అనునదియే మొదటిమంత్రముయొక్క అర్థము. ఇట్లే జగత్కారణ వస్తు పరమైన సంశయము గలిగిన సమయమందు నానా వాదులు నానావిధములుగ తమతమ మతములను చెప్పెదరనియు రెండవ ఋక్కు చూపించుచున్నది; తదర్థ మేమన:—

"కాలమే జగత్కారణ వస్తు వని కొందరు, ఆయా వస్తువుల స్వభావ విశేషమే ఆయా వస్తువుల పరిణామమునకు కారణమై యున్నదని కొందరు, "నియతి" యను నియమ విశేషమే (తప్పని భవితవ్యతయే) జగత్కారణమని మరి కొందరు, ఏకారణము లేకనే ఆకస్మికముగానె ప్రపంచము పుట్టియున్న దని మరికొందరు, సూక్ష్మములైన పంచభూత పరమాణువులే. స్థూలప్రపంచో

త్పత్తికి కారణ భూతమై యున్నదని మఱికొందరు, ఇవి యన్నిటి కన్నను విలక్షణుడైన పురుష శబ్దవాచ్యుడైన జీవాత్ముడే సమస్తప్రపంచమునకు కారణభూతుడై యున్నాడని వేరె కొందరు, ఇటులె నానా వాదులు నానా రీతులుగ తమతమకు తోచినట్లుగ కారణ వస్తువుల యొక్క కథలను చెప్పుచున్నారు. పంచభూతముల యొక్క సంయోగ విశేషము చేత శరీర కారణమై పరిణమించిన తర్వాత అట్టి శరీరమునందు జీవాత్మ వ్యక్తియు అభివ్యక్తమైనను, ఈజీవునకు ఏదేనొక విషయమునందును స్వాతంత్ర్యము గలుగదు. ఎటులన? "సుఖమే నాకు కావలెను" అని యెంతగా నపేక్షించినను, అతని యిష్టప్రకారము ఆసుఖము దొరుకనేరదు. "దుఃఖము నాకక్కరలేదు" అని యెంత చింతించుచున్నను, ఘోరదుఃఖము ప్రాప్తించుచునే నాక ఇష్టప్రకారము నిర్వహింప బడుట లేదు. ఇట్లు సుఖప్రాప్తి యందును దుఃఖ నివృత్తి యందును స్వాతంత్ర్యమును పొందక అత్యంత పరతంత్రుడగ బడిన ఈ జీవాత్ముడు ప్రపంచమునకు కారణభూతుడు నిర్వాహకుడు కానేరడు." అనునది రెండవసూత్రార్థమై యున్నది.

ఇట్లు జగత్కారణ వస్తు విషయమై నానావిధ సందేహముల నొంది, ఆ బ్రహ్మవాదులు సకల సంశయ నివారణమునకై అష్టాంగయోగ క్రమమును సరించి ధ్యానయోగమునందు నిరతులైరి. ఇట్లు దీర్ఘ కాలము వరకు ఆచరించిన ధ్యానయోగ ప్రభావము చేత పరమాత్ముని శక్తి స్వరూపిణియై, కరుణా మూర్తియైయున్న దేవియు ప్రసన్నురాలై వారియొక్క విశేషానుగ్రహము చూపించి, పరమాత్మ తత్త్వము వారికి స్పష్టముగా ప్రకాశించు నట్లు జ్ఞాన విశేషమును ప్రసాదించెను. పూర్వోక్తమైన పంచబ్రహ్మములును, ప్రకృతికాల మనుజాదివస్తువులును, జీవస్వరూపములును ఇవియు కారణత్వము సాధింపదగనివగుటను, కొన్ని వస్తువుల కంటె కారణత్వము శాస్త్రములలో అవగతమై యున్నందున కారణ శబ్దముచేత నిర్దేశింపబడ సమర్థమై యున్న ఆసమస్త కారణములకు, శక్తిస్వరూపిణియైన దేవిని తన నిరూప్య వర్గమునందు చేర్చి తానే సర్వనియామకము కాగల అద్వితీయమైన పరమ శివతత్త్వము బ్రహ్మస్వరూపమును దేవ్యనుగ్రహముచేత ఆ బ్రహ్మవాదులు సాక్షాత్కరించుకొనిరి" అని మూడవసూత్రముయొక్క అర్థము. ఇట్లు దేవి ప్రసాదముచేత "శివతత్త్వమే బ్రహ్మ మనబడు తన నిర్ణయము బ్రహ్మవాదులకు లభించినదానిని నిస్సంశ

యను గా చూపు ఈ శ్వేతాశ్వతరోప నిషత్తునందు

యదా తమ స్తన్న దివా న రాత్రి
ర్న స న్నచాసన చ్ఛివ ఏవ కేవలః
త దక్షరం తత్సవితు ర్వరేణ్యం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ।

యను మంత్రము నాల్గవ అధ్యాయము నందు (౪-౧౮) విదితమయి యున్నది. దీని యభిప్రాయమేమనగ- "స్థూలమైన సమస్తజడప్రపంచమునకు ఉపాదాన కారణముకాగల 'ప్రకృతి-ప్రధాన'మను పర్యాయనామాంతరములను పొంది యున్న అతిసూక్ష్మావస్థాపన్నమైన తమస్సను వస్తుమాత్రమే మిగిలియున్న ప్రళయకాలమునందు పగలు రాత్రి యను విభాగమునగాని, స్థూల చేతనా చేతనములను సదసద్వస్తువుల విభాగము గాని, లేదని చూపి, అట్టి సమయమునందు శివశబ్దవాచ్యమైన పరమాత్మ యొక్కడే మిగిలియుండె" నని చెప్పియున్నందున, శివవ్యతిరిక్తమైనవానికి ఆ సమయమునందు స్థితియు సంభవించదు. మరియు శివశబ్దవాచ్యుడై, సర్వప్రేరకుడై యున్న పరమాత్ముని అత్యద్భుతమైన తేజస్సనునది యెన్నడయిన యేవికారమును పొందక సర్వదా ఏక రూపము గలదై యుండుటవలన అక్షర మనబడుచున్నది. పరమాత్ముని నాశరహితమైన తేజస్సే పరమాత్మోపాసకులందరికి వర్ణనీయమయి యున్నది. (ఆశ్రయించుటకు యోగ్యమై యున్నది.) అద్భుతమైన తేజస్సుతో కూడి యున్న పరమాత్మునివలననే ఐహికాముష్మికములైన సకల శ్రేయస్సులకు సాధనమై యున్న జ్ఞానవిశేషమునకె నిధియై, అనాదియైయున్న వేదవాణియు లోకానుగ్రహమునకు ఆవిర్భూతమైనది." యనునది యీ మంత్రముయొక్క అభిప్రాయమైయున్నది. ఇటులే సమస్త ప్రపంచముయొక్క సృష్ట్యారంభమునకన్న పూర్వమునందు శివుని కొక్కనికే సద్భావము చెప్పబడినందున మరియొకరికి ఆ సమయమునందు సద్భావము సంభవించదు గనుక, శివునికే జగత్కారణత్వమును అంగీకరించవలసినదేకాని, మరొకరి కంగీకరించుట కవ

21 కాశము లేదు,— మరియు నిదే మంత్రమునకనతిదూరమునందు—

"అజాత ఇత్యేవం కశ్చి ద్భీరుః ప్రపద్యతే
రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యం" ౪ ౨౧

యను మంత్రముపఠితమై యున్నది. దీని యభిప్రాయ మేమనగ:— "జనన మరణాదిరూపమైన నానావిధసాంసారికోపద్రవములచేత సంతప్తుడయి చెదరి యున్న జీవుడు, నిన్ను జననమరణాదిరహితుడవని తెలిసి, తన సకలదుఃఖ నివృత్తికొరకు నిన్నే ఆశ్రయించును; నిన్నే శరణు పొందును. నీ పంచముఖములలో దక్షిణముఖమును భజించును; అందువలన నో పరమాత్మా! నీ దక్షిణముఖముచేతనే నీవు నన్ను చేయి వదలక యెల్లప్పుడు రక్షించుచుండుము." యనునదే యీమంత్రాభిప్రాయమై యున్నది. ఇటులే ఈ మంత్రములందు రుద్రశబ్దవాచ్యుడైన పరమశివునకే జననమరణాదిరాహిత్యము ఉక్తమయియున్నందున, జననమరణాదులచేత పరిపీడితులైన ముముక్షు జనుల చేత ఉపాస్యత్వము, ఆశ్రయణీయత్వము, ప్రార్థనీయత్వము శివునకే సిద్ధమయి యున్నందున శివుడే జగత్కారణుడని ఒప్పవలసియున్నది.

"యదా చర్మవ దాకాశం వేష్టయిష్యంతి మానవాః
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి" శ్వే. ౬-౨౦

యను మంత్రము పఠితమైయున్నది. దీని అభిప్రాయమేమనగ:— సాంసారిక సమస్త దుఃఖ నివృత్తికొరకు పరమాత్మ తత్త్వ జ్ఞానమే అవసరమా? అథవా తత్త్వజ్ఞానము లేకయే దుఃఖాంత్యము గలుగునో? యను సందేహమును నిరాకరించి, తత్త్వజ్ఞానముచేతనే దుఃఖనివారణము కలుగునుకాని, వేరే మార్గము లేదు." యను నిర్ణయమును చేయుటకై ఈ మంత్రము ప్రవర్తింపబడినది. ఈ మంత్రఫలితాంశమేమనగా: "అపరిచ్ఛిన్నమైన ఆకాశముయొక్క సర్వ ప్రదేశాచ్ఛాదనమనునది అనంతకోటికల్పకాలముల నుండియు కానేరని పనియై యెట్లున్నదో, అటులే దేవశబ్దవాచ్యుడయి శివశబ్దప్రతిపాద్యుడయి యున్న పరమాత్మని జ్ఞానములేకయే సంసారదుఃఖనివృత్తి లభించవచ్చు ననుకార్యముకూడ కోటికోటికల్పములనుండి కానేరని పనియైయున్నది. అందువలన సంసార దుఃఖముయొక్క కొనను చూడవలెనన్నవానికి శివతత్త్వ పరిజ్ఞానము ఆవశ్యకమే అయియున్నది." యనునదే ఈ మంత్రఫలితాంశము.



# శివుడే పూజనీయుడు.

విశ్వమునందు అనేకులు శివుడే అధికుడనియు, విష్ణువే అధికుడనియు కలహించుకొనుచు వ్యర్థముగా కోలాహలము కల్పించుచున్నారు. విచారశీలురు ఇట్లు కలహించుకొనక శాస్త్రవిచక్షణచేసి దేవుడెవ్వడని నిశ్చయింతురు. శివుని యొక్క నిశ్చయమునకయి వేదోపనిషత్తులు, పురాణేతిహాసములే ప్రామాణ్యములయినందున అట్టి ప్రామాణ్యములచేతనే దేవుడెవ్వడని సిద్ధము చేయ వలసి యున్నది. అథర్వశిరోపనిషత్తునందు—

"దేవా వై స్వర్గం లోక మగమా స్తే దేవా రుద్ర మపృచ్ఛన్
కో భవా నితి। సో బ్రవీత్ అహమేకః ప్రథమ మాసం వర్తా
మి చ భవిష్యామి చ నాన్యః కశ్చి న్మత్తో వ్యతిరిక్త ఇతి।

పూర్వ మొకప్పుడు ఇంద్రుడు, అగ్ని, వాయువు మున్నగుదేవతలు రుద్రుడు నివసించునట్టి స్వర్గలోకమునుగూర్చి పోయిరి. స్వర్గ మనగా: రుద్రుడు నివసించునట్టి బ్రహ్మలోకము, స్వర్గలోకమును చేరినపిదప ఆ యింద్రాదిదేవతలు నీలలోహితుడును, త్రిలోచనుడును, పినాకపాణియు నగు ఆ చిత్రమయ పురుషుని చూచినవారలయి సర్వదుఃఖనాశకుడును సృష్టి స్థితి లయ కర్తయు నగు ఆ రుద్రుని "నీ వెవ్వడవు" అని యడిగిరి. అందులకు రుద్రుడీవిధముగ సమాధానము చెప్పెను:— స్వయం ప్రకాశ చిదానంద స్వరూపుడను. దేశ కాల వస్తు పరిచ్ఛేద శూన్యుడ నగు నే నొక్కడనే జగదుత్పత్తికంటె ముందు జగదాత్మకముగా నుంటిని; వెనుక ఎప్పుడో ఉండి ఇప్పుడు లేక పోలేదు; ఇప్పుడును ఉన్నాడను; ఇకముందుకూడ ఉండగలను. నావలె మఱొక్కడుండియుండలేదు: ఇప్పుడు లేడు; ఇకమీద నుండబోడు." అని రుద్రుడు సమాధానము చెప్పెను. కనుక రుద్రుడే దేవుడని స్పష్టమగుచున్నది.

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలగళం ప్రశాంతమ్।

ఆ రుద్రనామకుడయిన భగవంతుడు ఈశ్వరుడే యనుటకు కైవల్యోపనిషత్తునందు ఉమాసహాయుడనియు, త్రిలోచనుడనియు, నీలకంఠుడనియు విశేషణాత్మకనామములు వాడబడినందున శివుడే పరమేశ్వరుడని సిద్ధమగుచున్నది.

యః కర్తా సర్వలోకానాం శివ ఏవ భవేత్తు సః॥ కాశీఖండే॥

యని యున్నందున సర్వభూతములకు ఎవడు కర్తయో యనగా ఎవనివలన ఈ చరాచరాత్మక ప్రపంచముయొక్క ఉత్పత్తి, స్థితి, లయ, నిగ్రహానుగ్రహ

ములు గలుగుచున్నవో అతఁడు శివుఁడే యని స్పష్టమగుచున్నది. మరియు

జగామ శరణం దేవం సర్వభావేన శంకరం

సంత్యజ్య తృణవత్సర్వం బ్రహ్మవిష్ణ్వాదికాం స్తథా। కాశీఖండే।

స భావముచే నైనను సుభకసుడయు శివునినే శరణు బొందెను. తృణము మునువలె బ్రహ్మవిష్ణ్వాది సమస్త దేవతలను విడనాడెను. యని చెప్పబడి యున్నందున శివునివిన్న నేను దేవతలు శరణమునకు యోగ్యులు గారనియు, వారి నాశ్రయించిన ఎట్టిఫలమును సిద్ధించ దనియు అవగత మగుచున్నది.

సర్వాన్ దేవాన్ పరిత్యజ్య కిర్మనసా మనసా గిరా

త్వామేవ సాంబా సగుణా భవభావపురస్సరమ్। వాయువ్య సం।

అని యుండుటచేత మనోవాక్కాయకర్మములచేత సమస్తదేవతలను త్యజించి, సాంబమూర్తియో సగుణరూప పరశివునినే పూజింపవలె నని తెలియుచున్నది.

బ్రహ్మేంద్ర విష్ణు సుర దానవ లోకపాలై

ర్దైత్యైశ్చ దివ్యమునిభిః పరిపూజితం త్వామ్

దృష్ట్వాఽపి యస్తు పున రిచ్ఛతి దేవ మన్యం

సంసారినో నరకహేతు రయం విమోహః। మల్హణ స్తుతి।

బ్రహ్మ, ఇంద్ర, విష్ణు, సురలు, దానవులు, ఇతరులు, మునిశ్వరు లందరు నిన్ను పూజించుచుందురు. ఇది చూచియున్నను ఎవఁడు శివేతరదేవుని కోరునో ఆ సంసారికి నరకమే హేతువగును; అతఁడు విమోహితుఁ డనియే తెలియ వలెను. అనగా: శివేతరదేవతలు పూజ్యులు కారనియే యని యర్థము.

సర్వ మిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాః తే సంప్రసూయంతే

సర్వాణి చేంద్రియాణి సహ భూతై ర్న కారణం కారణానాం

ధాతా- ధ్యాతా కారణం తు ధ్యేయః సర్వైశ్వర్యసంపన్నః

సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే। అథర్వశిఖోపనిషత్।

సర్వమును బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాదులు వీనందరు పుట్టువారలు. సకలేంద్రియములును సకలభూతములును పుట్టుచున్నవి. వీనికన్నిటికిని కారణ మగుచు వస్తుమాత్రము పుట్టుటలేదు; అనగా నాశరహితమైనది. ఇట్లు సకలకారణములకును కారణమైనవాఁడును, సకలైశ్వర్యములు గలవాఁడును, సర్వేశ్వరుఁడును, శంభువును, ఆకాశమధ్యమందు (సకలచేతనుల హృదయాకాశమధ్యమందు)

వసించు వాడను, అగు పరమాత్మను ధ్యానింపవలయును. ఆ పరమాత్మ యే ధ్యేయ వస్తువు. అనగా, శంభుడైన శివుడే ధ్యేయుడు గాని, బ్రహ్మాదులు గారని స్పష్ట మగుచున్నది. మఱియు,

" శివ ఏకో ధ్యేయ శ్శివంకరః సర్వమన్య త్పరిత్యజ్య సమాప్తాఽథర్వశిఖా "

తా॥ శివాకరుడైన ( మోక్షము నొసంగు వాడైన ) శివుడే ( శుభ ప్రదుడైన పరమాత్మ యొక్కడే ) సర్వమును పరిత్యజించి ( ఇతరోపాసనం విసర్జించి ) ధ్యానింప దగిన వాడు ఇట్లు అథర్వశిఖోపనిషత్తు సమాప్తమైనది. యని గలదు గనుక శివుడే పూజనీయుడు గాని, ఇతరులుగారు.

ఉమయా సహితో దేవ స్సోమ ఇత్యుచ్యతే బుధైః
సఏవ కారణం నాన్యో విష్ణో రపి వైశ్రుతిః ॥

యని ఆదిత్య పురాణము ౨౮గవ అధ్యాయమునందుకూడ ఉమాసహితుడైన సోమ నామకుడైన శివుడే కారణుడనియు అన్యులుకారణులు గారనియు చెప్పుటయేగాక విష్ణువునకు కూడ శివుడే కారణుడనియు ఇదియే శ్రుతి వచనమనియు స్వీకరింప బడి యున్నందున శివుడే పూజనీయుడు గాని విష్ణువు గాడని తెలియు చున్నది.

బ్రహ్మా విష్ణు నకర్తవ్యం బ్రహ్మణైవచ నైవచ
సతతం పూజయే ద్రుద్రం బ్రహ్మ విష్ణూ పరిత్యజేత్ । కూర్మే ।

బ్రహ్మ విష్ణ్వాదులకు బ్రహ్మత్వము సిద్ధించ నందున వారిని విడచి బ్రాహ్మణుండైన రుద్రునినే పూజింప వలయును.

సర్వ మన్యత్పరిత్యజ్య హేయాన్విష్ణ్వాదికాన్సురాన్
శివ ఏవ సదా ధ్యేయ స్సర్వ సంసార నాశకః ॥

పరశివుడే సంసార నాశకుడుగనుక ఇతర విష్ణ్వాది దేవతలను విడచి ఆశివునినే పూజించ వలయునని పిప్పలాద శ్రుతియందు గలదు.

విష్ణ్వాదయ స్సురగణా శ్శివ స్సంప్రసూతా
స్తత్కారణస్య హి జనిర్నకుతోపి దృష్టా
ధ్యేయ స్సఏవ ఇత్యపరాని షేధ్య
నిర్ధార్య వస్తివమితి ప్రబలా సమాప్తా ।

22 విష్ణు మొదలైన సురగణములు శివ జనితులైనందున మరియు, ఆశివునకు జననము లేనందున ఆతడే (ఆ శివుడే) ధ్యేయుడు. అపరులైన విష్ణ్వా

నలు విడువదగిన వారని సమస్త బుద్ధిమంతులు నిర్ధారణము చేసిరి.

బ్రహ్మా విష్ణ్వాదయో దేవాః ఏకచిద్వ్యణు జంగమాః
ఉమాధవస్య తే సర్వే బాల క్రీడనకాఇవ॥ కాశీఖండే।
నసమస్తైశ్వర్య సంపూర్ణో నామ్నా సర్వేశ్వర స్స్వయం
సర్వై ర్ముముక్షుభిర్ధ్యేయః శంభు రాకాశ మధ్యగః।
సర్వ మన్య త్పరిత్యజ్య శివఏవ శివంకరః
పూజ్యో ధ్యేయశ్చ సర్వేషాం సమాప్తా౽థర్వణే శ్రుతిః। సూతసం

ఈశ్వరుడే ముముక్షువులచేత పూజనీయుడు, అన్యులు పరిత్యజింప దగి వారు. మంగళకరుడైన శివుడే ధ్యాన యోగ్యుడు. ఇదియే యథర్వణ శ్రుతి ప్రమాణమని చెప్పబడి యున్నందున శివుడే పూజనీయుడని సిద్ధమగుచు.

శ్రీమచ్ఛంకరాచార్యులవారు—

సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
నమన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృతఫలం
హరి బ్రహ్మాదీనామపి నికట భాజ మసులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజ భజనం।

జగత్తు నందనేకదేవతలు గలరు. వారు క్షుద్రఫలముల నిత్తురు. వారిని నేను స్వప్నమందును కూడ దలంపను. హరి బ్రహ్మాదులను కూడ సమీపస్థుడై యున్నను సులభ సాధ్యుడు కాని శివునినే నే నెల్లపుడు యాచించు చుందును. యనియు, నిష్పక్షపాత బుద్ధిచేత శివుడే స్మరణీయుడని స్మరించెను.

తస్మాత్సర్వం పరిత్యజ్య చరే దామరణాంతికం
సర్వైర్దేవైరపి సదా భజనీయ స్సదా శ్శివః।
కింపున ర్మానవై స్తుచ్ఛైః కో న్యోస్తి భవతారకః
తస్మాత్సర్వ ప్రయత్నేన పూజయే శ్శర మేశ్వరం॥
తస్మాద్భక్తిం సమాస్థాయ పూజనీయో మహేశ్వరః
ధర్మార్థ కామమోక్షార్థం పూజ్యో ధ్యేయశ్చ మానవః।
శివ స్సర్వ మితిజ్ఞాత్వా శివోహ మితి నిశ్చితం
నాస్తి నాస్తి శివాదన్యః నదేవోస్తి శివాత్పరః॥
సత్యం సత్యం పున స్సత్యం శివాదన్యం నకించన

శివ పాదద్వయం స్పృష్ట్వా వదా మీదం నకించన॥" స్కాందే॥

చరాచర జగత్తంతయు శివమయమే, నేను శివస్వరూపుడనే, శివునికి యన్యమైన దేమియు లేదని నిశ్చయించుకొని శివునికన్న అన్య దేవుడు లేడని శివునియొక్క పాదద్వయ సాక్షిగ సత్యమునే చెప్పు చున్నానని స్కాందమున ఋషులకు బోధించెను. కనుక, సర్వం శివమయం జగత్తనియే తెలియవలెను.

## శివ శక్తి విశిష్టత్వము

సర్వ హృదయ ప్రకాశో భవనక్రియాయా భవతి కర్తా
సైవక్రియా విమర్శః స్వస్థా క్షుభితా చ విశ్వ విస్తారా।

"హృదయ ప్రకాశః" యను పదము ఆత్మ ప్రకాశమను పదమును బోధించును. "ఆత్మ ప్రకాశమను పదము" ప్రకాశ స్వభావము గల "ఆత్మ స్వరూపము" యను అర్థమునందు పర్యవసానము పొందుచున్నది. "సన్-అస్తి త్వంగీకరణీయః" ఆ ఆత్మ ప్రకాశమను పదార్థము (పర శివ బ్రహ్మము) ఉన్నదనియే యంగీకరింప బడును. లేకున్న సంపూర్ణ జగత్తునకు నాస్తిత్వ రూప అంధత్వము ఏర్పడును యని సారస్వత సూత్రమందు గలదు.

ఆ హృదయప్రకాశ మనబడు ఆత్మ స్వరూపము భవనక్రియ కాశ్రయ మైనందుననే కర్త్రు వనబడును. ఆ భవన క్రియయే, బ్రహ్మ స్వరూపము నందు విశ్రాంతి పొంది యున్నపుడు "విమర్శః" యనబడును. ఈ విమర్శ యనునది "అస్మి" యను సద్రూపమై, "ప్రకాశే" యను చిద్రూపమై "నందామి" ఆనంద స్వరూపమై, యుండును. ఇదియే స్వస్థావస్థ యన బడును. ఈ భువనక్రియ యనబడు విమర్శయు నుక్తరూపమైన స్వస్థతను వదిలి "బహుస్యాం ప్రజాయే యేతి" యనుసృష్ట్యాది కార్యో న్ముఖత యను "క్షోభ"ను పొందినచో అప్పుడు "విశ్వ విస్తారా" యను పేరును పొందును. అనగా, విశ్వ శబ్ద వాచ్యమైన విచిత్ర ప్రపంచముయొక్క యాకారమును గలుగ జేసుకొనును. పరశివ బ్రహ్మము నందుగల భవన క్రియాయను విమర్శ శక్తియే యీ విశ్వవిస్తారరూప ప్రపంచమాయను, యని యున్నందున యీ విమర్శ శక్తి పరశివుని నుండి వేరేయని తెలియుట అసంగతము. శివుడు శక్తి విశిష్ట బ్రహ్మమనియే తెలియ వలెను మరియు శ్వేతాశ్వతర శృతియందు,

"పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ।"

ఆ పరశివ బ్రహ్మము యొక్క శక్తియు గొప్పదై యున్నది. నానా విధమైనది. ఆగంతుకముగా స్వాభావిక మైనది. జ్ఞాన క్రియేచ్ఛాదులను శక్తి విశేషములు గలదనియు "పరా, వివిధా, స్వాభావిక, జ్ఞాన, బల క్రియా" యను పదములు ఉక్తమై యున్నందున శక్తి పర శివునియందు స్వతస్సిద్ధ మైనదనియే యవగత మగుచున్నది.

తస్మిన్ కామాః సమాహితాః। శ్రుతిః॥

కామ సంకల్ప ఇచ్ఛా జ్ఞాన క్రియాదు లన్నియు పరమాత్ముని యందు స్వాభావిక ధర్మము లనబడు చున్నవి. ఇట్లు బ్రహ్మ స్వరూపము నకు యనంత శక్తి కలదని సిద్ధ మగుచున్నది.

సత్ చిత్ ఆనంద కామ సంకల్ప ఇచ్ఛా క్రియలలో మొదటి మూటికి యెప్పుడు నిత్యత్వమే యున్నందున, విక్షోభము సంభవించదు. అనగా, యీ మూడు (సత్ - చిత్ - ఆనంద) త్రికాలాబాధితములై నందున, నిత్యమై యేకరూపమై యుండును.

కామ సంకల్ప ఇచ్ఛా క్రియ లనుచు, వానికి విక్షోభము కలుగు చున్నది. అనగ, యివి కాల బాధితములై మార్పును పొందును. ఎప్పుడును యేక రూపముగ నుండవు. బ్రహ్మ స్వరూపము నందు స్పష్ట మనబడుచున్న, కాలము నందు [illegible] పేరును పొంది యుగ్రము మనబడుచున్నది. సృష్ట్యాద్యుపలక్షితమైన విక్షోభమును పొందినపుడు విస్తారపు ప్రపంచరూపమైన పరిణామమును పొందినట్లు మనబడుచున్నవి.

ఉదాహరణము:— వాయువు యొక్క చలనమువలన సముద్రము నందు తరంగ బుద్బుద ఫేనములు పుట్టుచున్నవి. మరియు, వాయువు నందును శాంతమైనంతనే యా తత్కాలిక తరంగ బుద్బుద ఫేనములు పునః యా సముద్రమునందే లయించు చున్నవి. ఈ తరంగాదులు ఉత్పత్తి కాలము నందు సముద్రము నుండి ప్రత్యేక మైనవే గాని, సముద్రమునకు అతిరిక్త మైనవి కావు. అట్లే సృష్ట్యాద్యుపలక్షితమగు గాలియొక్క చలనము చేత పరశివ బ్రహ్మమునందు సంకల్పాత్మకములైన ఇచ్ఛాక్రియాది శక్తులు తత్కాలము నందు నానా యా రూపములచేతను, నామములచేతను, ఉత్పన్నము యున్నాయను

ఆగాలి శాంతమైనంతనే పరశివబ్రహ్మము శాంతమగును. అపుడు ఆశక్తులన్నియు బ్రహ్మమునందు లయమై బ్రహ్మ స్వరూపమునే పొందు చున్నవి. అనగ పరబ్రహ్మ నామరూపములనే పొంది పర బ్రహ్మము గాను అస్తిత్వమునే పొందుచున్నవి. కనుక శక్తులు పర శివ బ్రహ్మము నుండి వేరుగా నుండ నేరవనియే సిద్ధ మగు చున్నది.

మరియు సువర్ణము నుండి కుండలా ద్యాభరణములు పుట్టు చున్నవి. కారణభూతమైన సువర్ణమునకు కార్యభూతములైన కుండలాదులకు నవిభక్తమైన విభాగము లోకానుభవ సిద్ధమై యున్నదో అట్టి విభాగమే భేదమని బడుచున్నది. ఈయను భేద పదార్థము సర్వశైవ సిద్ధాంతమునందు నిరూపింప బడినది. ఘటపటములకు ఆత్యంతిక భేదము కలదు. కాని సువర్ణకుండల ములకు అట్టి ఆత్యంతిక భేదమేర్పడదు. స్వరూపమాత్ర భేదమే గాక వస్తు భేదము గానేరదు. సువర్ణమే కుండలమైనది. కుండలము సువర్ణ మయమే ఐనందున సువర్ణ కుండలములకు వస్తు భేదము గానేరదు. ఇటులే ఇచ్ఛాక్రియాది రూపమైన శక్తి విశేషము వ్యక్తావస్థను పొందినను, బ్రహ్మము నుండియే వెడలి బ్రహ్మస్వరూపము చేతనే తన స్వరూప సత్తాస్థితి ప్రవృత్తులను పొందు చున్నందున బ్రహ్మము యొక్క ప్రాధాన్యతను వ్యక్తి జేయుచున్నది. అనగా శివ శక్తులు భేదముగ గన్పట్టినను శక్తి శివునియందే లయించి యున్నదని ముఖ్యార్థము. ఉత్పత్తి స్థితిలయములు గలది శక్తి యైనందున శివునకివి లేనందున శివునకు ప్రాధాన్యము జెప్పబడినది.

"జాయతే, అస్తి వర్ధతే, పరిణమతే, అపక్షీయతే వినశ్యతి" యను షడ్భావ వికారములు శక్తి స్వరూపమైన ప్రపంచమునకు తప్పునట్టివి కావు. కనుక ప్రపంచము అనిత్యమగును. శివుడు శక్తి విశిష్టుడైనందున శివుడు కూడ అనిత్యుడగును అను శంకగలుగును కాని "ఘటోనశ్యతి" యన్న నాశమను క్రియయు ఘటనిష్ఠమైనది గాదు. ఏలనన? నాశమనునది కాలాధీనమై కారణ సామగ్ర్యాధీనమై యున్నది కనుక ఘటనాశము ఘటమువలన గాదు దీనికి
23 కాలాధీనమైన కారణ సామగ్రులు గావలసి యున్నవి. ఈ కారణ సామగ్రులు కర్మేంద్రియముల సహాయము నపేక్షించు చున్నవి ఆ కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములను, జ్ఞానేంద్రియములు అంతరింద్రియమైన మనస్సును, ఆమ

నన్ను జీవాత్మని సహాయమునకై కోరుచున్నవి. ఆ జీవాత్ముడు దేశ, కాల, కర్మములకు పరతంత్రుడైనందున స్వతంత్రుడు కాడు. నిరంకుశ స్వాతంత్ర్యము గలవాడు ఈశ్వరుడే అయినందున, ఇట్టి స్వాతంత్ర్య ప్రయుక్త నాశక్రియయు ఈశ్వర నిష్ఠమే యైయుండును. కనుక ఈశ్వరునకు అనిత్యత్వము సంభవించదు. ఈశ్వరుడే ప్రకృతి రూపనాశము గావించుచున్నందున తాను నశింపడనియే సిద్ధమగుచున్నది. కార్యభూతమైన కుండలాది వస్తువులు రూపాంతరము పొందినను కారణభూతమైన సువర్ణమునకు మాత్రము నాశము గలుగకుండును. కనుక కారణభూతుడైన పరశివునకు కార్యభూతమైన శక్తియొక్క పరివర్తనములు గలిగినను అనిత్యత్వము సంభవించదు

ఇట్టి శక్తి విశిష్ట వస్తువే జగత్కారణమనియు భావించినచో విశిష్ట వస్తువు కారణమగు కాలమున కారణాంతరము యొక్క సహాయము నపేక్షించక తానే కారణమగునని స్థాపించినచో ఈ వీరశైవ సిద్ధాంతమునందు అద్వైత సిద్ధాంతమునకు ఎట్టి కొరతయు లేకుండును. కనుక వీరశైవులు శక్తివైశిష్ట్యమునే ఒప్పుదురు. ఇందుకు శ్రీపతి పండితులు తమ శ్రీకరభాష్యమునందు

ద్వైతాద్వైతమతే స్పష్టే విశేషాద్వైత సంజ్ఞికే
వీరశైవైక సిద్ధాంతే సర్వశ్రుతి సమన్వయః।

యని వ్రాసియున్నారు. దీనివలన వీరశైవమతము భావాభావాత్మక మైనదని సిద్ధమగుచున్నది. చంద్రకాంత శిలయందు నీరు, సూర్యకాంత శిలయందు అగ్నియు, బీజమునందు అంకురము ఎట్లు స్వాభావికముగా నున్నవో, అట్లే శివునియందు పరశివుడు స్వాభావికుడైయుండును.

ఔష్ణ్యం హుతాశ ఇవ శీతల మాంశుమంతా
శయ్యాసుమార్దవమి వాశ్మసు కర్కశత్వం।

అను ప్రమాణాను సారముగ అగ్నియందు ఉష్ణము, చంద్రునియందు శీతలము పాన్పునందు మృదుత్వము, పాషాణమునందు కర్కశత్వము, స్వభావ సిద్ధమై యున్నట్లు,సచ్చిదానందరూప పరశివ బ్రహ్మమునందు అనాదియైన విమర్శశక్తి కూడ స్వభావ సిద్ధమైయుండును.

“మయూరాండ రసన్యాయ” ము వలె (నెమలిగ్రుడ్డు రసమునందు ముందుదు ఉత్పన్నమగు నెమలియొక్క పాద-పక్షాదులు, నానావిధవర్ణములు

అడగి యున్నట్లు) ఆ విమర్శ శక్తియందు సకల చరాచరాత్మకమైన జగత్తు అడగియున్నది. చరాచర విశ్వాత్మకమైన విమర్శ శక్తియు స్వవిభాగ పరామర్శ దశయందు సత్త్వ-రజో-తమోగుణ రూపమై యున్నది - సత్త్వరజస్తమో గుణముల వైషమ్య (తారతమ్య) ము చేత ఆవిమర్శ శక్తియు శుద్ధ చిద్రూపుడైన-పరశివునియందు భోక్తృ, భోజ్య, ప్రేరకరూపములు గలదై పరిణమించును.

తదీయా పరమాశక్తిః సచ్చిదానంద లక్షణాః
సమస్తలోక నిర్మాణ సమవాయ స్వరూపిణీ।
తదిచ్ఛయాఽభవత్సాక్షాత్ తత్స్వరూపానుకారిణీ।

పరశివ సంబంధినియైన ఆశక్తి సమస్తలోక నిర్మాణమునందు సమవాయ స్వరూపముచే నుండి, అతని ఇచ్ఛానుసారముగ సాక్షాత్ అతని స్వరూపమే ఆగును, యను ప్రమాణానుసారముగ శక్తి పరశివునకు అభిన్నమై యుండి విశ్వోత్పాదన కారణీభూతమై యున్నది

చిదాత్మైవ హిదేవోఽంతః స్థితమిచ్ఛావశాద్బహిః
యోగీవ నిరుపాదాన మర్థజాతం ప్రకాశయేత్।

ఈ లోకమునందు యోగి తన ఇచ్ఛానుసారముగ పదార్థములను ప్రకాశింపచేయునట్లు, పరశివుడు తనయందు అడగియున్న జగత్తును విమర్శ శక్తిచేత ప్రకాశింప చేయును; అను ప్రమాణము చేత చరాచరాత్మకమైన జగత్తు ఆ పర బ్రహ్మమునందు సద్రూపమై యున్నదనియు సిద్ధమై యున్నది. ఇదే విషయము గీతయందు కూడ "నాసతో విద్యతే భావో నాభావో విద్యతేసతః।" యనువాక్యముచేత సమర్థింపబడుచున్నది. దీనిచే చరాచరాత్మకమైన ఈజగత్తు మాయావాదులు చెప్పునట్లు మిథ్యగాక సత్యమనియే సిద్ధాంత మగుచున్నది.

మిథ్యాత్వేఽస్తి నవా, సమస్త జగతాం మానం యదస్త్యేవచేత్
తత్సత్యం యది సంభవేదభి మతాద్వైతస్యహానిస్తతః
మిథ్యాచేద్యది తన్నసిధ్యతి జగన్మిథ్యాత్వమేత త్తథా
సత్యం బ్రహ్మ తదన్యదేతదఖిలం మిథ్యేతి వక్తాజడః॥

యని శివాధిక్యరత్నావళి కారుడు బ్రహ్మ సత్యం జగన్మిథ్యా యనుటకు దోషారోపణము చేయుచున్నాడు. అందువలన నిష్కల బ్రహ్మమే అద్భుతాకారమై పరిణమించినదని తెలియవలెను.

నశివేన వినా శక్తి ర్న దేవ్యాచ వినా శివః
నానయోరంతరం కించి చ్చంద్ర చంద్రికయోరివ॥

కనుక శివుని నుండి శక్తిని శక్తినుండి శివుని వేరుచేయ జాలము చంద్రుని నుండి వెన్నెలను విడదీయ లేనట్లు శివశక్తులకును ఐక్యత్వమే చెప్పవలసివచ్చును దీనిచే పరమేశ్వరుడు సవిశేషుడనియే అవగత మగుచున్నది.

## శివ పురుషత్వము

"పురుషో వై రుద్ర స్తన్మహో నమః" "తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్॥" "పురుషం కృష్ణపింగళం॥" "పురాతనోహం పురుషోహమీశో హిరణ్మయోహం శివరూపమస్మి॥" యని ఇట్లు శ్రుతులందు శివునియొక్క పురుషత్వము ప్రకటింప బడినది.

ఏకైవశక్తిః పరమేశ్వరస్య చతుర్విధా భాతివిని యోగకాలే
భోగే భవానీ పురుషేషు విష్ణుః క్రోధేచ కాళీ సమరేచ దుర్గా॥ రుద్రయా॥
ప్రకృతి స్త్వం పుమాన్ రుద్ర స్త్వయి తద్వీర్య మాహితం
త్వన్నాభి పంకజా జ్జాతః పంచవక్త్రః పితామహః॥ శివ పు॥
శివకేశవ సంభూతం కలయే శాస్త్రిభైరవమ్॥

అని అష్టభైరవస్తుతియందు నారాయణుని యొక్క శివపత్నిత్వము నిస్సందేహముగా ప్రకటింపబడినది.

ప్రకృతి స్త్వం సుర శ్రేష్ఠ పురుషోహం నిసంశయః
త్వన్మయం మన్మయం విశ్వ మవ్యక్త పురుషాత్మకం॥ ఆదిత్యపు॥
పురుషానాము సంపూర్ణః సాంబమూర్తి స్సనాతనః॥
వాసుదేవః పురాశక్తి రితివేదే ప్రపంచితం॥ సూతస॥
వాసుదేవ పురా ప్రకృతిరితి॥ కృష్ణగీత॥
ప్రకృతిః పరమో విష్ణుః పురుషః పరమశ్శివః॥ కూర్మ పు॥

ఇత్యాది పురాణములందు శివునియొక్క పురుషత్వము, విష్ణువు యొక్క స్త్రీత్వము భగవాన్ వ్యాసునిచే నిర్దేశింపబడినది.

శంకరశ్శూల పాణిశ్చ ఖట్వాంగీ విష్ణువల్లభః॥

యని శివునకు విష్ణువల్లభత్వము శివసహస్ర నామావళియందు చెప్పబడినది.

శ్లో॥ బాణస్త్వం వృషభస్త్వ మర్ధ వపుషా భార్యాస్త్వ మార్యా పతేః
ఘోణీత్వం సఖితామృదంగవహతా చేత్యాది రూపం దధౌ
త్వత్పాదే నయనార్పణంచ కృతవాన్ త్వద్దేహ భాగోహరిః
పూజ్యాత్పూజ్యతరస్సవహి నచేత్కోవా తదన్యోధికః॥

ఓ పరమేశ్వరా! శ్రీమహావిష్ణువు త్రిపుర సంహార సమయమున నీకు బాణమయ్యెను. వృషభాకారమును ధరించి వాహనమయ్యెను. అర్ధ శరీరమును ధరించి భార్యయయ్యెను. నీ పాద దర్శనమునకై వరాహ రూపము నొందెను. మోహినీ రూపము దాల్చి సఖిత్వ మొందెను. తాండవ సమయమున మద్దెల నాయించుచు మెలగెను. సహస్ర కమలార్చనము జేయునప్పుడొక్క కమలము తక్కువ కాగా, తన నేత్రమునుదీసి మీ పాదముల నర్పించెను. నీయర్ధాంగి యగుట చేతనే పూజ్యులగు బ్రహ్మాదులకంటె బూజ్యతరుడై ప్రకాశించెను. అతని కంటె శివభక్తులలో నధికుడు లేడని వచింపబడినది. కనుక విష్ణువు గూడ శివభక్తుడని శంకరాచార్యకృత శివానందలహరియందు గలదు.

## శివ సృష్టి.

"ఆత్మవా ఇదమగ్ర ఆసీత్" - "బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్"
"హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే - భూతస్యజాతః పతిరేక ఆసీత్"
"ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ" - "అసావాదిత్యో బ్రహ్మం"
"సదేవ సోమ్యా ఇదమగ్ర ఆసీత్" - "ఏక మేవాద్వితీయం బ్రహ్మ"

ఈ శృతివచనములచే బ్రహ్మ నామకుడైన శివుని వలననే సృష్టి యయ్యెనని అతడే అద్వితీయుడని తెలియును. మరియు ప్రకృతి యొక్క సత్యత్వము సిద్ధించును.

యస్యాజ్ఞయా జగత్ స్రష్టా విరించిః పాలకోహరిః
సంహారకాల రుద్రాఖ్యో నమస్తస్మై పినాకినే। బ్రహ్మోత్తర ఖం।

అపర శివుని వలననే బ్రహ్మ విష్ణు రుద్రులు జన్మించిరి కనుక ఆశివునకే నమస్కారము.

24 మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్॥

మాయయే ప్రకృతి, మాయామయుడే శివుడు - ఈ సమస్త భూతములే ఆశివుని

అవయవములు - అట్టి శివ అవయవములు ఈ జగత్తంతయు నిండి యున్నవి. అనగా ఈజగత్తే శివస్వరూపమని తెలియవలెను.

సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశ మధ్యే ధ్రువం సర్వాధికం। బ్రహ్మ విష్ణ్వాదులు శివునివలన జన్మించిరి కనుక అట్టి పరశివునినే పూజింప వలయును. అన్యులు త్యాజ్యులని అథర్వ శిఖోపనిషత్తునందు బోధింప బడుచున్నది.

యతో వా ఇమాని భూతాని జాయంతే। సర్వమిదం శివ ఏవ విజానీయః
శుద్ధో నిరంజనో విభురద్వయః శివమేకం శివమద్వైతం చతుర్థం
మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః శివోఽద్వైతః॥
ఏకఏవ రుద్రో నద్వితీయాయతస్థే నాసన్నచాసత్
శివ ఏవ కేవలః విశ్వాధికో రుద్రోమహర్షిః॥ ఇతిః।

శివుడే అద్వైతుడు కనుక ఆతడే బ్రహ్మమని అనేక ప్రమాణములు గలవు.

దుర్జ్ఞేయా శాంభవీ మాయా తయా సమ్మోహ్యతే జగత్
మాయాంతు ప్రకృతిం విద్ధి మాయినంతు మహేశ్వరమ్। ౨౭
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్
సత్య జ్ఞానాత్మకోఽనన్తో విభురాత్మా మహేశ్వరః। ౨౮ శివగీత॥

ఆ శాంకరీమాయ యెవరిచేనయిన దెలిసికొన నసాధ్యముకాను అట్టి మాయ చేతనే ఈ జగము మోహింప బడుచున్నది ఆమాయను ప్రకృతిగ నెఱుంగుము, మాయావియగు మహేశ్వరుడని తెలిసికొనుము. మహేశ్వరుడన్ననో సత్య జ్ఞాన స్వరూపుండును, నాశరహితుండును, ప్రభుండును, ఆత్మయు నగును. వాని యవయవ భూతములగు చేతనా చేతనములతో జగత్తు నిండియున్నది.

తతోయే పరిదృశ్యన్తే పదార్థా మద్విభూతయః
మయ్యేవ సకలం జాతం మయిసర్వం ప్రతిష్ఠితమ్॥ ౬-౫౩
మయిసర్వం లయం యాతి తద్బ్రహ్మాఽద్వయమస్మ్యహమ్.

కనబడు పదార్థములన్నియు నా విభూతులే. సర్వము నాయందే పుట్టినది. నాయందే యున్నది. నాయందే లయించును. గాన అద్వితీయ బ్రహ్మమును నేనె యని శ్రీ శంకరుడు రామునకు శివగీతయందు బోధించెను.

మయిసర్వం యథారామ జగదేతచ్చరాచరమ్
వర్తతే తద్దర్శయామి నద్రష్టుం క్షమతే భవాన్॥ శివగీత. ౭-౧౦

శ్రీరామా! ఈ స్థావర జంగమ రూపమగు జగమంతయు నా కుక్షిలో నున్నది. కనుగొనుటకు నీకు సామర్థ్యము చాలదు యని శ్రీశంకరుడు రామునకు దివ్య చక్షువుల నిచ్చి తన దివ్యస్వరూప సందర్శనము గావించెను.

అహమేవాత్మాఽన్తరాత్మా బ్రహ్మజ్యోతిర్య స్మాన్నమత్తోఽన్యః పరః
అహమేవ పరో విశ్వాధికః మామేవ విదిత్వాఽమృతత్వమేతి తరతిశోకమ్॥

" సోహం సర్వాకారః - యతోవా ఇమాని భూతాని జాతాని జాయంతే- యేన జాతాని జీవంతి - యత్ ప్రయంత్యభి సంవిశంతి - తం మామేవం విదిత్వోపాసీత"

" సోఽహం పృథివీ - సోఽహ మాపః - సోఽహం తేజః - సోఽహం వాయుః - సోఽహం కాలః - సోఽహం దిశః - సోఽహమాత్మా- మయిసర్వం ప్రతిష్ఠితం - బ్రహ్మవిదాప్నోతి పరం - బ్రహ్మ శివోమేఽస్తు సదాశివోం- అచక్షుర్విశ్వతశ్చక్షురకర్ణో విశ్వతః కర్ణోఽపాదో విశ్వతః పాదోఽపాణిర్విశ్వతః పాణిరహమశిరా విశ్వతః శిరా విద్యామాత్రైక సూత్రయో విద్యారూపో- విద్యామయో - విశ్వోవిశ్వోఽహమజరోఽహం - మామేవం విదిత్వా సంసారపాశాత్ ప్రముచ్యతే" భస్మజాబాలోప నిషత్.

తా॥ భగవాన్ మహాదేవుడు భుసుండ మహాఋషితో చెప్పుచున్నాడు: ఓ భుసుండా! నేను సమస్త భూతములయొక్క అంతరాత్మను, స్వయం ప్రకాశసాక్షిని నాకన్న అన్యమైన వస్తువు వేరేలేదు నేనే సంసారమునాదు సారమును, ఏవం అన్నిటికన్న ఉత్కృష్ట వస్తువును. నాయొక్క స్వరూపము తెలిసికొనే విద్వాంసులను అమృతరూప బ్రహ్మముయొక్క ఆత్మ స్వరూపముతో ఆవిర్భాగము గలుగుచున్నది. మరియు మృత్యురూప సంసారముయొక్క సమస్త దుఃఖములనుండి విముక్తి గలుగును

నేనే సంసారమునందు సర్వరూపములతో ప్రతీతుడనౌదును. నావలననే ఆకాశాది సమగ్ర భూతప్రాణి ఉత్పన్న మవుచున్నవి. నా సత్తా వలననే తమ జీవనముల ధరించుదురు మరియు అంత్యమునందు నాయొక్క స్వరూపము నందె లయమగుదురు. ఈ ప్రకారము నీవు నా సర్వవ్యాపక స్వరూపమును తెలిసి స్వాత్మ రూపముతో ధ్యానించుము"

నేనే సర్వం సహాపృథివిని, నేనే జీవనప్రదమైన జలమును, నేనే ప్రకాశమయమైన అగ్నిని, నేనే పావనకర్తయైన పవనుఁడను, నేనే సర్వ సంహారకుడైన మృత్యు దేవతను, నేనే దశదిశలను, నేనే ఆత్మను, నాయందే ఈ సర్వ దృశ్య సమగ్ర సంసారము కల్పిత రూపముచే వర్తమానమై యున్నది. బ్రహ్మ స్వరూపమును తెలిసి విద్వాంసుఁడు బ్రహ్మనే ప్రాప్తించుకొనును. నేనే బ్రహ్మను. సదాశివ ఏవం ఓంకారుఁడను, వస్తుతః నిర్గుణ నిరాకార స్వరూపుఁడను నాకు చక్షు, కర్ణ, పాద, హస్త, శిరాదులు లేకున్నను. మాయారూప ఉపాధి వలన అసంఖ్య విచిత్రచక్షు కర్ణ, పాద, హస్త, శిరాదులు గలవాఁడనగుదును. బ్రహ్మ విద్యారూపమైన "ఓం నమశ్శివాయ" యను మంత్రమునందే నా నివాసము. ఈ మంత్రరూప మందిరమునందే నా ఉపలబ్ధి యగును నేనే విశ్వేశ్వరుఁడను, అజుఁడను, అమరుఁడను మరియు మంత్రరూప విన్యాసముఁడను, నా సాక్షాత్కారముచేతనే అధికారి గణములు నిఖిల సంసార బాధలనుండి ముక్తులగుదురు

అస్తి సచ్చిత్సుఖాకార మలక్షణ పదాస్పదం
నిర్వికల్పం నిరాకారం నిరస్తాశేష విప్లవం ౩
పరిచ్ఛేద కథాశూన్యం ప్రపంచాతీత వైభవం
ప్రత్యక్షాది ప్రమాణానా మగోచర పదేస్థితం । ౪
స్వప్రకాశ విరాజంత మనామయ మనౌపమం
సర్వజ్ఞం సర్వగం శాంతం సర్వశక్తి నిరంకుశం । ౫
తత్తేన మహసా సర్వం చేతనా చేతనం జగత్
స్వాత్మరూపేణ జగతామస్య స్వప్రకాశ్యం తదస్మృతం॥ ౬

సృష్టికి పూర్వమునందు సచ్చిదానంద మయమై, తెలియరాని ఉనికిపట్టుగలదై నిర్వికల్ప, నిరాకార, నిరస్త విప్లవము గలదై, ప్రపంచము యొక్క వైభవము నుండి దూరమై, ప్రత్యక్షాది ప్రమాణములకు అగోచరమై, "అత్రాయం పురుషస్స్వయం జ్యోతిః తమేవ భాన్త మనుభాతి సర్వం" యను శ్రుతివచనాను సారము జ్యోతిస్స్వరూప మైనందున స్వప్రకాశమై, జనన మరణాది రోగములు లేనిదై, ఉపమాతీతము, సర్వజ్ఞత్వము, సర్వవ్యాపకత్వము, రాగ ద్వేషాది రహితము, సకల నియామకత్వము, సర్వనిగ్రహానుగ్రహ సామర్థ్యములచే యుక్తమై శివ, రుద్ర, మహాదేవ, భవ ఇత్యాది నామములు గలదై,

స్వజాతీయ విజాతీయ స్వగతభేద రహితమై, నిర్దేశింప నసాధ్యమై శాశ్వతమై యున్న "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" యను శృతిచే సిద్ధమైన పరబ్రహ్మ మొక్కటే సర్వత్ర వ్యాపించి యుండెను.

"సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" అను శృతివచనాను సారము పూర్వోక్త శక్తి సమేత శివాభిద పరబ్రహ్మము నందు చరాచరాత్మక మైన జగత్తు సృష్టి కన్నను ముందే జ్ఞానకర్మేంద్రియములను గోచరము గాకుండ అడగి యుండెను.

శ్లో॥ శివాభిదం పరబ్రహ్మ జగన్నిర్మాతు మిచ్ఛయా
స్వరూప మాదదే కించి త్స్వస్య స్ఫూర్తి విజృంభితం। ౮
నిరస్త దోష సంబంధ నిరుపాధిక మవ్యయం
దివ్య మప్రాకృతం నిత్యం నీలకంఠం త్రిలోచనం। ౯
చంద్రార్ధ శేఖరం శుద్ధం శుద్ధస్ఫటిక సన్నిభం
శుద్ధముక్తా ఫలాభాస ముపాస్యం గుణమూర్తిభిః। ౧౦

శివుడను పేరుగల ఆపరబ్రహ్మము జగత్తును సృష్టించవలెనను ఇచ్ఛగలదై, ఆనంద బాహుళ్యముచేత ఉబ్బి ఒక ఆకారము గలదాయెను. ఆ స్వరూప మెట్టిదనగా దోషరహితమైనది. ఉపాధి రహితమైనది అవ్యయమైనది. దివ్య స్వరూపముగలది. ప్రకృతి జన్యముగానిది. శాశ్వతమైనది. నీలకంఠము గలది. మూడుకన్నులు గలది. చంద్రఖండమే శిరోభూషముగా గలది. పవిత్రమైనది. నిర్మల స్ఫటిక తుల్యమైనది. శుద్ధముత్యముల కాంతివంటి కాంతిగలది. బ్రహ్మ విష్ణు రుద్రులను త్రిగుణవిశిష్ట దేవతలచే ఉపాసింప బడునది మరియు నిర్మల జ్ఞానమను చక్షురాది ఇంద్రియములు గలది సర్వయోగులచే గోచరింపదగినది ప్రకృతి సంబంధమైన సర్వజ్ఞత్వాద్యనంత కల్యాణ గుణాశ్రయము గలది. ఘటనాఘటనాద్యనంత మహత్త్వాశ్రయ మైనది. ఇట్టి విచిత్ర స్వరూపము చేత స్వశక్తియైన పరాశక్తిచే కూడికొనియున్న ఉమామహేశ్వర స్వరూపమును ధరించెను.

శ్లో॥ సశంభుర్భగవాన్ దేవ స్సర్వజ్ఞ స్సర్వశక్తిమాన్
25 జగత్సిసృక్షుః ప్రథమం బ్రహ్మాణం సర్వదేహినాం। ౧౪
కర్తారం సర్వలోకానాం విదధే విశ్వనాయకః
తస్మై ప్రథమ పుత్రాయ శంకరశ్శక్తి మాన్విభుః। ౧౫

సర్వజ్ఞ స్సకలావిద్యా న్సానుగ్రహముపాదిశత్
ప్రాప్తవిద్యో మహాదేవాత్ బ్రహ్మా విశ్వ నియామకాత్॥ ౧౬
సమస్తలోకాన్నిర్మాతుం సముద్యమ పరోఽభవత్
కృతోద్యోగోపి నిర్మాణే జగతాం శంకరాజ్ఞయా। ౧౭

“సవీక్షత లోకాన్సృజత యథాపూర్వ మకల్పయత్” యను శ్రుతి వచనాను సారము అశివశక్తి స్వరూపుడైన పరమేశ్వరుడు జగత్ సృష్టి జేయవలయునను ఇచ్ఛగలవాడై ౧౪ లోకముల సృష్టికన్న మొదలే బ్రహ్మను సకల ప్రాణులకు స్వామిగా నిర్మించెను.

“విశ్వాధికో రుద్రో మహర్షి ర్హిరణ్య గర్భం జనయామాస
పూర్వం సనోఽబుద్ధ్యా శుభయా స్మృత్యా సంయునక్తు”

యను యజుర్వేద వచనముకూడ ఇదే అర్థమును జెప్పుచున్నది. సర్వశక్తి సమన్వితుడై, సర్వ వ్యాపియై, సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు అతని ప్రథమ పుత్రుడయిన బ్రహ్మకు అనుగ్రహ పూర్వముగా వేదాది సకల శాస్త్రములు ఉపదేశించెను.

“యోబ్రహ్మాణం విదధాతిపూర్వం-యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై” యను శ్వేతాశ్వతరోపనిషద్వచనము ఇదే అర్థమును జెప్పుచున్నది. జగన్నియామకుడయిన ఆ పరశివునిచేత సకల విద్యలను పొంది బ్రహ్మ సకలలోకములను సృష్టింప ప్రయత్నించెను, గాని మాయాబద్ధుడై యున్నందున జగన్నిర్మాణము జేయ నసమర్థుడాయెను. అందువలన పరశివుని గురించి అనేక విధముల ప్రార్థింప దొడగెను.

తస్యైవ ప్రార్థితస్స్వయంభు ర్బ్రహ్మణా విశ్వయోనినా
ససర్జాత్మసమప్రఖ్యాన్ సర్వగాన్ సర్వశక్తికాన్॥ ౨౭
ప్రజ్ఞోర్జ పరమానంద సంవాహిత మానసాన్
ప్రమథాన్ విశ్వనిర్మాణ ప్రళయాపాదన క్షమాన్॥ ౨౮

విశ్వయోని యగు జగన్నిర్మాణమునకు నిమిత్తుడైన బ్రహ్మచేత ప్రార్థితుడై పరమేశ్వరుడు తనకు సమానమైన తేజస్సు గలవారిని, సర్వవ్యాపకులను, సర్వసమర్థులను, ఉత్కృష్ట జ్ఞానానందముతో నిండిన మనస్సు గలవారిని జగన్నిర్మాణ ప్రలయముల జేయ సమర్థులైన ప్రమథులను సృజించెను. ఈ శివసృష్టిని జూచి బ్రహ్మకూడ సృష్టి

ప్రారంభము జేసెను. అది బ్రహ్మసృష్టి యనబడు చున్నది. ఈ సిద్ధాంత శిఖా మణిమతానుసారమే కూర్మ పురాణముకూడ ఇట్టిసృష్టిక్రమమునే జెప్పుచున్నది.

ఏక ఏవ శివస్సాక్షాత్సత్య జ్ఞానాది లక్షణః
వికార రహితః శుద్ధః స్వశక్త్యా పంచధాస్థితః॥ ౧౩

వికార రహితుడు, శుద్ధుడు మరియు సచ్చిదానందుడైన పరశివుడొక్కడే సాక్షాత్ తనశక్తివలన ఐదు విధములాయెననియు, సృష్టికార్యము శివుని వలననే ఐనదనియు సూతసంహిత జ్ఞానయోగ ఖండమునందు గలదు.

"ఏనేదం పంచవిధం సర్వం॥" అథర్వశిరోపనిషత్,

ఆశివుని వలననే ఈ పంచ భూతాత్మకమైన ప్రపంచ మాయను అని గలదు. మరియు ఆ పరశివునియొక్క పంచముఖములనుండియే పంచభూతము లుత్పన్న మైనవని బ్రహ్మజాబాలోప నిషత్తునందు చెప్పబడినది.

సద్యోజాతాత్పృథివీ, వామదేవా దుదకమితి, అఘోరా ద్వహ్నిరితి, తత్పురుషాద్వాయురితి, ఈశానా దాకాశమితి॥

సద్యోజాత ముఖమునుండి పృధివియు. వామదేవ ముఖము నుండి జలము, అఘోర ముఖమునుండి అగ్నియు, తత్పురుష ముఖమునుండి వాయువు, ఈశాన ముఖమునుండి ఆకాశము, ఇట్లు పంచముఖముల నుండి పంచభూతములు పంచభూతాధిపతులుత్పన్నమయ్యెనని వాతూలాగమము జెప్పుచున్నది.

## శివగణోత్పత్తి

ఆదా వ్యోమ్ని స్థితో భాతి సాక్షాద్దేవః సదాశివః
సదాశివాదీశ్వరో భూత్సం భూతః పవనేస్థితః॥
ఈశ్వరాదభూద్రుద్రో వహ్నితత్వే వ్యవస్థితః
విష్ణుతత్వో దితో బ్రహ్మా పృథ్వీతత్వే వ్యవస్థితః॥
ఏవం పరాశక్తి జాతాపి విశ్వరూపాః పంచమూర్తయః॥ వాతూలే॥

ఆకాశమునకు - అనాది పరశివుడు అధిపతి. వాయువునకు - సదాశివుడు అధిపతి. అగ్నికి - రుద్రుడు అధిపతి. జలమునకు - విష్ణువు అధిపతి. పృథ్వికి - బ్రహ్మ అధిపతి.

పరశివుని రెండవ స్వరూపుడైన సదాశివుడే పంచముఖుడు, దశభుజ

త్రినేత్రములు గలవాడు. అతనికే సాకారమూర్తి యనియు, సగుణ బ్రహ్మ మనియు, సదాశివుడనియు, మూలమూర్తియనియు, మహాదేవుడనియు, వేద వేద్యుడనియు, పంచవింశతి లీలామూర్తియనియు, పంచకృత్యాదీశ్వరుడనియు మాహేశ్వరుడనియు, అనేకపర్యాయనామములు గలవు. ఇందుకు ప్రమాణము.

శ్లో॥ ఘృతకాఠిన్య వన్మూర్తిః సచ్చిదానంద లక్షణః
మూలమూర్తిర్మహాదేవో వేదవేద్యః సదాశివః
ఆదికర్తా జగన్నాథ శ్శూలపాణి రితీర్యతే ॥

ఈ సదాశివునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యము లను ఐదు ముఖములు. వీటిలో మొదటి నాలుగు నల్దిక్కులందును, ఈశాన్య ముఖము ఊర్ధ్వమునందు గలదు.

సద్యోజాతాద్బ్రాహ్మణా స్సంబభూవుః
వామదేవాత్ క్షత్రియా విశశ్చాఘోరా చ్చూద్రా
స్తత్పురుషాత్ శివస్య పంచాత్మకస్య గణా ఈశాన్యతస్స్యుః॥

సద్యోజాత ముఖమునుండి బ్రాహ్మణులు, వామదేవ ముఖమునుండి క్షత్రి యులు, అఘోర ముఖమునుండి వైశ్యులును, తత్పురుష ముఖము నుండి శూద్రులును, ఈశాన్య ముఖమునుండి ప్రమథ గణము లుద్భవించిరని సిద్ధాంత శిఖోపనిషత్తు నందు గలదు.

లింగధారణోపనిషత్తునందు కూడ "పంచమో లింగధారకః" యని చెప్పబడి యున్నందున ఈశాన్య ముఖమునుండి అత్యాశ్రములైన లింగ ధారులు పుట్టిరనియే తెలియు చున్నది.

ఈశాన ముఖసంజాతా వీరశైవా మహాజనః
వీర నందీ తథా భృంగీ, వృషభ స్కంద ఏవచ।

ఈశాన్య ముఖోద్భవులైన వీర, నంది, భృంగి, వృషభ, స్కంద యను ఐదు గురే గణాచార్యులు. వీరే ప్రథమ వీరశైవ మతస్థులు. మహాతేజస్సంపన్నులు యని పాశుపత తంత్రమునందు గలదు.

కనుక అట్టి వీర నంది భృంగి వృషభ స్కందయను పంచగణముల వంశ ములందుపుట్టిన లింగాంగులకు అత్యాశ్రమత్వము గలిగి యున్నందున ఆజన్మాంత దీక్ష విధింప బడి యున్నది అనగా ఈశాన్య ముఖము నుండి యుద్భవించిన

గణముల వంశపరంపరయే లింగాంగులని (వీరశైవులని) స్పష్టమగు చున్నది.

అత్యాశ్రమిత్వాత్ గణవంశజానాం లింగాంగసంగినాం తత్రాజన్మాంత
దీక్షా యథాగంగా శివసంగా త్తథైవ వసూతకంవా నాప్యశుచిత్వమేషాం॥

యను సిద్ధాంత శిఖోపనిషత్ప్రమాణము పైయర్థమును స్పష్టీకరించు చున్నది.

మద్జ్ఞానమేవ నందిస్స్యాద్భృంగి వైరాగ్య మేవచ
ప్రతాపో వీరభద్రస్స్యా త్సద్ధర్మో వృషభస్స్మృతః॥ ౧
కీర్తిస్స్కంద ఇతిప్రోక్తం పంచైతే మత్స్వరూపిణః
నందీ భృంగీ తథావీరో వృషభస్కంద ఏవచ। ౨
మత్స్వరూపా స్సముత్పన్నాః పంచగోత్రాది కారిణః
రేణుకో దారుకశ్శంఖుః కర్ణశ్చధేనుకర్ణకః। 3
విశ్వకర్ణశ్చ పంచైతే పంచగోత్ర సముద్భవాః
ఏతేషాం పంచనామాని యుగభేదేన సర్వశః॥ సుప్రభేదాగమే. ౪

శివునియొక్క జ్ఞానమే నందియైనది వైరాగ్యమే భృంగియైనది. ప్రతాపమే వీరభద్రుడాయెను. సద్ధర్మమే వృషభుడు. కీర్తియే స్కందుడాయెను. ఈ ఐదుగురిని ఈశ్వరునియొక్క స్వరూపులనియే తలంప వలెను. నంది, భృంగి, వీర, వృషభ, స్కందయను ఈ ఐదుగురే గోత్రాధి కారులు అనగా వీరి గోత్రములే గణ వంశజులైన లింగాంగులకు జెల్లును. వీరి గోత్రోద్భవులే పంచాచార్యులు. అనగా రేణుక, దారుక, శంఖుకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణ యను పంచాచార్యులు ఈ పంచ గోత్రీయుల నుండియే పుట్టియున్నారు లేక ఈ పంచగోత్రముల నుద్ధరించుటకే పుట్టినారు యన్నను సరిపోవును. ఈ పంచాచార్యులు వేరువేరు యుగములందు వేరువేరు నామములతో ప్రసిద్ధిజెందిరి. యని సుప్రభేదాగమ మతము.

కృత యుగమునందు ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, పంచాక్షరులనియు, త్రేతాయుగమునందు ఏకముఖ, ద్విముఖ, త్రిముఖ, చతుర్ముఖ, పంచముఖులనియు, ద్వాపరమునందు రేణుక, దారుక, ఘంటాకర్ణ, ధేనుకర్ణ, విశ్వకర్ణులనియు, కలియుగమునందు రేవణారాధ్య, మరుళారాధ్య, ఏకో
26 రామారాధ్య, పండితారాధ్య, విశ్వారాధ్యులనియు పంచాచార్యుల నామములు గలవు. శంకరుడు సృష్టి నిర్మించు కాలమునందు పంచాచార్యులను

పంచవక్త్రీ గణాధీశ్వరులను నిర్మించెనని సుప్రభేదాగమమునందు విస్తారముగ వ్రాయబడినది. వీరే వీరశైవ తత్వములను జగత్తునందు స్థాపించి లింగధారణ, షట్స్థల, అష్టావరణ, పంచా చారములను ప్రచారము జేసిరి.

## శివ వందే పశుపతిం.

శివం పశుపతిం వందే పశుపాశ విలక్షణం

యస్య విజ్ఞాన మాత్రేణ పాశముక్తా హిజంతవః।

ఏ మహానుభావుని యనుగ్రహాము గలిగినంతనే జంతువులు మోహ్రత్తాడునుండివిడి పింప బడినట్లుల జీవకోటి పాశముల నుండి విడిపింపబడునో అట్టి పశుపాశ విలక్షణుడగు పశుపతిని నమస్కరించెదను.

పశువనగా జీవుడు. ఈ బ్రహ్మాండములందు జీవములను పాశముతో గట్టివేసినవాడు పశుపతి. ఆ పశుపాశ విముక్తికొరకు తదధిపతియగు శివుని సేవించవలెను. ఆత్మను వేరుగా దలంచి పాశవిముక్తికై ప్రయత్నించి జీవుడు పతియనుగ్రహామున మోక్షము నొందు చున్నాడు. భోక్తను, భోగ్యమునను, ప్రేరకునికి యెంతభేదము గలదో అంతటి భేదము పతికిని, పశువునకు, పాశము నకు, గలదు. నువ్వులందు నూనె, పెరుగు నందు నెయ్యి, అరణియందు అగ్ని మొదలు వ్యాపించి యున్నదో అట్టులనే యీ జగత్తునందు పతి వ్యాపించి యున్నాడు. కావుననే శృతులయందు ఈశ్వరుని యొక్క అస్తిత్వము తేట తెల్లముగా నిరూపింప బడినది.

> ఏకఏవరుద్రో న ద్వితీయాయ తస్థే - య ఇమాన్ లోకానీశత ఈశనీభిః - ఇదగ్ం సర్వమసృజత - విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖోవిశ్వతో హ స్తి ఉత విశ్వత స్పాత్ - సం బాహుభ్యాం నమతి సం పతత్రై ర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః।

రుద్రుడొక్కడే గలడు. రెండవ వాడు లేడు. ఆతడే ఈసర్వ ప్రపంచమును సృష్టించెను. ఆతడే సర్వమును చూచుచు, నెల్లరికి సహాయము జేయుచు, ఊర్ధ్వాది సప్త లోకముల సృజించి సర్వజ్ఞుడై యున్నాడు. కావున ఈశ్వరుడున్నాడనియే చెప్ప వలయును. ఈప్రపంచము కార్యము. దీని సృజించిన వాడీశ్వరుడు. కార్యమైన ఈజగత్తుబట్టి కారణమైన పరమేశ్వరుడూహింప బడును. జగత్కర్త యగు నీశపతియే బ్రహ్మ మొదలు పిపీలికా పర్యంతము మాల

మాయాది పాశములచే కట్టివేసి స్వకార్యముల జేయు చున్నాడు.

చతుర్విం శతి తత్త్వాని మాయాకర్మ గుణా అపి
విషయా ఇతి కథ్యంతే పాశా జీవ నిబంధనాః ॥
బ్రహ్మాది స్తంబ పర్యంతాన్ పశూన్ బధ్వా మహేశ్వరః
పాశైః పశుపతిర్దేవః కార్యం కారయతి స్వయం
మలమాయాదిభిః పాశైః సంబద్ధాంశ్చ పశూన్ పతిః
సఏవ మోచకస్తేషాం భక్త్యా సమ్యగుపాసితః ॥
బ్రహ్మాద్యాః స్థావరాంతాశ్చ దేవదేవస్య శూలినః
పశవోహి ద్విజశ్రేష్ఠ తస్యాజ్ఞావశవర్తినః ॥ వాయవీయ॥

మాయాకర్మ గుణములు ఇరువదినాలుగు తత్త్వములు విషయములని వచింప బడును. ఇవియే జీవునిబంధించు పాశములు బ్రహ్మమొదలు స్థావరములవరకు నుండు పశువులను మలమాయాది పాశములచే బంధించి యాయా పనుల జేయించుచు సర్వేశ్వరుడుండును. భక్తితో నుపాసించు పశువులను మెడత్రాడు నుండి యాతడే కరుణాళుడై విడిపించును. బ్రహ్మ మొదలుకొని స్థావరముల వరకును శివాజ్ఞావశము నందున్నవి. అవి పశువులని చెప్పబడు చున్నవి.

బ్రహ్మాది స్తంబ పర్యంతాః పశవః పరికీర్తితాః
తేషాం పతిత్వా ద్విశ్వేశః శివః పశుపతి స్స్మృతః॥

బ్రహ్మ మొదలు స్థావరములవరకు నుండునవి పశువులనియు వాటికి నధిపతి యగుటచే విశ్వేశ్వరుడు పశుపతియనియు నుడువబడునని స్కాందమునగలదు. సర్వజీవులను నియమించువాడు పశుపతియని శృతిప్రమాణముకూడ గలదు.

విశ్వస్య జగతః కర్తా పశోరస్య పరశ్శివః
తమేవ పరమం జ్ఞాత్వా మృత్యుపాశా ద్విముచ్యతే॥
యథాసమస్తం నదివా నరాత్రి ర్నసదప్యసత్
కేవలం శివ ఏవైకో యతః ప్రజ్ఞా పురాతనా॥
నైనమూర్ధ్వం నతిర్యచ్చ నమధ్యో పరిచాగ్రహీత్
నతస్య ప్రతిమా చాస్తి తస్యనామా మమధ్యగః॥
ఏకోదేవ స్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వ భూతాంత రాత్మా
సర్వాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా నిర్గుణః కేవలశ్చ॥

అతశ్చ సంక్షేప మిదం శృణుధ్వం శివః పరస్తాత్ప్రకృతేశ్చపుంసః
ససర్గ కాలేచ కరోతిసర్వం సంహారకాలే పునరాదదాతి॥

షట్త్రింశ త్తత్త్వములతో గూడినవాడు పశువు. పశువునకంటె నతీతుఁడు పశుపతి జగత్కర్తయగు పరశివుడతడే. పరాత్పరుఁడగు నాతని దెలిసి కొనుట వలన ప్రాణులు మృత్యుపాశమునుండి విముక్తులగుచున్నారు. శివుడు తమస్సు కంటె నతీతుఁడు. సదసత్స్వరూపుఁడు. అతనికి దివారాత్రులు లేవు. అతనికి సదృశు డెచ్చటనులేఁడు ఆపరమేశ్వరు డొక్కడే సర్వభూతాంతర వాసియై నిర్గుణుడై కేవలుడై చైతన్యసాక్షియై ప్రకాశించు చున్నాఁడు. అతడే పతియనఁ బడును. ఇంతయేల? సంక్షేపముగా వచింతును. ప్రకృతికంటె భిన్నుఁడగు నాశివుండు నీసర్వమును సృష్టికాలమున సృష్టించును. సంహారకాలమున సంహరించును అతడే పతియనఁబడును. ఈ యనేక ప్రమాణములు మరియు,

"పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతం।"

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి"

ఇత్యాది వాక్యములు కూడ శివునియొక్క పతిత్వమును స్పష్టపరచుచున్నవి.

బ్రహ్మాద్యాః స్థావరాంతాశ్చ దేవదేవస్య శూలినః। ౬౦
పశవః పరికీర్త్యంతే సంసార పరివర్తినః

తేషాం పతిత్వాద్దేవేశి హ్యహం పశుపతిస్స్మృతః। ౬౧
మలమాయాదిభిః పాశై ర్బధ్నాతి సపశూన్ పతిః

సఏవ మోచకస్తేషాం భక్త్యా సమ్య గుపాసితః। ౬౨
చతుర్వింశతి తత్త్వాని మాయాకర్మ గుణాఅపి

విషయాఇతి కథ్యంతే పాశాజీవ నిబంధనాత్॥ ౬౩
బ్రహ్మాది స్తంభ పర్యంతాన్ పశూన్బధ్వా మహేశ్వరి

పాశైరేతైః పతిశ్చాహం కార్యం కారయతి స్వకం। ౬౪
ఇంద్రియాణ్యాపి తస్యైవ మవాజ్ఞావశగాని తు

కారయంతి నరం కార్యం వశంచ స్వేచ్ఛయా పశూన్॥ ౬౫
తస్మాత్ పశుపతిం మాంతు జ్ఞాత్వాలింగార్చకః శివె

ఛిత్వాపాశా నవిక్లిష్టాన్ పరం నిర్వాణముచ్యతే॥ ౬౬
భుక్తిముక్తి ప్రదోదేవి పశుత్వ వినివర్తకః

పూజనీయ సదాచారం యథాశ్రాద్ధం యథావిధిః। ౬౭
యః కుర్యాదాంతికీం దీక్షామాదేహాంతమనాకులః
వీరశైవం ప్రకుర్వీత సవై నైష్ఠిక ఉచ్యతే। పారమేశ్వరాగమే।

తా॥ బ్రహ్మాదిదేవతలు, యక్షోరగాదులు, మానవులు, పశుపక్ష్యాదులు క్రిమికీటకాదులు మరి స్థావరాదులన్నియు సంసారమునందు పరివర్తన గలవి యైయుండున పశువులనబడు చున్నవి. వీటికన్నిటికి దేవదేవుడైన పరమ శివుడే పతియైయుండున అతడు పశుపతి యనబడుచున్నాడు. అతడు మలమాయాదులను పాశములచేత పశువులను బంధించును. మరియు భక్తిచేత పూజించు వారిని బంధమునుండి వదలించి ముక్తులజేయును. పంచభూతములు, పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ తన్మాత్రలు, చతురంతః కరణములు ఇవియే చతుర్వింశతి తత్వములు. ఇవియే మాయాకర్మ గుణములు, లేక విషయములనబడు చున్నవి. వీటిచేతనే పశువులు బాధింపబడుచున్నవి. కనుక వీటిని పాశములనెదరు. ఈ పాశముల చేతనే అణువు బంధితు లగుదురు మరియు ఈ పాశనివృత్తియే మోక్షమైయుండున ఈ అవిద్యవలన గలుగుచున్న పాశములను శివజ్ఞాన శివార్చనముల వలన ఛేదించి నిర్వాణపదమను ముక్తిని పొందవలెను. శివుడు భోగమోక్షముల నిచ్చువాడు కనుక అతనిని యథాశక్తి యథాభక్తి పూజించవలెను. ఇదియే వీరశైవుల యొక్క నైష్ఠికమని శివుడు పార్వతికి బోధించి తనపతిత్వమును వెల్లడి జేసియున్నాడు.

## శివస్తుతి

యజుర్వేదమునందు భగవాన్ శివుని యొక్క వైదిక ప్రార్థన.

(౧) నమః శంభవాయ చ మయోభవాయ చ నమః శంకరాయ చ
మయస్కరాయ చ నమః శివాయ చ శివతరాయ చ॥

(౨) నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చవో నమో నమో భవాయ చ రుద్రాయ చ
నమః శర్వాయ చ పశుపతయే చ నమో నీలగ్రీవాయ చ శితికంఠాయ చ।

(3) నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః సహస్రాక్షాయ చ శతధన్వనేచ
నమోగిరిశయాయ చ శిపివిష్టాయచ నమోమీఢుష్టమాయచేషుమతేచ॥

27

(౪) త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఉర్వారుకమివ బంధనాన్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

(౫) వామదేవాయనమో జ్యేష్ఠాయనమః శ్రేష్ఠాయనమో రుద్రాయ నమః కాలాయనమః కలవికరణాయనమో బలవికరణాయనమః॥

(౬) బలాయ నమో బలప్రమథనాయ నమః సర్వ భూత దమనాయ నమో మనోన్మనాయ నమః ॥

(౭) ఈశానః సర్వవిద్యానామీశ్వరః సర్వ భూతానామ్ ॥
బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోం ॥

౧ సుఖము నుత్పన్నము చేయు వాడును, సుఖమును భావించువాడును, లౌకిక పారమార్థికములగు నుభయ సుఖముల ప్రదానించు వాడును, కళ్యాణ స్వరూపుడును, నిష్కల్మషుడు నగు శివునకు నమస్కారము.

౨ శ్వాసములు మొదలుకొని శ్వాసపాలకుల దనుక ప్రతిబింబింప చేసిన మూర్తి గలవాడును, సుఖ నాశకుడును, పాప విధ్వంసకుడును, అజ్ఞులనైన రక్షించు వాడును, కంఠమునందొక చోట నీలవర్ణము గలవాడును, సుభ్రకాయుడు నగు శివునకు నమస్కారము: నమస్కారము:

౩ కపర్దమను జటను ధరించిన వాడును, అర్ధ ముండిత శిరస్కుడును, ముండియును, వేయి కన్నుల సామియును, నూరు విల్లుల బట్టిన వాడును, కైలాస వాసియును, వామార్ధ భాగమున విష్ణుమూర్తిని ధరించిన వాడును, మేఘము వలె నభీష్టముల ననేకముగ గ్రుమ్మరించు వాడును, ధనుర్ధారియై శత్రులతాలవిత్రుడును నగు శివునకు నమస్కారము.

౪ త్రినేత్రుడును, సువాసన గలవాడును, బలవర్ధనుడును నగు శివుని భజించి, తొడిమనుండి పండువలె, మృత్యు బాధము నుండి వీడి మోక్షమును పొందుదము గాక!

౫ దేవతలలో నందరికి నెరవు బుట్టించు వాడును, సర్వ జ్యేష్ఠుడును, సర్వ శ్రేష్ఠుడును, సర్వాధారుడును, వివిధజగత్కారణములను, రాక్షసబలమును నశింప చేయు వాడును నగు శివునకు నమస్కారము

౬ సకల శక్తి మాతుడును, బలము చేత వివిధ శక్తి సంహారకుడును, సకల భూత దమనుడును, సర్వజ్ఞమగు ఉత్కృష్టమైన మనస్సు గలవాడును, అగు శివునకు నమస్కారము.

౪ సర్వవిద్యల నియామకుడును, సర్వభూతముల నాయకుడును, బ్రహ్మ విద్యాపాలకుడును, బ్రహ్మకధిపతియునగు శివుడు, నిరంతరము నన్ననుగ్రహించు గాక! నేనా శివుడనుగా మారుదును గాక.

ఇక పురాణేతిహాసములందు గూడ కీర్తింప బడిన
శివస్తుతి ఉదహరింప బడును.

విష్ణు ఇంద్రాది దేవతలు, శంబరాది దైత్యులు, గలిసి మంధరాచలమును కవ్వముగను, వాసుకిని రజ్జువుగను, జేసి క్షీరసముద్ర మథనమును తీవ్రముగా జేయుటచే మత్స్య మకర కచ్ఛప సర్పతిమి గజ గ్రాహాది జంతువులు అత్యంత వ్యాకులములాయెను. అప్పుడు సముద్రము నుండి హాలాహలమనెడి ఉగ్రమైన విషముత్పన్నమయ్యెనంత:-

తదుగ్రవేగం దిశిదిశ్యుపర్యధో విసర్పదుత్సర్పదసహ్యమప్రతి
భీతాః ప్రజా దుద్రువురంగ సేశ్వరా అరక్ష్యమాణాః శరణం సదా శివమ్॥

సమస్త దిశలందును, పైన క్రింద వ్యాపించు చున్న, అత్యుగ్ర వేగము గల అసహ్య అనుపమ హాలాహలవిషము నుండి రక్షించు వారు ఎవరును లేక భయ భీతులై దేవదానవులు తమ నాయకుల వెంబడించు కొని కైలాస వాసుడైన భగవాన్ శ్రీసదాశివుని శరణు పొందిరి. అప్పుడు దేవతలందరి పక్షమున బ్రహ్మ శ్రీసదాశివుని యిట్లు ప్రార్థించెను

దేవ దేవ మహాదేవ భూతాత్మన్ భూత భావన
త్రాహి నః శరణాపన్నాం త్రైలోక్య దహనాద్విషాత్ ॥ ౨౧

త్వమేకః సర్వజగతః ఈశ్వరో బంధ మోక్షయోః
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తి హరం గురుమ్। ౨౨

గుణమయ్యా స్వశక్త్యాఽస్య సర్గస్థిత్యప్యయాన్విభో
ధత్సే యదా స్వదృగ్భూమన్ బ్రహ్మవిష్ణు శివాభిదామ్। ౨౩

త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావ భావనః
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః ॥ ౨౪

దేవదేవా! మహాదేవా! నీవు స్థావరజంగమాత్మక విశ్వమునకంతరాత్మవు మేము నీశరణు పొందితిమి. ఈహాలాహల విష బాధ నుండి రక్షింపుము. నీవొక్కడవే ఈజగత్తునకీశ్వరుడవు. శరణాగత రక్షకుడవు. చరాచర జగమునకు గురుడవు.

ఇందు చేతనే బుద్ధిమంతులు నిన్ను విశుద్ధ ప్రేమచే పూజింతురు ఓ స్వయం ప్రకాశ వ్యాపక స్వరూప భగవంతుడా! త్రిగుణాత్మికమగు మాయా శక్తి చేత జగత్సృష్టిసంహారములను నీవుచేయు నప్పుడు బ్రహ్మ, విష్ణువు, శివుడు అను నామములను ధరింతువు. నీవే పరబ్రహ్మము యొక్క గూఢ తత్త్వము. సత్ అసత్ (మూర్త-అమూర్త) పదార్థముల కారణుడవు. నానా శక్తులచేత గూడి యుండు వాడవు సమస్త జగదాత్మవు: మరియు జగదీశ్వరుడవు నీవె.

త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా ప్రాణేంద్రియ ద్రవ్య గుణ స్వభావః
కాలక్రతుస్సత్యమృతం చ ధర్మః త్వయ్యక్షరం యత్త్రివిధామనంతి। ౨౬

శంకరా! నీవె వేదాది సకల శాస్త్ర జన్మస్థానము. జగత్తునకునీవె ఆదికారణము. చరాచర విశ్వమునకాత్మవు. ప్రాణేంద్రియద్రవ్యగుణాది పదార్థములు నీయొక్క-స్వరూపములే. నీవె కాలరూపుడవు సత్యఋత ధర్మ స్వరూపుడవు. మరియు వేదముల సారభూతమైన ఓంకారము నీవేయై యున్నావు.

అగ్నిర్ముఖం తేఽఖిల దేవతాత్మా క్షితిం విదుర్లోక భవాంఘ్రి పంకజం
కాలం గతిం తేఽఖిల దేవతాత్మన్ దిశశ్చ కర్ణౌ రసనం జలేశం। ౨౭
నాభిర్నభస్తే శ్వసనం నభస్వాన్ సూర్యశ్చ చక్షూంషి జలం చ రేతః
పరాపరాత్మా శ్రయణం తవాత్మా సోమోమనో ద్యౌర్భగవన్ శిరస్తే।
కుక్షిః సముద్రా గిరయోఽస్థిసంఘాః రోమాణి సర్వౌషధి వీరుధస్తే
ఛందాంసి సాక్షాత్తవ సప్తధాతవః త్రయీమయాత్మన్ హృదయం సర్వధర్మః॥

భగవంతుడా!సదాశివా! బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతలు నీఅంశమాత్రములే. అగ్నియే నీముఖము. నివాస భూతమైన పృథివియే నీచరణ కమలము. అఖిల దేవ రూప ప్రసిద్ధ కాలమే నీగతియు. ఈదశదిశలే నీకర్ణములు. వర్ణ దేవతయే నీజిహ్వ. ఆకాశమే నీనాభి. వాయువేనీశ్వాసము. సూర్యుడే నీకన్ను. జలమే నీవీర్యము నీనిర్గుణ నిరాకార ఆత్మయే జీవేశ్వరుల అధిష్ఠానము. చంద్రుడే నీమనస్సు. స్వర్గలోకమే నీశిరస్సు. సప్తసముద్రములే నీఉదరము. పర్వత సమూహమే నీ అస్థిపంజరము. ఓషధులే నీరోమములు. వేదత్రయరూపపరమేశ్వరా! గాయత్ర్యాది ఛందస్సులే నీసప్తధాతువులు. సంపూర్ణ ధర్మమే నీ హృదయము.

ఏతత్పరం ప్రపశ్యామో నపరం తే మహేశ్వర
మృడనాయ హి లోకస్య వ్యక్తిస్తేఽవ్యక్త కర్మణః॥

మహేశ్వర! నిన్ను మించిన దేవుడొక్కడైన లేడు. కేవలము జగత్కా-
ల్యాణమునకు వస్తుతః అవ్యక్త నిర్గుణ నిరాకారుడవైన యున్నను, వ్యక్తసగుణ
సాకారుడవైన గురువువు; అని ఈ ప్రకారము శివస్తుతి జేయగా, శివుడు ప్రత్య
క్షమై వారి రక్షణార్థము హాలాహలమును కంఠమందుంచు కొనియెనని శ్రీమ
ద్భాగవత అష్టమ స్కంధము నందుకూడ శివమహిమ కీర్తింప బడినది

శ్రీమహాభారతానుశాసన పర్వమునందు శ్రీకృష్ణుడుశివారాధన జేయుట.

లీలామాత్రుడైన భగవాన్ శ్రీకృష్ణునకు అష్టభార్యలు గలరు. వారిలో
జాంబవతియను భార్యకు పుత్రసంతానము గలుగనందున కృష్ణుని ప్రార్థించు
కొనెను. అందుకు కృష్ణుడు పుత్రసంతానము బడయుటకై గరుడ వాహనా
రూఢుడై హిమాలయ పర్వతమునకు వెళ్లి ఒక ఆశ్రమమునందు దిగెను. అక్కడ
అనేకమంది మునులు తపస్సు జేయుచుండిరి.

శ్రీకృష్ణుడుకూడ మహాఋషి ఉపమన్యునివలన శివదీక్షను పొంది తపస్సు
చేసెను. దండము మరియు మేఖలము ధరించెను. చేతియందు కుశ ధరించెను.
ముండనము చేసికొనెను. మరియు శివలింగ స్థాపనము జేసుకొని దానిని షోడ
శోపచారములచే పూజించుచు ఘోరమైన తపస్సు చేయుచుండెను. ప్రారంభ
మునందు శ్రీకృష్ణుడు ఒక మాసము వరకు కేవలము ఫలములే భక్షించెను.
రెండవ మాసమునందు కేవలము జలముపై యుండి, మూడవ నాలగవ
ఐదవ మాసమునందు కేవలము వాయుభక్షణముచే తపస్సు జేసెను. పైకి
చేయునెత్తి - ఒక కాలుపై నిలుచుండి ఆరు నెలల వరకు "నమఃశివాయ"
యను పంచాక్షరీ మంత్రమును ఏకాగ్రచిత్తముతో జపించెను. తుదకు శివుడు
సాక్షాత్కరించెను శ్రీకృష్ణుడు నిమీలిత లోచనుడై ఇట్లుశివస్తుతి గావించెను.

నమోస్తుతే శాశ్వత! సర్వయోనే! బ్రహ్మాధిపంత్వామృషయో వదంతి
తపశ్చ సత్త్వంచ రజస్తమశ్చ త్వామేవ సత్యంచ వదంతి సంతః॥ ౧
త్వంవై బ్రహ్మాచ రుద్రశ్చ వరుణోగ్నిర్మనుర్భవః
ధాతా త్వష్టా విధాతాచ త్వంప్రభుః సర్వతోముఖః॥ ౨
త్వత్తో జాతాని భూతాని స్థావరాణి చరాణిచ
28
త్వయా సృష్టమిదం కృత్స్నం త్రైలోక్యం సచరాచరం॥ 3
యానీంద్రియాణీహమనశ్చకృత్స్నం యోవాయవః సప్త తథైవచాగ్నయః

యేదేవసంస్థాస్తవ దేవతాశ్చ తస్మాత్ పరం త్వామృషయో వదంతి॥ ౮
వేదాశ్చయజ్ఞాః సోమశ్చ దక్షిణాపావకోహవిః
యజ్ఞోపగంచ యత్కించిత్ భగవాన్ స్తదసంశయమ్॥ ౯

ఓ శాశ్వతుడా! ఓ సర్వ కారణుడా! ఓ ప్రభో! నీకు నమస్కారము. ఋషి సత్తములు నిన్నే బ్రహ్మాది దేవతల యొక్క స్వామివందురు నిన్నే విద్వాంసులు తమ, సత్వ, రజ. తమ సత్వ రూపుడ వందురు, అనగా నీవే ఏకమాత్ర సర్వమయు, సర్వాభిన్న, సర్వాత్మవు. నీవు బ్రహ్మవు. రుద్రుడవు. వరుణ, అగ్ని, మను, శంకర, ధాతా, త్వష్టా విధాతా ప్రభువునీవే. ఏలనన నీవే సర్వగతుడవు. సర్వాధిష్ఠానుడవు. నీవలననే స్థావర జంగమ భూత ప్రాణులు ఉత్పన్నమయినవి. నీవే ఈ చరాచరత్రిలోకమును రచించితివి. నీవే ఇంద్రియ, మన, వాయు, అగ్ని, దేవతాది సమస్త సంసారము కన్న సర్వోత్కృష్టుడవు ఇట్లు ఋషులు వచింతురు. నీవే వేద, యజ్ఞ, సోమ, దక్షిణ, పావక, హవ్యాది సమస్త యజ్ఞము యొక్క ఉపకరణము యని ఇట్లు శ్రీకృష్ణుడు అనేక శ్లోకములచే స్తోత్రము చేసెను. అప్పుడు శంకరుడు ప్రసన్నుడై శ్రీకృష్ణునకనేక వరదానములతో సహా సహస్ర పుత్రులనొసంగెను. ఇటులే శ్రీకృష్ణుడు రుక్మిణి కొరకు కూడ శివునారాధించి అష్టపుత్రుల వరదానము శివుని వలన బడసెనని మహా శివపురాణ జ్ఞాన సంహిత యందుకూడ ఇట్టి కథా వర్ణన గలదు. అతడు పూజించిన ఓత్వేశ్వరలింగము సుధామ పురివద్ద బర్డాపర్వతముపై యిప్పటికి గలదు.

నాస్తి శర్వసమోదేవో నాస్తి శర్వ సమాగతిః
నాస్తిశర్వసమోదానే నాస్తిశర్వ సమోరణే॥

మహా భారతమునందు మునివరుడైన వ్యాస భగవానుడు శివుని సమానము ఏ దేవుడు లేడు అతడే సంసార జీవులకు సద్గతి నివ్వగలడు. కల్యాణము మరియు సుఖము నిచ్చుటయందు శివునికన్న మించిన దయాళుడు లేడు. మరియు యుద్ధము నందు శివసమాన పరాక్రమముగల పురుషుడు లేడు. యని చెప్పి శివాధిక్యమును చాటించెను.

పద్మపురాణాంతర్గత శివగీత యందు భగవాన్ శంకరుని గురించి
శ్రీరాములవారి భక్తి

శ్రీ రామచంద్రుడు తన ప్రేయసియైన సీతను లంకాధి పతియైన రావణుడు

హరించుకొనిపోవ తనప్రియురాలి విరహ దుఃఖము చేత దివారాత్రులు ఆహార విహారంబులుమాని అతిదుఃఖిత స్వాంతుడై తమ్మునితోడ ప్రాణములు విడువ సమకట్టెను. అట్టిసమయమునందు అగస్త్యమునీంద్రుడు రాముని సన్నిధికేతెంచి ఈ సంసారముకొరకై మానవులు వగవరాదని బోధించెను. ఈపాంచభౌతిక దేహమే మారుచుండును గాని సచ్చిదానంద స్వరూపమగు నాత్మకు చావు పుట్టుకలులేవు మరియు దుఃఖము గలుగదు. కనుక ఆత్మ స్వరూపుండైన పరమాత్ముని గురించి తపస్సుజేసిన తదనుగ్రహమువలన పాశుపతాస్త్రమును పొంది దుష్టరావణుని సంహరింప గలుగుదువని బోధించెను.

శ్రీ అగస్త్య మునిచంద్రుని వాక్సుధారస పానముచే తృప్తుడై రామగిరి యందు గోదావరీ తీరమున శివలింగమును స్థాపించుకొని యథావిధి దీక్షను గొని భూతిభూషిత సర్వాంగుడై రుద్రాక్షా భరణాలంకృతుడై వనపుష్పములచే శివుని పూజించుచు శివనామ సహస్రమును జపించ నారంభించెను. ఒక మాసము ఫలహారము చేతను, ఒకమాసము పర్ణాశనముచేతను, ఒకమాసము జలాహారము చేతను, మఱియొక మాసము పవనాశనము చేతను, శాంతో దాంతుడై మహేశ్వరుని షోడశోప చారములచే పూజించెను. అంతట రాముడు యొకనాడు ప్రళయకాల మహార్ణవ ధ్వని బోలియు సముద్ర మథన కాలమున వెడలినతీవ్రారారావము మాడ్కియు, త్రిపుర సంహార కాలమున రుద్రబాణాగ్ని స్వనమువలె భయంకరమగు శబ్దము వినబడ సంభ్రాంతుడై ఆ మహాతేజస్సుచే కన్నులు గానరానివాడై ఒక్క క్షణకాలము మిక్కిలిమోహమునొందెను. తర్వాతను మోకాళ్లనూదుచు మేదిని శరణుడై భయార్తుడై కనులు మూసుకొని శంకరుడే రక్షకుడని యెంచి పెద్ద యెలుంగున శివ సహస్రనామంబుల జపించెను. అంత కోటిసూర్య ప్రకాశ వంతుడయిన సచ్చిదానంద స్వరూపుడును పురుషశ్రేష్ఠుడును నగు మహాదేవుని దర్శించెను.

ప్రణమంతం తతో రామ ముత్థాప్య వృషభధ్వజః
అనినామ రథం దివ్యం ప్రహృష్టే నాంతరాత్మనా॥

బద్ధాంజలియై నమస్కరించు చున్న శ్రీరాముని శివుడు పైకిలేవనెత్తి రథముపై జేర్చుకొనియెను. మరియు అతని తపస్సునకు మెచ్చి ఇష్టార్థపూర్తికై పాశుపతాస్త్రము నిచ్చెను.

అథ దివ్యం ధను స్తస్మైదదౌ తూణీరమక్షయమ్.
మహాపాశుపతం నామ దివ్య మస్త్రం దదౌతతః॥

అనంతరము శ్రీరాములు శివునియొక్క విశ్వరూపమును జూడ గోరినందున శివుడు అనుగ్రహ పూరితుడై స్థావర జంగమ రూపమగు జగమంతయు తన కుక్షిలో గలిగిన దివ్యరూపమును జూపెను.

విద్యుత్కోటి ప్రతీకాశ మతిభీమం భయావహమ్
తద్దృష్ట్వైవ భయాద్రామో జానుభ్యామవనీంగతః॥

అట్టి కోటిమెఱుపు లొకసారి మెఱసినటుల తళుక్కుమని భయంకరమై పాతాళ గుహను బోలిన తననోరు తెఱచిచూపించ రాముడు నిలువలేక భయాక్రాంతుడై మోకాలిపై వ్రాలి దండప్రణామాబు లాచరించుచు పలుభంగుల స్తోత్రము జేయ నారంభించెను.

దేవ! ప్రపన్నార్తిహర! ప్రసీద ప్రసీద విశ్వేశ్వర! విశ్వవంద్య!
ప్రసీద గంగాధర! చంద్రమౌళే! మాంత్రాహి సంసార భయాదనాథమ్।
త్వత్తోహిజాతం జగదేతదీశ! త్వయ్యేవ భూతాని వసంతి నిత్యమ్
త్వయ్యేవశంభో విలయంప్రయాంతిభూమౌయథా వృక్షలతాదయోఽపి॥
బ్రహ్మేంద్రరుద్రాశ్చ మరుద్గణాశ్చ గంధర్వయక్షాసురసిద్ధసంఘాః
గంగాదినద్యో వరుణాలయాశ్చ వసంతి శూలిం స్తవవక్త్రమధ్యే॥
నమస్సచ్చిదాబోధి హంసాయ తుభ్యం
నమః కాలకంఠాయ కాలాత్మకాయ,
నమస్తే సమస్తాఘ సంహారకర్త్రే
నమస్తే మృషాచిత్త వృత్త్యేక భోక్త్రే॥

ఇటుల స్తోత్రముజేసి బద్ధాంజలియై యుండ శివుడు తన నిజరూపమును దాల్చి శ్రీరామునకు ఉపాసనావిధులు మోక్షయోగము, భక్తియోగము పూజా విధానము మరియు జపలక్షణము మొదలైనవన్నియు బోధించి అంతర్ధానుడాయెను.

లింగ పురాణమందు వర్ణింప బడిన పరమ శైవుడైన విష్ణు మూర్తి.
ఒకానొక సమయమున దానవులతి క్రూరులై చరించుచుండ దేవతలు పీడితులై విష్ణుమూర్తిని శరణు బొందిరి. విష్ణుభగవానుడు వారి కరుణాక్రందము విని అభయప్రదుడైన శ్రీమహాదేవునారాధించి దానవ సంహార కార్యమునకు దగిన

శస్త్రముల పొంద గోరి, తన సుఖ శయన స్థానమగు క్షీరసాగరము నొదిలి కైలాస పర్వత సమీపమున హరీశ్వర నామక జ్యోతిర్లింగమును స్థాపించి, మహాదేవుని పూజ మానస సరోవర కమలములతో విధిపూర్వకముగా జేయ దొడగెను. శివనామసహస్రముపఠించుచు, నామమునకొక కమలము చొప్పున ప్రతినిత్యము సహస్ర కమలములతో పూజించు చుండెను. ఇట్లు జరుగు చుండ ఒకదినమందు మహాదేవుడు పరీక్షింప దలచి కమల మొకటి తక్కువ జేసెను. విష్ణుమూర్తి పూజాసమయమున కమలము తక్కువగుటను చాలచింతించి దివ్య దృష్టిచే యంతటగలయ జూచెను; కాని కమలమెచ్చటను గానరాలేదు. అప్పుడు వ్రతభంగమగునని తననేత్రరూప కమలమును శివచరణములందు సమర్పించెను

పుష్పదంతాచార్యులు మహిమ్నస్తోత్రమునందీ విషయము నతి సుందరముగా ఇట్లు వర్ణించెను.

హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయో
ర్యదేకోనే తస్మిన్ నిజముదహరన్ నేత్ర కమలం
గతో భక్త్యుద్రేకః పరిణతిమసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర జాగర్తి జగతాం ।

ఇట్టి భక్తి వలన శ్రీసదాశివుడు ప్రత్యక్షమై, వాంఛితార్థముల వేడుకొనుమనగా విష్ణుమూర్తి యిట్లు స్తుతించెను.

ఏకాక్షరాయ రుద్రాయ అకారాయాత్మ రూపిణే
అకారాయాది దేవాయ విద్యా దేహాయ వై నమః । ౧
తృతీయాయ మకారాయ శివాయ పరమాత్మనే
సూర్యాగ్ని సోమవర్ణాయ యజమానాయవై నమః ॥ ౨
అగ్నయే రుద్రరూపాయ రుద్రాణాం పతయే నమః
శివాయ శివమంత్రాయ సద్యోజాతాయ వేధసే ॥ 3
వామాయ వామదేవాయ వరదాయామృతాయ తే
అఘోరాయాతి ఘోరాయ సద్యోజాతాయ రంహసే ౪
మోక్షాయ మోక్షరూపాయ మోక్షకర్త్రే నమో నమః
ఆత్మనే ఋషయే తుభ్యం స్వామినే విష్ణవే నమః ॥ లింగపు। అ. ౫

హే భగవన్! దైత్య బాధలను దేవతలోర్వలేక నన్ను శరణాగతులైరి. కావున

దానవ సంహారము కొరకు నీయనుగ్రహమును కోరుచున్నా ననగా శివు డాతని కరుణా జనక వచనములచే ప్రసన్నుడై తన తేజోమయమైన సుదర్శన చక్రము ననుగ్రహించగా విష్ణుమూర్తి శత్రుసంహారమతి సులభముగా గావించి చక్రధరు డని ప్రసిద్ధికెక్కెను.

## వ్యాసుని శివస్తోత్రము.

ఆనియందు వ్యాసమహర్షి విష్ణుభక్తుడై యుండి విష్ణువే సర్వ దేవోత్తముడని చాటుచు కాశీక్షేత్రమునకు బోయి, విశ్వనాథ దేవాలయమునందుకూడ "నదేవః కేశవాత్పరః" యని విష్ణువు యొక్క ఆధిక్యమును ప్రశంసించగా తక్షణమే నందికేశ్వరునిచే హస్తములు స్తంభింప జేయబడి అసాధారణ దుఃఖము ననుభ వించెను. అప్పుడు శ్రీమహావిష్ణువు వ్యాసునకీరీతి బోధించెను.

ఏక ఏవహి విశ్వేశో ద్వితీయో నాస్తి కశ్చన । ౪౯
తత్ప్రసాదాదహం చక్రీ లక్ష్మీశ స్తత్ప్రభావతః
త్రైలోక్య రక్షా సామర్థ్యం దత్తం తేనైవ శంభునా । ౫౦
తద్భక్త్యాపరమైశ్వర్యం మయాలబ్ధం వరాత్తతః
ఇదానీంస్తుహితం శంభుం యది మే శుభమిచ్ఛసి । కాశీఖండే. ౫౧.

ఓ వ్యాసా! సమస్త దేవతలలో విశ్వనాథుడే ముఖ్యుడు. అతని కన్న ముఖ్యు లెవరును లేరు. విశ్వనాథుని ప్రసాదము చేతనే నేను చక్రపాణిని, లక్ష్మీపతిని, త్రిలోక రక్షకుడ నైతిని, మరియు విశ్వనాథుని యందసాధారణ భక్తినుంచి యే పరమైశ్వర్యమును పొందితిని నీవు నాశుభమును కోరువాడవేని విశ్వనా థునే పూజించు మని యాజ్ఞాపించగా వ్యాసుడు గర్వము వీడి—

ఏకో రుద్రో నద్వితీయో యతస్త
ద్బ్రహ్మైవైకం నేహ నానాస్తి కించిత్
యద్వ్యత్యయః కోఽపివా కుత్రచిద్వా
వ్యాచష్టాం తద్వ్యస్య శక్తిర్మదగ్రే ॥ ౫౩
యః క్షీరాబ్ధేర్మంథనాఘాత జాతో
జ్వాలామాలీ కాలకూటోఽతి భీమః
తం సోఢుం వా కోఽపరోఽభూన్మహేశా
ద్యజ్జ్వాలాభిః కృష్ణతామాప విష్ణుః ॥ ౫౪

యద్బాణోఽభూచ్ఛ్రీపతిర్యస్య యంతా
లోకేశో యత్స్యందనం భూః సమస్తా
వాహా వేదా యస్యవై దృష్టి పాతా
దగ్ధా గ్రామాస్త్రి పురా స్తత్సమః కః ॥ ౫౧

యః కందర్పో వీక్ష్యమాణః సమానం
దేవైరన్యైర్భస్మ జాతః స్వయం హి
పాపైర్బాణైః సర్వ విశ్వైక జేతా
కోవా స్తుత్యః కామ జేతు స్తతోఽన్యః ॥ ౫౨

యం వై వేదో వేద నో నైవ విష్ణు
ర్నోవా వేధా నో మనో నైవ వాణీ
తం దేవేశం మాదృశః కోఽల్ప మేధా
యాథాత్మ్యదైవేత్త్యహో విశ్వనాథం॥ ౫౩

యస్మిన్ సర్వం యస్తు సర్వత్ర సర్వో
యోవై కర్తా యోఽవితా యోపహర్తా
నో యస్యాదిర్యః సమస్తాధి రేకో
నో యస్యాంతో యోఽంత కృత్తం నతోఽస్మి ॥ ౫౪

యస్యైకాఖ్యా వాజిమేధేన తుల్యా
యస్యానత్యాచైక యాఽల్పేంద్ర లక్ష్మీః
యస్య స్తుత్యా లభ్యతే సత్యలోకో
తస్యార్చాతో మోక్షలక్ష్మీరదూరా॥ ౫౫

నాన్యం దేవం వేద్మ్యహం శ్రీమహేశా
నాన్యం దేవంస్తౌమి శంభోఋతేఽహం
నాన్యం దేవం వా నమామి త్రినేత్రాత్
సత్యం సత్యం సత్యమేతన్మృషా న॥ ౫౬ కాశీఖండము అ. ౯౫

ఈ రీతి వ్యాసుడనితర సాధారణ భక్తిచే విశ్వనాథు భజించి, బాహు బంధము నుండి ముక్తుడై, శివనింద వలన ప్రాప్తమైన దోష పరిహారము కొరకు గంగా నదీ తీరమున శోభించు చున్న ఘంటాకర్ణ శివాచార్యుని పుణ్యాశ్రమము నందు నిజనామమున వ్యాసేశ్వరలింగమును స్థాపించి ధన్యుడయ్యెను.

పారాశర్య స్తదారభ్య శంభు భక్తి పరోఽభవత్
లింగం వ్యాసేశ్వరం స్థాప్య ఘంటాకర్ణ హ్రదాగ్రతః ॥ ౬౮
విభూతి భూషణో నిత్యం నిత్యం రుద్రాక్ష భూషణః
రుద్రసూక్త పరో నిత్యం నిత్యం లింగార్చకోఽభవత్ ॥ ౬౯

ఈ వాక్యముల సత్యత్వము కాశియందిప్పటికి జూడ నగును. ఏమన? ఘంటాకర్ణ శివాచార్యుల శిలావిగ్రహము, వ్యాసేశ్వరలింగమిప్పటి కన్పట్టు చున్నవి. ఈ ప్రకారము ఋషులనేకులు వీరశైవ దీక్షనుపొంది తమతమ పేరిట కాశి యందు లింగముల స్థాపించి పూజించిరట్లు తెలియు చున్నది. అగస్త్యేశ్వర, గౌతమేశ్వర, కశ్యపేశ్వర, కపిలేశ్వర, మార్కండేశ్వర, వశిష్ఠేశ్వర, విశ్వామిత్రేశ్వర, యను ఋషిస్థాపిత శివలింగములనేకములు కాశియందు శివసర్వాధిక్యతను వేనోళ్ల చాటు చున్నవి.

స్రష్టా త్వం సర్వ జగతాం రక్షితా సర్వ దేహినాం
హర్తా చ సర్వ భూతానాం త్వాం వినైవాఽస్తి కోఽపరః ।
అమరా దానవా దైత్యాః సిద్ధవిద్యాధరా నరాః
ప్రాణినః పక్షిణః శైలాః శిఖరోఽపి త్వమేవ హి ।

నీవె చరాచరాత్మక జగత్తును సృష్టించువాడవు. సమస్తదేహధారులను రక్షించు వాడవు. మరియు సర్వ భూతములను సంహరించు వాడవు. నిన్ను మించిన వాడెవ్వడును లేడు. అమరులు, దానవులు, దైత్యులు, సిద్ధులు, విద్యాధరులు, నరులు, పక్షులు, పర్వతములు, మొదలైనవన్నియు నీవే యై యున్నావని శ్రీవిష్ణుమూర్తియు తన శ్రీముఖమున నుండి భగవాన్ శంకరుని విభూతి వర్ణన గావించెను.

కావున దేవ దానవ మానవులకెల్లరకు పరశివుడే పూజార్హుడనియు, మోక్షప్రదాత యనియు, వేదాగమ పురాణేతిహాసములు ఘంటా ఘోషగా నిరూపించు చున్నవి.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి యందు శివతత్త్వమను
మూడవ ప్రకరణము సమాప్తము.

---

ఓమ్

శ్రీశివాయ నమః

# శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి

# లింగతత్త్వము.

నాల్గవ ప్రకరణము.

జ్వాలమాలా వృతాంగాయ జ్వలన స్తంభరూపిణే
నమశ్శివాయ శాంతాయ బ్రహ్మణే లింగరూపిణే ।
యదేకమవ్యక్తమనంతమీడ్యం విభుం స్వయం నిష్కలమద్వితీయం
గురుస్వరూపేణ సుఖప్రదం తన్నిరంజనం లింగమహం నమామి ।

ఏది యొకటి యైనను నేత్రములకగోచరమై మితిలేనిదై యున్నదో, ఏది స్తోత్రయోగ్యమైనదో, ఏది సర్వదిశలందు నిండి కలాతీతమైనదియో, ఏది గురుస్వరూపముచేత సుఖము నిచ్చునదియో, అట్టినిరంజన లింగమునకు నమస్కరించెదను.

## లింగ శబ్దార్థము

లీయతే యత్ర భూతాని నిర్గచ్ఛంతి యతః పునః
తేన లింగం పరం వ్యోమ నిష్కలః పరమః శివః । సూత సం ।

ఉత్పత్తిస్థితిలయముల కారణభూతమైన లింగమే పరబ్రహ్మమనియు, మరియు శివుడే లింగస్వరూపుడనియు జెప్ప బడినది.

సర్వస్య చరాచరాత్మకస్య ప్రపంచస్య యల్లింగం ప్రభవలీనస్థానం ।
లీయతేస్మిన్నంతకాలే జగత్సర్వం సృష్టికాలే బహిర్గచ్ఛతీతిలింగమ్ ।

"జన్మాద్యస్యయతః" అను సూత్రమునకు శ్రీపండితారాధ్యులు తన భాష్యమునందు చరాచరాత్మక ప్రపంచము యొక్క ఉత్పత్తి స్థితి లయములకు లింగమే స్థానభూతమని వ్రాసి యున్నారు.

లీనం ప్రపంచ రూపాహి సర్వమేతచ్చరాచరం
సర్వాదాగమ్యతే భూయ స్తస్మాల్లింగముదీరితం
లింగం శైవమిదం సాక్షాచ్ఛివతత్త్వోభయాత్మకం
ధ్యాతవ్యమర్చనీయం చ భుక్తిముక్తి ఫలేచ్ఛునా ॥

సకల ప్రపంచము లింగమునందు లీనమై, లింగము నందే పునఃపునః జన్మించు

చుండును మరియు శివలింగమే పూజాధ్యానములకు యోగ్యమైనది. భుక్తిముక్తి ఫలముల గోరువారు లింగమునే యర్చింప వలయునని స్పష్టపరచ బడినది.

లీనార్థం గమకం చిహ్నం లింగమిత్యభిధీయతే
భం వృద్ధిం గచ్ఛతీత్యర్థాద్భగః ప్రకృతిరుచ్యతే
ముఖ్యో భగస్తు ప్రకృతిర్భగవాన్ శివ ఉచ్యతే॥

లీన - అవ్యక్తావస్థలోనున్న వస్తువును, గమక - గమనింప జేయు, చిహ్నం - చిహ్నమే, లింగం - లింగమని చెప్ప బడుచున్నది.

భం - వృద్ధిని, గ-ప్రాప్తము జేయునది భగము ఆభగమే ప్రకృతి: కనుక భగవంతుడనగా ప్రకృతికధిష్ఠాతయగు శివుడే యని జెప్ప బడెను.

లయం గచ్ఛతి యత్రైవ జగదేతచ్చరాచరం
పునఃపునః సముత్పత్తిం తల్లింగం బ్రహ్మ శాశ్వతం।
తస్మాల్లింగమితిఖ్యాతం సత్తానంద చిదాత్మకం
బృహత్వాద్బృంహణత్వాచ్చ బ్రహ్మ శబ్దాభిధేయకం।

ఏ పరబ్రహ్మమందీచరాచర ప్రపంచము లయించునో, మరల జన్మించునో, అట్టి బ్రహ్మమే లింగ స్వరూపము. సచ్చిదానందాత్మికమైన ఆమహాలింగము మహత్తరమై యున్నందున, జగత్సృష్టి కున్ముఖమై యున్నందున బ్రహ్మమను పేరు గలదైనది. ఇందుచే మహాలింగమే పరబ్రహ్మమని సిద్ధించు చున్నది.

జ్యోతిర్మయం పరం లింగం శృతిరాహ శివాత్మకం॥

అను వేదాగమ వచనముల ప్రకారము లింగమునకు పరశివ పరమాత్మ పరమేశ పరంజ్యోతి ఈశ్వర సదాశివ రుద్ర ఇత్యాది అనేక నామములు గలవు.

బ్రహ్మ ప్రజననం కూటం పవిత్రమమృతం సవః
ప్రస్తరో జనిమ ప్రాణో దేవో లింగం తదైవ చ
పర్యాయ వాచకా యేతే లింగస్యపరమాత్మనః॥

పరమాత్మ యనబడు లింగమునకు బ్రహ్మము ప్రజననము కూటము పవిత్రము అమృతము సవనము ప్రస్తరము జన్మము ప్రాణము దేవత లింగము అను పర్యాయ నామములు గలవు.

శివశక్త్యోశ్చ చిహ్నస్య మేలనం లింగముచ్యతే॥ ౧౦౭

శివుడనగా బ్రహ్మము: శక్తి యనగా మాయ: వీనియొక్క చిహ్నముల మేళనమే

శివలింగమని శివపురాణాంతర్గత విశ్వేశ్వర సంహిత యందు గలదు.

నాదో లింగమితి జ్ఞేయం బిందు పీఠముదాహృతమ్
నాదబిందు సమాయుక్తం లింగాకార మిహోచ్యతే॥ ౭౩
లీయతే గమ్యతే యత్ర యేన సర్వం చరాచరమ్
తదేతల్లింగమిత్యుక్తం లింగ తత్త్వ విశారదైః॥ ౭౪
ఆకాశం లింగమిత్యాహుః పృథివీ తస్యాది పీఠికా
ఆలయం సర్వ భూతానాం లయానాం లింగ ముచ్యతే॥ ౭౫

నాదమే లింగమనియు, బిందువే పీఠమనియు, ఈ రెండిటి యొక్క కూటమియే లింగాకారమని చెప్పబడినది. లింగమందే ప్రపంచమంతయు నిర్గమించి లయించు చున్నది. శివుడు లింగరూపుడైనందున ఆతని స్వరూపము నిరూపించ వలె నన్న లింగమనియే చెప్ప వలయును. ఆకాశము లింగరూపమగును. పృథ్వీపీఠమగును ఆకాశము పృథివి పీఠితో గూడిన జగత్తే సర్వభూతముల యొక్క ఉత్పత్తి స్థితి లయములకు స్థానమైనందున జగత్తే లింగరూపమని జెప్పినను దోషము లేదు ఇందు చేతనే లింగ తత్త్వము దెలిసిన మహాత్ములు "సర్వమిదం లింగ మయం జగత్" యని కూడ జెప్పి యున్నారు.

## శివలింగస్వరూపలక్షణము

మహాలింగమిదం దేవి మనోతీతమగోచరం
నిర్నామ నిర్గుణం నిత్యం నిరామయ నిరంజనం॥
నిర్మలం నిష్కళం జ్ఞేయం నిర్భేద్యం నిరుపాధికం
అద్వైతానందమక్షీణ మసాదృశ్యమిదం శృణు
అలక్ష్యమద్వయంశూన్యమమూర్తం పదమవ్యయ్యం
అకులానామయం శుద్ధమనాద్యం శివముచ్యతే॥
(౧) ఊర్ధ్వశూన్యమధశ్శూన్యం మధ్య శూన్య స్వరూపకం
ఆది మధ్యాంత శూన్యం చ నిష్కళం దేహావర్జితం॥

ఓ పార్వతీ! అగమ్యమైన మహాలింగము నిర్గుణమై, నాదరహితమై, నిరంజనమై, నిర్మలమై, అనుపమానమై, దేహరహితమై, ఆదిమధ్యాంతశూన్యమై ప్రకాశించు చున్నదని శివలింగ స్వరూప లక్షణము జెప్పబడెను. వాతులాగమమందు గూడ లింగము శూన్య మనియే వ్రాయ బడినది.

లింగమాకారము గల వస్తువుల వలె గోచరము గాదు. ఎట్లన? "అణో రణీయాన్మహతో మహీయాన్" (ఆలింగము) పరమాణువుకన్న చిన్నదనియు, గొప్పదానికన్న గొప్ప దనియు, చెప్పబడినది. "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" వాణి ఏ ప్రకారమాయుహ లింగమును పొందలేక వెనుతిరుగు చున్నదో, ఆప్రకారమే మనస్సు కూడ వెను దిరుగును (అంగా లింగము మనోవాక్కుల కగోచర మైనదని అర్థము) "అత్యతిష్ఠ ద్దశాంగులం" ఆలింగము సృష్టికన్న పదిరెట్లు అధికమైనదని వేదాగమములు చాటు చున్నవి "సూక్ష్మాత్సూక్ష్మతరం" లింగము సూక్ష్మముకన్న అత్యంతసూక్ష్మమైనది కనుక "చకిత మభిధత్తే శ్రుతిరపి" శృతులను గూడ తెలియబడ జాలనిది.

"జ్యోతిర్మయం పరం లింగం స్థాణువజ్జ్వలతి లింగ మదృశ్యం"
ఈ యాజ్ఞవల్క్యవ నిమద్వచన ప్రకారము శివయోగుల హృదయము మందు జ్యోతిస్వరూపము గలిగి పరశివలింగము ప్రకాశించు చుండును. ఆలింగము చక్షురాదీంద్రియముల కగోచర మైనది.

లింగ గర్భే జగత్సర్వం త్రైలోక్యం స చరాచరం
లింగబాహ్యాత్పరం నాస్తి తస్మాల్లింగం ప్రపూజయేత్॥ వీరాగమే॥
జగత్తంతయు లింగమందే గలదు. ఆ లింగబాహ్యమున యేమియులేదు. అట్టి విశ్వమయ లింగమును పూజించవలెనని చెప్పియుండుటను లింగమునకు విశ్వాత్మకత్వము బోధింపబడినది.

అతః సచ్చిదానంద లక్షణః పరమేశ్వరః
స్వయమేవ సదాలింగం నలింగం తస్య విద్యతే॥ సూతసం॥
సత్యజ్ఞానానంద స్వరూపుడయిన పరమేశ్వరుడు తానే లింగమాయె ననియు, ఆ లింగ స్వరూపుడయిన శివునకు వేరే లింగము లేదనియు, చెప్పబడినది. కావున శివుడే లింగస్వరూపుడని తెలియవలెను.

అతః శివస్సర్వ జగద్విభావకః స్వయంప్రకాశః స్వయమేవ కేవలః
మహోదితో లింగమితి ద్విజర్షభా స్తదేవపూజ్యం శృతిమస్తకస్థితం॥ సూ॥
స్వప్రకాశుడైన పరమశివుడే లింగరూపము చేత పూజనీయుడనియు, ఇదియే శృతులయొక్క ఉత్తమ సిద్ధాంతమనియు స్పష్టముగా జెప్పబడినది.

# ఓంకారమే శివలింగము.

లీయతే గమ్యతే యత్ర లింగే విశ్వం చరాచరం
ఓంకార ఏవ లింగం స్యాత్ సర్వకారణ కారణం
ఓమితి తద్బ్రహ్మపదం లింగాకారం మహేశ్వరం
సృష్ట్యర్థం సర్వతత్త్వానాం లోకస్యోత్పత్తి కారణం॥

అని ప్రపంచమంతయు యేలింగమునందు లయించి మరల పుట్టుచుండునో అట్టి లింగమే ఓంకారము. ఆ లింగమే సర్వమునకు కారణమైనది. ఓం యను బ్రహ్మపద వాచ్యమైన లింగమే సమస్త తత్త్వములకు కారణమైనది. మరియు సమస్త లోకములను పుట్టించునదియని చెప్పబడెను. ఇట్లు లింగము, ఓంకారము బ్రహ్మము వీటికభేదము సూచింపబడినది.

ఓం ఇత్యేతదక్షరముద్గీథముపాసీత॥ ఛాందోగ్యోపనిషత్తు॥ ౧

ఓం యను ఏకాక్షరమే గానమునకు ఉపాసనమునకు యోగ్యమైనది.

ఓం ఖం బ్రహ్మ యజు ౪౦-౪౭

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ గీతా. ౮-౧౩

ఓం యను ఏకాక్షరమే సాక్షాత్ సమస్త చరాచర బ్రహ్మమాయెను.

శ్రు॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ నమశ్శివాయేత్యజాయతే
ఓమిత్యేకాక్షర మిదగ్ం సర్వతస్యోప వ్యాఖ్యానమ్"॥ మం॥ ౧

ఓం యను యేకాక్షరమే సర్వమైనది ఈ యేకాక్షర వ్యాఖ్యానమే వేదము.

సర్వే వేదాయత్ పదమామనంతి తపాంసిసర్వాణి చ యద్వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యో
మిత్యేతత్॥ కఠ ౧-౧౫

వేదములేపదమును వర్ణించుచున్నవో, తపస్సులు దేనికొరకై చెప్పబడినవో, దేనికొరకు బ్రహ్మచర్యాది వ్రతధారణము చేయుబడునో అది కేవలము ఓం యను యేకాక్షరమని సంక్షేపముగ చెప్పబడినది.

తదేవలింగం ప్రథమం ప్రణవం సర్వ కామికం శివపు. విద్యే. సం॥

31 కోరికల సిద్ధింప జేయునదియే ప్రణవము ఆప్రణవమే ప్రథమ లింగము.

"తత్ దూరే తదంతికే" బ్రహ్మముమల విక్షేపా వరణముల వలన దూరమై సర్వ వ్యాపకత్వము వలన సమీపస్థమై యుండును.

# శివలింగ పరబ్రహ్మత్వము.

బ్రహ్మ విష్ణ్వాదయో దేవా స్సర్వేవేదాద యస్తథా
లీయంతే యత్ర గమ్యంతే తల్లింగం బ్రహ్మకేవలం
చిదానంద మయః సాక్షా చ్ఛివ ఏవ నిరంజనః
లింగమిత్యుచ్యతే నాన్యద్యతః స్యాద్విశ్వ సంభవః
బహునాత్రకిముక్తేన లింగ మిత్యుచ్యతే బుధైః
శివాభిదం పరం బ్రహ్మ చిద్రూపం జగదాస్పదం॥ సి. శిఖామణౌ॥

బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు, సమస్తవేదములు ఎందుపుట్టి మరల లయించుచున్నవో అదియే లింగము, ఆ లింగమే బ్రహ్మ మనబడు చున్నది. అట్టి బ్రహ్మస్వరూప మైన వస్తువే చిదానంద మయమైనది. నిరంజనమైన బ్రహ్మమే సాక్షాత్ శివు డనబడును. ఆ శివస్వరూపమే లింగమన బడును. అన్యముగాదు. జగత్తునకు కారణమై, చిద్రూపమైన శివనామక పరబ్రహ్మమే లింగమనబడు చున్నదని అనేక పర్యాయములు ప్రతిపాదింప బడినది.

బ్రహ్మేతి లింగమాఖ్యాతం బ్రహ్మణఃపతిరీశ్వరః
పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కాత్ తనుఃశుచిః॥

బ్రహ్మమే లింగమనియు, పతియనియు, ఈశ్వరుడనియు అతని సంపర్కము వలననే తనువు శుచి గాగలదనియు రేణుకాచార్యులవారు తమ వేదభాష్యమన దగు సిద్ధాంత శిఖామణియందు వ్రాసియున్నారు.

బ్రహ్మణఃపతిరీశోవై బ్రహ్మైతల్లింగముచ్యతే
పవిత్రం తద్ధివిఖ్యాతం తత్ప్రభుర్విశ్వతే స్వయం॥ స్కాంద పు॥

బ్రహ్మమే పతి, ఈశ్వరుడు, లింగమనియు, ఆలింగము పవిత్రము స్వయంప్రకాశ మనియు చెప్పబడినది.

బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మాశివోమే అస్తు.

బ్రహ్మమే శివుడు ఆ శివుడే లింగస్వరూపమని పంచ బ్రహ్మ మంత్రము లందు స్పష్టమగు చున్నది.

అలింగమేక మవ్యక్తం లింగం బ్రహ్మేతి నిశ్చితం
స్వయం జ్యోతిః పరం తత్వం పరవ్యోమ్ని వ్యవస్థితమ్॥

అరూపం నిష్కలం బ్రహ్మ భావాతీతం నిరంజనం
శబ్దాది విషయాతీతం మూలలింగమిహోచ్యతే॥ కూర్మ పు॥

రూపులేనిది, నిష్కలమైనది, భావాతీతమైనది, మాయా రహితమైనది, శబ్దాది విషయములను మీరినదియే బ్రహ్మము, బ్రహ్మమే మూలలింగము, అదియే అవ్యక్తము, స్వయంజ్యోతిర్మయము పరమతత్త్వమని చెప్పబడినది.

శ్రు॥ సర్వం ఖల్విదం బ్రహ్మ - లింగం తద్బ్రహ్మ సంజ్ఞితం
తల్లింగం బ్రహ్మ శాశ్వతం- లింగం బ్రహ్మ సనాతనం

బ్రహ్మమనగా లింగము, లింగమనగా బ్రహ్మము కావున లింగ బ్రహ్మములకు భేదము కల్పితమని నమ్మవలయును.

తల్లింగం పరమం బ్రహ్మ సచ్చిదానంద లక్షణమ్
నిజరూపమిత్యా నా త్రిధావస్థా ప్రజాయతే॥ సిద్ధాంతాగమే॥

లింగమే పరబ్రహ్మము సచ్చిదానంద స్వరూపము నని గలదు.

## లింగధారణ ప్రతిపాదనము

వీరశైవులు మోక్షాపేక్ష గలవారైనందున లింగాంగ సామరస్యమే వారికి పరమ పురుషార్థమైనది మోక్షాపేక్షగల వారికి శివలింగధారణము, శివదీక్ష, శివపూజలనెడి త్రివిధ శివకర్మలు బోధింపబడినవి. నిగమాగమ పురాణేతిహాసాది సమస్త ప్రబల ప్రమాణముల వలన లింగధారణ మావశ్యక మనియు, ఇదియే మోక్షసాధకమనియు, స్థిరపడుచున్నది. పారమేశ్వరాది శివాగమములలో లింగధారణము సవిస్తరముగ ప్రతిపాదింప బడినది. ఆ లింగధారణ ప్రతిపాదకములైన ప్రమాణము లిక్కడ ఉదహరింపబడు చున్నవి.

౧. ఋగ్వేదమంత్రము అష్ట. ౭. అధ్యా. 3 వర్గ ౮.

పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్త తనూర్నతదామో అశ్నుతే శృతాస ఇద్వహన్త స్తత్సమాశత॥

బ్రహ్మణస్పతే - లింగరూప శరీరావచ్ఛేదము తోడను శరీరభావము తోడను అధిష్ఠాతృడవగు పరమశివుడా! తే - నీయొక్క, తత్ - బ్రహ్మపద వాచ్యమగు లింగరూప శరీరము, పవిత్రం - ఉక్తరీత్యా శుచ్యశుచికాలము లందును ధరించ యోగ్యమైనది. వితతం - ఇష్టప్రాణ భావములనెడు త్రివిధ భేదముచేతను ఆచార

లింగాది భేద షట్కముచేతను, బహువిధముగ ఖ్యాతమైనది.

ప్రభుః - నిగ్రహానుగ్రహ సమర్థుడవై లింగరూపమున వ్యాపకుడవగు నీవు, విశ్వతః - సమస్త ఇష్టప్రాణ భావములను, గాత్రాణి - స్థూల సూక్ష్మ కారణరూప భక్తశరీరములను, పర్యేషి - వ్యాపించుచున్నావు. అనగా ధరించ బడిన వాడవై లింగరూప శరీరముచే భక్తాంగ సంగివైతివని తాత్పర్యము.

అతప్తతనూ - వేధా, మను, క్రియ, లనెడు శివదీక్షాత్రయ సంస్కారముచేత దగ్ధపాపుడు గానట్టి, ఆమః - ఆ పరిపక్వాంతః కరణుడగు బురుషుడు, తత్ - ఆపరశివ స్వరూపమగు నిష్టలింగమును, నాశ్నుతే - పొందజాలడు. ఇద్వహాంతః - శివజ్ఞాన సంపన్నులగు, శృతాసః - శివలింగాశ్రితులు, తత్ - ఆ శివలింగ బ్రహ్మముయొక్క సామరస్యమును, సమాశత - సర్వత్ర పొందుచున్నారు. అనగా లింగధారణ శివదీక్షా శివపూజల ద్వారా శివజీవైక్య మోక్షములభించునని యాదివేదము పరమహితము నుద్ఘోషించుచున్నది మరియు

(౨ యజుర్వేద తైత్తిరీయారణ్యకములో షోడశాను వాకమునందు ప్రపాఠక. ౧౦. అనువాక ౧౬)

నిధన పతయే నమః నిధన పతన్తికాయ నమః ౧

ఊర్ధ్వాయ నమః ఊర్ధ్వలింగాయ నమః ౨

హిరణ్యాయ నమః హిరణ్య లింగాయ నమః ౩

సువర్ణాయ నమః సువర్ణ లింగాయ నమః ౪

దివ్యాయ నమః దివ్యలింగాయ నమః ౫

భవాయ నమః భవ లింగాయనమః ౬

శర్వాయ నమః శర్వలింగాయ నమః ౭

శివాయ నమః శివలింగాయ నమః ౮

జ్వలాయ నమః జ్వల లింగాయ నమః ౯

ఆత్మాయ నమః ఆత్మలింగాయ నమః ౧౦

పరమాయ నమః పరమ లింగాయ నమః ౧౧

ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్ం స్థాపయతి పాణిమంత్రం పవిత్రం॥

నిధన పతయేనమః - నిధన సృష్టి స్థితిలయములకు పతయే ప్రభువైన శివునికొరకు నమః - నమస్కారము, అస్తు - అగుగాక.

నిధన పతాంతికాయ నమః - ప్రళయమునందు పడుచున్న బ్రహ్మ మొదలగు ప్రాణులకు సమీపమందున్న పరమ శివునికొరకు నమస్కారము.

ఊర్ధ్వాయనమః - పృథివ్యాది శక్త్యంత, పంచత్రింశత్తత్త్వముల కన్నను స్థానాది చిచ్ఛక్త్యంత షట్త్రింశత్తత్త్వముల కన్నను మీదనున్న పరశివతత్త్వము కొరకు నమస్కారము.

ఊర్ధ్వలింగాయనమః - బ్రహ్మాండమును మీదనున్న, శరీరమందున్న, సర్వ చక్రమందున్న పరశివతత్త్వమనే అఖండలింగము కొరకు నమస్కారము.

హిరణ్యాయనమః - సర్వమును పొందిన సర్వగతుడైన పరశివుని కొరకు నమస్కారము.

హిరణ్యలింగాయనమః - బంగారు ప్రకాశముగల మణిపూరక చక్రమందున్న బంగారపు ప్రకాశముగల ప్రాణలింగము కొరకు నమస్కారము.

సువర్ణాయనమః - మంచిదైన సద్యోజాతాది పంచముఖములయందు పంచవర్ణ కాంతులుగల శివుని కొరకు నమస్కారము.

సువర్ణ లింగాయనమః - మంచిదైన నకార, మకార, శికార, వకార, యకార, ఓంకారములనే ఆరు వర్ణములచే కల్పించబడిన ఇష్టలింగము కొరకు నమస్కారము.

దివ్యాయనమః - సేవించదగిన వాడగుటచే హృదయాకాశమందున్న శివుని కొరకు నమస్కారము.

దివ్యలింగాయనమః - ఆకాశమనే ఉపాంగముగల శరణాంగముచే సేవించ దగిన ప్రసాద లింగముకొరకు నమస్కారము.

భవాయనమః - భవునికొరకు నమస్కారము.

భవలింగాయ నమః - జలమనే ఉపాంగముగల మాహేశ్వరాంగముచే సేవించదగిన గురులింగము కొరకు నమస్కారము.

శర్వాయనమః - శర్వునికొరకు నమస్కారము

శర్వలింగాయనమః - పృథివియనే ఉపాంగముగల భక్తాంగముచే సేవించ

32 దగిన ఆచార లింగముకొరకు నమస్కారము.

శివాయనమః - శుభప్రదుడయిన శివునికొరకు నమస్కారము.

శివలింగాయనమః - కల్యాణప్రదమైన శివలింగమునకు నమస్కారము.

జ్వాలాయనమః - సర్వప్రకాశుడయిన శివునికొరకు నమస్కారము.

జ్వలలింగాయనమః - వాయువే ఉపాంగముగల ప్రాణలింగిచే సేవించ దగిన చరలింగము కొరకు నమస్కారము.

ఆత్మాయనమః - జీవాత్మరూపమైన శివునికొరకు నమస్కారము.

ఆత్మలింగాయ నమః - జీవాత్మయనే ఉపాంగముగల ఐక్యాంగముచే సేవించదగిన మహాలింగము కొరకు నమస్కారము.

పరమాయనమః _ పరమాత్మమైన శివునికొరకు నమస్కారము.

పరమలింగాయనమః - స్థూల సూక్ష్మములయిన ఇష్టలింగ ప్రాణలింగ ములకంటె అతిశయమైన భావలింగముకొరకు నమస్కారము.

**సూర్యస్య** - సూర్యమండలములోనున్న, సోమస్య - బ్రహ్మవిద్యా రూప మైన చిచ్ఛక్తితో కూడిన పరమశివ సంబంధియగు, పాణిమంత్రం - వామహస్త మందుధరించి పూజించదగిన దగుటచే, రక్షించుచున్న, పవిత్రం-దీనిచే పవిత్రము చేయబడిన భక్తునకు అశుచికాలమందున్నూ, ధరించదగిన, ఏతత్ - ఈ సర్వ లింగము-ఆచారలింగ, గురులింగ, శివలింగ, చరలింగ, ప్రసాదలింగ, మహాలింగ, ఇష్టలింగ, ప్రాణలింగ, భావలింగ, అఖండ లింగములనే లింగదశకమును పూర్వ మందుచెప్పబడిన ఘ్రాణాది హృదయాంత జ్ఞానేంద్రియ షట్కమందు పాయ్వాది హృదయాంత కర్మేంద్రియ షట్కమందు త్యాగాంగ యోగాంగ భోగాంగము లనే స్థూలసూక్ష్మ కారణ శరీరములయందు పశ్చిమచక్రమందు, స్థాపయతి - గురుడు ధరింప జేయవలసినది. అనగా జ్ఞానేంద్రియ షట్కమందున్నూ, కర్మేం ద్రియ షట్కమందున్నూ, ఆచార లింగాది లింగషట్కమును, స్థూలాది శరీర త్రయమందు ఇష్టాది లింగత్రయమును, పశ్చిమ చక్రమందు అఖండలింగమున్నూ ఈ రీతిగా గురుడు పదిలింగములను శిష్యునకు ధరింపజేయ వలసినది.

**"ఏతత్సోమస్య" యనుమంత్రమునకు సిద్ధాంతాగమమునందు లింగ** ధారణపరమైన అర్థము స్పష్టముగా జెప్పబడినది—

(3) ఏతత్సూర్యస్య మిత్రస్య మండలాంతర వర్తినః
సోమస్య పార్వతీశస్య లింగం భవభయాపహం
సర్వేషు భక్తదేహేషు స్థాపయేద్గురుణాసహా
పవిత్రాణాంపవిత్రత్వాత్పవిత్రమితి కథ్యతే

తస్మాద్ధార్యం సదాలింగం పాణిమంత్రేతి మంత్రతః
పాణౌలింగం సమాసాధ్య దీక్షాకాలె గురుశ్శివం
యేనస్మరతి యన్మంత్రం పాణిమంత్రం వదంతిహి॥
మననాత్పూజనాద్భక్తాన్ త్రాయతీతి నిరుక్తితః
పాణిమంత్రమితిప్రోక్తం తల్లింగం బ్రహ్మశాశ్వతం॥

ఈ సూర్య మండలాంతర్వర్తియైన పార్వతీశునియొక్క భయనివారకమైన లింగమును సమస్త భక్తుల దేహములందు సద్గురువు ఎల్లప్పుడు నట్లుగా స్థాపించవలెను. అనగా బాహ్యలింగధారణము గావించవలెను. పవిత్రవస్తువుల కన్న పరమపవిత్రమైనందున పాణిమంత్రయుక్తముగ భక్తుడు ఎల్లప్పుడు ధరించుకొనవలయును. దీక్షాకాలమునందు శివస్వరూపుడయిన గురువు లింగమును శిష్యపాణితలమునందుంచియే ఈ మంత్రము స్మరించును కనుక అది పాణిమంత్రమనబడినది. ఈ పాణిమంత్రము తన్మంత్రపూరిత లింగము శాశ్వతమైనది. అది మనస్సుచే పూజించు భక్తులను సంసారమునుండి తరింపజేయునది.

ఈ పైరెండు మంత్రార్థములనే వ్యాసమహాఋషులు లింగపురాణ ఉత్తరభాగముయొక్క ౨౧ అధ్యాయమునందు

(౪) వేదశాస్త్రపురాణేషు కామికాద్యాగమేషుచ
లింగధారణ మాఖ్యాతం వీరశైవశ్చ నిశ్చయాత్॥ ౯౭
బ్రహ్మేతి లింగమాఖ్యాతం బ్రహ్మణః పతిరీశ్వరః
పవిత్రం తద్ధివిఖ్యాతం తత్సంపర్కాత్తనుః శుచిః॥ ౯౮
ఋగిత్యాహ పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే
తస్మాత్పవిత్రం తల్లింగం ధార్యం శైవ మనామయం॥ ౯౯
అతప్తతనురజ్ఞోవా ఆమ స్సంసారలక్షణః
దీక్షయా రహితః సాక్షాత్ నాప్నుయాల్లింగముత్తమం॥ ౧౦౦
యఃకరోతి తపఃపూర్వం సతప్తతను రుచ్యతే
నకరోతి తపఃపూర్వం సోఽతప్తతనుః రుచ్యతే॥ ౧౦౧
పరిపక్వో విమోక్షాయ సోఽర్హస్తే లింగధారణం॥
యజురవాప్య సర్వంవై లింగం స్థాపయతీతిచ। ౧౦౨
తస్మాద్ధార్యం మహాలింగం పాణిమంత్రేతి మంత్రతః॥

ప్రాణాలింగం వినిక్షిప్య దీక్షాకాలేగురుః స్వయం॥ ౮౦౩
యేనస్తువతి తన్మన్త్రం, ప్రాణిమాత్రం వదంతిహి॥
పవిత్రత్వాన్మహేశస్య శివస్య ప్రతిపాదనాత్॥ ౧౦౪
పవిత్రకరణాత్పుంసాం పవిత్రమితి కథ్యతే
అతః సర్వేషుకాలేషు ధారయేల్లింగ ముత్తమం॥ ౧౦౫
గచ్ఛంస్తిష్ఠన్ స్వపన్జాగ్రన్నున్మిషన్నిమిషన్నపి
శుచిర్వాప్యశుచిర్వాపి లింగంసర్వత్ర ధారయేత్॥ ౧౦౬
లింగధారీసదాశుద్ధో నిజలింగం మనోహరం
అర్చయేత్ గంధపుష్పాద్యైః కరపీఠేసమాహితః॥ ౧౦౭

౯౭. వేదశాస్త్రపురాణములందును కామికాద్యాగమములందును వీరశైవునకు లింగధారణ మావశ్యమని నిశ్చయించి చెప్పబడినది;

౯౮ లింగమునకు బ్రహ్మమనె సంజ్ఞగలదు. లింగరూపమైన ఆ బ్రహ్మమునకు పరశివుడు అధిష్ఠాతయై యుండును. ఈ లింగము పవిత్రమైనదని ప్రసిద్ధియై యున్నందున దీని స్పర్శము వలన దేహము శుద్ధమగును.

౯౯ లింగరూప బ్రహ్మమునకు, అధిష్ఠాతృడవైన ఓ పరశివా! ఇష్ట ప్రాణాది రూపములచేత సర్వత్ర వ్యాపించియున్న, పవిత్రము, అనామయమైన, ఆ నీలింగము ముముక్షువులు ధరింపకొనవలెయునని ఋగ్వేదము నందు చెప్పబడినది.

౧౦౦ పూర్వమునందేవడు శివార్థమై తపస్సు చేయనివాడో, అవిద్యామోహితుడో, పాపియో, సంసృతికి లోబడినవాడో, దీక్షారహితుడో, అతనికి లింగధారణాధికారము లేదు.

౧౦౧ ఎవడు పూర్వమునందు తపస్సు చేసియుండునో, అతడు తప్తతనుడని పిలువబడును. తత్కారణమువలన మోక్షమున కధికారియైన అతడు శివలింగమును ధరించుటకు పాత్రుడగును. తపస్సుచేయనివాడు అతప్తుడని యనబడును కనుక లింగధారణమునకు యోగ్యుడు కాడు.

౧౦౨ యజుర్వేదముకూడ "సర్వలింగం స్థాపయతి పాణిమంత్రం పవిత్రం" యని చాటుచున్నందు వలన అట్టిపాణిమంత్రం పవిత్రమ్ యను మంత్రార్థమును తెలిసిన గురువు దీక్షాకాలమునందు శివలింగము నరచేతి యందుంచుకొని

తన్మంత్ర పఠన పూర్వకముగా దానిని శిష్యుని హస్తపీఠము నందుంచును. తత్కారణమున హస్తస్థితమైన లింగము పాణిమాత్రమని చెప్పబడును.

౧౦౪ శివుడు పవిత్ర స్వరూపుడైనందున తద్రూపలింగము కూడ పవిత్రమైనదియే. తత్కారణమున లింగమును ధరించు వీరశైవుడు కూడ పవిత్రుడే యగును.

౧౦౫ గురుదత్త లింగమును సత్పురుషులెల్లకాలము ధరింపవలయును.

౧౦౬. అనగా, నడచు చున్నను, నిలచి యున్నను, కూర్చుండి యున్నను, పడుకొని యున్నను, మెలకువతోడ యున్నను, కన్నులుమూసి యున్నను, తెరచి యున్నను, శుచ్యశుచి కాలము లందును, ఇంతయేల? సర్వకాల సర్వావస్థలయందును, లింగము ధరింప దగినదనియు, కరపీఠమునందు లింగము నుంచుకొని పూజించు లింగధారియే సదా శుచిర్భూతుడని నిరూపించి యున్నారు.

మరియు ఋగ్వేదము యొక్క మంత్రము కూడ ఇదే యభిప్రాయమును

జెప్పుచున్నది. ఏట్లనగా?

౫ అయంమే హస్తో భగవానయం మే భగవత్తరః

అయంమే విశ్వ భేషజో ఽ యంశివాభి మర్శనః

అయంమాతా అయంపితా అయంజీవాతు రాగమాత్

ఇదంతవప్రసర్పణం సుబన్ధవేహి నిరీహి॥ మం౧. ౧౦సూ. ౬౦మం.౧౨

అయం-ఈ, భగవాన్- లింగ రూపుడైన పరశివుడు, మే- నాయొక్క హస్తః- హస్తగతుడై యుండును. (హస్త పీఠమందుండును.) అయం - ఈపర శివుడు, మే- నాయొక్క, భగవత్తరః- శ్రేష్ఠమైన సకలైశ్వర్య రూపుడు, అయంమే- ఇతడే నాయొక్క, విశ్వభేషజః- సర్వ రోగ నివారక యోగ్యమైన వాడు, అయం - ఇతడు, శివాభిమర్శనః - సమస్త కళ్యాణ ప్రదుడు. అయం - ఇతడు, జీవాతుః - జీవసాధన భూతుడు, ఆగమాదిశాస్త్ర ప్రామాణ్యము వలన, హేసుబన్ధో- ఓనిరుపాధిక విశ్వబంధో, ఏహి- రమ్ము, తవ - నీకు, ప్రసర్పణం-విహార స్థానమైన, ఇదం- ఈ నాయొక్క హస్తగత లింగమును, నిరీహి- విడచి పోకుము అనగా యెల్లప్పుడు ఈలింగమందే వెలసయుండుమని చెప్ప బడెను.

33 కృష్ణయజుర్వేద శ్వేతాశ్వతరోప నిషత్ప్రథ మోధ్యాయ మందు.

౬ క్షరంప్రధానమమృతాక్షరగ్ం హరః

క్షరాత్మనావీశతే దేవ ఏకః

తస్యాభిధ్యానాద్యోజనా తత్వభావా
ద్భూయశ్చాంతే విశ్వ మాయా నివృత్తిః ॥

ప్రధానం - ప్రవృత్తి, క్షరం - అనిత్య మైనది. అమృతాక్షరం - మరణమున్ను, స్వరూపనాశనము లేనిది పురుష తత్వము, దేవః - జ్ఞాన ప్రకాశమైన, ఏకః - ఒక్కడైన, హరః - శివుడు, క్షరాత్మనా - ప్రకృతి పురుషులను, ఈశతే - రక్షించు చున్నాడో, తస్య - ఆ శివుని యొక్క, అభిధ్యానాత్ - జ్యోతిర్లింగ రూపముచే హృత్పుండరీకమందు ధ్యానించుట వల్ల, యోజనాత్ - ఇష్టలింగ రూపముచే, అంతే - దేహావసాన కాలమందు, భూయః - తిరిగిన్ని, విశ్వమాయా నివృత్తిః - సకలాజ్ఞాన నివారణ మగు చున్నది. అని యిదే యర్థము లింగసంయోగము కర్తవ్యమని లింగధారణ దీపిక, లింగధారణ చంద్రిక, శ్రీకర భాష్యము లందు కూడ వ్రాయ బడినది.

ఈప్రకారము శివలింగ ధారణ ప్రతిపాదన అనేక వేదమంత్రము లందున్నది. మరియు ఆగమ పురాణ ప్రమాణములచే కూడ యిదే యర్థము సిద్ధించు చున్నది.

సూక్ష్మాగమము - పటలము ౫.

౭ లింగే ప్రాణాన్వినిక్షిప్య ప్రాణేలింగం వినిక్షిపేత్
తల్లింగం స్థాపయేచ్ఛిష్యే సమ్యగ్ ధ్యాత్వైక భావతః॥ ౪౭
ధ్యాత్వైశిష్యాయ తల్లింగం ధారయిత్వా నిరూపయేత్
వీరమాహేశ్వరాచార నిష్ఠాయ పరదుర్లభం॥ ౪౮
దత్తం లింగమిదంవత్స మాకదాచిద్వియోగయ
ప్రాణవద్రక్షణీయం హి ప్రాణలింగం మిదంతవ.। ౪౯
ఉత్తమాంగే గళే కక్షే తథా వక్షస్థలేపివా
కుక్షిస్థలేపివా నిత్యం సావధానేన ధారయేత్॥ ౫౦
ప్రమాదాత్పతితే లింగే భిన్నే చోరాదిభిర్హృతే
పీఠాద్యుత్క్రమితేవాపి సహ ప్రాణాన్ పరిత్యజేత్॥ ౫౧

శ్రీగురువు శిష్యునకు దీక్షారూప సంస్కారమును జేయు సమయ మందు మంత్రోపదేశమును జేసిన పిదప శిలాదోష శిల్పదోషములను యథా విధి తొలగించి శివకళను దానియందుంచి, శిష్యునకిచ్చి, శివలింగము నందు

శిష్యుని ప్రాణమును, మరియు శిష్యుని ప్రాణము నందు శివ లింగమును ప్రతిష్ఠించి శివునననన్యభావము చేత ధ్యానించుచు, యథా యోగ్య ముగ శిష్యుని హస్తపీఠము నందాలింగమును స్థాపించ వలయును. వీరమాహేశ్వ రాచార నిష్ఠుడై ధ్యానైకతత్పరుడైయున్న శిష్యునకు ఈరీతి లింగమును ధరించు విధియు ముగిసిన తర్వాత ఉపదేశించు పద్ధతి యేమనగా? ఓ పుత్రుడా ఇతర సామాన్యులకు పరమ దుర్లభమైన ఈలింగమును నేను నీకు కరుణతో యిచ్చి యున్నాను. దీనిని నీవు దేహమునుండి దూరముచేయ వలదు. ప్రాణము వలె కాపాడుము. ఏలననగా? నిజముగా ఇది నీప్రాణలింగము. అందు వలన మస్తక, కంఠ, కక్ష, కుక్షిస్థలములలో యేదో యొకస్థలమునందు మిక్కిలి జాగ్రత్తగా ధరించికొని యుండుము. లింగముజారి పడినను, దొంగిలింపబడినను, కారణాంత రముచేత పలిగి పోయినను, పీఠమునుండి పడిపోయి భిన్నమైనను తక్షణమే ప్రాణములను విడువుము యనిచెప్పబడినది.

౮ ఇత్థంనిర్వృత్యదేవేశి దీక్షాంపూర్వాంగ సంయుతాం
సంబధ్నీత గురుల్లింగం శిష్యాయ మమశైలజే॥ పారమేశ్వరా॥

ఈప్రకారముగా పూర్వాంగదీక్ష మొదలైన వన్నియు ముగిసినతర్వాత శ్రీగురువు శిష్యునకు శివలింగధారణము చేయ వలయుననియు వాక్యముగలదు. ఇదేప్రకార ముగ స్కాందపురాణంతర్గత శంకర సంహిత ఉ. ౮౧ అధ్యాయమందు

౯ పీఠస్థ శివలింగే తు శిష్యప్రాణం నిధాయ చ
లింగం సంస్థాప్య తత్ప్రాణే ప్రాణలింగం భవేత్తతః॥ ౩౫
దత్వా శిష్యాయ తల్లింగం శ్రద్ధాభక్తియుతాయ సః
పూజయ ప్రాణలింగం త్వం యావజ్జీవం ప్రతిజ్ఞయా॥ ౩౬

శక్త్యాత్మక పీఠముపైయున్న శివాత్మక లింగము నందు శిష్యుని ప్రాణమునుంచి అట్టి శిష్యుని ప్రాణమునందు శివలింగమును స్థాపన జేసియుండుట వలన ప్రాణ లింగమన బడును. ఈప్రాణ లింగమును శ్రద్ధా భక్తియుతుడైన శిష్యుని కిచ్చి యావజ్జీవము నీవు ఈప్రాణలింగమును నేమముతో పూజించుము యని గురువు ఉపదేశము చేయవలెను యనిచెప్ప బడెను.

౧౦ త్ర్యియంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం
ఊర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

**సుగంధిం**- నిరతిశయ పరిమళ విశిష్టత్వముగల, సర్వజ్ఞత్వాదిముగల గుణములు గల, **పుష్టి వర్ధనం** - శమదమ భక్తి వైరాగ్య జ్ఞాన సమృద్ధి కారకమైన, **త్ర్యంబకం**- లింగరూపశివుని, **అమృతాత్** - మరణము లేనిచే, **యజామహే** పూజచేయు చున్నాను: మరియు ధరించు చున్నాను. దానివలన, **బాధనాత్** - బంధమునుండి, **ఊర్వారుకమివ**- పక్వదశయందు కర్కటీ ఫలమువలె, **మృత్యోః**- జనన మరణ ప్రవాహ విశిష్ట సంసారాత్మక మృత్యువునుండి, **మృక్షీయం**-విడువ బడుదును; అనగా లింగధారణచే పురుషుడు పక్వము జెందిన కర్కటీ ఫలము వలె మృత్యురూప సంసారమునుండి విముక్తుడగును. అని వేదవచనము గలదు. దీని యొక్క లింగధారణ పరమైన యర్థము స్కాందపురాణ మందీ విధముగా నిర్వచింప బడినది

೧೧ త్ర్యంబకం మహాదేవం లింగరూపమనామయం
దివ్యగంధ సమాయుక్తం జ్ఞానవైరాగ్య సిద్ధిదం॥
అమృతాద్దేహ పాతాంతం శ్రద్ధాభక్తి సుసంయుతః
యజామహే ధారయామ పూజాంకుర్మో యథావిధిః॥
పక్వకాలే యథావృంతా దుర్వారక ఫలంభువి
తథాహం మృత్యు సంసారాద్విముచ్యేయం నసంశయః॥

೧.೨ సంస్కృత్య గురుణాదత్తం షడధ్వన్యాస పూర్వకం
వామహస్త గతంలింగం సావధానేన పూజయేత్॥ వాతూలాగమే॥

೧3 ధారయేద్యస్తు వస్త్రాద్యా లింగాకారం శివం సదా
తస్యహస్త స్థితం విద్ధి మత్పదం సంపదాం పదం।
శిరోదేశేథవా కంఠే హస్తే వక్షస్థలేపివా
లింగధారణ హీనో యస్తం త్యజేదంత్యజం యథా।
కుండంచ గోళకంచైవ లింగధారణ వర్జితం
తథా దేవలకంచైవ దృష్ట్వా చాంద్రాయణం చరేత్॥ వీరాగమే.

೧೪ లింగమంత్రోపదేశశ్చ కరపీఠార్చనం జపః
మల్లింగ ధారణంత్వత్ర లోకాచార ప్రవర్తకం। కిరణాగమే.

೧೫ స్థూలాంగేత్విష్టలింగంతు మేనధారయతే ద్విజః
దృష్ట్వా తం సహసాపుత్ర సచేలస్నానమాచరేత్॥
అలింగ ధారిణం దృష్ట్వా కుర్యాత్సూర్యావలోకనం॥మకుటాగమే

౧౬ ఏకకాలం ద్వికాలంవా త్రికాలం వాపి శాంకరీ
పూజయేన్నియతం లింగం ప్రాణలింగ పరాయణః॥ ౬౧
ఏవం యః కురుతే భక్త్యా ప్రాణలింగార్చనం సదా
వీరశైవః సవిజ్ఞేయః సర్వశైవోత్త మోత్తమః॥ సూక్ష్మాగమే
౧౭ మూర్ధ్ని కంఠే భుజే హస్తే హృత్థ్సలే నాభిమండలే
ఏతేషామేక దేశే తు ధారయేచ్ఛివ లింగకం ॥ 3౨
స్వీకరోతి యదాలింగం గురుణా దీక్షయాఽనునా
తథా ప్రభృతి లింగైక్య మవినాభావ యోగతః॥ ౪౯
దేహం ప్రాణేన సంస్థాప్య ప్రాణం లింగేన నిక్షిపేత్
ప్రాణే నిక్షిపేల్లింగం పృథగ్భావం నకారయేత్॥ వాతులాగమే ౯౦
౧౮ న వీరశైవ సదృశం మతమస్తి జగత్త్రయే
సర్వభోగప్రదం పుణ్యం శివసాయుజ్య దాయకం ౪౨
యస్య భస్మ లలాటేఽస్తి కంఠే లింగముదాత్మకం
రుద్రాక్ష ధారణందేహే సోఽహందేవి నసంశయః॥ వీరాగమే. ౪౮
౧౯ గురోశ్చ జంగమస్యైవ శివ లింగస్య పూజనం॥ ౨3
ఏషాం పాదోదకం చైవ భుక్తశేషాన్న మేవ చ
భక్షయేచ్ఛివ భక్తస్తు ప్రసాదో జన్మశుద్ధిదః॥ వీరాగమే. ౨౪
౨౦ ఇత్థంనిర్వర్త్య దేవేశి దీక్షాం పూర్వాంగ సంయుతాం
సంబధ్నీత గురుర్లింగం శిష్యాయ మమశైలజే॥ పారమేశ్వర. ప॥ ౯

ఈరీతిగ పూర్వాంగ దీక్ష యంతయు ముగిసిన తర్వాత శ్రీ గురువు శిష్యునకు శివలింగ ధారణము జేయ వలయు ననియు అట్టి గురుదత్త లింగమును వామ హస్తము నందు పూజించ వలయు ననియు తర్వాత దేహము నందు ధరించ వలయు ననియు దానిని ప్రాణ సమానముగా భావించి కాపాడ వలయు ననియు దానిచె సమస్త భోగములు మరియు మోక్షముసిద్ధించుననియు, అనేకాగమ ప్రమాణములు గలవు.

34 ౨౧ లింగధారణమాఖ్యాతం ద్విధా సర్వార్థ సాధకైః
బాహ్య మాభ్యంతరం చేతి మునిభిర్మోక్ష కాంక్షిభిః ॥
ఆధారే హృదయేవాపి భ్రూమధ్యే వా నిరంతరం

జ్యోతిర్లింగాను సంధానంతదేవాంతర ముచ్యతే॥ సిద్ధాంతశిఖామణౌ॥
లింగధారణము బాహ్య లింగ ధారణము అంతర్లింగ ధారణ మనియు, రెండు విధముల వర్ణింప బడినది. మోక్షాపేక్ష గల మునులచేత ధరింపదగినదని లింగ ధారణ పరమైన ప్రమాణమగుచున్నది.

౨౨ బ్రహ్మ విష్ణ్వాదయో దేవా మునయో గౌతమాదయః
ధారయంతి సదా లింగం ఉత్తమాంగే విశేషతః॥
వేదేషు శాస్త్రి సంఘేషు పురాణేష్వాగమేషు చ
బ్రాహ్మణస్య సమాఖ్యాతంలింగధారణ ముత్తమం॥ లింగపు. అ.౨౧

బ్రహ్మవిష్ణుమొదలైన దేవతలు, గౌతమాది మునులు, తలపైన లింగధారణము జేసుకొనిరి. బ్రాహ్మణులు కూడ శివలింగమును ధరింప వలెనని వేదాగమ శాస్త్ర పురాణము లందు చెప్ప బడినదని నిరూపింప బడినది.

౨౩ స్వప్న కాలే కృతం పాపం బ్రహ్మహత్యాదికం చ యత్
యథా ప్రబోధ సమయే తన్మిథ్యా భవతి స్వయం॥ ౨౮
తథా కృతం మహాపాపం లింగధారణతః పురా
యదస్తి తల్లయం యాతి లింగధారణతః పరం॥ శంకర సం॥ అ. ౮౩

స్వప్నమునందు సంభవించిన బ్రహ్మ హత్యాది పాపములు జాగ్రదవస్థ యందు లేకుండ బోవునట్లు శివలింగధారణము కన్న మొదలుచేయబడిన యేమహాపాతకములు గలవో అవన్నియు లింగమును అంగముపై ధరించి నంతనే నాశనమగుచున్నవి యని శివుడు స్కందునకు లింగధారణ మహాత్మ్య ముపదేశించెను.

౨౪ సాంగోపాంగమితి ప్రోక్తం శివ లింగస్య పూజనం
ప్రవృత్తానాం నివృత్తానాం భేదతో ద్వివిధం ద్విజాః॥ ౩౨
ప్రవృత్తానాం పీఠపూజా సర్వాభీష్ట ప్రదా భువి
పాత్రేణైవ ప్రవృత్తస్తు సర్వపూజాం సమాచరేత్॥ ౩౩
నైవేద్యమభిషేకాంతే శాల్యన్నేన సమాచరేత్
పూజాంతే స్థాపయేల్లింగం సంపుటేచ పృథక్గృహే॥ ౩౪
కరపూజా నివృత్తానాం స్వభోజ్యం తు నివేదయేత్
నివృత్తానాం పరం సూక్ష్మం లింగమేవ విశిష్యతే॥ ౩౫
విభూత్యభ్యర్చనం కుర్యాద్విభూత్యై చ నివేదయేత్

పూజాం కృత్వాఽథ తల్లింగం శిరసా ధారయేత్సదా॥ శివపు॥ ౩౬
శివలింగమును పీఠమునందుంచి పూజించువారు ప్రవృత్తిమార్గులనియు, కరము నందుంచి పూజించువారు నివృత్తిమార్గులనియు ఈనివృత్తిమార్గులు పూజానంతరము లింగమును శిరస్సునందు ధరింతురనియు, చెప్పి వీరశైవులు నివృత్తిమార్గులు వారికి లింగధారణ మావశ్యకమని ప్రతిపాదింప బడినది.

౨౫ ముఖే మంత్రో హృది ధ్యానం మస్తకే లింగధారణమ్
శిఖా రుద్రాక్ష భస్మాని ఇతి బ్రాహ్మణ లక్షణం॥ గౌతమస్మృతిః

౨౬ సర్వసంగే నివృత్తస్య ధ్యాన యోగరతస్య చ
న తస్య దహనం కార్యం నచ పిండోదక క్రియా॥
శివధ్యాన రతోభూత్వా శివలింగాంగ సంయుతః
శివేతర పరత్యాగీ ధ్యానయోగీ స ఉచ్యతే॥ మనుస్మృతిః॥

౨౭ అక్షపాదాదయ సర్వే శక్తయః పరయా ముదా
ధారయంత్యలికాగ్రేషు శివ లింగ మహార్నిశం॥ మనుస్మృతిః

౨౮ వామహస్త స్థితం లింగం సావధానేన పూజయేత్
మస్తకే హృదయే కంఠే ధారయేత్ సర్వదాద్విజః॥ శంఖస్మృతిః

౨౯ పూజయేద్యస్తు హస్తాదౌ శివలింగం శివాత్మకం
తస్య హస్త స్థితా ముక్తిః శంకరస్య ప్రసాదతః॥ పారాశరస్మృతిః

ఈ స్మృతులందు కూడ లింగ ధారణము, లింగాంగ సామరస్యము, కర పీఠార్చనము ఇత్యాదులే బోధింప బడినవి.

వేదాంత సారోపనిషత్తునందు:

౩౦ అథాశ్వలాయనోభగవంతంపరమేష్ఠినంపరిసమేత్యోవాచవిముక్తం సద్యో ముక్తి కరం బ్రూహీతి. సహోవాచ యాజ్ఞవల్క్యః. పరమేష్ఠీ శివోఽద్వైతశ్చతుర్థః శాంతః సఏవధ్యేయః సఏవ పూజ్యః. తద్ధ్యాన పూజ నాదవిముక్తా భవంత్యయం విశేషోఽత్యాశ్రమిణః............
పరేణ శుద్ధే హృదయాబ్జ మధ్యే లింగం ధృత్వా జ్యోతిషి సంవిశంతి అత్యాశ్రమస్థాః పరిముచ్యంతి ధీరాః తేషాంసుఖం శాశ్వతం నేతరేషాం..........
లింగ స్వరూపం ధృత లింగ భావ మంతర్బహిః స్వస్యచ సామరస్యంజ్ఞాత్వా హి దేవం శుద్ధ భావైరుపాస్యం ఉపాస్య ధీరాః పరిముచ్యంతి సాక్షాత్ ......

సర్వే చ బృహస్పతి ముఖామరాః ప్రాహ్యోపాస్య శివం సాంబం బ్రహ్మ స్వహృద యాంబుజే లింగాంగ సామరస్యాచ్చ శరీరే లింగ ధారణా నియమేనైవ ధృత్వా తే ముక్తాః సంసార సాగరాత్ వేదాంత సార సర్వస్వమనే నైవ వశీ కృతం.

ఆశ్వలాయన మహర్షి సద్యోముక్తి కరమైన తత్వము నుపదేశించవలియునని పరమేష్ఠిని వేడుకొనగా "శివుడే పరము ధ్యేయుడును, మోక్షస్వరూపుడును నై యున్నాడు. అతని స్వరూపమునబడు లింగమును అంతర్బాహ్యములందుధరించి ధ్యానపూజాదులను భక్తితో గావించుచవేడులకు ముక్తిలభించును ఇదియే లింగాంగ సామరస్యము అని పరమేష్ఠి యుపదేశించెను.

భక్తి యోగోపనిషత్.

౩౧ అథపరమ శివలింగాంగ సామరస్య భక్తియోగం వ్యాఖ్యాస్యామః. బహుజన్మాంత రేషు యోగసిద్ధానాం పరమ శివలింగాంగసామరస్యం ... ... ... శివః ప్రాణః శివ భక్తస్య శివప్రసాదే మతిరస్య సర్వదా శివ ప్రసాదస్య ధృతి ర్నిరంతరం. న శివాదన్యద్దైవ చింతనం. న శైవమంత్రాదపరోఽస్తి మంత్రో భస్మస్నానం నిత్యతృప్తి ర్హృదంతః రుద్రాక్షాణాం ధారణం॥

నిర్లేపోపనిషత్

౩౨ భస్మాలేపః సర్వగాత్రేషు నిత్యం రుద్రాక్షాణాం ధారణం లింగ పూజా పంచాక్షర్యా జపః చిత్త వృత్త్యా రుద్రాధ్యాయః పాఠకృత్యం నచాన్యత్. లింగం సత్యం నిష్కలం బ్రహ్మరూపం ధార్యం పూజ్యం హృదయే జ్యోతిరాద్యం సత్తామాత్రం వాఙ్మనోతీత మేతత్పంచాత్మకం భాసతే యేన ముక్తః శివస్య తనవో జ్ఞేయా లింగం యత్నంపుటం గుణాద్ధారం తథా వస్త్రం సర్వ వేదాంత నిశ్చితం.

భస్మధారణము, రుద్రాక్షధారణము, లింగపూజ, పంచాక్షరీ జపము, రుద్ర నమక చమక పారాయణములన బడు నైదు కార్యములే మానవునకు నిత్యకృత్యములు. ఇతరము లేదు. నిష్కల, జ్యోతి, బ్రహ్మ, సత్య, జ్ఞాన, ఆనంద స్వరూపమగు లింగముదు హృదయమునందు ధరించి పూజించువాడు ప్రపంచ వికారముల దాటి శివునందైక్య మగును లింగము, లింగ కాయ, వస్త్రము, సూత్రము, ఇవి యన్నియు శివుని యొక్క శరీర స్వరూపములే నై యున్నవి ఇది సర్వ వేదాంత నిశ్చయమని చాటుచున్నాడను.

చిదంబరోపనిషత్తునందు:—

౩౩ శివేభక్తిర్జాయతే పుణ్యశేషాత్ భక్తిస్మూలం సర్వసంసార ముక్తేః। గురూపదేశాద్విదితాత్మ తత్త్వాః శివస్వరూపం ప్రభజంతి సంతః। తత్సాధకానీహ బహూనిసంతి తత్రాద్యః స్యాన్మంత్రరాజః పురాణః। పంచాక్షరః సర్వదేవర్షి సేవ్యః। తస్మింశ్చైతజ్జగదాస్తే విలీనం। ............ యస్యత్రిపుండ్రం లసతే లలాటే తతి త్రిలోకీ లసతేచ సత్యం। ........ అంతర్లింగం జ్యోతిషా సంవిభాతం బహిర్లింగం హృదయే సన్నివిష్టం। శంభుః సాక్షాదద్వయాత్మా సఏవ రహస్యమేతన్న విదంతి లోకాః॥

పుణ్యావిశేషమువనే శివభక్తి కలుగును. భక్తిచే నీజగత్తంతయు మోక్షము నందగలదు. సత్పురుషులు గురూపదిష్ట మార్గమునను సరించి తత్త్వమును దెలిసికొని శివైక్యము నందుచున్నారు. శివతత్త్వప్రాప్తికి, సాధనములగు సర్వశ్రేష్ఠ మార్గములలో మొదటిది. పంచాక్షరీజపము, రెండవది భస్మలేపనము, మూడవది అంతర్బాహ్య లింగధారణము. ఇట్టి రూపముల తనలో నిముడ్చుకొని యద్వయుడుగా నున్న పరశివుని పామరులు కొందరు దెలియకున్నారు. (తత్త్వజ్ఞులగు వీరశైవులు తదాచరణ వలన ముక్తులగు చున్నారు.

సిద్ధాంతోప నిషత్తునందు:—

౩౪ సద్యోజాతాద్బ్రాహ్మణాః సంబభూవుః। వామదేవాత్ క్షత్రియా విశశ్చ ఘోరాచ్ఛూద్రా స్తత్పురుషాత్। శివస్య పంచాత్మకస్య గణా ఈశానతః స్యుః। అత్యాశ్రమిత్వాద్గణవంశజానాం లింగాంగ సంగినాం తత్రాజన్మాంత దీక్షా। యథా గంగా శివ సంగాత్తథైవ నసూతకం వా నాప్యశుచిత్వమేషాం గచ్ఛం స్తిష్ఠన్నిమిషన్నున్మిషన్వా స్వపన్ జాగ్రన్ లింగధారీ శుచిః స్యాత్। భుంజన్ మూత్రాద్యుత్సృజన్వా కదా చిన్నతత్రోచ్ఛిష్టం భజతే శుద్ధదేహీ శీర్షే కంఠే వక్షసి కక్షదేశే నాభౌ హస్తే సర్వదా ప్రాణలింగం ధార్యం। యథా। సంప్రదాయం పురస్తాద్గురోర్విదిత్వా హృదయం ముఖ్యముక్తం॥

సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యములనెడు శివుని

35 పంచముఖములనుండి, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రగణాధిపతులు క్రమముగ నుద్భవించిరి. గణవంశజులత్యాశ్రమములు కలవారు కావున శివైక్యముగు పర్యంతము ఎల్లప్పుడును సూతకాది బాధలులేక శివపూజనొనర్చుటకు అర్హులై

యుందురు. శుచ్యశుచికాలమునందును శివలింగమును వదలక ధరింతురు. తమ సంప్రదాయము ననుసరించి గురూపదేశ ప్రకారము, శిరస్సు, కంఠము, వక్షస్థలము, భుజము, నాభ్యుపరి, భాగములలో నెచటనైనను, శివలింగమును ధరించవచ్చును కాని, హృదయమే లింగధారణమునకు ప్రశస్తమైన స్థలమని శ్రుతి భగవతి బోధించుచున్నది.

లింగధారణోపనిషత్తునందు!—

౩౫ చతుర్వర్ణానాం ధారణం కుర్యాత్। పశుపక్షీ మృగకీటక లింగధారణముచ్యతే।..........పిండాజ్జననం తజ్జననకాలే ధారణముచ్యతే। సర్వలింగం స్థాపయతి పాణిమత్రం అయం మేహస్తా భగవానితి ధారయేత్... శ్రౌతశ్రౌతేషు ధారణం వేదోక్త విధినా శ్రౌతం శ్రుతిరహిత మశ్రౌతం సర్వవర్ణేషు ధారణం కైవల్య సిద్ధిర్భవతి॥

పిండ జననమునందే బ్రాహ్మణ క్షత్రియాది సమస్త వర్ణీయులకును, విధ్యుక్తముగ లింగధారణము గావించ వలయును, అయితే వైదికులకు వేదోక్తముగను, తాంత్రికులకు తాంత్రికముగను వారివారి యధికారానుసారము లింగధారణము గావించుటయే ముక్తిప్రదము.

ప్రసాద జాబాలోపనిషత్తునందు:—

౩౬ రుద్రభుక్తం భుంజీత రుద్ర పీతం పిబేద్రుద్రా ఘ్రాతం జిఘ్రేత్। యద్యద్వస్తు సమర్పితం లైంగం తత్తదేవ భుంజీయాత్॥

శివలింగమునకు రూప, రుచి, తృప్తి, గలవస్తువుల నర్పించియే తాననుభవింపవలెను. లింగార్పితముగాని పదార్థమును సేవించకూడదు. (శివార్పితమను రహస్యమును దెలియజాలని కొందరు శివనిర్మాల్యమును గూర్చి కుతర్కము గావింతురు గాన నట్టివారు కేవలమూఢులనియే దీనిభావము)

వీరలైంగ్యోపనిషత్తునందు:—

౩౭ ఆత్మలింగం యోధత్తే సోఽహమేవ। తదధిహిద్వివిధం లింగంఇష్టం ప్రాణంచ। యదక్షరం పరబ్రహ్మ తత్సూత్రమితి ధారయేత్। ధారణాదస్య సూత్రస్య నోచ్ఛిష్టం నాశుచిర్భవేత్..........అశిష్యాయ నదాతవ్యమలింగానా మదర్శనమలింగానామసాయుజ్యం। చతుర్వర్ణానాం లింగం మనుతే

సపాతకేభ్యః పూతోభవతి రుద్రమంత్ర జాపీభవతి। సముక్తో భవతి.........
సద్యోజాతముఖమాసీత్ రేణుకాచార్యారాధ్య ఉద్భవతి। వామదేవ ముఖమాసీత్ దారుకాచార్యారాధ్య ఉద్భవతి। అఘోరముఖమాసీత్ ఘంటాకర్ణగణేశారాధ్య ఉద్భవతి। తత్పురుష ముఖమాసీత్ ధేనుకర్ణ గణేశారాధ్య ఉద్భవతి। ఈశాన ముఖమాసీత్ విశ్వకర్ణ గణేశారాధ్య ఉద్భవతి। వేదాగమ సంప్రదాయ మహేశ్వర తత్త్వవిత్పంచా చార్యేభ్యో దీక్షితః లింగ స్పర్శనః సపవాసానం॥

శివలింగధారి శివుడే, అట్టి ఇష్టప్రాణరూపమగు లింగము నుపాసింపుము. ఇయ్యది శాశ్వతబ్రహ్మమనియే శివసూత్రమును (లింగమును) ధరించ దగును. ఈ సూత్రమును సూతకాదులయందు అశుచియని భావించకూడదు. శివార్పితమును ఉచ్ఛిష్టమన జనదు. శివ్యభావ శూన్యునకు లింగము నీయ వలదు. అలింగులకు సాయుజ్యముక్తిలేదు లింగధారి పాపముల నెగజిమ్మి, రుద్రమంత్రమును జపించి, ముక్తుడగుచున్నాడు. సద్యోజాత, వామదేవ అఘోర, తత్పురుష, ఈశానములనంబడు శివపంచముఖములనుండి శ్రీజగద్గురు రేణుకాచార్యారాధ్య, దారుకాచార్యారాధ్య, ఘంటాకర్ణ గణేశారాధ్య, ధేనుకర్ణ గణేశారాధ్య, విశ్వకర్ణ గణేశారాధ్యులను పంచాచార్యులు క్రమముగ నుద్భవించిరి. వేదాగమ సంప్రదాయముల నరసి పంచాచార్య పరంపరాగత గురువుల వలన దీక్షనుబొంది శివలింగమును ధరించి పూజింపవలెను. మాహేశ్వర తత్త్వకోవిదుడైన వాడే నేనని పరశివుడు బోధించెను.

౩౮ లింగాంగశోభా మోక్షమార్గైకనిష్ఠాః
లింగాంగ సామరస్యాచ్చ శరీరే లింగధారణాత్
నియమేనైవ ధృత్వా ముక్తా స్సంసార బంధనాత్॥ హంసోప ని॥

లింగధారణము వలననే సంసార బంధము వదిలి మోక్షము లభించు చున్నది. కనుక లింగాంగసామరస్యముకొరకు శరీరముపైన స్థూలలింగమునుధరించవలెను.

౩౯ అమృతస్య దేవధారణో భూయాసం
శరీరం మే విచర్షణం జిహ్వా మేమధుమత్తమా
కర్ణాభ్యాం భూరి విశ్రువం బ్రహ్మణః కోశోఽసి
మేధయాపి హితః శ్రుతం మే గోపాయేతి। తైత్తిరీయ।

మోక్షమునకై శివరూపమైన శివలింగధారణముగల వాడనగుదును. నాయొక్క

శరీరము పాపరహితమైనది. యగుగాక, నానాలంకయు అతిమధుర భాషణము గలదగుగాక, నాయొక్క చెవులచేత శివజ్ఞానమునే వినెదను. శివుడు ఉపల ధాధిష్ఠానము గలవాడు. లౌకికప్రజ్ఞచేత ఆవరింప బడినవాడును అయియున్న నాయొక్క శ్రవణపూర్వకమైయున్న భక్తి జ్ఞానాధికమును కాపాడుగాక.

ఇట్లు వేదాగమ పురాణేతిహాసోప నిషత్ప్రమాణములచే లింగధారణ మావశ్యకమనియు అదియే సంసారబాధమును భేదించి ముక్తి నిచ్చునదనియు, యిది లేకున్న మనుష్యులు సంసారసాగరమునుండి తరించలేరనియు, బ్రాహ్మణాది సమస్త వర్ణములవారికి కూడ లింగధారణ మావశ్యకమనియు, వీరశైవులకు లింగాంగ సాయుజ్యమే జీవన రహస్యమనియు, చెప్పి లింగధారణము ప్రతిపాదింప బడినది.

## లింగధారణాచ్చన సనాతనత్వము

బహు ప్రాచీనకాలమునుండి లింగారాధనము ప్రచారమునందు గలదు. వేదాగమోపనిషత్పురాణేతిహాసములందు గూడ దానియొక్క ప్రాశస్త్యము విస్తారముగ వర్ణింప బడినది.

మహాభారత అనుశాసనపర్వము ౧౪ వ అధ్యాయమునందు
ఉపమన్యుమునియు శ్రీకృష్ణునకు

యస్య బ్రహ్మాచ విష్ణుశ్చ త్వం చాపి సహ దైవతైః
అర్చయేధాః సదాలింగం తస్మాచ్ఛ్రేష్ఠతమో హిసః॥ ౭౨

ఎవని (శివుని) లింగమును బ్రహ్మవిష్ణ్వాది దేవతలు మరియు నీవుకూడ ఎల్లప్పుడు పూజించుచుండుదో అట్టి శివుడు సర్వోత్కృష్టుడే యగును అట్టి శివలింగ పూజయే సర్వాభీష్ట ప్రదము

యాజ్ఞవల్క్య ఇతిఖ్యాత ఋషిః పరమధార్మికః
ఆరాధ్య స మహాదేవం ప్రాప్తవా నతులం యశః॥ ౭౩
వేదవ్యాసశ్చ యోగాత్మా పరాశరసుతో మునిః
సోపిశంకర మారాధ్య ప్రాప్తవానతులం యశః ౭౪

పరమ ధార్మికుడయిన యాజ్ఞవల్క్యుడను సుప్రసిద్ధ ఋషియు మహాదేవుని పూజించియే అసదృశమైన కీర్తిని పొందెను; పరాశరుని పుత్రుడైన వ్యాస

మునియుకూడ శంకరు నర్చించియే అనన్య సాధారణ కీర్తిని సంపాదించెను. ఈ మొదలయిన వాక్యములను ఉదాహరించినవాడై శివలింగపూజా ప్రభావమును బోధించెను. అటులే లింగపూజయే శివానుగ్రహ ప్రాప్తికి ఉత్తమోపాయమని

"సర్వభూతభావం జ్ఞాత్వా లింగమర్చయతి ప్రభోః
తస్మిన్నభ్యధికాం ప్రీతిం కరోతి వృషభధ్వజః॥

ఎవడు శివుడు సర్వభూతమయుడని భావించి, లింగరూపుడయిన ఆ పరమాత్మని భక్తిచేత నర్చించునో, అతనిని వృషకేతనుడయిన ఆ శివుడు అతిశయముగా ప్రీతించుచున్నాడు యని మహాభారత ద్రోణపర్వము అధ్యాయమునందు వ్యాసమునియు కంఠోక్తిగా చాటుచున్నాడు. ఇదే అభిప్రాయమును ఆ మహాఋషియే శివమహాపురాణ విద్యేశ్వర సంహితయందు

న లింగారాధనాదన్యత్పుణ్యాం వేదచతుష్టయే
విద్యతే సర్వశాస్త్రాణామేష ఏవ వినిశ్చయః॥ ३౧

లింగపూజకు సమానమైన పుణ్యము మరొకటి లేదని నాలుగు వేదములు జెప్పుచున్నవి. ఇట్లు శాస్త్ర నిశ్చయము గలదని చెప్పి యున్నారు మరియు భాగవత దశమస్కందము ౬౮వ అధ్యాయమునందు

ఆరాధ్య దేవదేవేశం శంకరం లోకశంకరం
తపసాతోష యిత్వా తం కైలాసగిరివాసినమ్
రుక్మిణ్యాం తనయం లేభే దగ్ధకామం పునర్హరిః॥

కృష్ణుడు సకలదేవతాసార్వభౌముడును, లోకమునకు సుఖము గలుగజేయువాడు కైలాసనివాసియు నయిన శంకరుని పూజించుటచే తపస్సుచేత సంతోషింపజేసి దహింపబడిన తన కొమారుడయిన మదనుని మరల రుక్మిణియందు బొందెననియు చెప్పబడినందున శివపూజా సనాతనత్వము వెల్లడి యగుచున్నది.

లోకవిఖ్యాతులయిన వ్యాసమహాఋషులు శివభక్తిని వెల్లడి జేయుటకై తమ పేరుచేత "వ్యాసేశ్వర" మను శివ లింగమును స్థాపించి, తాము ఘంటాకర్ణ శివాచార్యుల శిష్యులై లింగధారణ మహత్మ్యము నానాహేతులగా బోధించిరి. భరతఖండమునందు గల ప్రాచీన దేవతల యొక్క మూర్తులను శోధక దృష్టిచేత పరిశీలించిన, ప్రతిదేవతయొక్క హస్తమునందుగాని కంఠము నందుగాని లింగధారణమున్నట్లు కనబడుచున్నది. భరతఖండమునందు అత్యంత

6

ప్రసిద్ధములనబడు పండరు పురమునందుగల విఠోబనామకమైన విష్ణుమూర్తి యొక్క మస్తకమునందునూ, బార్సీపట్టణమునందు ప్రకాశించుచున్న భగవంత నామకుడయిన విష్ణుమూర్తియొక్క మస్తకమునందునూ బళ్లారి మండలమునందు నరసింహదేవుని గుట్టయందు శోభించుచున్న నృసింహ మూర్తియొక్క హస్తమునందును లింగధారణముండుట లోక ప్రసిద్ధమే మై యున్నది.

లక్ష్మ్యాది శక్తయస్సర్వా శ్శివ భావ విభావితాః
ధారయంత్యలికాగ్రేషు శివ లింగ మహర్నిశం ॥

అను సిద్ధాంత శిఖామణియొక్క ప్రమాణముచేత, లక్ష్మి మొదలయిన సమస్త శక్తి గణముకూడ లింగధారణయుక్తులై యుండిరని స్పష్టమగుచున్నది ఈవిషయమునందు శక్తిపీఠములలో అత్యంత సుప్రసిద్ధమైన కొల్లాపురము మహాలక్ష్మియొక్క మస్తకము నందునూ, కాశ్మీరదేశము నందుగల శారదాదేవియొక్క మస్తకమునందును, తులిజాపురము భవానియొక్క మస్తకమునందును, కంచికామాక్షియొక్క మస్తకమునందునూ, కాశీ విశాలాక్షియొక్క మస్తకము నందును, ఇప్పటికి శోభించు చున్న లింగధారణమే బలమైన సాక్షియైయున్నది. దీనివలన లింగధారణము దేవానుదేవతలకునుమాన్యమనియే తెలియును జగత్తు నందు తమ తపః ప్రభావముచేతను, మహిమ ప్రభావముచేతను జ్ఞానప్రభావముచేతనూ, వైరాగ్యప్రభావముచేతనూ, అసాధారణమైన కీర్తిని సంపాదించి ఇప్పటికి కీర్తికాయులై ప్రకాశించుచున్న అగస్త్య, గౌతమ, దూర్వాస, దధీచి, సానంద, వ్యాస, కశ్యప, ఉపమన్యు, హరకంఠులను మొదలైన అసంఖ్య మహాఋషులుకూడ లింగధారణమహిమను తెలిసికొని శ్రీజగద్గురువుల నాశ్రయించి లింగధారణమును పొంది, వారివలన లింగాంగ సామరస్య రూపజ్ఞానములను సంపాదించుకొని ముక్తులైన విషయము పాశుపత తంత్రము, కాశీ ఖండము, శ్రీశైలఖండము, మొదలైన గ్రంథములయందు విశేషముగా వర్ణింపబడియున్నది. లోకప్రసిద్ధులైన ఈ మహాఋషులేగాక నల, కకుత్స, పురూరవ యను చక్రవర్తులుకూడ లింగధారణ సంపన్నులై యుండిరనియు, ఆ కాలము నందు భరతఖండమంతయు శివమయమై యుండెననియు అనేక గ్రంథావలోకనము వలన గోచరమగుచున్నది.

చతుర్వేదాః లింగం ధారయంతి
ఋషయః శివలింగం ధారయంతి
అజహరయ శ్శివలింగం ధారయంతి
సురేంద్ర దైత్యాశ్శివలింగం ధారయంతి
తస్మాద్దేవా శ్శివలింగం ధారయంతి ॥ అధర్వణే.

చతుర్వేదములు, ఋషులు, బ్రహ్మ విష్ణ్వాదులు, సురులు, ఇంద్రాది దేవతలు, మరియు దైత్యులు అందరు శివలింగమును ధరించిరని అధర్వణవేదమందు గలదు.

ధారయేద్యస్తు హస్తేన లింగాకారం శివంసదా
తస్య హస్తస్థితం సిద్ధం మత్పదం సంపదాం పదం॥
బ్రహ్మవిష్ణు సురేంద్రాది దేవతాః పరమోమునిః
శిరోభిర్ధారయేత్యేతే శివలింగ మహర్నిశం॥
అక్షపాదాదయ సర్వే శక్త్యయస్సర్వదాముదా
ధారయంతి శిఖాగ్రేషు శివలింగం చ సాదరం॥
వినిర్భిద్య సదా గాత్రే వివరే లోహపాత్రకె
శివలింగం వినిక్షిప్య పూజయంతి చ రాక్షసాః॥
కంఠేషు హార కంఠోపి మునయో మానవ స్తదా
సర్వదా శివలింగంతు ధారయంతి యజంతి హి॥ వాతూలాగమే.

బ్రహ్మవిష్ణ్వాది దేవతలు శివలింగమును, శిరస్సునందు, ఇంద్రాదులు శిఖాగ్రము నందు, రాక్షసులు లోహపాత్రమునందు పూజించి దేహమునందును, మరియు మునులు మానవులు కంఠమునందును ధరింతురు మరియు పూజింతురు యని బ్రహ్మాది మానుష్య పర్యంతము లింగ ధారణము చెప్ప బడినది. మరియు

ఏవం సురాస్సగంధర్వాప్సరసోరగ రాక్షసాః
పూజయంతి సదాకాలం ఈశానం సురనాయకం॥
సర్వం లింగమయం లోకం సర్వం లింగే పతిష్ఠితం
తస్మాత్సంపూజ్యతేలింగం యదిచ్ఛేత్సిద్ధి మాత్మనః ॥

యీ ప్రకారముగా దేవతలు, గంధర్వులు, అప్సరసలు, ఉరగులు, రాక్షసులు, యెల్లప్పుడు సురనాయకుడయిన ఈశ్వరునినే పూజించు చుండిరి. సమస్తము లింగమయమైనది. కనుక ముముక్షువులు శివలింగమునే పూజించ వలయును.

బ్రహ్మా విష్ణు స్తదాశక్రో లోకపాలాశ్చ దేవతాః
లింగార్చన రతోఽహేతోః మానుషేషు చ కాకథా॥ లింగ పు॥

బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, దిక్పాలకాది సమస్త దేవతలు లింగార్చన నిరతులై అగ్రగణ్యులయిరి. కనుక మనుష్యులు కూడ తల్లింగార్చనమే చేయవలయును.

బ్రహ్మాది స్తంభ పర్యంతం సిద్ధి యోగముదాహృతం
లింగార్చన విహీనా నాం కుతో మోక్షః కుతో విధిః॥

లింగార్చన లేక బ్రహ్మాదుల కెవరికైనను మోక్షము సిద్ధింపదు

రౌద్రం సమభ్యర్చ్య హి లింగమాదౌ
శిలామయం చారు హరిస్తు భక్త్యా
సుదర్శనం వైష్ణవ మాద్యమగ్ర
మవాప్తవాన్ ఏష పరం పదం యత్॥ బ్రహ్మ కైవర్తమ్.

పూర్వకాలమునందు హరియు అత్యంత భక్తిచేత రుద్రస్వరూపమైన శివలింగమును పూజించి సుదర్శనమును వైష్ణవమును, పరమ పదమును బొందెను.

రౌద్రం లింగం మహావిష్ణు భక్త్యా శుద్ధం శిలామయం
చారుచిత్రం సమభ్యర్చ్య లబ్ధవాన్ పరమం పదం॥ పరాశర పు.

అను వాక్యములచేత విష్ణువుయొక్క లింగార్చనమే బోధింపబడినది. మరియు

బ్రహ్మ సర్వజగత్కర్తా యస్య లింగార్చనే సతు
భారతీ మాప్తవానాశు సపూర్వాం సర్వచేతనైః
యస్యలింగం సమభ్యర్చ్య మరుతస్సకలా అపి
లబ్ధవంత శ్శ్రియం పూర్ణా మిత్యేషా శాశ్వతీ శ్రుతిః॥ బ్రహ్మాండ॥

జగత్కర్తయైన బ్రహ్మయు ఆ శివలింగమును పూజించి భారతిని పొందెను. సమస్త దేవతలు లింగమును పూజించి పూర్ణ శ్రేయస్సును పొందిరి

విష్ణుబ్రహ్మాదయోదేవా మునయో గౌతమాదయః
ధారయంతి సదాలింగముత్తమాంగే విశేషతః॥
కశ్యపాత్రి భరద్వాజ నారదాది మహర్షయః
ధారయంతి సదాలింగముత్తమాంగే విశేషతః లింగ పు॥

బ్రహ్మ విష్ణ్వాది దేవతలును, గౌతమ కశ్యప భరద్వాజ, నారదాది మహాఋషులును, తమ ఉత్తమాంగమునందు ఎల్లప్పుడు లింగమును ధరించుచుందురు.

బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః
ఇంద్రాది లోక పాలాశ్చ సాధ్యాశ్చైవ మరుద్గణాః॥
విశ్వామిత్రో వశిష్ఠశ్చ కణ్వోగౌతమ ఏవ చ
అష్టావక్రో దధీచిశ్చ శైబ్యః శ్యాండిల ఏవచ॥
ఏవమన్యే మహాత్మానో మునయో బ్రహ్మవాదినః
లక్ష్మ్యాద్యాశ్శక్తయశ్చాపి మునిపత్న్యః పతివ్రతాః॥
లింగధారణ సంయుక్తాః లింగవ్రత పరాయణాః
స్థూలాంగే లింగసంయోగ విభేదే మరణోత్సుకాః॥ ఉపబృంహణే.

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ, ఇంద్రాది లోకపాలకులు, సాధ్యులు, దేవతలు, విశ్వామిత్ర, వశిష్ఠ, కణ్వ, గౌతమ, అష్టావక్ర, దధీచి, శైబ్య, శాండిల్యాది మహాత్ములు, మునులు, బ్రహ్మవాదులు, లక్ష్మ్యాది శక్తులు, మునిపత్నులు, పతివ్రతలు, లింగధారులై లింగవ్రత పరాయణులై యుండిరి. అకస్మాత్ లింగచ్యుతి గలిగిన ప్రాణత్యాగము జేయుచుండిరి. అనగా లింగమును తమ ప్రాణముగా భావించుచుండిరి.

లింగస్య ధారణం పుణ్యం సర్వపాప ప్రణాశనం
ఆదృతం మునిభిస్సర్వై రాగమార్థ విశారదైః॥

సర్వాగమార్థములను దెలసిన అనేక ఋషులచేత స్వీకరింప బడినదియు, సమస్త పాపములను నశింపజేయునదియు నయిన ఈ లింగధారణము నిజసుఖము నిచ్చునట్టి సామర్థ్యము గలది. కనుక లింగధారణము వలన మహాపుణ్యము లభించునని స్పష్టముగా జెప్పి లింగధారణ సనాతనత్వము ప్రకటింపబడినది.

ఇంద్రనీల మయం లింగం విష్ణుః పూజయతే సదా
బ్రహ్మమణి మయం లింగం పూజయత్యనిశం శుభం॥ ౨౧
ఇంద్రో రత్నమయం లింగం చంద్రః శుక్తి మయం తథా
భానుస్తామ్రమయం లింగం పూజయత్యనిశం శుభం॥ ౨౨
రౌక్మం లింగం కుబేరశ్చ పాశీచాలక్తమేవచ
యమో నీలమయంలింగం రాజతం నైరుతిస్తదా॥
కాశ్మీరం పవనోలింగం అర్చయత్యనిశం విభోః॥ అ.౭౮ స్కాందే ౨౩

37

విష్ణువు ఇంద్రనీలమయ లింగమును, బ్రహ్మ మణిమయ లింగమును, ఇంద్రుడు రత్నమయలింగమును, చంద్రుడు శు క్తిమయ లింగమును, సూర్యుడు తామ్రమయ లింగమును, కుబేరుడు సువర్ణమయలింగమును, వరుణుడు లక్కమయ లింగమును, యముడు నీలమయలింగమును, నైరుతి రజితమయ లింగమును, వాయువు కుంకుమలింగమును పూజించుచుండిరి.

ఏవం తే లింగితాస్సర్వే లోకపాలాస్సవాసవః
తథాసర్వేపి గంధర్వాః పాతాలే కిన్నరైః సహ॥

ఈ ప్రకారము సమస్త దేవతలు గంధర్వులు, యక్ష గరుడ కిన్నర కింపురుషాదులందరు లింగవంతులై యుండిరని సిద్ధమగుచున్నది. ఈ స్కాంద పురాణానుసారముగనే లింగపురాణమునందు కూడ లింగధారణ పూజాదుల వర్ణన విశేషముగ జెప్పబడినది. ఉదాహరణార్థము ఈదిగువశ్లోకములు వ్రాయబడుచున్నది.

శివధ్యానరతోభూత్వా శివలింగాంగ సంయుతః
శివేతర పరిత్యాగీ ధ్యాన యోగస ఉచ్యతే॥
యథా బాహ్యే శివం ధృత్వా పూజాం కుర్వంతి మానవాః
తథాహృది ప్రసన్నశ్చేద్ధ్యానం యోగస్స ఉచ్యతే॥ వీరాగమే
ఉరస్థలే హరిర్లింగం ధృత్వామూర్ధ్ని పితామహః
లింగస్థం మాం సమారాధ్య స్వం స్వం పదమవాపతుః॥
మల్లింగ మస్మకాద్యంగే ధృత్వా శక్రపురోగమాః
దేవా మాం లింగ మధ్యస్థం సంపూజ్య స్వం పదం యయుః॥
లక్ష్మీ సరస్వతీ ముఖ్యా దేవ్యో మల్లింగ మాదరాత్
ధృత్వా నిజాంగే తల్లీన భావాజగ్ముః పరం సుఖమ్॥ శంకరసం॥
అథరామగిరౌరామః పుణ్యేగోదావరీతటే
శివలింగం ప్రతిష్ఠాప్య కృత్వా పూజాం యథావిధి
భూతిభూషిత సర్వాంగో రుద్రాక్షా భరణైర్యుతః॥ శివగీత॥
దేవదేవస్య చింతాత్మా అజయో విష్ణురవ్యయః
సర్వరూపం భవం జ్ఞాత్వా లింగేర్చయతి తం ప్రభుం॥ భారత॥ద్రో.

కారణ పురుషులైన విష్ణ్వాది శ్రీరామకృష్ణులకుకూడ లింగధారణ పూజావిధులు

జెప్పబడి యున్నవి. మరియు వాల్మీకి రామాయణమునందు యుద్ధకాండము సర్గము ౧౨౬ యందు రాములవారు జానకితో ఇట్లనుచున్నాడు.

అత్రపూర్వం మహాదేవః ప్రసాదమకరోద్విభుః
ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః ౨౧
సేతుబంధ ఇతిఖ్యాతం త్రైలోక్యేన చ పూజితం
ఏతత్పవిత్రం పరమం మహాపాతక నాశనం॥ ౨౨

ఓ సీతా! ఏ జగదీశ్వరు డగు మహాదేవుని పూజించి రావణాసురుని జయించి నిన్ను దేగిలిగితినో, అట్టి రామేశ్వరక్షేత్ర మియ్యదియే! ఇది సర్వపాతక సంహార కారియైన పరమపవిత్రమైన సేతుబంధక్షేత్రము. ఇటనే శివుడుప్రసన్నుడై వరము లొసంగి నన్నుద్ధరించెనని రాముడు వచించు చున్నాడు.

యత్రయత్ర సయాతిస్మ రావణో రాక్షసేశ్వరః
జాంబూనదమయం లింగం తత్రతత్రస్మ నీయతే॥ ౪౨
బాలుకావేది మధ్యేతు తల్లింగం స్థాప్యరావణః
అర్చయామాస గంధాద్యైః పుష్పైశ్చాగరుగంధభిః॥ వా. రా.

రాక్షసులకు రాజైన రావణుడు దిగ్విజయ యాత్రా సమయము నందు ఎక్కడెక్కడ వెళ్లుచుండెనో అక్కడక్కడ సువర్ణ నిర్మిత శివలింగమును వెంట గొని పోవుచుండెను. ఇసుక వేదిక నిర్మించి దానిపై సువర్ణలింగమును స్థాపించి గంధపుష్ప ధూపదీపాదులతో పూజించు చుండెననికలదు.

## త్రిలింగ స్వరూపము.

శివలింగ స్వరూపం తే వక్ష్యామి శృణుపార్వతి
ఇష్టలింగం ప్రాణలింగం భావలింగ మితి త్రిధా॥ ౨౩
దీక్షా విధానాద్గురుణా యల్లింగం ప్రతిపాదితం
మంత్రోపదేశ సహిత మిష్టలింగ ముదాహృతం॥ ౨౪
తత్రదేహేంద్రియగుణః శివార్పిత నిజాంతరః
శివఏవ మనోలీనం ప్రాణలింగం తదుచ్యతే॥ ౨౫
జాగ్రదాది వ్యవస్థాసు జ్యోతిర్లింగైక్య మానసం
అజ్ఞానం నివృతం యస్మా ద్భావలింగం తదుచ్యతే॥ సూక్ష్మాగమే॥

శివుడు ఇష్ట, ప్రాణ, భావములను త్రిలింగములయొక్క స్వరూపమును పార్వతికి బోధించి యున్నాడు. దీక్షాకాలమునందు సద్గురువు మంత్రోపదేశముచేత ఏలింగమును శిష్యునకు ప్రసాదించుచున్నాడో ఆలింగమే ఇష్టలింగమన బడుచున్నది. దేహసంబంధ కర్మజ్ఞానేంద్రియములను శివార్పణబుద్ధిచే నిగ్రహించి శివునియందే మనస్సు లయించుటమే ప్రాణలింగము. మరియు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు మనస్సు జ్యోతిర్లింగము నందు లీనమైయుండ అజ్ఞాన నివృత్తి దేనితో గలుగుచున్నదో అదియే భావలింగము. అనగా గురుదత్తమైనదే ఇష్టలింగము, జీవమే ప్రాణలింగము, ఆత్మయే భావలింగమని అవగతమగుచున్నది.

## త్రివిధ లింగ ధారణము.

లింగధారణము నిరుపాధికము, సోపాధికమనియు రెండువిధము లైనది. దానిలో నిరుపాధిక లింగధారణము అంతర, బాహ్యమనియు రెండుభాగములై సోపాధిక లింగధారణము బాహ్యమనియు ఒకే విధమైనది.

౧. అంతర్లింగ ధారణము-

చిద్రూపం పరమం లింగం శాంకరం సర్వకారణం
యత్తస్య ధారణం చిత్తే తదాంతర ముదాహృతం॥

అను ఆగమవచన ప్రకారము సకల విశ్వోత్పత్తికి కారణమై సచ్చిదానందాత్మకమై యున్న, శివసంబంధమైన యే మహాలింగము గలదో దానిని తన హృదయ కమలమునందు ధ్యానరూపముచేత ధరించుటయే నిరుపాధికమైన అంతర్లింగ ధారణమని చెప్పబడినది.

౨ నిరుపాధిక బాహ్యలింగ ధారణము:- స్త్రీ మొదలయిన యే వస్తువులను చూచినను ఆయావస్తువుల నామరూపములను తీసివేసి అస్తి-భాతి-ప్రియ రూపముచేత అది లింగమేయని తెలిసి ఈ సకల జగత్తుయొక్క నామరూపములను వదలి మిగిలిన పరిపూర్ణ మహాలింగమునందు మనస్సును స్థిరపరచి అనుసంధానము జేయుటయే నిరుపాధిక బాహ్యలింగధారణము

3 సోపాధిక బాహ్యలింగ ధారణము:- స్ఫటికశిల శ్రీశైలాది మహా పర్వతశిల - చంద్రకాంతశిల - సూర్యకాంతశిల - వీనిచే నిర్మితమైన నేదో యొక లింగమును, పరీక్షించి శిల్పశాస్త్రప్రకారము పంచసూత్రములచేత సలక్షణమైన

స్నానాద్యభిషేకముల చేత పరిశుద్ధమైన శివజీవ కళలతో కూడి గురుదత్త ఇష్టలింగమును ధరించుటయే సోపాధిక బాహ్య లింగధారణమనిగణింపబడినది కనుక లింగధారణము స్థూల, సూక్ష్మ, కారణములని మూడు ప్రకారములు.

## స్థూలలింగము.

ఇష్టపూజాం స భక్తానాం అనుయచ్ఛతి సర్వదా
ఇష్టలింగమితి ప్రాహ తస్మా దాథర్వణీ శ్రుతిః।

యనునట్లు ఈ స్థూలలింగము తనభక్తులకు సదా కోరినవస్తువులను భాగ్యోదయమును గలుగజేయుననియు, అథర్వణశ్రుతి దీనినే ఇష్టలింగమనియు చెప్పుచున్నది.

ఇష్టి- యనగా పూజా-యేవస్తువయొక్క పూజచేత తన ఇష్టమనోరథము పూర్ణము కాగలదో అదియే ఇష్ట లింగమనబడును. గురువుచే యను గ్రహింపబడిన విశేష జ్ఞాన యోగము చేత తన సమస్త క్రియలు ఇష్ట లింగము నందే అణగు చున్నవి కనుక దీనినే క్రియా లింగమని శివాగమజ్ఞులైన వీర శైవులు చెప్పుదురు. దీనిస్వరూపము:- యిది దేహలింగమై మరియు స్థూలతత్త్వమై క్రియా రూపమై ఆనందరూపమై యుండును. దీనియందు పీఠము, కటి, వృత్తము, గోముఖము, నాళము, గోళకములను ౬ కళలు గలవు.

నమః పీఠమితి ప్రోక్తం శికారం మధ్యమీరితం
వాకారం గోముఖం వృత్తం యకారం గోలకం స్మృతం॥
ఓంకారం లింగమాఖ్యాతం షడ్వర్ణం లింగముచ్యతే। సి. సారావళి.

నమకారములే పీఠము. శికారమే నడుము. వకారము గోముఖము వృత్తము. యకారము గోలకము. ఓంకారమే లింగము. ఇట్లు షడక్షరములే లింగ స్వరూపమైనవి.

ఇవి క్రమముగా- భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యమను ఆరు అంగస్థలములను నకారాది ప్రణవాంతము షడక్షరములను, ఆచారలింగ, గురులింగ, శివలింగ, జంగమలింగ, ప్రసాదలింగ, మహాలింగములను ౬ ప్రకారముల లింగస్థలములను, చూపెట్టుచున్నది మరియు పీఠమే ఇష్టలింగమై
38 నాళమే ప్రాణలింగమై, గోళకమే భావలింగమై, యుండును. అటులే నాళమే శక్తిస్వరూపమై గోళకమే శివస్వరూపమై యుండును. ఈ శివశక్తులచేత కూడిన

ఇష్టలింగమునందు శిలా ( పృథ్వి ) తత్వము గలిగి దానికి నీలవర్ణమైన కంథియు ఆచ్ఛాదనమై యుండును.

## లింగధారణ స్థలములు.

తల్లింగం ధారయేచ్ఛిష్య ప్రాణలింగ మిదంతవ
ఏకముక్త స్తదాలింగం నకదాచిద్వియోజయేత్॥
ఉత్తమాంగే గలేవాపి కక్షేవక్షస్థలే పివా
తథాహస్తతలేవాపి ప్రాణలిగం ధరేత్సుధీః॥
నాభౌచ హృదయే మూర్ధ్ని సర్వావస్థాసు సర్వదా
శ్రీలింగధారణం కుర్యాద్దేవి నిత్యం మమప్రియః॥ వీ.మా.ఆచా.సం॥

శిరస్సు, కంఠము, బాహువు, వక్షస్థలము, హస్తము, నాభి, హృదయము, వీటియందు లింగమును ఎల్లప్పుడు ధరించవలయును. ఎన్నటికిని లింగమును వదిలి యుండగూడదు.

## బాహ్య లింగార్చన క్రమము.

మునేవక్ష్యే విశేషేణ శ్రుణులింగార్చన క్రమం॥ ౧౪౨
పూజోపచార విధినా షట్త్రింశద్భేద మీరితం
పూజాద్వాదశధా ప్రోక్తా శివసిద్ధాంత తత్పరైః ౧౪౩
ఉపచారా స్తథాచైవ చతుర్వింశద్విదాః స్మృతాః
విభూత్యభ్యుక్షణం లింగే కరణం స్నపనస్యచ। ౧౪౪
అంగార తాపనంచైవ ధూప సంజీవనం తతః
ధూపప్రసారణం చైవ తతో గంధావతంసనం॥ ౧౪
అక్షతారోపణం చైవ పుష్పోపహారణం తతః
దీపప్రకాశనం చైవ నైవేద్యాన్న సమర్పణం ౧౪౬
తాంబూల స్వప్రదానంచ వస్త్ర ప్రావరణం తతః
ఏవం ద్వాదశధా ప్రోక్తా శివలింగార్చన క్రియా। ౧౪౭
ఆవాహనాసనార్ఘ్యాణి పాద్యమాచ మనంతతః
యజ్ఞోపవీత మాల్యాను లేపనాభరణానిచ॥ ౧౪౮

ఛత్రంచ చామరం చైవ తాలవృంతంచ దర్పణం
ఘంటా శంఖంచ గీతంచ వాద్యం నృత్తం ప్రదక్షిణం॥ ౧౪౯
నమస్కారః స్తుతిర్యాచ్నా విజ్ఞప్తిస్తు విసర్జనం
ఇత్యేవముపచారాశ్చ చతుర్వింశద్విధాః స్మృతాః॥ ౧౫౦
సమర్చనోపచారాణాం షట్త్రింశద్భేద భేదతః
షట్త్రింశత్తత్త్వమయ్యేషా శైవీ శ్రుతిరితి స్థితిః ౧౫౧
అథార్చనోపచారాణాం యోగక్రమ ఉదీర్యతే
భస్మస్నానాదిభిః శుద్ధి కరణం విధివత్తతః॥ ౧౫౨
సంవిత్పంచాక్షరీమంత్రానుష్ఠానం తత ఆసనం
కరాబ్జ పీఠరూపేణ తత ఆవాహనం పరం॥ ౧౫౩
ఆనీయాంగ స్థలాల్లింగం ప్రవేశ స్తత్కరస్థలే
విభూతభ్యుక్షణం నిత్యం సమంత్రక మనంతరం॥ ౧౫౪
అర్ఘ్యాది శైవ సామాన్యం తతఃస్నపన కర్మచ
అంగారతాపనాదీనిదశ ప్రోక్తాని పూర్వవత్॥ ౧౫౫
తతో యజ్ఞోపవీతాది విజ్ఞప్త్యంతా యథాయథం
విసర్జనం కరస్థస్య లింగస్యాంగే నివేశనం॥ ౧౫౬
ఏవం లింగార్చనం యస్తు కురుతే భక్తిపూర్వకం
తస్య పుణ్యఫలం సమ్యగ్వక్తుం నాలం చతుర్ముఖః ౧౫౭
లింగమధ్యే మహాదేవః సాక్షాన్నిత్యం వ్యవస్థితః
అనుగ్రహాయ లోకానాంతస్మాల్లింగం ప్రపూజయేత్॥ లింగపు॥౧౫౮

ఓ మునీశ్వరా! శివార్చనము పూజా మరియు ఉపచారములచేత ముప్పది ఆరు ప్రకారములైనది. పూజ పదిరెండు ప్రకారములైనది. ఉపచారము ౨౪ ప్రకారములైనది, లింగమునకు విభూతి ప్రోక్షణము, లింగమునకు స్నానము, అగ్ని యొక్క ఉష్ణస్పర్శ, ధూపస్పర్శ, ధూపప్రసారణం గంధలేపనము, అక్షతారోపణ, పత్రపుష్పధారణ, దీపనీరాజన, నైవేద్య సమర్పణ, తాంబూలార్పణ, వస్త్రధారణ యని శివపూజ ౧౨ ప్రకారములు.

ఉపచారము ఆవాహన, ఆసన, అర్ఘ్య, పాద్య, ఆచమన, యజ్ఞోపవీత, పుష్పమాలికా, అనులేపన, ఆభరణ, ఛత్ర, చామర, వ్యజన, దర్పణ,

ఘంటా, శంఖ, గాన, వాద్య, నృత్య, ప్రదక్షిణ, నమస్కార, స్తుతి, ప్రార్థనా, విజ్ఞాపనా, విసర్జన, యని ౨౮ ప్రకారము లైనది. అర్చనోపచారములు కూడి మొత్తము ౩౬ తత్వముల స్వరూపముగలదాయెను.

## ప్రాణలింగము.

సర్వతత్వమయః ప్రాణ స్సర్వజ్ఞాన మయశ్శివః
అనయోర్యోగమేవైతత్ప్రాణ లింగమిహోచ్యతే।

యను వీరాగమ వచన ప్రకారము సకలతత్వమయమైన జీవమే ప్రాణమన బడును. తత్వాతీత జ్ఞానమయుడే శివుడనబడును. అథవా జ్ఞానముచేత తెలియ దగిన వస్తువే చేతనమయమైన లింగము ఆలింగమును దెలియు శక్తియే (జ్ఞానమే) ప్రాణమైయున్నది. అనగా శివలింగమునందు మనస్సుంచుటమే ప్రాణ లింగము అథవా హృదయ కమలమందు యేది మనోభావముల కగోచరమై సత్స్వరూపముచేత యుండునో అది ప్రాణలింగ మనబడును. ఈ లింగము చిద్రూపమై మంత్రస్వరూపమై యుండును. ఈ చిద్రూపు యోగులకు మాత్రము కాన్పించును కనుక ఇది స్థూల లింగమనబడును. మరియు ఇది దేహము నందుండుటమువలన అంతర్లింగ మనబడును.

బిందుస్వరూపామల మూలపీఠం
నాదస్వరూపం స్ఫురదూర్ధ్వ పీఠం
కలాత్మ తిర్యగ్గత గోముఖాద్యం
చిద్రూపలింగం హృదయాబ్జ సంస్థం॥

హృదయకమలమునందు సాక్షిరూపముగా వెలుగుచున్న యేచిన్మాత్రము గలిగి యున్నదో అదేలింగము; అట్టిలింగమునకు బిందునాదములే మూలోర్ధ్వ పీఠములు, కల రూపమే తిర్యగ్గత గోముఖము యను నట్లు నిరూపింపబడినది. ఈ రీతిగా హృత్కమలము నందు విరాజించుచున్న జ్యోతిర్లింగమే "సఏవప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః" (కౌ-౩-౮) ప్రాణస్యప్రాణమ్ (బృ...౪-౪-౧౮) యను ప్రమాణాను సారముగా ముఖ్యప్రాణమని ప్రసిద్ధ మైయుండు. అయినను దేహేంద్రియాదుల సంచలనమున కాధారభూతమైన ప్రాణవాయువునకు సహా ప్రేరకమైన దైవంమైన ప్రాణలింగమని చెప్పబడినది.

అంతర్జ్యోతిర్లింగము యొక్క అనుసంధానరూపమైన అంతర్లింగ ధారణము ముముక్షువులయిన జనులకు విహితమైనది.

సమస్త జగదాత్మాపి శంకరః పరమేశ్వర
భక్తానాం హృదయాంభోజే విశేషేణ విరాజతే ॥

సుఖమునిచ్చు పరమేశ్వరుడు (అనగా లింగము) సకల జగత్తు యొక్క ఆత్మ స్వరూపమై యున్నను తనభక్తుల హృదయమునందు అధికముగా ప్రకాశించును.

శరీరమందు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము వీటితో గూడిన అంతఃకరణము గలదు. అదే హృదయ కమలము. దీని యందే లింగ రూప పరబ్రహ్మము ప్రకాశించు చుండును.

విశుద్ధేషు విరక్తేషు వివేకిషు మహాత్మసు
శివస్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛన ధారిషు ॥

అను మహావాక్యముల ప్రకారము అత్యంత పరిశుద్ధాంతఃకరణము గల విరక్తులందు ఆత్మానాత్మ వివేకము గల వారియందు, మహాత్ముల యందు భస్మ రుద్రాక్షాది శివలాంఛన ధారుల యందు సర్వాత్ముడైన పరమ శివుడు (మహాలింగము) ప్రకాశించు చుండును. అది మలినాంతఃకరణాలందు గానరాదు.

చిద్రూపం పరమం లింగం శాంకరం సర్వ కారణం
యత్తస్య ధారణం చిత్తే తదాంతరముదాహృతం ॥

అను ఆగమ వచన ప్రకారము సకల విశ్వోత్పత్తి కారణమైన శివ సంబంధమైన మహాలింగమునే హృదయ కమలమందు ధ్యాన రూపమున ధరించుటయే నిరుపాధికమైన అంతర్లింగధారణమని చెప్ప బడినది.

అవ్యక్తం కారణం లింగం అక్షరం పరమం పదం
సద్గుణం శుద్ధ విజ్ఞానం హృది పశ్యంతి యోగినః॥ యోగసారమ్.

39 లింగమవ్యక్తమైనది. చరాచరజగమునకు కారణమైనది నాశరహితమైనది. శ్రేష్ఠమైనది. సద్గుణ యుక్తమైనది. శుద్ధ విజ్ఞానము గలది. కావున మోక్షమునిచ్చు శివలింగమును యోగీశ్వరులు హృదయమునందు యోగ దృష్టిచే చూచెదరు.

# అంతర్లింగము

ఒక సమయము నందు ఇంద్రాది దేవతలు విష్ణువును గురించి, ఓలక్ష్మీకాంతుడా నీవెల్లప్పుడు హృత్పంకజమందు శివలింగమునే సముపాసించు చుందువని చెప్పుటయే గలదు; కాని హృదుపాస్య వస్తువు లింగ రూపమైన దని మేమెట్లు తెలుసు కొనగలము? యని యడుగగా,

తతోఽవ్యయాత్మా స హరిః స్వహృత్పంకజ శాయినం
దర్శయామాస దేవానాం మురారిర్లింగమైశ్వరం ॥ వామన పు॥

అనంతర మవ్యయాత్ముడైన మురధ్వంసి యైన ఆవిష్ణువు తన హృదయము నందు విరాజించుచున్న ఈశ్వర సంబంధ లింగమును దేవతలకు చూపించెను.

అపరిచ్ఛిన్నమవ్యక్తం లింగం బ్రహ్మ సనాతనం
ఉపాసనార్థమంతస్థం పరిచ్ఛిన్నం స్వమాయయా॥

అని శ్రీ రేణుక శివాచార్యులు నిరూపించినట్లు పరబ్రహ్మాభిన్నుడైన శివుడే హృదయారవిందము నందు లింగ రూపుడై వెలుగు చుండునని నిశ్చయము.

ప్రాణాపాన సమాఘాతాత్కంఠమధ్యాద్యదుత్థితం
ప్రాణలింగం తదాఖ్యాతం ప్రాణాపాన నిరోధిభిః ॥

గురూపదేశ ప్రకారముగా యోగ మార్గము చేత మూలాధారమును బిగించి అపాన వాయువును ప్రాణవాయువుకు సంఘటింప జేసిన నాభి కంఠము వీటి మధ్యనుండి యేజ్యోతి ఉద్భవించునో అదే ప్రాణలింగమని శివయోగుల మతము.

ప్రాణేష్వంతర్మనసో లింగమాహుః ॥ అను అథర్వశిఖోపనిషద్వచన ప్రకారము ప్రాణములందు గల అంతస్థ మనస్సే లింగ మనియు, మరియు

ఊర్ధ్వం ప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి
మధ్యేవామన మాసీనం విశ్వేదేవా ఉపాసతే ॥

అను కఠవల్ల్యుపనిషద్వచనము ననుసరించి ప్రాణాపాన వాయువుల మధ్య ఆశీనుడైన విశ్వదేవుడైన ప్రాణలింగమును పూజించవలె ననియు,

ప్రాణో యత్ర లయం యాతి భాస్కరే తుహినం యథా
తత్ప్రాణలింగముద్దిష్టం తద్ధారీస్యాత్తదా కృతిః ॥

సూర్యుని యందు మంచు అడగి పోవునట్లు యేస్థానమందు ప్రాణవాయువు లీన

మై యుండునో అదే ప్రాణ లింగమని చెప్ప బడినది. ఆ ప్రాణలింగాను సంధా నము గల పురుషుడే ప్రాణ లింగ స్వరూపుడగును.

జ్ఞానినాం యోగయుక్తానామంతస్స్ఫురతి దీపవత్
చిదాకారం పరబ్రహ్మ లింగమ జ్ఞై ర్నభావ్యతే ॥

యోగసాధన సంపన్న శివయోగులకు స్ఫురణమైన, పరబ్రహ్మ మయమైన ఆ ప్రాణలింగము హృదయ కమలమునందు దీపము వలె ప్రకాశించు చుండును.

హృదయే బ్రహ్మ సోమసూర్యాగ్ని మండలే
నివాత దీపోపమస్థాయి హృద్యంతర్జ్యోతిః పురుమః ॥

యను ఉపనిషద్వచన ప్రమాణాను సారము పరబ్రహ్మ స్వరూప లింగము హృదయమందు జ్యోతివలె ప్రకాశించు చుండు ననియు, మరియు అట్టి ప్రాణ లింగము గురూపదేశము వినా గోచరము గాదనియు తెలియ వలెను.

అంతస్థితం పరం లింగం జ్యోతిరూపం శివాత్మకం
విహాయ బాహ్యలింగస్థా విమూఢా ఇతి కీర్తితాః ॥

అంతస్థ శివాత్మక జ్యోతి రూప శివలింగమును (అనగా ప్రాణలింగమును) విడచి అన్య ప్రాకృతిక లింగములైన స్థావర లింగములందెవరు తత్పరులై పూజింతురో వారు మూఢులని పిలువ బడుదురు.

సం విల్లింగ పరామర్శీ బాహ్యవస్తు పరాఙ్ముఖః
యస్సదావర్తతే యోగీ ప్రాణ లింగీ స ఉచ్యతే ॥

అందువలన బాహ్య స్థావర లింగములందు, తత్పూజా సాధనములందు, మనస్సు లేనివాడై అంతస్థిత జ్ఞాన రూపప్రాణలింగ విచారము నెల్లప్పుడు జేయు చుండు శివయోగియే ప్రాణ లింగియని పిలువ బడును.

మాయా వికల్పజం విశ్వం హేయం సంచింత్యనిత్యశః
చిదానంద మయే లింగే విలీనః ప్రాణ లింగవాన్ ॥

మాయా గుణ భేదము వలన జన్మించిన యీ జగత్తు పరిత్యాజ్య మైన దనియు, స్పష్టముగ భావించి యెల్లప్పుడు సచ్చిదానంద స్వరూప ప్రాణలింగము నందు మనో లయమును జేయుచుండు శివ యోగియే ప్రాణలింగియని పిలువ బడును.

సత్తా ప్రాణమయా శక్తిః సద్రూపం ప్రాణ లింగకం ॥

తత్సామరస్య విజ్ఞానాత్ప్రాణ లింగేతి కథ్యతే ॥

చిదాత్మక లింగమునకు ప్రాణమే పీఠమైనది. అజ్ఞాన లింగము నాదబిందుకలాతీతమైనది. ప్రాణము కూడ నాదబిందు కలారూపము గలది. కనుక అట్టిలింగమునకు ప్రాణమెట్లు పీఠమాయె ననిన.

కూటస్థచేతనోహం నిష్క్రియ ధామాహమపతర్క్యహం
ఏకోహమవికలోహం నిర్మల నిర్వాణ మూర్తి రేవాహం
నిరవయవోహమజోహం కేవల సన్మాత్ర సారభూతోహం ॥

అను ఆత్మ బోధోపనిషద్వచన ప్రకారము నేను సత్స్వరూపుడ నని గలుగు జ్ఞానమే ప్రాణశక్తి యనియు తెలియ దగినది. అట్టి జ్ఞానము లేని పక్షమున ఆశక్తికి జడత్వము ప్రాప్తించును కావున అజడము సద్రూపమైన ప్రాణ శక్తి రూపముచేత చిద్రూపలింగ సమేతమై యున్నదని తెలియ వలెను. ఇట్లుండగా ఆశివశక్తుల సామరస్యమును తెలియుట చేతనే ప్రాణ లింగయని పిలువ బడును

అంతర్గతం చిదాకారం లింగం శివమయం పరం
పూజ్యతే భావ పుష్పైర్యత్ప్రాణలింగార్చనం హి తత్ ॥

అను సిద్ధాంత శిఖామణి వచన ప్రకారము ప్రాణ లింగము హృదయ కమల మధ్యమునందు చిదాకారమై యుండును. సర్వోత్కృష్ట శివస్వరూప ప్రాణలింగమును బాహ్య ద్రవ్యములతో పూజించుటసాధ్యమై నందున అంతరంగ మానసిక ద్రవ్యముల చేతనే పూజింప వలయును. కనుక అంతఃకరణ వ్యాపారవిశేషముల చేత చేయ బడిన పూజయే ప్రాణలింగార్చనమని పొగడ బడినది.

అంతః పవన సంస్పృష్టే సుసూక్ష్మాంబర శోభితే
మూర్ధన్యచంద్ర విగళ స్సుధాసేకాతి శీతలే
బద్ధేంద్రియ నవద్వారే బోధదీపే హృదాలయే
పద్మపీఠేస మాసీనం చిల్లింగం శివవిగ్రహం॥
భావయిత్వా సదాకాలం పూజయేద్భావ వస్తుభిః
క్షమాభిషేక సలిలం వివేకో వస్త్రముచ్యతే
సత్యమాభరణం ప్రోక్తం వైరాగ్యం పుష్పమాలికా
గంధస్సమాధి సంపత్తి రక్షతా నిరహంకృతిః॥
శ్రద్ధాధూపో మహాజ్ఞానం జగద్భాసి ప్రదీపికో

భ్రాంతి మూల ప్రపంచస్య నివేద్యంతన్ని వేదనం
మౌనం ఘంటాపరిస్పందస్తాబూలం విషయార్పణాం
విషయ భ్రాంతి రాహిత్యం తత్ప్రదక్షిణ కల్పనా ॥
బుద్ధే స్తదాత్మికా శక్తిర్నమస్కార క్రియామతా
ఏవంవిధైర్భావపుష్పైరుపచారైరదూషితైః
ప్రత్యన్ముఖమనాభూత్వా పూజయేల్లింగమాంతరం ॥

హృదయ కమలమునందుగల బింద్వాకాశ మధ్యమే ప్రాణలింగస్థలము. ఆస్థలము ప్రాణవాయువుతో కూడినదై, అత్యంత సూక్ష్మాకాశముగలదై, పైనున్న బ్రహ్మ రంధ్రము లోని పూర్ణ చంద్రమండలము నుండి జారుచున్న అమృత ధారసేచన చేత మిక్కిలిచల్లనిదై, శివజ్ఞానప్రకాశము గలదై ఉన్న ఊర్ధ్వహృదయ కమల మనుస్థానమందు ౧౨ రేకుల కమలముగలదు. ఆ కమల మధ్య జ్యోతిర్మయమైన ప్రాణలింగము గలదు. దానిని సద్గురూపదేశముతో దెలిసి, మానసిక వస్తువుల చే పూజింప వలయును.

అనగా: శాంతియే అభిషేకము; నిత్యానిత్య వస్తు విచారమే వస్త్రము. సత్యమే ఆభరణము. ఇహపరఫలభోగ వైరాగ్యమేపుష్పమాలిక. చిత్తైకాగ్ర తయే గంధము అహంకార నిరహంకార రాహిత్యమే అక్షతలు. విశ్వాసమే ధూపము. జగత్స్వరూప ప్రకాశమైన మహాజ్ఞానమే దీపము. అభిమాన త్యాగమే నైవేద్యము. మౌనమే ఘంటానాదము. విషయాతిక్రమణమే తాంబూ లము. విషయ సౌఖ్యముల జెందకుండుటయే ప్రదక్షిణము. బుద్ధ్యాదివ్యాపా రములన్ని జ్యోతిర్లింగము నందు లయింప జేయుటయే నమస్కారము. ఈప్రకా రము ఆంతరిక నిర్దుష్టోపచారములచేత మనస్సును బంధించి ప్రాణ లింగ పూజ సల్పుచుండుటయే ప్రాణలింగార్చనమని శిద్ధాంత శిఖామణి యందు గలదు.

ఈ పూర్వోక్త ప్రాణలింగార్చనా రీతి చేత అంతరంగ క్రియా తత్పరుడై యున్న ప్రాణలింగియు, లింగ రూపుడైన శివునకు, అంగ రూపుడైన జీవునకు, సమాన సామరస్యాను సంధానమును సదా జేయు చుండుటయే సమాధియగును.

40 పరబ్రహ్మ మహాలింగం ప్రాణో జీవః ప్రకీర్తితః
తదేకభావ మనసాత్సమాధిస్థః ప్రకీర్తితః ॥

సకల జగదాది మూలమైన మహాలింగమే పరబ్రహ్మ నామకమైన పరతత్వము.

"ప్రాణారూఢో భవేజ్జీవః" అను ఆగమ వచన ప్రకారము ప్రాణమే జీవము. కావున శివ జీవులందు సమాన సమరసము గలిగించి, ఐక్యమునుజేసి, ధ్యానపరాయణుడైన వాడే సమాధిస్థుడని పిలువ బడును.

ఇట్టి ప్రాణలింగార్చనమును సల్పు సమాధిస్థుడైన శివయోగి అష్టాంగ యోగాఖ్యానముల యందు కడ తేరును. అతడే ప్రాణలింగి. ఈ పూర్వోక్త శివధ్యానము పుణ్య పాపమను యేరులు గలిగి అవిద్యాది పంచక్లేశములను ఆకులు గలిగి యున్న జనన మరణ రూప సంసార విష వృక్షమును నరకుట యందు గండ్ర గొడ్డలి వంటిది. మరియు అజ్ఞానమను రాక్షసుని కన్నుల తెర చుట యందు, సంసార రూపగాఢాంధకారమును తొలగించుట యందు ఈ శివ ధ్యానము ప్రచండ సూర్యాగ్ని వంటి దని తెలియ వలెను.

శివజ్ఞాన సంపన్నత్వముగల జీవునికే అంగమనియు, అట్టిశివజ్ఞానము చేత సాక్షాత్కరింప యోగ్యమైన వస్తువే లింగమని శివాగమజ్ఞులు దెలిపిరి. అంగ మని పిలువబడు జీవాత్మ నందు శివలింగము సామరస్యము చేత యుండును. ఆప్రకారమే శివలింగము నందు జీవము సామరస్యము చేత యుండునే కాని వేరె భిన్నాభిప్రాయము లేదు. తత్కారణము వలన బీజాంకుర న్యాయము వలె ఈ విధమైన ఉభయ జ్ఞానము యే ప్రాణలింగికి యుండునో అతడే అంగ లింగి యని పిలువ బడును. కావున ఆతని యందు ద్వైత జ్ఞానము లేదని తాత్పర్యము. ఈప్రకారముగా నెవడు ఈనిజ లింగమును పరముక్తి స్వరూ పముగా తెలుసుకొని ఆలింగ సమరసాంగుడై యుండునో అతడు దేహాయుక్తుడై యున్నప్పటికి పునః భవమును పొందని వాడై నందున ముక్తుడై అనగా జీవ న్ముక్తుడై యున్న అంగ లింగియే శివజ్ఞానియు, మహాగురువునై యుండును. ఈప్రకారముగా ఆంతరిక ద్రవ్యముల చేత ప్రాణలింగార్చనము జేయుచు శివా చారముచే కూడుకొని శివలింగ సమరసమైన అంగ స్వరూపము గల వాడే ఈనాలుగవస్థలముయొక్క ప్రాణలింగితన శివజ్ఞానముచే శరణుడని పిలువబడును.

## భావలింగము

తన అంతర్బహిర్భాగములందు లింగమే నిండి యున్నదను మనోవ్యాపా రమే భావము ఈభావమేవస్తువునందు లీనమానో అదియే భావ లింగము ఇది లోన యున్నందు వలన అంతర్లింగ మనియు, లోన బైట నిండి యున్నందు వలన పరాత్పర లింగమనియు దీనికి నామము గలదు. ఇది కలారహిత మైనది

కనుక భావనకే గోచరమగును. ఇది సమస్త లింగములందు ఉత్తమమై సద్రూప మైనదని జ్ఞానులు నిశ్చయించిరి. ఈలింగ మాత్మద్రై యున్నది.

ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణా శ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగ రచనా నిద్రా సమాధి స్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం ॥
దేహశ్శివాలయస్సాక్షాత్తత్రాస్తే పరమశ్శివ॥

అను సట్లుసప్త ధాతు నిర్మితమగు తనదేహమే శివుడుండు రాజధాని యనియు, (కైలాసమనియు) దాని యందున్న హృదయ కమలమే అంతః పురమనియు, మనస్సే శృంగార మంటపమని, బుద్ధియే పరమ పీఠమని, దాని పైన మూర్తి మంతమై ప్రకాశ మయమై యున్న తెలివియే లింగమని నమ్మి, ఆ నిరంజన వస్తువునందు మనస్సును లీనము జేయుటయే భావలింగపూజ. మరియు నడచు చున్నను, నిలచి యున్నను, నిద్రించి యున్నను, మేలుకొని యున్నను, మరి యేకార్యము జేయుచున్నను, అన్ని సమయములందు భావలింగానుసంధానుడై యుండ వలెను. అప్పుడాతడు చేయు సర్వ కార్యములు లింగ పూజను మిగిలి యుండవు. అనగా భోగసాధనమైన శరీరము శివపూజా సాధన మైనందున వాటిచే పుట్టిన సుఖాదులు సమస్తము లింగార్పిత మనియే భావించ వలెను.

# కరపీఠార్చనము

వీరశైవులు వామహస్తమునందు లింగము నుంచుకొనియే పూజించ వలయును కాని ఇతరత్ర గాదు. కరపీఠస్థ లింగార్చకులే వీరశైవులన బడుదురు. కాదేని శైవులన బడుదురు. కావున ఇతరార్చనల కన్న కరపంకజ పీఠార్చనమే శ్రేష్ఠ మని ఆగమ ప్రమాణములనేకములు గలవు. గ్రంథ విస్తర భీతిచే కొన్నిమాత్ర మిట ఉదహరింప బడుచున్నవి.

అథోచ్యతే బహిః పీఠం తతో న్యూనాధి కారిణః
లింగస్య నిత్య పూజాయాం కరపంకజమాదితః ॥
స్వ వామ హస్తం దేవేశి విభావ్య కమలాకృతిం
లింగం తత్కర్ణికా మధ్యే ప్రతిష్ఠాప్యర్చయే త్సదా॥ పార.ఆ. ౧౩

వీరశైవులు బాహ్యలింగార్చనమునకు యోగ్యమైన స్థానము కరపంకజమని నిశ్చ యించి నిత్య లింగ పూజాదులను జేయుచున్నారు. హస్తము నందు కమల మును భావించి తన్మధ్య ఆయిష్ట లింగము నుంచి, ఎల్లప్పుడు పూజించు చుండు రని పార్వతికి శివుడు వచించి యున్నాడు.

భూమిః సర్వార్థ నాశాయ తృణం విప్లవ కారణం
తత్ర సర్వోత్తమం దేవి పీఠార్థం కరపంకజం ॥
సర్వ దేవాత్మకం పద్మం సర్వ క్షేత్ర మయం శుభం
సర్వ సౌభాగ్య జనకం యత్ప్రోక్తం కరపంకజం ॥ ౩౦
తస్మాద్ద్విజనమాశ్రిత్య నిరాకులాత్మనాః సదా
యథా సంభావితా భక్త్యాహ్యర్చ్యే ల్లింగం కరాంబుజే ॥ ౪౧

అన్నిటికన్న కరపీఠమే శ్రేష్ఠమైనది. ఆకర పీఠమునందు భావింపబడిన పద్మము సర్వ దేవాత్మకమైనది. సర్వ క్షేత్ర మయమైనది. మరియు సర్వ సౌభాగ్యము గలుగ జేయునది. కావున సంస్కారితుడైన సద్గురువు నాశ్రయించి, కల్మష రహితుడై భక్తి చేత కరపీఠము నందు లింగమును పూజించ వలెను.

అనంత గుణితం పాణి పంకజే మమ పూజనం
జ్ఞాత్వా గురుముఖాత్ సమ్యక్ పాణి పద్మే సమర్చయేత్ ॥ ౬౨
యథా యోగ్యముమే లింగం యథాపంచాక్షరీ మనుః
యథైవ శ్రీగురోర్నామ తథైవ కరపంకజం ॥ ౨౦
స్వరూపం కర పద్మస్య జ్ఞాత్వాగురుముఖాత్సుధీః
అభిషేక పరో నిత్యం మహామేవ స ఈశ్వరీ ॥ ౨౧

గురుముఖము నుండి మంచిని తెలిసిన వాడై లింగమును పాణి తలమందు పూజించ వలెను. ఎట్లు లింగము, పంచాక్షరీ మంత్రము, శ్రీగురువు యొక్క నామము శ్రేష్ఠమో అటులే కరపంకజము కూడ అతి శ్రేష్ఠ మైనది. కనుక బుద్ధి మంతుడైన వాడు గురుకృపవలన కరపద్మము యొక్క స్వరూపమును బాగుగ నెరిగిన వాడై లింగార్చనము జేయు వాడు సాక్షాత్ తానే యగు నని పరమ శివుడు పార్వతీ దేవికి బోధించి యున్నాడు.

శ్రీ కరకమలమునందు లింగమునుంచి పూజించుటయే శ్రేష్ఠము. ఇట్లు ముముక్షువులైన సమస్త వీరశైవులచే ఆచరింప దగినది.

# లింగపూజ ఫలాఫలములు

యస్యలింగం సమభ్యర్చ్య మరుతః సకలా అపి
ప్రపేదిరే శ్రియః పూర్ణా స్తే పూజ్యాసర్వ చేతనైః శివధర్మే॥

సమస్తమైన దేవతలు ఆ శివలింగమును పూజించి పూర్ణ శ్రేయస్సునుపొందిరి. సర్వత్ర పూజనీయులయిరి. కనుక లింగము యశస్సునిచ్చు సామర్థ్యము గలది.

సంసార దుఃఖ కాంతారే నిమజ్జశ్చ మహాతపే
చక్రవద్భ్రమతే దేవి లింగార్చన వివర్జితః॥

లింగార్చన విహీనులు సంసారమను దుఃఖారణ్యమునందు చక్రమువలె పుట్టి చచ్చుచుందురు. అని శివగీతలయందుకూడ జెప్పబడినది.

శివార్చన విహీనోయం పశురేవ నసంశయః
స తు సంసార చక్రేస్మి న్నజస్రం పరివర్తతే। శివయోగ ప్రదీపికా.

యను వచనప్రకారము యెవడులింగమును పూజించడో అతడు పశుస్వరూపుడు. జననమరణములుగల సంసారచక్రమునందు యెల్లప్పుడు దిరుగు చుండును

"న శివార్చన సామ్యోస్తి ధర్మోన్యో భువనత్రయే"

భువనత్రయమందు శివపూజకు సమానమైన అన్యధర్మము లేదని స్పష్టమగు చున్నది. కనుక శివలింగమును యెల్లప్పుడు పూజింప వలయును.

బ్రహ్మాది స్తంభపర్యంతం సిద్ధయోగ ముదాహృతం
లింగార్చన విహీనానాం కుతో మోక్షః కుతో విధిః॥

లింగార్చనలేని వానికి మోక్షమే సిద్ధించదని తాత్పర్యము.

సర్వం లింగమయం లోకం సర్వలింగే ప్రతిష్ఠితం
తస్మాత్సం పూజయే ల్లింగం యదిచ్ఛేత్సిద్ధి మాత్మనః॥ శివధర్మే॥

తన ఆత్మయొక్క సిద్ధికోరినవాడు జగస్వరూపుడయిన పరశివ లింగమునే పూజించవలయును. అని ఆత్మసిద్ధి లింగపూజ వలననే గలుగునని చెప్పబడినది.

లింగాంగ సంగినోవత్స పునర్జన్మ నవిద్యతే
యుగపత్ జ్ఞానసిద్ధిస్యాత్ తతో మోక్ష మవాప్నుయాత్॥ శం. సం॥

41 లింగధారికి పునర్జన్మములేదు. జ్ఞానసిద్ధి అతితీవ్రముగా గలుగును. మరియు క్రమశః మోక్షము ప్రాప్తించును.

స్వప్నకాలే కృతపాపం బ్రహ్మహత్యాదికం చయత్

యథాప్రబోధ సమయే తన్మిథ్యా భవతి స్వయం॥ ౭౪
తథాకృతం మహాపాపం లింగధారణతః పరా
యదస్తి తల్లయం యాతి లింగధారణతః పరం॥ ౭౫ శంకరసం॥౮ 3

స్వప్నమునందు సంభవించినట్టి బ్రహ్మహత్యాది పాపము జాగ్రదవస్థయందు ఎట్లు లేకుండ పోవునో నట్లే శివలింగధారణముకన్న మొదలు చేయబడిన ఏ మహాపాపము గలదో అదంతయూ లింగము నంగమందు ధరించిన తోడనే నాశనమగునని శంకరుడు కుమారస్వామికి ఉపదేశించెను. కనుక లింగపూజ వలన మహత్తరమైన పాపములు నివారింప బడుచున్నవి. మరియు

జన్మాంతర సహస్రేషు యజ్ఞదానాదిభిర్ద్విజాః
నరాణాం క్షీణపాపానాం శ్రద్ధాలింగార్చనే భవేత్॥
యజ్ఞాస్తపాంసి దానాని తీర్థసేవా వ్రతం జపః
సర్వం లింగార్చనా హీనం పలాయనం భవేద్ద్విజాః॥
సర్వేషా మేవధర్మాణాం మల్లింగారాధనం వరం
మల్లింగం శక్తి సహితం పూజయేత్సర్వదా శుచిః॥

అనేక జన్మములందు యజ్ఞదానాదులు జేసినందున పాపములు నశించినతర్వాత లింగార్చనమునందు శ్రద్ధగలుగును. మరియు లింగార్చన విహీనమైన యజ్ఞములు, తపములు, దానములు, తీర్థములు, వ్రతములు మరియు జపము లన్నియు నిష్ఫలము లగుచున్నవి. కనుక సమస్త కర్మములకన్న లింగారాధనమే శ్రేష్ఠమైనది. కనుక నాయొక్క శక్తి సహితమైన లింగమును ఎల్లప్పుడు భక్తులు, పూజించవలయునని శివుడు చెప్పుచున్నాడు.

లింగార్చనము వలన సమస్తపాపములు నశించును, మోక్షములభించును, శివలోకప్రాప్తి గలుగును. సమస్తదానముల, తీర్థముల, యాగముల ఫలములు గలుగును. ఘోరబంధనమునుండి ముక్తిగలుగును. పరమపదము సిద్ధించును, నరజన్మము అనగా పునర్జన్మములు గలుగకుండునని స్కాంద పురాణమునందు అనేక ప్రమాణవాక్యములు గలవు

(౧) చాంద్రాయణి సహస్రాణి తప్తకృచ్ఛ్రి శతానిచ
సర్వవ్రతాని చీర్ణాని లింగస్యాభ్యర్చనే కృతే॥
(౨) గవాం కోటి సహస్రస్య యజ్ఞకోటి శతస్యచ

దానే యత్ఫలమాప్నోతి సకృదభ్యర్చితే శివే॥
(3) యేర్చయంతి మహాదేవం తేయాంతి పరమం పదం
సకృదభ్యర్చితేలింగే గర్భజన్మ నవిద్యతే
సదా సమర్చయేద్యస్తు సయాతి పరమాంగతిః॥
(4) స్వర్గే యజ్ఞ ఫలం భుక్త్వా దానానాం చ ఫలంతథా
తేవిశంతీహ గర్భేషు లింగార్చన వివర్జితాః॥
లింగార్చనరతానాం చ గర్భేజన్మ నవిద్యతే
గర్భవాస భయాద్భీతో లింగార్చన పరోభవేత్॥
గర్భవాసే మహాదుఃఖం యస్త్విదం ఛేత్తుమిచ్ఛతి
సోభ్యర్చయేత్సదాలింగం భక్తిభావేన శాంకరం॥
(5) దేవత్వం లోకపాలత్వం ఋషిత్వం దానవేశతాం
లోకేశ్వరత్వ మీశత్వం లింగస్యాభ్యర్చ నాద్భవేత్॥
(6) లింగార్చనాత్పరోధర్మో నాస్తినాస్తి జగత్రయే
లింగార్చనాత్పరం శ్రేష్ఠం నభూతం నభవిష్యతి॥

ఈ లింగపూజ సర్వత్రతులు జేయదగును. లింగపూజయందు జాతికులభేదముల నెంచవలదు. అందరికి పూజాధికారము మరియు ఫలము సమానమే గలదు.

యస్సర్వదార్చ యేల్లింగం సరుద్ర ఇవ భూతలే
పాపీహా సర్వ మర్త్యానాం దర్శనాత్స్పర్శనాదపి॥
విధవాశ్చ సువాసిన్యో బ్రాహ్మణాః క్షత్రియాశ్శివం
శూద్రాశ్చేతర జాతీయాః కుర్యుర్లింగార్చనం సదా
న జాతిభేదో లింగార్చే సర్వేరుద్ర సమాస్స్మృతాః
యశ్శివం పూజయేన్నిత్యం మహాపాతక సంభవైః
దోషైః కృతైర్నలిప్యేత పద్మపత్రమివాంభసా॥ స్కాందే॥

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులే కాక మరియే జాతివాడయినను, స్త్రీలలో, విధవలైనను, సువాసిని లైనను శివలింగమును పూజింప వచ్చును. ఇట్టి శివ లింగార్చనమునందు జాతిభేదముల నెంచకూడదు. కనుక ఎట్టి వాడయినను లింగము నర్చించి తన మహాపాతకములను బోనాడదగునని శివలింగ పూజ ఫలము సర్వత్రులకు సమానమని చెప్పబడినది. ఇంతియేకాక,

కిం వేదైః కిం తతశ్శాస్త్రైః కిం తపోభిరథవ్రతైః
శివం సంపూజ్యయే న్నిత్య ముపదేశోయముత్తమః॥

శివలింగ పూజనమే ముఖ్యోపదేశము శివలింగార్చకునకు వేదములు, శాస్త్రములు, తపములు, వ్రతములు, నిష్ప్రయోజనములని తెలియవలయును.

లింగమధ్యే మహాదేవః సాక్షాద్దేవో వ్యవస్థితః
అనుగ్రహాయ లోకానాం తస్మాల్లింగం ప్రపూజయేత్॥ వీ॥శై॥ప్రదీ.క

శివలింగ పూజవలన శివునియొక్క అనుగ్రహమును పొందగలుగుదుము. ఏల ననగా సాక్షాత్ పరశివుడే లోకులకు అనుగ్రహించుటమునకే లింగమధ్యమునందు నివసించి యుండును. కనుక లింగపూజ అవశ్యముగ జేయ వలయును.

ఇదమఖిల రహస్యం లింగపూజా విధానం
సుజన సురమునీంద్రైః రాపృతం భక్తిమద్భిః
భవభయ పరిహారం వేదవేదాంత సారం
తమపి కథయసర్వాం లింగపూజా రతాయ॥ శంకర సం॥

ఈ లింగపూజా విధానము అత్యంత రహస్యమైనది. భక్తివంతులయిన సుజనులు దేవతలు, మునులు దీనిని ఎల్లప్పుడు సలుపుచుందురు దీనిచే భవము మరియు భయము రెండును పరిహారమగుచున్నవి. ఇది వేదవేదాంత సారమైనది. కనుక నీవుకూడ లింగపూజా రతులయిన వారలకు లింగపూజా విధాన మంతయు చెప్పుముయని శివుడు స్కందునకు బోధించెను.

ఇట్లు వేదాగమ పురాణేతిహాసోప నిషత్ప్రమాణములచేత లింగధారణము లింగ పూజా విధానము, కరపీఠలింగ పూజాధికృత, త్రివిధలింగార్చన ఇత్యాది విషయములు ప్రతిపాదింప బడినవి శివుడు లింగరూపములచేతనే పూజనీయుడని సిద్ధించ బడినది. కనుక ప్రతి వీరశైవుడు తన ఇష్టప్రాణ భావలింగములను దెలిసి త త్త్రివిధలింగ పూజలను సల్పుచు లింగాంగ సామరస్యమును ముక్తిని పొందగలరని కోరుచున్నాను.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి శ్రీవీరశైవసిద్ధాంత శిరోమణి యందు లింగతత్వమను
నాలుగవ ప్రకరణము సమాప్తము.

---

ఓం

శివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి

# శివయోగము.

## ఐదవ ప్రకరణము.

యస్యజ్ఞాన క్రియారూపా శక్తిర్భవి విముక్తిదా
సర్వజ్ఞాన విధాతారం తం వందే పరమేశ్వరం॥

శివయోగమనగ శివార్చనము. దీనికి శివజ్ఞాన, శివభక్తి. శివధ్యాన, శివవ్రతము లని నాలుగు అంగములు గలవు. "తచ్చజ్ఞానం బ్రహ్మాత్మైక్య గోచరం" అనగా తత్వమస్యాది వాక్యముచే గలుగు జీవబ్రహ్మాల అభేదవిషయకమునే జ్ఞానమని చెప్పుదురు. మరియు తనస్వరూప ప్రకాశమే ముక్తి. ఈ స్థూల సూక్ష్మ కారణ శరీరసంబంధపాశ, రోగ, రాగాదులు మరియు వాసనాదులు కేవలజ్ఞానము వలననే లయము గానేరవు. మరియు స్వస్వరూపమైన శివునిశక్తియు కూడా వికాసమును పొందనేరదు. తన స్వరూపమును తెలిసికొని ఆ స్వరూప చింతనము చేయుచుబోగా తనస్వరూపము ప్రకాశమగును. తన సర్వజ్ఞత్వాది శక్తులు వికసించెదవు. స్వరూపచింతనకు మనస్సుయొక్క స్వస్థత అవశ్యకము ఆ మనోశాంతికి శరీరారోగ్య మావశ్యకము. అందువలననే "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" యని పెద్దలు చెప్పియున్నారు. కనుక సాధకుడు మొదలు తన శరీరమును ఆరోగ్య స్థితియందుంచుకొన వలెను. ఈ స్థూల శరీరముయొక్క ఆరోగ్యమునకై హఠయోగము, సూక్ష్మశరీరము యొక్క కామక్రోధ రూపమైన రోగనాశనమునకై సవికల్ప శివయోగము, కారణ శరీరముయొక్క అజ్ఞాన నాశనమునకై నిర్వికల్ప శివయోగము అత్యావశ్యకము. దీనినే పతంజలి ఋషులు సమాధి యనియెదరు. దీనినే మన వీరశైవాచార్యులు లింగాంగ సామరస్యమనుచున్నారు. ఏలననగా

"పంచాచార పురస్కృతో ష్టావరణాంతర్గత పంచాక్షర మంత్రార్థను సంధానరూప లింగాంగ సామరస్యం మనోవృత్తి విశేష స్సాధనం"

అనగా భృత్యాచార, శివాచార, గణాచార, లింగాచార, సదాచారములను పంచా చారములచే కూడిన

భస్మరుద్రాక్ష లింగాని గురుర్మంత్రం తథాచరః
పాదోదక ప్రసాదౌచ శైవాష్టావరణానిహి॥

యని చెప్పబడిన అష్టావరణములందు గల పంచాక్షర మంత్రార్థ రూపుడయిన సర్వాత్మక శివుడే తానను శివజీవుల ఐక్యమను అను సంధాన రూపమైన లింగాంగ సామరస్యమే మనోవృత్తి విశేషము. ఇదియే మోక్షమునకు సాధనము మరియు "సమ్యగ్యోగోహిసంయోగః" యని లింగాంగైక్యరూప ముక్తిఫలములు యోగమని చెప్పియున్నారు. "మానవశ్శివయోగేన శివోభవతి సర్వదా" సాధన రూపమైన శివయోగముచేత శివత్వ ప్రాప్తియగు చున్నందున మనుష్యుడు శివయోగముచేత శివుడే యగుచున్నాడు. ఇక యోగమనగా నేమి?

యోగోనామ హి సంబంధో జీవాత్మ పరమాత్మనోః
ధ్యాన యోగేతి వాక్యేన యోగనిష్ఠా ఉదాహృతా॥
అంగం జీవః పరం లింగం సామరస్యం తయోః శుభం
యోగ ఇత్యుచ్యతే సద్భిః శివతత్వార్థ వేదిభిః॥

అనగా లింగాంగరూప శివజీవుల సంబంధరూప సామరస్యమే యోగము. ఈ యోగనిష్ఠులైన వీరశైవులే యోగులు.

తే ధ్యానయోగాను గతా అపశ్యన్
దేవాత్మ శక్తిం స్వగుణైర్నిగూఢాం॥

వీరశైవీయ లింగధారణాది రూపమైన శివయోగమునకు "అమృతస్య దేవ ధారణో భూయాసం॥" యను శ్రుతిప్రమాణములే చాలును. యిది పూర్వ కాండమునందుగల అగ్నిష్టోమాది కర్మములను విరోధించు చున్నది.

"నకర్మణా నప్రజయా న ధనేన త్యాగే నైకే అమృతత్వ మానశుః" "నాస్త్యకృతః కృతేన" ఇత్యాది శ్రుతివాక్యములచేత పశుకర్మ ప్రతిపాదితమైన కర్మకాండము యొక్క కర్మములకు దౌర్బల్యము కలుగుచున్నందున బ్రహ్మ ఖాండోక్త వీరశైవ ధర్మములు స్థిరమైన ముక్తిసుఖమును గలుగజేయుచున్నవై నందున ప్రబలములని చెప్పబడినవి. మరియు ఆ వీరశైవధర్మములు ఉత్తమ రత్నములవలె గ్రహించ యోగ్యమైనవి. నశ్వరములైన సాతిశయము లైన స్వర్గాది ఫలములను తృణీకరించిన వారైనందున అగ్నిష్టోమాది ధర్మములను

వీర శైవులు ఆచరింతురు. అయినను కేవల మోక్షోపయుక్తమైన ప్రతికర్మములనే ఆచరింతురు. అందువలన వీరశైవీయ లింగార్చన, లింగధారణ, లింగధ్యాన, లింగార్పణ, లింగార్పిత గ్రహణములే మొదలయిన శివయోగ ప్రతిపాదికములైన శ్రౌతధర్మములే ఆచరణీయము.

జ్ఞానం శివమయాం భక్తి శైవధ్యానం శివాత్మకం
శైవవ్రతం శివార్చేతి శివయోగో హి పంచధా॥

అనగా శివార్చనమే ముఖ్యమనబడు శివయోగమునకు, శివజ్ఞానము, శివధ్యానము, శివవ్రతము, ఇవియే అంగములైనవి. కనుక జ్ఞానము, శివయోగము యొక్క ఒక్క లింగమై యున్నది. అందువలన సాంగమైన శివయోగమే ముక్తికి కారణమగును. కాని ఒక లింగరూపమైన జ్ఞానము మాత్రము కారణము కాజాలదు. కనుక ముముక్షువులు సాంగశివ యోగమునే సంపాదించవలెను. సారాంశమేమన శివార్చనమే శివయోగము, దీనికి శివజ్ఞాన, శివభక్తి, శివధ్యాన, శివవ్రతములే నాలుగు అంగములు - ఈ యోగమువలననే మలత్రయ నాశనమై మోక్షము లభించును

## శివయోగాంగములు.

సర్వార్పణము జేయుట. శరణుడగుట. ఆత్మనివేదనము జేయుట. యను కైవల్య సాధనము ఇతరసాధనములకన్న శిఖాగ్రస్థానమునందు గలదని చెప్పిననే ఉచితము. ఈసాధనము నాలుగు తెరంగులయి యున్నది. జ్ఞాన, భక్తి, కర్మ, మరియు ధ్యానయోగము. సాధకుడు సర్వార్పణము గావించి తన సాధనమును ప్రారంభించినను ప్రత్యేక వ్యక్తిగతమైన బుద్ధ్యాదిశక్తులు హెచ్చుతచ్చు ప్రమాణముచేత వికాసము పొందియున్నందున ఆయాసాధకుడు తనయందు ప్రగల్భస్థితిని పొందినశక్తినే తన సాధనమునందు మిక్కిలి ఉపయోగించుట స్వాభావికము. ఈ రీతి పైనుదహరించిన నాలుగు మార్గములకు కావలసియున్న శక్తులేవనిన అనుక్రమముగ జ్ఞానమార్గమునకు బుద్ధి, భక్తిమార్గమునకు భావనాశక్తి, కర్మమార్గమునకు క్రియాసామర్థ్యము, మరియు ధ్యానమార్గమునకు చిత్తముయొక్క ఏకాగ్రత. సాధకుడు ప్రాధాన్యముగ ఒకశక్తి నుపయోగించుటము వలన సహజముగ సర్వార్పణము జేసిన శరణులయందు ఒకడు జ్ఞాన

మార్గీ మరియొకడు భక్తిమార్గీ, ఇంకొకడు కర్మమార్గీ, మరియింకొకడు ధ్యానమార్గీ యనబడును. కనుక ఈ నాలుగు మార్గముల ప్రత్యేక వివేచనము జేయుట అవశ్యమై యుండును.

## ౧ జ్ఞానమార్గము.

జ్ఞానమార్గమందు ముఖ్యముగ కావలసినది. ఆత్మానాత్మవివేకము. నిశ్చితనిస్సంశయజ్ఞానము. ఇదితీవ్ర అథవా కుశాగ్రబుద్ధి గలవారికే త్వరలో సాధ్యమగును. ఇట్టి జ్ఞానమును స్థిరముజేసుకొని దానియందు తన చిత్తము నుంచుటమే రెండవమెట్టు. ఈ జ్ఞానము కాకమొదలే తత్సాధనమైన బుద్ధిని నిర్మలము జేయవలెను అహంకారము - కుకల్పన, మిథ్యాతర్కము, కామము మొదలయిన వాటిని త్యజించి బుద్ధిని శుద్ధీకరించి, సాధకుడు కేవల సత్యోపాసకు డవుటమే అవశ్యము. లేకున్న ఆత్మనిశ్చయముకాక, కైవల్యము చేదిక్కనేరదు.

తనయందు తానే ప్రత్యక్షానుభవముచేత జ్ఞానమును తెలుసుకొని, అజ్ఞానము తానేయని నిశ్చయించి, దానియందే యుండు సామర్థ్యము గలిగిన అదే ఆత్మజ్ఞానము వాచాతీత, మనోతీత, వర్ణాతీత, అక్షతీరాత పరమాత్మ తత్త్వమే తాను యనునది బుద్ధిచేత తెలిసి అందు స్థిరమైయుండుటమే స్వరూప జ్ఞానము. ఈ జ్ఞాన నిశ్చయమైనంతనే భవబంధత్వము క్రుంగిపోవును. తర్వాత సాధకునకు యేభయము లేకుండును. దేహభావముపోయి, జీవభావమునష్టమై భక్తియుప్పొంగి, మాయతగ్గును. మాయతగ్గిన కైవల్యము జిక్కును. అజ్ఞానము జ్యోతివంటిది. వెలుగులో మహావెలుగు అది తెలిసిన నదే ఆత్మవస్తువు. అఖండమైన వెలుగులో యుండుటమే ముక్తి.

## ౨ భక్తిమార్గము.

జ్ఞానమార్గియైన శరణుడు ముఖ్యముగా తన శుద్ధబుద్ధి నవలంబించుకున్నను సర్వార్పణము జేసిన భక్తుడుతన శుద్ధభావశక్తినే ప్రధానముగ నమ్మి ముక్తిపదమునందు సాగును. వేరువేరు వస్తువులయందు మరియు విషయముల యందు పంచిపెట్టబడిన తన ప్రేమభావమును ఒకేఒక పరమాత్ముని యందు అనన్య భావముచేతను, నిష్కామబుద్ధిచేతను ఏకీకరించుటమే పరమభక్తియొక్క

లక్షణము. ముక్తికి ఆత్మజ్ఞానము ఎప్పటికైనను ఆవశ్యకము. జ్ఞానమార్గీయు దానిని తన శుద్ధ విమర్శన శక్తిచేత పొందినను, భక్తుడు నిర్హేతుక ప్రేమభావము చేత దానిని పొందును. భక్తిభావనము మత్తేభమునకు అంకుశము వంటిది. భక్తుడు పూజపురస్కారాదులను చేయుచుండగ ఏదో ప్రతీకము నుపయోగించు వాడుక కలదు. అయినను అది ప్రతీకమని మాత్రము ఎప్పటికి మరువకూడదు. ఏలననగా దేవుడు ఆప్రతీకమునందు లేక దానిని చూచులోని భావమునందుగలడు. అతడు నిరాళ, నిశ్శూన్య, నిరాకారుడని తెలిసి, అతని చిహ్నమని ఆ వస్తువును పూజించిననే అది యుపయుక్తమగును లేకున్న శిలతరు నీరాదులను దేవతలని భావించి పూజించిన భక్తుడు తస్సాధన వస్తుగుణములనే పొందును యని యిట్టి అంధవిశ్వాసులను ఆగమకారులు హేలన జేసిరి.

తిథివార ముహూర్తాదుల నెదిరిచూడక రాత్రింబవలు పరమాత్మని స్మరించుటయే నిజభక్తి యనబడును. వచనమునందు నామామృతమును నయనమునందు ఇష్టదేవతను చెవియందు దేవకీర్తనమును, నునిచి భక్తుడు శ్రీ చరణకమలము నందు భ్రమరూపుడైన సదైవసుఖియై యుండును. దేవుడే తల్లి, తండ్రి, బంధువు, మిత్ర, సర్వస్వమని నమ్మి సేవించు చుండును. తనుమన ప్రాణములయందు నీరూపైయున్నపిదప, తెలివియే తానైనాక, నే నెవరిని ఎదురు పెట్టి పూజించవలెను? నీవే నేనైనట్లు ఉపచారము లన్నియు అణగి పోవును. యని భక్తుడు దేవుని గురించి సంబోధించును ఈస్థితియందు ఆత్మజ్ఞానమై భక్తి నిష్ఠ జ్ఞాననిష్ఠ రెండు ఒకటే యయినందున భక్తునకు ముక్తిపదము ప్రాప్తమగును.

## 3 కర్మమార్గము.

పరమ భక్తుడు తన నిర్హేతుక ప్రేమాతిశయముచేత లభించు ఆత్మజ్ఞానమునే కర్మయోగియు నిరహంకారియై, ఫలాశారహితుడయి నిష్కామకర్తవ్య కర్మములు సతతము జేయుచున్నందున పొందును. ఇక్కడ కర్మమైనను, సర్వార్పణము జేసి యున్నందున స్వసంకల్ప మనునది ఏమియు అతనియందు మిగిలి
43 యుండదు. పరమాత్మ సంకల్పములనే అతడు కేవల నిమిత్త మాత్రుడై చేయుచుండును. జ్ఞాన మార్గీకి శుద్ధబుద్ధి, నిశ్చితజ్ఞానము, ఆ జ్ఞానమునందు స్థిరమైన ఉనికి, ఇవి ఆవశ్యకమైయున్నట్లు భక్తునకు నిర్మల కోమల అంతఃకరణము, శుద్ధ

భావము, అనన్య నిర్హేతుక ప్రేమ, ఇవి ఆవశ్యకమై యున్నట్లు, కర్మయోగికి కూడ కార్యాకార్య నిర్ణయశక్తి నిర్ణీతకార్యమును జేసితీరవలయునను దృఢ సంకల్పశక్తి, పరమ ఉత్సాహము, నిరహంకారము, పూర్ణ నిష్కామత్వము, లోకహిత దృష్టి ఇవి ఆవశ్యకములయి యున్నవి. కర్మయోగమును జేయకున్న నిర్మల శుచిత్వమును తెలియుటసాధ్యము. సత్క్రియోపచారములు జేయుట చేతనే జ్ఞానము గలుగును. జ్ఞానముచేతనే ముందు ఐక్యస్థితి ప్రాప్తమగును.

## ధ్యానమార్గము.

సాధన మార్గము లందు ధ్యానమనునది మిగిలి యున్నది. పాతంజల యోగముయొక్క ముఖ్యతత్వము లన్నిటిని స్వీకరించి వీరశైవులు వాటిని చిత్త శుద్ధికై మరియు చిత్తస్థిరీకరణమునకై ఉపయోగించి యున్నారు. ఏసాధనము నైన చేబూనినను దానికేకాగ్రత, అథవా చిత్తస్థైర్యము అత్యావశ్యకము. చిత్తై కాగ్రత లేకున్న సామాన్య వ్యవహారము కూడ సులక్షణముగ సాగదు. అందు వలన మనశ్శక్తి సర్వస్వమును ఒకేఒక పరమాత్మునియందు అర్పించు మహా సాధనము చంచల చిత్తులకు సాధ్యమగునెట్లు? సర్వథా సాధ్యముగాదు. వీర శైవులు తమపద్ధతి ప్రకారము ధ్యానయోగమునకే మహత్వమివ్వక భక్తియుక్త క్రియాసహిత ధ్యానమును ప్రతిపాదించి యున్నారు. అందువలననే వారు “లింగ” రహిత మరియు “శివాచార” రహిత ధ్యానయోగమును హేయముగ జూచు చున్నారు. సాకారము గల పాత్రమునందు నిరాకారామృతమును భుజించ గోరుట గొడ్డు ఆవునందు క్షీరము లపేక్షించునటులే నిరర్థకము. చంచల మైన మనస్సును మరియు ప్రాణవాయువును ఈరెంటిని ఒక్కటి జేసిననే మనస్సు స్థిరమవును. అప్పుడు దానిని సగుణమునందు నిశ్చలముజేసి ముందు నిర్గుణమునకు పోవలయును. అక్కడ చిత్తము నిజమందు లీనమయి నట్లయిన అదే రాజయోగము యొక్క పరమసాధ్యము. ఆనిజము పరమజ్యోతి స్వరూప మైనది. అది మనస్సుయొక్క విశ్రామస్థానము. యెబదినాలుగు ఆసనములలో సిద్ధాసన మన్నిటికన్న శ్రేష్టమైనది. ఆ ఆసనమునందు గూర్చుండి షణ్ముఖీముద్ర చేత, యన్ని ద్వారములమూసి, మూలాధారమునందు నిద్రించియున్న కుండలి శక్తిని జాగ్రత్తపరచి దానిని అనంత కోటి సూర్యప్రభగల ఆత్మజ్యోతి యందు

లయముజేయవలెను. అదే నిజసుఖదాయకమైన చిత్తలయము. రాజయోగసిద్ధికి ఆవశ్యకమైన యమనియమములకు వీరశైవులు మహాత్త్వము నిచ్చినది స్వాభావికము, ఏలనన అవి చిత్తశుద్ధికి మూలాధారమైయున్నవి. ఆశారోష హర్షాదుల నువదలి, అనృత, హింస, పరధన, పరస్త్రీ పరనిందలను సమూలముగ దూరము చేసి బ్రహ్మచర్య, నిష్కామత, జపతప మొదలైన వాటియందు రతుడైనవానికి ధ్యానసిద్ధియు సులభము క్రియారహిత ధ్యానమువ్యర్థమై యుండును. ఇటులే అష్టాంగ పాతంజలయోగముయొక్క యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారములను పూర్వయోగము మరియు ధ్యాన ధారణ సమాధియను ఉత్తరయోగము యీ రెంటిని తమసాధనమందు వీరశైవులు త్తమముగ యుండ యత్నించిరి.

సంసారాన్ముచ్యతేజంతు శ్శివతాదాత్మ్య భావనాత్
తథాదానం తపో వేదాధ్యయనం చాన్యకర్మవా.
సహస్రాంశం తునార్హంతి సర్వదా ధ్యానకర్మణః॥ శివగీత॥

శివతాదాత్మ్య భావనచే నరుడు సంసారము నుండి ముక్తుడగును కావున ధ్యానముకంటె దాన తపోవేదాధ్యయనములు వేయిమడుంగులు తక్కువ.

జాతి మాశ్రమమంగాని దేశం కాల మథాపివా
ఆసనాదీని కర్మాణి ధ్యానం నాపేక్షతే క్వచిత్. శివగీత

జాతియాశ్రమము యమనియమాద్యష్టాంగములు దేశము కాలము ఆసనకర్మలుమున్నగు వానిని ధ్యానమపేక్షింపదు. వానితో ధ్యానము చేయు వానికవసరములేదు.

గచ్ఛం స్తిష్ఠం శ్చరన్వాపి శయానోవాఽన్య కర్మణి
పాతకే నాపి యుక్తోవా ధ్యానాదేవ విముచ్యతే॥ శివగీతా॥

నడుచుచు నిలచుచు పోవుచు, శయనించుచు వేఋపని యందుండియు పాపముతో (మైలతో) కూడిన వాడయినను ధ్యానము చేయుటవలన సంసార బంధమునుండి ముక్తుడగును.

శివధ్యానరతో భూత్వా శివలింగాంగ సంయుతః
శివేతర పరిత్యాగీ ధ్యానయోగీ చ ఉచ్యతే॥ మనుస్మృతౌ॥

శివధ్యానమునందు మగ్నుడై శివలింగమునందు జీవమును 'ఐక్యముజేసి శివేతర దేవపూజాదులను పరిత్యజించిన వాడే ధ్యానయోగియగును.

# శివజ్ఞానము

త్వక్చక్షు జిహ్వాఘ్రాణేంద్రియములను పంచజ్ఞానేంద్రియములకు గోచరమగు, ప్రతిక్షణము పరివర్తనము జెందు ఈ సృష్టిలోని అఖిల పదార్థములపైకి ఎప్పటికి పరివర్తనములేని ఏకరూపమైన నిత్యానిత్య వస్తువొకటి గలదు. అదే పరాత్పర సత్యమని వేదాంతుల సిద్ధాంతమైయున్నది. ఆవస్తువు శబ్దములచేత అవర్ణనీయమైనది. ఏలనన అది వాఙ్మనముల కగోచరము. అయినను దానిని వర్ణించుటావశ్యకమై యున్నందున ఉపనిషత్కారులు వర్ణించి యున్నారు. ఈ వర్ణన యధార్థము గాదు. ఐనను నిర్దేశము మాత్రమని తెలియ దగినది. ఆ వస్తువు కార్య కరణ ఇహపర ఆద్యనాది పుణ్యాపాప సుఖదుఃఖములు లో బయట మీదక్రింద యను మొదలైన ద్వంద్వముల మీరినదై యున్నది. ఈ ప్రపంచము కాక మునుపే అది యున్నది. అది అఖండ అద్వయ స్వయంభూ స్వతంత్ర నిరాలంబ మరియు నామ రూప క్రియాతీతము. అది ఏకమైనది. బయలు వలెనే నిర్గోచరమై అంతటను వ్యాపించి యుండును. వేదాదులు గూడ ఆ వస్తువును వర్ణించుటకు సమర్థములు గాలేదు. ఆవస్తువు యొక్క ఉనికి అనుభవము చేత తెలియ వలెను కాని తెలివి చేత గ్రహించి దానిని ముందు చూచుటశక్యము. ఇట్టి అతీత చిద్ఘన వస్తువును సత్ చిత్ ఆనంద నిత్య పరిపూర్ణ మని శైవాగమజ్ఞులు చెప్పెదరు. సత్ మరియు నిత్యమనగ ఎల్లప్పుడుండు నది. చిత్ అనగా జ్ఞాన స్వరూపము. ఆనందమనగా ఆనందమయము. సుఖదుఃఖాతీత సతత ప్రసన్న భావము గలది. పరిపూర్ణ మన అప్రమేయము అనుపమమైన అనంత గుణ అనంత శక్తి సమేతమైనది. ఈపరాత్పర సత్యమును వేదాంతులు బుద్ధి చేత గ్రహించి కేవలము నిరవయ శూన్య మని యొక వస్తు రూపముగా సంబోధించిరి. అదే సత్యమును భావముచేత అనుభవించి దానిని పరమాత్మ లేక పరశివ యను పురుష వాచకముగా సంభోధించిరి. అత్యంత సత్య వస్తువు బట్ట బయలు నిష్కళ నిరవయవ శూన్యమను నది అనుభవమైన మాట. తురీయాతీత అవస్థ యందు అనగా నిర్వికల్ప సమాధి స్థితియు, స్థిర మరియు నిత్యమైనప్పుడు ఈఅనుభవము కాగలదని అనుభవజ్ఞులు చెప్పుచున్నారు. సత్ చిత్ ఆనంద నిత్య పరిపూర్ణమను గుణములు సవికల్ప

సమాధి స్థితి యందు గోచరమగు చున్నవి. ఇక ఈ అఖండ అద్వయ నిష్కళ నిర్గుణ అనాద్యనంత ద్వంద్వాతీత అద్వైత ఏక వస్తువు నుండి ఈ సాది సాంత సకల సగుణ ద్వంద్వ పూర్ణమైన అనేక విధ వస్తువులచేత కూడి యున్న విశ్వము ఎట్లు నిర్మాణమాయె నను నదియే విచారణీయము. వేదాంత శాస్త్రము నందు ఇది మహత్తర ప్రశ్నమై యున్నది. సృష్టియు కార్యమని గమనించిన దీనికి కారణము మరియు కర్త రెండును అవశ్యములై యుండును. ఇది కార్యము గాదని యన్న తత్వతః సృష్టి యను నది లేక యుండును. సృష్టియు కార్య మనియే శైవాగమానుయాయుల మతము. మహత్కర్త యనగా పరశివుడు. తన శక్తి యొక్క వినోదమునకై జగమును నిర్మించెను. కర్తయు కార్యము చేయ వలయు నన్న ఏదో యొక ఉద్దేశముండ వలయును. ఇక అకాముడైన శివుని యందు ఉద్దేశమెట్లు సంభవించును? అందు చేతనే వినోద, లీల, ఆట, ఈమూలమునసే ఆతడు సృష్టి రచించె నని నిర్ధారణ చేయ బడినది. పర శివుడు తన శక్తి వలన ఈవిశ్వమును నిర్మించెననిన ఈవిశ్వము లోని చరాచర జడ చేతనవస్తువులన్నిటి నిర్మించె ననియే అర్థము. జీవరాసుల నతడే నిర్మించెను. తా నొక్కడే యుండి యుండ ఈవివిధ సృష్టిని దేనిచేత మరియు యెట్లు నిర్మించెను? నిర్గుణ పరశివుని సంకల్పము చేత మొదలాతని చిచ్ఛక్తి గాన్పించెను. అది తన శక్తి యొక్క చలన మాత్రము చేతనే ప్రవృత్తి నివృత్తి లేక శక్తి భక్తి యను రెండుప్రకారము లాయెను. ఆశక్తియు క్రియాశక్తి యను అంశము చేత మాయాశక్తి యాయెను. దాని నుండి పురుష ప్రకృతి బుద్ధి అహంకార మనస్సు పంచజ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియ పంచతన్మాత్రలు మరియు పంచ భూతములు ఇట్లు ౨౫ తత్వములు పుట్టినవి.

ఈ ప్రకారము సృష్టికి పరశివుడను కర్త యొక్క వినోదమే హేతువు ఆతని శక్తియే ఉపాదాన కారణము. పరశివుడు తన స్వేచ్ఛా విలాసము చేత అనంతకోటి ఆత్మలను అనంతకోటి బ్రహ్మాండములను తనయందే పుట్టించి ఆ ఆత్మలకు ౨౫ తత్వములను సంబంధించి దానియందు ఆ ఆత్మలు "దేహోఽ
44 హం" యని తమ నిజ స్వరూపమును మరచి కామక్రోధాదులకు వశులై బాధ మునకు లోబడి యుందురు. ఈ సృష్టి యందుత్పన్నమైన జీవులన్నియు మాయాశక్తి మూలముగా తమ ఆత్మ భావమును మరచి దేహభావములకు

లోబడి యుండును. విషయములకువశమై యుండును. ఇట్లు ఈసృష్టి మరియు సృష్టి రచన యొక్క క్రమమై యున్నది.

## తత్వవివేచనము

పురాణ వేదాంత శివాగమేషు విచారయే త్తత్వమనంత రూపం
సదాశివాఖ్యాం విమలం చిదంశం పరాత్పరం సత్యసుఖాత్మ భూతం ॥

వీర శైవ సిద్ధాంతమందు 36 తత్వములంగీకరింప బడినవి. సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మమునకు అవినాభావ సంబంధము చేత యున్న విమర్శ శక్తి యొక్క స్ఫురణమే "శివ - శక్తి - సదాశివ - ఈశ్వర - శుద్ధవిద్యా - మాయా కలా - విద్యా - రాగ - కాల - నియతి - పురుష - ప్రకృతి - బుద్ధి - అహంకార - మన - శ్రోత్ర - త్వక్ - నేత్ర - జిహ్వా - ఘ్రాణ - వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థ - శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ - ఆకాశ - వాయు - అగ్ని - జల - పృథ్వీ - " యను నవియే 36 తత్వ రూపములై పరిణమించెను.

శక్తి విశిష్ట పరబ్రహము "బహుస్యాం ప్రజాయేయ" యను ఛాందోగ్య శృతి వాక్యాభిప్రాయాను సారముగా సృష్టి జేయ ఉన్ముఖమై యుండగా తన్నిష్టమైన విమర్శ శక్తియే ఇచ్ఛాశక్తి రూపమై పరిణమించును.

అనాది నిధనాచ్ఛాంతాచ్ఛివాత్ పరమ కారణాత్
ఇచ్ఛాశక్తిహి ర్వ్యాప్యాంతా తతో జ్ఞానం తతః క్రియా
తత్రోత్పన్నాని భూతాని భువనానిశ్చతుర్దశ ॥

అను శివాగమ ప్రమాణాను సారముగా ఉత్పత్తి నాశ రహితము, పరమ కారణము, శాంతము నైన పర శివ బ్రహ్మము చేత మొదలు ఇచ్ఛా శక్తియు, దాని వలన జ్ఞాన శక్తియు, క్రియా శక్తియు ఆవిర్భవించినవి ఆ ఇచ్ఛా శక్తి జ్ఞానశక్తియు అంతరంగముననూ, క్రియాశక్తి బహిరంగముననూ యుందునవి. పరశివ బ్రహ్మము జ్ఞాన శక్తి యందు ప్రబలి "నేను సర్వజ్ఞుడను" అను అభిమానము పొందగ శివతత్వమన బడును. ఈశివతత్వాత్మకమైన పరశివ బ్రహ్మమే జ్ఞాన విశిష్టత్వ కారణము చేత భావి ప్రపంచమునకు కారణమగు చున్నది.

పరశివ బ్రహ్మము క్రియాశక్తి యందు పెంపొంది "నేను సర్వకర్తను"

నను అభిమానమును పొందగ "శక్తి తత్వ" మన బడును. ఈశక్తి తత్వాత్మక మైన పరశివ బ్రహ్మమే క్రియా విశిష్టత్వాకారము చేత భావి ప్రపంచమున కుపాదాన కారణమగును.

ఈ శక్తి తత్వము ఇచ్ఛా శక్తికంతరంగమైన జ్ఞాన శక్తియందు ప్రవేశించి "అహం ఇదం" "నేను ఈప్రపంచమును" అని అభిమానమును పొందగ ఈశ్వర తత్వమన బడును.

ఈశక్తి తత్వము సాగర తరంగ న్యాయము వలె "అహమిదం" నేనను అహంకారమునకు "ఇది" యను ప్రపంచమునకు అభేద జ్ఞానమును పొందగా "శుద్ధవిద్యాతత్వమన బడును.

శుద్ధ విద్యాతత్వ రూపమై పరిణమించుచున్న ఈశక్తి తత్వము మయూరాండ న్యాయము వలె తన యందేకమై యున్న భావిప్రపంచ నిర్మాణ కారణీభూత సూక్ష్మ పదార్థములందు అన్యోన్యాభావ రూప భేదబుద్ధి ప్రాధాన్యము చేత "మాయా తత్వమన బడును.

కలా విద్యా రాగ కాల నియతి యను పంచ తత్వములు పురుషునకు కంచుక రూపమై యున్నందున మొదలు కంచుకి యైన పురుషతత్వమును నిరూపించి తర్వాత కలాది పంచ తత్వములను నిరూపింపనగును.

కాష్ఠ యోగము చేత అగ్నికణములావిర్భవించు నట్లు పరశివుని ఇచ్ఛాశక్తి యోగము చేత ఆవిర్భవించుచున్న శివాంశమే మాయాశక్తియందు ప్రవేశించి "పురుష తత్వ" మనబడుచున్నది. ఈపురుష తత్వమునకు మాయామల సంబంధము గలిగి యున్నందున ఆత్మయందనాత్మ జ్ఞానము అనాత్మ వస్తువులందు ఆత్మత్వ జ్ఞానము "నేను సుఖిని" "నేనుదుఃఖిని" యను బుద్ధియు ఉత్పన్నమగుచున్నది. పురుషుడీరీతిగ ఆణవాది మలములచేత యుక్తుడైనందున సంసారి యనబడును.

పురుషుడుమాయామలావృతుడై తనసర్వకర్తృత్వ సర్వజ్ఞత్వ పూర్ణత్వ నిత్యత్వ వ్యాపకత్వ రూపశక్తులను పోగొట్టుకొని కించిత్కర్తృత్వాది శక్తులచేత యుక్తుడగును. పురుషుని ఈకించిత్కర్తృత్వ శక్తియే "కలా" తత్వమన బడుచున్నది. అపూర్ణత్వ శక్తి యే స్రక్చందన వనితాది విషయిక ప్రీతి రూప మైన "రాగతత్వ" మనబడుచున్నది. అనిత్యత్వ రూపశక్తియే భూత భవిష్యద్వర్తమాన

కాలముల వ్యవహారమునకసాధారణ కారణమైన "కాలతత్త్వ"మనబడు చున్నది అవ్యాపకత్వ రూపశక్తియే ఈకారణమువలన ఈకార్యమే గలుగును, మరొకటి గలుగదను నియమమునకసాధారణ కారణమైన "నియతి తత్త్వ"మనబడినది.

కార్యోన్ముఖ్య గర్భితమైన ఇచ్ఛా శక్తియు స్వగతమైన జ్ఞాన శక్తియు క్రియా శక్తి యందు గల "జ్ఞానం క్రియా నభవతి, క్రియా జ్ఞానం నభవతి" అన్యోన్యాభావరూప భేదబుద్ధి ప్రధానమైన మాయాతత్త్వము నందు ప్రతిస్ఫురింపగా "ప్రకృతితత్త్వ" మన బడును. ఈప్రకృతి తత్త్వము సుఖదుఃఖ మోహాము లకు కారణములైన సత్త్వరజస్తమో గుణముల సామ్యావస్థా రూపమై యుండి మహత్తత్త్వమే మొదలైన పృథివ్యంతమై యున్న ౨౩ తత్త్వములకు మూల కారణమై యున్నది.

ప్రకృతి తత్త్వరూపమై యున్న ఈశక్తి తత్త్వమే "ఇదమిత్థం" ఇది యిట్టులే సరి యను నిశ్చయమునకు కారణమైయుండి బుద్ధి తత్త్వమున బడుచున్నది. దీనికే మహత్తత్త్వ మని నామాంతరము గలదు.

బుద్ధితత్త్వ రూపమైన శక్తి తత్త్వమే "నేను-నాది" యను అహంకార మమకారములకు కారణమై "అహంకార తత్త్వమన బడుచున్నది. అహంకార రూపమైన శక్తితత్త్వమే "స్థాణుర్వా పురుషోవా" యను సంకల్ప వికల్పములకు కారణమైనదై "మనస్తత్త్వ" మనబడుచున్నది. బుద్ధ్యహంకార మనస్తత్త్వములు శరీరమందున్నందున ఈమూడు "అంతఃకరణ"ములన బడును. ఈ అంతఃకరణ ములు ఇచ్ఛా శక్తిప్రధానమై యున్నవి.

అంతఃకరణ రూపమై పరిణమించిన ఈశక్తి తత్త్వమే బాహ్యశరీరము నవ లంబించి శబ్ద జ్ఞానమునకు సాధనమైనది. "శ్రోత్రతత్త్వ" మనియు, స్పర్శ జ్ఞానము నకు సాధనమైన "త్వక్తత్త్వ"మనియు, రూపజ్ఞానములకు సాధనమైన "నేత్ర తత్త్వమనియు, రసజ్ఞానమునకు సాధనమైన "జిహ్వాతత్త్వమనియు, గంధ జ్ఞాన మునకు సాధనమైన "ఘ్రాణతత్త్వ"మనియు, పిలువ బడు చున్నది. ఈ ఐదు ఇంద్రియములు జ్ఞానశక్తి ప్రధానమైనందున జ్ఞానేంద్రియము లనబడు చున్నవి.

జ్ఞానేంద్రియరూపమై పరిణమించు ఈశక్తి తత్త్వమే ఉచ్చారణ క్రియకు సాధనమై "వాక్తత్త్వ" మనియు, దానాదానాది క్రియలకు సాధనమైన "పాణి

తత్వ"మనియు, గమనాగమనాది సత్క్రియలకుసాధనమైన "పాదతత్వ"మనియు మలత్యాగమునకు సాధనమైన "పాయుతత్వ"మనియు, రేతోమాత్ర పరిత్యాగమునకు సాధనమైన "ఉపస్తతత్వ" మనియు, పిలువ బడును. ఈ ఐదు ఇంద్రియములు క్రియాశక్తి ప్రధానమైనందున కర్మేంద్రియములు లని పిలువబడు చున్నవి. ఈ పైనుదహరించిన త్రయోదశ తత్వములు ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి ప్రధానములై యున్నవి.

ఈశక్తి తత్వమే కేవల శ్రోత్రేంద్రియ గ్రాహ్యమైన శబ్ద తత్వ రూపమై కేవల త్వగింద్రియ గ్రాహ్యమైన "స్పర్శతత్వ" రూపమై కేవల నేత్రేంద్రియ గ్రాహ్యమైన "రూపతత్వ" రూపమై కేవల జిహ్వేంద్రియగ్రాహ్యమైన "రసతత్వ" రూపమై, కేవలఘ్రాణేంద్రియ గ్రాహ్యమైన "గంధతత్వ" రూపమై పరిణమించు చున్నది. శబ్దము నందు ధ్వన్యాత్మక వర్ణాత్మక శబ్దమనియు, స్పర్శ యందు శీతోష్ణ స్పర్శ యనియు, రూపమందు నీలపీతాది రూపమనియు, రసమందు మధురామ్లాది రసమనియు, గంధమందు సుగంధ దుర్గంధ మనియు, విభాగము వ్యక్తముగాక సామాన్య రూపముతో యున్నందువలన శబ్దాదులు "తన్మాత్ర" లని పిలువ బడుచున్నవి.

పూర్వోక్తమైన ఈ శక్తితత్వమే శబ్దైక గుణము గల "ఆకాశతత్వ" రూపమై, స్పర్శమను ప్రధాన గుణము గల వాయుతత్వ రూపమై, రూప మను ప్రధాన గుణము గల తేజస్తత్వ రూపమై, రసమను ప్రధాన గుణము గల జల తత్వ రూపమై, గంధమను ప్రధాన గుణము గల పృథివీ తత్వ రూపమై, పరిణమించును. ఈపంచభూతములలో ఉత్తరోత్తర భూతములందు పూర్వపూర్వ గుణములు అనువర్తించు చున్నవి. నిగమాగమాది ప్రసిద్ధములైన ఈముప్పది యారుతత్వములు సచ్చిదానంద రూపమైన శక్తి విశిష్ట పరశివ బ్రహ్మము యొక్క పరిణామ రూపమైనందున వీరశైవ మతము పరిణామ వాదమును జగత్సత్య వాదమును బోధించు చున్నది.

## జీవస్వరూపము

45 పర శివుడు చిదానంద స్వరూపుడు, సర్వవ్యాపకుడు, భేదరహితుడు, నీలపీతాద్యాకార రహితుడు, మాయిక సత్వ రజస్తమో గుణ శూన్యుడు, మాయిక పపంచ దూరుడు, "ఏకఏవ రుద్రో నద్వితీయాయ తస్థే" "ఏకమేవా ద్వితీయం

బ్రహ్మ" ఇత్యాది శృతి ప్రమాణాను సారముగా ఒక్కడే యై యుండును తన యందు నిత్య సంబంధము చేత విమర్శ శక్తిలో యడగి యున్న అనాది మాయ యొక్క సంబంధము వలన ఆపరశివు నంశము జీవుడన బడు చుండును. ఆజీవుడు దేవ మనుష్య పశు పక్షి మృగ జలచర ఇత్యాద్యనంతానంత భేదముల చే కూడిన ప్రాణి వర్గము నందు వసించును.

మాయాం తు ప్రకృతిం విద్ధి మాయినం తు మహేశ్వరమ్ ॥

అను శృతి ప్రమాణాను సారముగ ఆ పర శివుడు మాయా శక్తితో గూడి ప్రేరకుడై సమస్త హృదయము లందు వసించును. జీవుడు శివాంశ రూపుడైన అభిప్రాయమును బ్రహ్మసూత్రములందు, "అంశో నానా వ్యపదేశాత్" అను దానిచే సమర్థింప బడినది

యథాసుదీప్తాత్పావకాత్ విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః
తథాక్షరా ద్వివిధాః సోమ్య భావాః ప్రజాయంతే తత్రచైవాపి యంతి।

అగ్ని వలన అగ్న్యంశ రూపములైన అనంతానంతాగ్నికణములెట్లు ఆవిర్భవించు చున్నవో అటులే పరబ్రహ్మ వలన తదంశ భూతములైన అనంతానంత జీవులా విర్భవించి అందే లయించు చుండు నని ముండకశృతి యందు గలదు.

జీవుడు స్థూల చిదచిదాత్మక శక్తి విశిష్టుడు. జీవుని స్థూల చిచ్ఛక్తియు, కించిదజ్ఞతా రూపమై యున్నది. స్థూలాచిచ్ఛక్తియు కించిత్కర్తృతా రూపమై యున్నది. జీవుడీ రెండు విధముల శక్తుల కాశ్రయమైన ఇచ్ఛా శక్తిచే కూడి యున్న వాడు. అనగా ఇచ్ఛా శక్తి విశిష్టుడని తెలియ వలెను. శివాంశ భూతుడైన జీవుడు, కించిదజ్ఞుడు, కించిత్కర్తృవు కించిద్శక్తి యుతుడు, అవిద్యా మోహితుడు, బ్రహ్మైక్య జ్ఞాన వర్జితుడు, ఘోరా పార నిస్సార సంసార తాపత్రయానల దందహ్యమానుడు, బద్ధుడు అగును. పరశివుడు సచ్చిదానంద స్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వ కర్త, సర్వ శక్తి సమన్వితుడు, ఉపమాతీతుడు, జనన మరణ రహితుడు, చరాచర ప్రపంచ వ్యాపకుడు, నిత్యుడై యున్నాడు.

వీరశైవ సిద్ధాంతమందు శివ జీవులకు పారమార్థిక భేదాభేదమంగీకృతమై యున్నది. అగ్ని నుండి ఉత్పన్నములైన అగ్నికణములకు అగ్నికి అత్యంతభేదము గాని అథవా అత్యంతర భేదము గాని చూపింప రానట్లు శివుని వలన

అవిర్భవించి శివాంశులన బహుజీవులకు అత్యంతా భేదము గాని అథవా అత్యం తాభేదము గాని చూపించుటకు సాధ్యము గాదు. అగ్ని కణములు కూడ దూది యందుజ్వాలాగ్నిగా మారును. కనుకఅగ్ని మరియు అగ్నికణములందు అత్యంత భేదాభేదములు జూపుటసాధ్యము. అందు వలననే వీరశైవ శివాచార్యులు శివ జీవులకు పారమార్థిక భేదాభేదమునొప్పి యున్నారు. ఈ వీరశైవ మతమునకు ద్వైతాద్వైత మతమనియు నామాంతరము గలదు. శృతులందు ద్వైతమును అద్వైతమును ప్రతిపాదించు ఉభయ పక్ష వాక్యములు గలవు, కనుక వీరశైవ శివాచార్యులు ఈఉభయపక్ష సామరస్య మార్గమనుసరించు చున్నందున వీరశైవ సిద్ధాంతము సర్వ శృతి సమ్మతమై యున్నది.

ఇదే విషయమును వీరశైవ మతభాష్యకారులైన శ్రీపతి పండితులు తమ శ్రీకరభాష్యమందు విస్తారముగా వ్రాశి యున్నారు.

పరశివుడు తన లీలావినోదము చేత తన శక్తి ముఖాంతరము చేసిన విశ్వమందు జీవమనునది యొక ఘటనము. అదొక చైతన్య సాగరము యొక్క బిందువు. చిత్సూర్యుని కిరణము, జ్ఞాన ఘనాగ్ని యొక్క స్ఫులింగము. తత్వతః పరమాత్ముడు ఈవిశ్వమందెల్లెడల వ్యాప్తుడై యున్నాడు. జడమున కంటె చలనమునందు. చలనమునకన్న చేతనమునందు, చేతనము కన్న జీవమందు సామాన్య జీవమునకన్న బుద్ధి యుక్త జీవమందు, బుద్ధియుక్త జీవము కన్న మనుష్యులందు, మనుష్యుల కన్న సత్వశీల భక్తుని యందు, లేక జ్ఞాని యందు, ఆతని ఆవిర్భావము హెచ్చు కన్పట్టు చున్నది. అందు చేతనే పరమాత్ముని స్వరూపము భక్తునకు లేక జ్ఞానికి తెలియుట శక్యమైనట్లు అన్యులకు తెలియు టసాధ్యము. మిగిలిన వారు మాయామోహముచే కప్పబడి, అజ్ఞానమునకు లోబడి ద్వంద్వములందు జిక్కువడి కర్మ చక్రమందు తిరుగు చుందురు. అహం కార, అభిమాన, ధన, స్త్రీ, రాజ్య లోభము, కామ క్రోధాది యరి షడ్వర్గ ము లివియే మాయ యొక్క వివిధ రూపములు. వీటి మూలముననే మను ష్యుడు కర్మ బంధములకు గురి యగును.

ఇదియే అవిద్య అజ్ఞానము. తానీ దేహము చేత మర్యాదితుడు ఏవం గుణ విశిష్టుడు, ఇట్టి కులశీలము గలవాడు అను మొదలగు ఉపాధులకు మను ష్యుని యందు గల చైతన్యము చిక్కినదైనను, అజ్ఞాన మూలముననే తెలిసి

చూడ ఈ దేహము పాంచభౌతిక సంబంధము. ధనము కుబేరునిది మానము. వాయువుచే కూడినది. కర్మము జేయు శక్తి ఆదిశక్తి నుండివచ్చినది. జ్ఞానము చిద్ఘనము నుండి దొరకినది. ఐనను ఇన్నిటికి జీవుడు నేను నావి యని కొట్టు కొను చుండును. ఈ అజ్ఞానము యొక్క ఆవరణము మాయ మగునంత వరకు జీవుడాత్మ స్వరూపమును దెలియడు. ఈ రీతి బద్ధాత్ముడే జీవుడన బడును పరమాత్మ నుండి అధోముఖ మైన అర్థాత్ అతని నుండి పరాఙ్ముఖుడైన చైత న్య విశిష్టమే జీవుడు. విషయోన్ముఖ జీవుడే బద్ధుడన బడును అతడు విషయ ముల ప్రేమించక ఇంద్రియములకు వశుడు గాక అంతర్ముఖుడై తన నిజ స్వరూ పమును తెలియ గోరిన అతనిఉదయ కాలము సమీపించినదని తెలియదగినది, బద్ధ జీవులన్నియు పశువృత్తినవలంబించి నందున పశువులన బడుదురు. అజ్ఞాన రూపమైన మాయా సమస్తమును కట్టుచున్నందున పాశమన బడును. పరశివుడు జీవరాసులకు పతియైనందున, జీవములను పాశము నుండి ముక్తి జేయ సమ ర్థత గలవాడై నందున పశుపతి యన బడును. దుఃఖానుభవము చేత ఒక తీరు ఉపరతిగలిగి, విషయసుఖము నిజసుఖముగాదను భావము స్థిరమైనట్లయిన విషయ విరాగము గలిగి నిజ సుఖము యొక్క ఆకలిపుట్టును అదియే సత్య నిత్య ఆత్మసుఖము యొక్క అభిలాష యన బడును.

జీవుడు తత్వతః పరమాత్ముని అంశమై యున్నను సృష్టియొక్క ఉత్పత్తికి ముఖ్య సహాయమైన మాయా శక్తి మూలకమున తన నిజ స్వరూపమును మరచి అతడు దుఃఖమందు మునిగి తేలు చుండును. మూల స్వరూపమును మరపించు నట్టి సామర్థ్యము గల ఈమాయా విషయు వివేచనము చేయుట అత్యావశ్యకము. విశ్వోత్పత్తి యనగా సంసారము. సంసారము నుండి మరుపు గలిగెను మరుపు యను మాయయే ఈవిశ్వమును కప్పినందున జీవులు తామసమునకు లోబడిరి. అహంకారమను నదే మాయ యొక్క గొప్ప ఆయుధము. అహంకారము తలకెక్కినచే కుటిల కుహక కల్పనలను, సుడిగాలి వీచి జ్ఞాన జ్యోతి తగ్గి మనుష్యుడు చెడిపోవును. కామక్రోధ లోభ మోహ మదమత్సరములను మనుష్యుని శత్రువులందు సర్వమును మీరినదే కామము, ఆశ, తృష్ణ, ఇట్టిది కావలయు నను ఇచ్ఛ అదే దుఃఖ పరంపరలకు మూలము. మనుష్యుని భావి తృష్ణయే మూలమాయ యని చెప్పిన ఉచితమనిపించును.

దేహమనగా తాను, తనదేహము శాశ్వతము, ధనకనకాదు లస్థిరములు, విషయ సుఖమే ముఖ్య సుఖము. పంచేంద్రియములే సుఖ సాధనములు, అని తెలిసి వర్తించు వానికి ఎప్పటికి సుఖము లభించదు. ఏలనన? నిజసుఖము పరాపలంబి గాదు. అది జయాపజయములు, నిందా స్తుతులు, మొదలగు ద్వంద్వముల నవలంబించి యుండదు. అది అంతఃకరణమందాత్మను, అంతర్యామిని యవలంబించి యుండును. నిజ సుఖము పరమాత్ముని జ్ఞానము వలెనే లభింప గలదు. ఈ తెలివిచే మనుష్యుడు మలము నుండి బయలు బడును. ఇందు తాత్పర్యమేమనగా సృష్టి యందు ప్రతి జీవము ఒకవ్యక్తియై వేరువేరుగ యున్నట్లు కనబట్టు చున్నను, సకల జీవములతోడ నికట సంబంధము గలిగియే యున్నది. అదృశ్యమై యున్నను బలమైన బంధనముల చేత సంబద్ధమైనది ఆ జీవము యొక్క పుట్టుక పెరుగుట జీవన క్రమము చావు ఇవిఅనంత విశ్వ వ్యాపారము నందొక అంగరూపమైన వ్యాపారము. దీని లెస్సగ గ్రహించి తన పరిమాణమును తెలుసు కొనకనే అహంభావము చేత అభిమానము చేత గర్వము చేత నేను నాది యని తాను తనంతటనే వృథా దొడ్డతనము యొక్క కల్పనల పెంచుకొని చేతగాని మరియు ఎన్నటికి పూర్తిగాని విషయ కాముకుల వెన్నంటి ఆశ యను దయ్యమునకు మనస్సు నోడి జన్మాంతరముల వరకు కర్మబంధముల కట్టువడు చున్నాడు. ఇది మాయకు మోసపోయిన వారి గతి. ఇట్లు గాక వ్యక్తియు తన యదార్థ స్వరూపమును దెలిసి కొని తనవైయ్యక్తిక జీవనావశ్యక విషయముల సేవించుచు, తన శక్తి సామర్థ్యముల నన్నిటిని లోక హితము కొరకు వెచ్చించి సమాధానమును పొందువాడు మాయాతీతుడు. అతడే ముక్తిపదము పొందుటకర్హుడు.

ఈవిశాల విశ్వమందు చైతన్య గుణమైన జీవుడు సదసద్వివేక బుద్ధిగలిగిన తర్వాత విషయ సుఖము, ఆత్మ సుఖము వీటి లోని తారతమ్యమును గుర్తించును. అప్పుడు నేనెవరు? ఎక్కడి నుండి వచ్చితిని? ఎక్కడికి పోవుదును అను విషయములపై తీవ్రజిజ్ఞాస ఉత్పన్నమగును. జిజ్ఞాస గలిగిననేఆత్మజ్ఞానము
46 కడకు జీవుని దృష్టి తిరుగును ఈఆత్మ జ్ఞానమే ముక్తి యొక్క ముఖ్య సోపానము. సుఖమే సర్వ జీవముల యొక్క ధ్యేయమనుటలో యెవరికిని మతభేదము లేదు. అనుకూల వేదనయే సుఖము, ప్రతికూల వేదనయే దుఃఖ మనుటలో

అందరు సమ్మతింతురు. సకలేంద్రియములయందు వికారముగలుగు మనస్సును త్రిప్పినవాడే సుఖి, పంచేంద్రియముల ఇచ్ఛ యందు చెడిన మనస్సు నుంచు వాడే దుఃఖి. మనస్సు బహిర్ముఖమయిననే అతడు మాయా ప్రపంచి, అంతర్ముఖమైననే అవిరళ జ్ఞానియు, మనస్సు మహాత్ముయందు నిలచిననే అతడు ముక్తుడు. ఈ ఆత్మసుఖి బాహ్యసుఖములనుండి వకృతుడుకాక ఆంతరికసుఖము చేత సుఖించును. విషయసుఖము పరావలంబనము, పరతంత్రము. సదోషము, అతృప్తికరము, క్షణికము. ఆత్మసుఖము స్వావలంబనము, స్వతంత్రము, నిర్దోషము, పూర్ణతృప్తిదాయకము, మరియు నిత్యము. ఈ నిత్యసుఖమును పొందు వాడే ముక్తుడు. విషయసుఖముల కోరువాడే బద్ధుడనబడును.

ఈబద్ధత్వము మాయమైననే చంద్రుని కళలు చంద్రుని యందే అడగినట్లు సూర్యుని కిరణములు సూర్యునియందే చేరునట్లు, దీపముయొక్క వెలుగు దీపమునందే కూడునట్లు, అగ్నియొక్క కాంతి అగ్నయందే లీనమైనట్లు సముద్రమునీరు మేఘములై, నీరై, నదులై మరల సముద్రజలమైనట్లు, వ్యక్తిననుకొనుచున్న చిత్కణము మరల చిద్ఘనమునందు లీనమైననే అది పరిపూర్ణవిదేహముక్తి పొందినటులగును. ఇదియే ఐక్యసుఖము.

ఈ సుఖస్థితియందు మనుష్యుడు ఆత్మైక్యమును తెలిసినందున ముందుకు మోహమునకు లోబడకుండును. మరియు కర్మములచేత బద్ధుడుకాడు. ఇట్టి జీవన్ముక్తుడు కర్మముయొక్క కఠోర బంధనములచే కట్టబడకుండును. ఏలననగ బంధనము కర్మమునందుండక కర్మఫలాశ యందుండును. కర్తయందుండక ఆతని ఆసక్తియందుండును. జీవన్ముక్తుడు సర్వకామములను దూరిన వాడయినందున, ఫలాశను విడచిన వాడయినందున, ఆసక్తిని త్యజించిన వాడయినందున నిర్లేపుడయి యుండును. అతడు ఏక్రియచేసినను ఏ కర్మము నాచరించినను ఉపచారార్థమే ఆచరించునుకాని ఫలప్రదమును పొందవలెనని కాదు. అతడు ఉండియు బద్ధుడుకాడు, చచ్చి సూతకి గాడు, పొంది పాతకిగాడు ఏసంఘము లేని నిజైక్యుడు. చచ్చిన తర్వాతనే ముక్తి దొరుకునని కొందరిమతము. కాని యిది వీరశైవులకు సమ్మతముకాదు. బ్రతికి యుండగనే జీవన్ముక్తుడు కానేరకున్న మరణాంత్యమున ముక్తుడగుట అసాధ్యము. కాయబలిసి పండయినట్లు జీవన్ముక్తియు విదేహముక్తియందు పూర్తియవుచున్నది. కనుక జీవన్ముక్తుడగుటయే ముఖ్యము.

చిత్కణమైన జీవుడు చిద్ఘనమైన పరమాత్మునకు ఒక్కసారే తనసమస్త శక్తియుక్తి, భక్తులను, తనుమన భావములను, ప్రాణ కరణ, కర్తృత్వములను, అర్పించి, అతనికి పూర్ణశరణాగతు డవుటయే సర్వార్పణ మనబడును. పరమాత్మునికి కాయము నర్పించిన కర్మములేదు. జీవమునర్పించిన జననములేదు. భావమునర్పించిన భ్రమలేదు, ఎరుక నర్పించిన అజ్ఞానములేదు. ఇట్లు సర్వార్పణము జేసిన సాధకుడే అతీతుడు గానోపును. తన ఇంద్రియములకు ఎదురైన సమస్త సుఖములను పరమాత్మున కర్పించి కేవల ప్రసాదభావముచేత అనుభవించు పరమాత్మ భోగోపభోగియైన సాధకాగ్రణియే ఏసుఖములయందుకూడ ఆసక్తుడు కాకయుండును. పూర్ణార్పణ చేసినవారికి తనదొకటైన మిగిలియుండదు. దేహము ఆత్మయందు, మనస్సు జ్ఞానమునందు, భావము నిర్భావమునందు, సమతత్త్వము శాంతియందు లీనముగా జేసిన సర్వార్పణ భావయుక్తుడు నిత్యముక్తుడవును.

## ఆత్మానాత్మ వివేకము

ఈ శాస్త్రమునందు తత్త్వ వివేచనము, మరియు సాధన మార్గము యని రెండు భాగములు జేయవచ్చును. మొదటిభాగము సత్యమును స్పష్టముగ వివరించును. రెండవది ఆసత్యమును సాక్షాత్కరించు దారినిజూపును. మొదలు వీరశైవుల తత్త్వవివరణమును విమర్శింప వలయును. మనకు గోచరమవుచున్న విశ్వము వివిధమైనది. పరివర్తన శీలముగలది. వ్యక్తులచేత కూడినది. జడచేతన రూపముగలది సగుణమైనది. ఇదియంత ఒకేఒక నిత్యనిర్గుణ శుద్ధ చైతన్య రూప అనాది అనంత పరతత్త్వముచేతనే గలిగెను. ఆ నిర్గుణ పరతత్త్వము స్వలీలచేత అథవా స్వభావముచేత సత్ చిత్ ఆనంద నిత్యపరిపూర్ణమై నిష్కల తత్త్వ మనబడును. ఆ నిష్కల తత్త్వము తద్గతమైన శక్తిచలన మాత్రము చేత ప్రవృత్తి నివృత్తిరూపమై రెండువిధములాయెను. విశ్వనిర్మాణకార్యము ప్రవృత్తి ముఖముచే గలిగినది. విశ్వనివృత్తికార్యము నివృత్తిముఖముచేగలిగినది. ప్రవృత్తి యొక్క క్రియాశక్తిద్వారా మరియు మాయాశక్తి యొక్క సహాయముచేత ఒకదిక్కు పురుషుడు, యింకొకదిక్కు ప్రకృతి ఇవి ఉత్పన్నమవుచున్నవి. పురుషుడు చైతన్యరూపుడు; ప్రకృతియు జడరూపము, త్రిగుణాత్మక ప్రకృతిచేత

ముందు మహత్ అథవా బుద్ధి, అహంకారము, మనస్సు, ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు తన్మాత్రలు, మరియు ఐదు మహాభూతములు, ఇటులే యిరువది ఐదు తత్వములు నిర్మాణమైనవి. పురుషుని నుండి మొదలుకొని పంచభూతములలో అంతముగువరకు గల యిరువదిఐదు తత్వముల పరస్పర సంయోగముచేత ఈ వివిధసృష్టి మరియు దానిలోని అనేక పదార్థములు పుట్టినవి. ఇగి తత్వములందు శివ, శక్తి, సాదాఖ్య అథవా సదాశివ, ఈశ్వర, సద్విద్యా, మాయా, కాల, నియతి, కలా, విద్యా, రాగయను ఈపద నొకండు తత్వముల కూడి మొత్తము ముప్పదిఆరు తత్వములని చెప్పు వాడుక గలదు.

లోకాది లోకములు అనంతవస్తువులు, మరియు అనంత జీవరాసులు ఈ రీతి నిర్మాణ మైనవి.

ఈవిశ్వమునందు కేవల జడవస్తువు అథవా కేవల చేతనవస్తువు యనున దిలేదు. దీని అర్థమేమనగ వాటిప్రమాణము ఎంత ఎక్కువతక్కువ యుండి యున్నను పురుష మరియు ప్రకృతి ఈ రెండిటి యోగము లేక యేవస్తువు నిర్మితము కానేరదు. పురుషాంశము హెచ్చినట్లు జీవకోటియు నిర్మాణమై దానియందు మరియు బుద్ధి హెచ్చై ప్రాణులు పుట్టుచున్నవి. ప్రకృతి అంశము హెచ్చినయట్లు శిలా, మన్ను నీరు మొదలైన జడపదార్థములు పుట్టుచున్నవి. అదేరీతి కేవలము ప్రవృత్తి అథవా కేవల నివృత్తి ఇది ప్రత్యేకముగ విశ్వము నందుండుట అశక్యము. ప్రవృత్తియు అధోముఖము, సంసృతి కారణము, బంధన కారకము. నివృత్తియు ఊర్ధ్వముఖము, ఐక్య కారణము, ముక్తిదాయకము. అనేక జన్మానుభవానంతరము జీవాత్ముని జడావరణము తగ్గి అతనియందుగల చేతనాంశము హెచ్చయి అతనికి యింద్రియములచేత గలుగు అనిత్య సుఖము అక్కర లేకుండును. మరియు నిత్యసుఖమే కావలసియున్నట్లు తోచును. ఇదియే ముక్తియొక్క కోరిక. అతడు ఇంద్రియ సుఖములకు మోహించి విషయములను పొందచేసి పునఃపునః జననమరణములకు లోనైకర్మచక్రమున [illegible] నుండక అనిత్య సదోషమైన ఇంద్రియ సుఖములను పేయముగా [illegible] నిత్య నిర్దోష ఆనందమును పొందనారంభించిన అతడు మెల్లమెల్లగ మోక్షమార్గమును పొందును. చివరకుద్వంద్వరహితుడై నిత్యసుఖమునమభవించును జీవన్ముక్తుడై

అతడు జనన మరణ రహిత మోక్షమును పొందును. అతడు దేహధారియైనను అతని దేహమునకు శీతోష్ణాదులు తగులుచున్నను అవన్నిటిని అతడు శాంత రీతిచేత సైరించుకొనును. అతని మనస్సు సామ్యమును అనగ సమీపావస్థను పొందియున్నందున మరియు ఎల్లెడల పరమాత్ముని చూచుచున్నందున అతడు సతతశాంతిని అనుభవించును. ఆప్తకాముడయినందున అతడు కేవలము లోక హితార్థము సత్కార్యమునే జేయును కర్మబంధనము లేక జీవనమును నిత్యానందముచేత సాగించును.

ఇది యంతయు తత్త్వవిచార మాయెను. ఇక యిటువంటి ముక్తస్థితిని యెట్లుపొందవలయు నని వివరించునదే సాధనమార్గము. జీవాత్ముడు తానొక ప్రత్యేక వ్యక్తిననియు, తాను సుఖదుఃఖిననియు, పాపిననియు, అల్పబుద్ధి గలవాడ ననియు, అల్పశక్తుడననియు, యనునదే అనుభవించు చుండును. అదేకాలము నను తనచుట్టుగల విశాలవిశ్వము సుబద్ధము, సుసూత్రము, నియమాంకితము అయి నడచుచున్నదని ప్రత్యక్షముగా జూచును. ఈపరి, విశ్వము ఏశక్తివలన నడచుచున్నదో దానికి అనన్యశరణాగతుడై తానొక్క ప్రత్యేక వేరేవ్యక్తిగాను, తానొక ప్రచండ విశ్వశక్తియొక్క అంశమాత్రుడనని తెలుసుకొనవలయును. అనగ అతని అహంకారాభిమానములు అణగి పోవుచున్నవి. విషయసుఖ ములు భంగురము లయినందున, సదోషములయినందున, వాటిని విడచి నిత్య సుఖముకడకు పోవ్వుగ ప్రవృత్తుడగుట కాతడు యత్నించును. అనగ అతని యందు వైరాగ్యముద్భవించి ముముక్షువృత్తియు స్థిరమవుచున్నది. నేను ఈ దేహముగాను - దేహగతమైన మనస్సునుగాను, మనోగతమైన బుద్ధినిగాను, అయినను దాను పరమాత్ముని అంశమైన చైతన్య మహాత్ముడ యనుభావన మును దృఢము చేసుకొని పోవుట అవశ్యము. ఇదే ఆత్మవిచార మనబడును. అథవా ఆత్మానాత్మ వివేకమనబడును. ఇట్లు అయినంతనే తాను మరియు విశ్వ నియామకశక్తి ఇవిరెండును తత్త్వతః ఒక్కటియే యనుభావము ఉద్భవించి భయ శోక మోహాదులు మాయమవును. విషయసుఖములను విడచి ఆత్మసుఖ
47 మునను సరించి పోవుచు మనస్సు అధికముగ నిష్కామ మరియు శాంత మవునట్లు నడచుట నిష్కామత్వము మూలము మనస్సు నిర్మలము, ఉత్సాహ పూర్ణము, అరిషడ్వర్గములనుండి ముక్తమవును. సాధకుడు అటుతర్వాత తన

భావసర్వస్వమునంత పరమాత్మునియందు అర్పణము జేయ సమర్థుడవును. అటులే అతని విచారము. ఉచ్చారణ, ఆచారము, ఇవియన్నియు పరమాత్ముని ప్రీత్యర్థమని అథవా అతని కార్యసిద్ధ్యర్థమనియు అవుచుండును. సాధకుడు పరమాత్మ ధ్యానమునందే సతతరతుడౌటకు యత్నము జేయవలెను. అయిననే ఈ అతని భావము స్థిరమవును. ఈ స్థితిని పొందినవాడు స్వాభావికముగ సత్య, అహింస, అస్తేయ, పరధన పరస్త్రీ నిరపేక్ష, బ్రహ్మచర్యము, ఈ మొదలయిన నైతికగుణములచేత యుక్తుడవును, తనదను కర్తవ్య మేమియు అతనికి మిగిలియుండనందున అతడు తనచిత్తమును పరమాత్ముని యందుంచి సర్వలోకహిత దక్షుడవును, సర్వార్పణ అథవా స్వాత్మార్పణముచేత ప్రారంభించిన తనసాధనమును సాధకుడు నిశ్చిత నిస్సంశయ ఆత్మజ్ఞాన, అనన్యనిర్హేతుక పరమాత్మ భక్తి, నిష్కామ ఫలాశారహిత స్వకర్మము, పరమాత్మధ్యానము, వీటిచేత పరిపూర్ణము జేయవలయును. అనగ అతడు జీవన్ముక్తుడై, పరమాత్మునితోడ సమరసుడయి, పరమానంద పదవియందు ఆరూఢుడైయుండును ఇదియే వీరశైవుల శాస్త్రము యొక్క సారమైయున్నది.

## శివభక్తి

అనేక జన్మ సిద్ధానాం శ్రౌతస్మార్తాను వర్తినాం
నరాణాం క్షీణపాపానాం శివేభక్తిః ప్రజాయతే॥

యను శివాగమోక్తిప్రకారము నానాజన్మములందు అనేకవిధములైన శ్రుత్యుక్త కర్మమును, స్మృత్యుక్త కర్మమును, జేసిజేసి పాపపుంజమును బోగొట్టుకున్నటువంటి నరులకు శివునియందు భక్తిపుట్టుచున్నది. ఈ శివభక్తి దినేదినే వృద్ధియైన శక్తిపాతమనబడును. ఈ శివభక్తి శక్తిపాతుడైనవాడు సద్గురువు నాశ్రయించును. ఆగురువు శిష్యుని వీక్షించి వేధా, క్రియ, మంత్రయను త్రివిధమైన వీరమాహేశ్వరదీక్ష గావించును. అట్టిదీక్షవలన స్థూల, సూక్ష్మ, కారణములను మూడు శరీరముల నాశ్రయించియున్న ఆణవ, మాయా, కార్మికములను మలత్రయములు నాశమగును. తర్వాత ఇష్ట ప్రాణ భావ లింగములను లింగత్రయ ధారణము, గావించి ఆలింగముల ఉపాసనాక్రమమును, బోధించును. దీనిచేశిష్యుని యొక్క హృదయ క్షేత్రమునందు నాటబడిన శివభక్తియను బీజాంకురము

లింగాంగ సామరస్యమను తంతువులను విడచి, మంచిగా బలిసి, సత్య, క్షమా, దయా, శౌచ, నియమ, మార్దవ, తపస్సు, త్యాగ, బ్రహ్మచర్య, సంతుష్టి ఆర్జవములను పరిశుద్ధమైన జలసేచనముచేత క్రమక్రమముగా, సకాలము నందు మోక్షరూపమైన ఫలము సిద్ధించును. కనుక ఇట్టిమోక్షమునకు శివభక్తి యే మూలకారణమగును. ఇందుకు పారమేశ్వరాగమమునందు:

అత్రవక్ష్యే విశేషంతే లింగధారణ వైభవాత్
భక్తిమాత్రేణ కల్యాణి సుఖం దుఃఖాంబుధిం తరేత్॥ ౧-౬౯

శివభక్తి వలననే శాశ్వతసుఖము లభించును మరియు దుఃఖ సాగరము తరింప బడును యని చెప్పియున్నది కనుక మోక్షసిద్ధికై భక్తియే ప్రాముఖ్య మైనది.

శివుని పూజించ వలెనన్న తత్వరహస్యమును తెలియకున్న పూజ సిద్ధించదు రుద్రుడై రుద్రుని పూజించవలెనని ప్రమాణము గలదు. రుద్రు డగుట ఎట్లనగా ( ప్రాణలింగాంగ సంబంధీ సరుద్రో నాత్రసంశయః ) యను ప్రమాణప్రకారము శరీరేంద్రియాదు లందు అధి దేవతలై యున్నవారిని నివా రించి ఆయా ఇంద్రియములందు లింగములను స్థాపనచేసి భక్తిచేత శివుని పూజించ వలెను. భక్తియు ప్రౌఢభక్తి మూఢభక్తియని రెండువిధములు. దేవుడు వేరు, నేను వేరు; నేను నాదేహములో యున్నాను. దేవుడు గుడియందు గలడుయని తెలిసి, దేవునిప్రతిమను పూజించి దేవునకు అరటిపండ్లు టెంకాయలు, అన్నము మొదలైన వస్తువలు నివేదించి, ఆపదార్థములను ప్రసాదమని భావించి సేవించునదే మూఢభక్తి మరియు పరశివుని పూజ్య పూజక లీలచేత లింగ అంగ ములనురెండు రూపములు ధరించి యున్నాడు. లింగమేశివుడు, అంగమేజీవుడు; లింగము సామాన్యముగ ఇష్టలింగము, ప్రాణలింగము, భావ లింగమని మూడువిధములై, విశేషముగా ఆచారలింగ, గురులింగ, శివలింగ, జంగమ లింగ, ప్రసాద లింగ, మహా లింగమని ఆరువిధములై ఇదే లింగము సామాన్యముగ త్యాగాంగ, భోగాంగ, యోగాంగ, మని మూడు విధములై విశేషముగ భక్త, మహేశ, ప్రసాది, ప్రాణ లింగి, శరణ, ఐక్యయను ఆరు విధములైన, అంగములను లింగమునకు నిత్య సంబంధము అనగా అంగమునువిడచి లింగములేదు, లింగమునువిడచి అంగములేదని తెలసి, త్యాగాంగము నందు ఇష్టలింగమును, భోగాంగమునందు ప్రాణలింగమును,

యోగాంగమునందు భావలింగమును ధరించి, శివుడు ప్రాణేంద్రియము నందు ఆచారలింగరూపుడై, జిహ్వేంద్రియమునందు గురులింగ రూపుడై, నేత్రేంద్రియమునందు శివలింగరూపుడై, త్వగింద్రియమునందు జంగమలింగ రూపుడై శ్రోత్రేంద్రియమునందు ప్రసాదలింగరూపుడై, మనస్సునందు మహాలింగరూపుడై, యుండియున్నాడని అను సంధానముచేత తెలిసి, యేపదార్థమును భుజింపవలసియున్నను శివార్చనసల్పి, సామాన్యముగ ఇష్టలింగమునకు రూపమును, ప్రాణలింగమునకు రుచిని, భావలింగమునకు తృప్తిని, విశేషముగ తాను భక్తనామముచేత ప్రాణేంద్రియమునందు ఆచారలింగరూపుడై యున్నశివునికి గంధపదార్థమును, మహేశనామముచేత జిహ్వేంద్రియమునందు గురులింగరూపుడై యున్న శివునకు రసపదార్థమును, ప్రసాదనామముచేత నేత్రేంద్రియమునందుగల శివలింగరూపుడై యున్నశివునకు రూపపదార్థమును, ప్రాణలింగనామముచేత త్వగింద్రియమునందు జంగమలింగరూపుడై యున్నశివునకు స్పర్శపదార్థమును, శరణ నామముచేత శ్రోత్రేంద్రియమునందు ప్రసాదరూపుడై యున్న శివునకు శబ్దపదార్థమును, ఐక్యనామముచేత మనస్సునందు మహాలింగరూపుడై యున్నశివునకు ఆనందమును సమర్పించి, ఆయా ప్రసాదమును సావధానత్వముచేత స్వీకరించుటయే ప్రౌఢభక్తి, ఈ విధమైన అర్పణానుసంధాన క్రమమును గురుముఖముచే తెలిసికొని లింగభోగోపభోగియై యుండుటయే లింగాంగ సామరస్యము. సర్వావస్థలయందు లింగము నందు మనస్సులయించి లింగోపాసనా విశేషముచేత తుదకు లింగరూపుడై శివునియందు లీనమై శివుడే తానను భావయుక్తుడై యుండుస్థితియే శివ జీవైక్యము. ఇటులే దేహ ముండునపుడే లింగాంగ సామరస్యమును, దేహాంతరమునందు శివజీవైక్యరూప శివ సాయుజ్యమును పొందువాడే వీరశైవుడు వీరశైవుని యొక్క భక్తియే ప్రౌఢభక్తి.

భూతి రుద్రాక్ష సంయుక్తో లింగధారీ సదా శుచిః
పంచాక్షర జపోద్యోగీ శివభక్త ఇతి స్మృతః ॥ సిద్ధాంత శి।

భస్మరుద్రాక్ష సంపన్నుడు, ఎల్లప్పుడు శుచియైన వాడు, పంచాక్షరీ మంత్ర జపాసక్తుడు, ఐన లింగధారి శివభక్తుడన బడును.

శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం ॥

ఏవం నవవిధా భక్తిః ప్రోక్తా దేవేన శంభునా
దుర్లభః పాపినాం లోకే సులభః పుణ్యకర్మిణామ్॥ సి. శి.

శివకథాశ్రవణము, శివస్తోత్రము, శివస్మరణ, శివపాదసేవ, శివపూజ, నమస్కారము, శివునియందు భృత్యభావము, శివునియందు ప్రీతి, శివునియందాత్మసమర్పణము ఈ రీతి నవవిధభక్తి శివునిచే జెప్పబడినది లోకములో యీ నవవిధభక్తి పాపులకు దుర్లభమై పుణ్యాత్ములకు సులభమై యున్నది. ఏ సేవ నవవిధాంగములచే కూడియున్నదో అది పూర్ణభక్తి యనబడుచున్నది. ఈ నవవిధాంగభక్తి మనోవాక్కాయముల మూలకముగ మూడుప్రకారములైనది. ఏ సేవయందు శివలింగస్వరూపాదిచింతనగలదో అది మానసికభక్తి యనబడును. శివమంత్రజపరూపమైన సేవ వాచికభక్తి యనబడును. శరీరాదులచే ఆచరింపబడిన శివలింగపూజ కాయికభక్తి యనబడుచున్నది.

పంచధా కథ్యతే సద్భిస్తదేవ భజనం పునః
తపః కర్మ జపో ధ్యానం జ్ఞానం చేత్యనుపూర్వకమ్। సి. శి.

ఆ సేవ పునః తపస్సు, కర్మ, జప, ధ్యాన, జ్ఞాన మని ఐదు విధములు.

యో భక్తిరహితో మర్త్యః సమస్తా నిష్ఫలాః క్రియాః
న తస్య పరలోకోఽస్తి మృత శ్వానో భవిష్యతి। ౭౫
భక్తిహీనస్య కర్మాణి వృథా పూజాజపాదికం
ధృతమంగలసూత్రాఽపి విధవా న సువాసినీ। ౭౬ పార. ప. ౬

శివభక్తి లేనివానియొక్క సకలక్రియలు నిష్ప్రయోజనములు. ఆ భక్తిహీనుని శివపూజాది కర్మలన్నియు వృథా యగుచున్నవి. విధవ మంగలసూత్రమును ధరించుకొనియున్నను సువాసిని (ముత్తైదువ) గాకుండునట్లు శివలింగమును తన పతియందు భక్తిలేని మానవుడు తన మెడలో లింగమున్నను, పూజించుచున్నను తద్ధారణపూజాఫలముల బొందడు. ఆ భక్తిహీనునికి పరలోకము లభింపదు. మరణానంతరము నీచయోనులయందు పుట్టును. అని చెప్పి శివభక్తియొక్క అత్యావశ్యకత్వము చాటబడినది.

48 అస్పృష్టవిషయస్నేహా యో మోహ శ్శుద్ధసాత్వికః
మయీశ్వరే మహాదేవి సద్భక్తి రభినీయతే॥
భక్తి ర్మాతా పితా దేవి కామధేను స్సురద్రుమః

కరస్థ మమృతగ్రాసం విద్ధి భక్తం కులేశ్వరి॥ ౪౩ పార. ప. ౬

విషయ లోలుపత్వము లేక పరమాత్మునియందు శుద్ధసాత్వికమోహామే భక్తి యనబడును. భక్తునకు భక్తియే తల్లి దండ్రి, కల్పతరువు, కామధేనువు, భక్తియే భక్తునిచేతి అమృతకబళము. కనుకనే ఈ శివపథగమనము పుణ్యాత్ములకే లభ్యమగును.

## శివకర్మ

విశుద్ధాః ప్రాకృతాశ్చేతి ద్వివిధా మానుషాః స్మృతాః
శివ సంస్కారిణః శుద్ధాః ప్రాకృతా ఇతరే మతాః ॥

మానవులు శుద్ధులు (అప్రాకృతులు) ప్రాకృతులని రెండు భాగములైరి. శివసంస్కార సంపన్నులే శుద్ధులు. శివ సంస్కార శూన్యులే ప్రాకృతులు.

శివోక్త ధర్మ నిష్ఠా తు శివాశ్రమ నిషేవిణాం
శివ సంస్కార హీనానాం ధర్మః పైతామహ స్మృతః ॥

శివోక్త ధర్మములు శివాశ్రమియుల కొరకై చెప్ప బడినవి శివ సంస్కారహీనులైన ప్రాకృతులకు బ్రహ్మోక్త ధర్మాచరణము విధింప బడినది. కావున అప్రాకృతులు శివ కర్మలను, ప్రాకృతులు యజ్ఞాది కర్మల జేయుచుందురు.

వీరశైవులు వైదికులైనను వేదోక్త యజ్ఞాది కర్మముల నాచరించరు. "యాన్యస్మాకం సుచరితాని తాని సేవితవ్యాని నో ఇతరాణి" యను వేద వచనాను సారము వీరశైవులు తమకే కర్మములుత్తమములో వాటిని మాత్రమే యాచరింతురు. వేదోక్త కర్మము లందు నిత్య నైమిత్తికములను గ్రాహ్యామని కామ్యములైన జ్యోతిష్టోమాదియజ్ఞ కాండము నంగీకరింపరు. కారణ మేమనగా? "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత" ఇత్యాది వచనములు యజ్ఞముల చేయుటను గురించి విధించు చున్నను, ఇంద్రాది దేవతలను గురించి ఏదో యొక కామ్య ఫలాపేక్ష చేతనే ఈ యజ్ఞముల చేయ వలసి వచ్చును. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యని చెప్ప బడినట్లు స్వర్గాది లోక భోగము నశ్వరమైనది. పరిమిత కాలము గతించిన పిదప ఆసుఖము విడచి పునః భూలోకమునందు పుట్టవలసి యుండును. అందు వలన అదిపునరావృత్తి రహితమైన ముక్తి సుఖము గాదు; అల్ప సుఖమైనది.

వీర శైవోక్త ధర్మాస్తు బ్రహ్మ విద్యోప యోగినః ॥

అను అభియుక్తోక్తి ప్రకారము బ్రహ్మవిద్యకుపయోగములైన గురుసేవ, హర పూజ, జంగమాతిథ్యాది అష్టావరణములను ఆచరించుచు, "దహ్రం విపాపం పరమేఽశ్మ భూతమ్" (తైత్తిరీయే) ఇత్యాద్యుపనిషద్వచనాను సారము దహరా స్యుపాసన (అభ్యంతర జ్యోతిర్లింగానుసంధానముల) చేత బ్రహ్మ స్వరూపమును తెలిసి కృతార్థులగుటయే ఉత్తమాధికారులైన వీరశైవుల ముఖ్యధ్యేయమైనది.

ఈ రీతిగా వీర శైవులు బహిర్యజ్ఞముల సంగీకరింపకున్నను, ఆ ద్రవ్య మయ యజ్ఞముల కన్నను మించిన యోగ్యత గల హింసాది దోష రహితమైన రాగాది గుణ వర్జితములైన జ్ఞాన కర్మ జప తప ధ్యానములను మాత్రమెల్ల ప్పుడు ఆచరించు చుందురు. ఇవియే పంచ శివ యజ్ఞము లనబడును.

శివ దీక్షాపూర్వక ఉపనయనము, శివలింగ రూప యజ్ఞోపవీత ధారణ, పంచ శివ యజ్ఞములు, గర్భాధానాది కర్మలు అప్రాకృతు లాచరింతురు.

౧ ప్రాకృతుల వేదాధికార సూచకమైన ఉపనయనమునకు బదులుగా అప్రాకృతులు వేదాధికార సూచకమైన శివదీక్షను పొందుదురు. శివ దీక్షను గురువుచే పొందుటయే ఉపనయన సంస్కారమన బడును.

౨ ప్రాకృతులకు తంతుమయ యజ్ఞోపవీతము అనుష్ఠితమైనట్లు వీరశైవు లకు (అప్రాకృతులకు) వేదోక్తలింగ రూప యజ్ఞోపవీతము అనుష్ఠితమైనది. లింగధారణమె వీరశైవులకు యజ్ఞోపవీతధారణము.

"యజ్ఞో వై విష్ణుః" అనగా విష్ణువే యజ్ఞము. "విష్ణుర్యోనిమకల్పయత్" అను శృతిచేత విష్ణువు శక్తి స్వరూపముచేత లింగ పీఠమై యుండు నని యర్థము ఉప-సమీపమునందు, వీతం-చుట్ట బడిన వాడు, అనగా విష్ణురూపమైన పీఠము చేత ఆవరింప బడిన లింగమే యజ్ఞోపవీతము.

3 ప్రాకృతులచే సంధ్యావందనము అనుష్ఠింప బడినట్లు అప్రాకృత వీర శైవులచే శివార్చనమే అనుష్ఠేయమైనది. శౌచాది నిత్యనైమిత్తిక కర్మలు స్వాభావికము లైనందున సర్వ సమ్మతములు.

౪ ప్రాకృతులు దేవయజ్ఞ ఋషియజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్య యజ్ఞములను పంచయజ్ఞములు చేయుదురు. కాని యవి కర్మమునుండి వద లించి మోక్షమియ్య లేకున్నందున అప్రాకృతులైన వీరశైవులు పునర్జన్మరాహి

త్యమైనమోక్షప్రదమైన తపస్సు, కర్మ, జప, ధ్యాన, జ్ఞాన మను వేదోక్త పంచ యజ్ఞముల ననుష్ఠింతురు.

తపః కర్మ జపో ధ్యానం జ్ఞానంచేత్యను పూర్వకం
శివార్థే దేహసంశోష స్తపః కృచ్ఛ్రాదినో మతం ॥
శివార్చా కర్మ విజ్ఞేయం బాహ్యం యాగాది నోచ్యతే
జపః పంచాక్షరాభ్యాసః ప్రణవాభ్యాస ఏవవా ॥
రుద్రాధ్యాయాదికాభ్యాసో నాధీతిశ్చేతర శ్రుతేః ॥
ధ్యానం శివస్వరూపాది చింతానాత్మాది చింతనం ॥
శివాగమార్థ విజ్ఞానం జ్ఞానం నాన్యార్థ వేదనం ॥
అనేన పంచయజ్ఞేన యః పూజయతి శంకరం
భక్త్యా పరమయా యుక్త స్సవై భక్త ఇతిస్మృతః ॥

ముక్తికి జ్ఞాన కర్మములు రెండును ఆవశ్యకములు కావున ముముక్షువులు జ్ఞాన కర్మముల రెండిటి ననుసరింప వలయును. కర్మముచే జనన మరణాత్మక విష వృక్షమును నిర్మూలము గావించి, జ్ఞానము చేత నిత్యానంద స్వరూపుడైన పరశివుని పొందును. కర్మములందు పశుకర్మ, పతికర్మ యని రెండు విధములు. పశుహింసాది సాధనములైన కర్మములే పశు కర్మములు. ఈపశు కర్మము వలన స్వర్గాది ఫలములు ప్రాప్త మగుచున్నవి. పతికర్మము పై నుదహరించి నట్లు ఐదు విధములైనది. శివసేవ కొరకు దేహమును శుష్కింప జేయుటయే తపస్సు; కాని చాంద్రాయణాదులు చేయుట గాదు. శివార్చనమే కర్మము; యజ్ఞాదులు కర్మలుగావు. పంచాక్షరీమంత్రము, ప్రణవము, శ్రీరుద్రమనువాని యొక్క అధ్యయనమే జపము; కాని శృతుల పాఠము జపము గాదు. శివచింతనమే ధ్యానము గాని ఆత్మచింతనము ధ్యానము గాదు. శివాగమార్థములను తెలియుటయే జ్ఞానము గాని ఇతరార్థముల తెలియుట జ్ఞానము గాదు. ఈపంచ శివయజ్ఞములచేత శివుని యెవడు పరమ భక్తితో పూజించునో వాడే భక్తుడు.

అప్రాకృత ధర్మాచారులైన వీరశైవులు ఇట్టి మోక్షదాయక పంచయజ్ఞములనే జేయుచుందురు. ఈపంచ యజ్ఞములే పతికర్మలు. ఇట్టి పవిత్ర కర్మలు విడచి హింసాత్మక యజ్ఞయాగాదుల జేసిన రౌరవాది నరకము పొందుదురు. ప్రాకృతుల వలె శివేతర దేవతల పూజించుట, శివపంచాక్షరీ మంత్రము గాక

ఇతర మంత్రముల పఠించుట శివాచర్చన వదలి అగ్నిష్టోమాదుల జేయుట, శివేతర దేవతా ధ్యానము జేయుట, కామికాద్యాగమముల పఠనమును గాక ఇతరశృతుల పఠించుట మొదలైనవి పసుకర్మలు. వీనివలన శివ సాయుజ్యము, శివైక్యము ప్రాప్తించదు. అనగా వీరశైవులకు శివాగమార్థ జ్ఞానమే ముఖ్యముగాని వేదప్రామాణ్యము ప్రాముఖ్యము గాదు. ఆగమోక్తమైన భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్య మను షట్స్థలముల సత్యార్థమును తెలియుటే శివజ్ఞానము. దానిని ప్రతిదినము అభ్యసించుటయే శివపూజ యగును.

ఈ రీతిగ పంచ మహా యజ్ఞము లందు నిరతులై తన హృదయాకాశమునందు ప్రజ్వలించుచున్న జ్యోతిర్లింగ మను సూర్యుని చూచుచు మనస్సునందు అనుసంధానమును పొందుటయే వీరశైవునికి సంధ్యావందన మగును. ఈ రూపమైన జ్యోతిర్లింగమను అగ్నియందు మనోరూపమైన హస్తముచేత శబ్ద - స్పర్శాది విషయములను హవిస్సును నిరంతరము వేయుటయే వీరశైవునకు యజ్ఞమనబడును. ఈ ప్రకారమైన సంధ్యావందన, హోమములను ప్రతిదినము జేయు లింగాంగి యందు సత్యము, క్షమా, దయా, శౌచము, నియమ, మార్దవ, తపస్సు, త్యాగ, బ్రహ్మచర్య, సంతుష్టి, ఆర్జవములను ఏకాదశ శుద్ధ ధర్మములు ఉదయించు చుండును ఈ శుద్ధ ధర్మములు గలిగిన ప్రాపంచిక స్రక్చందనాది భోగ్య వస్తువుల యందు కోరికపుట్టకుండును. మరియు అరిషడ్వర్గములు ఇతనిచే భయపడు చుండును.

ఈ మహానుభావుడైన లింగాంగియు దాసత్వ, వీరదాసత్వమే మొదలైన షడ్విధసజ్జనత్వము, గురువునందు శివాభిన్నమైన జ్ఞానము, తన ఇష్టలింగమునందు మనోలీనము, జంగముని యందు ఆనందానుభవము, ఏకాదశవిధ ప్రసాదములందలి పరిజ్ఞానము, భక్తినిర్వాహము, యను షడ్విధ వ్రతమును జేయుచున్నవాడై, లింగాచార, సదాచార, భృత్యాచార, శివాచార, గణాచార, సమయాచారమను షడ్విధాచారము గలవాడై, అక్రోధ, సత్యవచన, క్షమా, భవిభక్త విభేద, అనుగ్రహ, సత్పాత్ర ద్రవ్యార్పణమను షడ్విధ శీలము గలవాడై
49 శివుని సదా పూజించుచుండును. ఇవియే పతికర్మములు. ఇతరములు పసుకర్మములైనందున వీరశైవులచే త్యాజ్యములు.

౫. షట్ కర్మములు- యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన,

పరిగ్రహము లనునవే షట్కర్మములు.

(1) శివార్చనము జేయుటయే యజనము.

(2) శివార్చనము ఇతరులచే చేయించుటే యాజనము.

(3) నిగమాగమముల అభ్యసించుటయే అధ్యయనము.

(4) నిగమాగమములను ఇతరులకు బోధించుటయే అధ్యాపనము.

(5) పాత్రాపాత్రములను దెలిసి ధనమును ఇచ్చుటయే దానము.

(6) యోగ్యులనుండి ధనము తీసుకొనుటయే ప్రతిగ్రహము.

ఈ షట్కర్మములందు యజన, అధ్యయన, దానములు మూడు మోక్ష సాధనములైనవి. యాజన, అధ్యాపన, ప్రతిగ్రహములు మూడు జీవనసాధనములైనవి కాగ వీరశైవుడు ఈ షట్కర్మలవలన ఇహ పరముల రెంటిని సాధించును. ఇహమునందు సుఖము పరమునందు మోక్షము రెండును సిద్ధించును. కనుక ఈ శివాగమోక్త అప్రాకృత కర్మములను వీరశైవులు జేయవలెను.

౩. దశకర్మములు. సంస్కారా దశ సంప్రోక్తా సర్వతంత్రేషు గోపితాః

యాన్ కృత్వా సంప్రదాయేన ప్రియవాంఛిత మస్నుతే॥ వీర. దీపిక.

గర్భాధాన, పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల, దీక్షా, వివాహ, అంత్యేష్టి యనునవి దశకర్మలు. మిగిలిన స్మార్తాగ్నిహోత్రాది ఆరుకర్మలుగూడి షోడశ కర్మ లనబడును. ఈ కర్మలను వీరశైవులు ఆచరించరు.

౪. జ్యోతిష్టోమాదులవిచారము: కేవల పుణ్యప్రదములైన జ్యోతిష్టోమ అగ్నిష్టోమ కృచ్ఛ్ర, చాంద్రాయణ, పౌండరీక కర్మములు వేదోక్తములైనను వానిని వీరశైవులు పరిత్యజింతురు వీరశైవులు తమ మతమునకు విరుద్ధము గాని కర్మములను మాత్రము అంగీకరించి అన్యప్రాణి వధారూప మైన క్రతువులను తమకు విరుద్ధాచారమైనందున దూషించిరి.

బ్రహ్మాండ భాండోదరమధ్యగాని ఉత్సర్గహోమక్రియ పూర్వకాని

ఉపార్జితాన్యాని సురార్చనాని మహేశ్వరా స్తేతు దహంతి పార్వతి॥

బలి, తర్పణ, హోమ, హవ్య, కవ్య కర్మలు వీరశైవులచే విడువదగినవి.

వీరమాహేశ్వరా స్సర్వే ధ్వంసీ కుర్వంతి సర్వదా

పౌరాణికాని స్మార్తాని వైదికాని క్రియాస్వపి॥

పౌరాణ స్మార్తసంబంధ మరియు వైదిక సంబంధ సమస్త కర్మలను వీరమాహే

శ్వరులైనవారు విడువవలయును అనగా వారు కర్మలను జేయగూడదు.

శివపూజాపరో భూత్వా పూర్వకర్మాణి వర్జయేత్
అథవా పూర్వకర్మీ స్యాత్ సా పూజా నిష్ఫలం భవేత్ ॥

లింగార్చన పరుడైనవాడు (శ్రాద్ధాది) పూర్వకర్మల విడువవలయును. లేకున్న ఆ లింగపూజ నిష్ఫలమగును.

శివాశ్రితానాం జంతూనాం కర్మణా నాస్తి సంగమః
వాజినాం దిననాథస్య కథం తిమిరజం భయం॥ సి. శి॥

శివుని ఆశ్రయించిన ప్రాణులకు కర్మసంబంధమే గలుగదు. సూర్యుని కిరణములకు అంధకార భయములేనట్లు కర్మమునకు శివభక్తుల నాశ్రయించు సమర్థత లేదు.

యే ప్రపన్నా మహాదేవం మనోవాక్కాయకర్మభిః
తేషాం తు కర్మ జాతేన కిం వా దేవాది తర్పణైః॥ సి. శి.

ఎవరు మనోవాక్కాయ కర్మములచేత శివుని ఆశ్రయించెదరో వారికి యజ్ఞాది కర్మసమూహముచేతను దేవతా తర్పణములచేతను ఏమి ప్రయోజనము లేకుండును. అనగా శివభక్తుడు యజ్ఞ తర్పణాది కర్మలను చేయకూడదని భావము.

సర్వేషామపి యజ్ఞానాం క్షయో స్వర్గః ఫలాయతే
అక్షయం ఫల మాప్నోతి ప్రపన్నః పరమేశ్వరం॥

జ్యోతిష్టోమాది సమస్త యజ్ఞములకు క్షయరూప స్వర్గమే ఫలమై యున్నది. కనుక శివభక్తుడు శివుని ఆశ్రయించి అక్షయ రూప మోక్షమునే పొందును.

తస్మాత్సర్వ ప్రయత్నేన శివారాధన తత్పరః
నిత్యం నైమిత్తికం కృత్వా కామ్యం కర్మ సదాత్యజేత్ ॥ లింగ పు.

శివారాధన తత్పరుడైన వీరశైవుడు నిత్య నైమిత్తిక కర్మములను అనగా శివ పూజాదులను శివార్పణ భావముచే ఆచరించ వలెనే కాని కామ్యకర్మ ముల నాచరించ కూడదు.

స్మార్త ధర్మగ్రంథోక్తమైన ఉపనయన, సంధ్యావందన, దేవయజ్ఞ, పితృయజ్ఞ, ఋషియజ్ఞ, భూతయజ్ఞ మనుష్యయజ్ఞము మొదలైన సకలక్రియలు కేవల స్వర్గ ఫలమునే యిచ్చుచున్నవి. వీరశైవ ధర్మ గ్రంథము లందు ఉక్తమైయున్న ప్రత్యేక క్రియయు మోక్షమునే యిచ్చునదియై యున్నది. ఏల ననగా దీక్షా సంస్కార పూర్వకముగా పరిశుద్ధుడైన వీరశైవుడు

తన పవిత్రశరీరము నందు శివలింగమును ధరించి, శివార్చన, జప, తప, ధ్యాన, జ్ఞానములను నియమముచే అనుష్ఠించినవాడై కేవలము అష్టావరణ, పంచాచార నిష్ఠాగరిష్ఠుడై, షట్స్థల, లింగాంగసామరస్య, శివయోగాదితపస్సు నాచరించుచు రంజిల్లుచు నుండును. ఇట్టివీరశైవునకు మోక్షము కరతలామలకమువలె సులభ సాధ్యము. ఇటులే వీరశైవ ధర్మము కేవల మోక్షప్రద మనిపించి నందుననే, కశ్యప, అత్రి, భరద్వాజ, జమదగ్ని, వశిష్ఠ, దూర్వాస, అగస్త్య, దధీచి, భృగు ఉపమన్యుడు మొదలైన అసంఖ్యాతమహర్షులు మొదలు తమ సంబాధ ప్రాకృత ధర్మముల నాచరించి, అనంతరము అప్రాకృత వీరశైవమతధర్మ ములను అనుసరించి, వీరశైవ పద్ధతి ప్రకారము దీక్షా సంస్కార పూర్వక లింగ యజ్ఞోప వీతమును ధరించి, శివార్చనాది దివ్యవ్రతప్రభావముచేత మోక్ష సామ్రాజ్య మునందు సార్వభౌము లనబడి రనియు, విష్ణు బ్రహ్మాది దేవతలు కూడ లింగధారులై, ఆ లింగధారణ ప్రభావముచేత పరమ పదమును పొంది రనియు వ్యాసాది మహాఋషులు తమ గ్రంథరాజములందు వివరించియున్నారు. వ్యాస మహర్షులు సహా ఘంటాకర్ణ శివాచార్యులశిష్యులై దీక్షాసంస్కార పూర్వకలింగ ధారణమును పొందిన విషయము కాశీఖండమునందు వ్యాస కాశి యందు గల శిలా విగ్రహములచేత స్పష్టమగుచున్నది. శంకరాచార్యులు కూడ అద్వైత మత మును స్థాపించి, "అహంబ్రహ్మాస్మి" "త్వంబ్రహ్మాసి" "తత్వమసి" యనితమశిష్య బృందమునకు బోధించి తమకు అంత్యమున నందు నిజానందము ప్రాప్తించనందున శ్రీజగద్గురు రేణుకాచార్యులను సమీపించి, వారిచే చంద్రమౌళీశ్వర లింగమును బొంది, హిమాచలమునందు నిశ్చలమనస్కుడై శివార్చనమును జేసి శివసాయు జ్యమును బొందెను. నాదచింతామణి, శంకర విజయము యను గ్రంథములే ఇందుకుసాక్షి కనుక వీరశైవ ధర్మప్రతిపాదిత అప్రాకృత కర్మములే ఆచరణీయ ములని సర్వసమ్మతమైన విషయము.

---

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇతి శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి యందు శివయోగ మను

ఐదవ ప్రకరణము సమాప్తము.

ఓం
శ్రీ శివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి.

## శివదీక్ష.

### ఆరవ ప్రకరణము.

ఈ ఉత్కృష్ట వీరశైవమందు గల వికల్పరహిత శివజ్ఞానప్రబోధకమైన, వేదాంత జన్యజ్ఞానానుసారిణియైన, శివజీవైక్య బోధకమైన, లింగాంగ సామరస్యాత్మక విజ్ఞాన ప్రదాతయైన, మరియు ఓంకార ప్రణవాత్మకమైన, సచ్చిదానందమును బొందజేయునదియైన, సిద్ధాంతములు సను స్తజనాచరణీయములనియు, అనింద్యములనియు, అద్వితీయములనియు, బోధపడుచున్నవి అట్టి అత్యంతాముల్య విజ్ఞానామృత పానము జేయుని మనుజుడు పామరుడేయని సిద్ధించును. ఇట్టి నిత్యానిత్య వివేకమును సదసత్తారతమ్యమును, మరియు పరబ్రహ్మజ్ఞానమును గోచరింపజేయు సద్విద్యను సద్గురుమూలకముగ ప్రతిమనుష్యుడు శివసంస్కార సంపన్నుడైననే బొందగలడు. అట్టిశివసంస్కారమే దీక్షయని వీరశైవసిద్ధాంతము.

దీయతేయేన విజ్ఞానం క్షీయతే పాశబంధనం
తయోస్తు సంఘటీకార స్సాచ దీక్షేతి కథ్యతే।
దీయతే పరమజ్ఞానం క్షీయతే పాశబాధనం
దీయతే క్షీయతే యేన దీక్షేతి పరిగీయతే। దీక్షానిర్ణయే॥
దీయతే యేన వైజ్ఞానం క్షీయతే పాశబంధనం
తస్మాత్సంస్కార ఏవాయం దీక్షేత్యపి ద కథ్యతే। దీక్షాసిద్ధాంతము।

ఈ శ్లోకములతో వివిధగ్రంథములందు లింగాంగ సామరస్యాత్మకమైన విశేష జ్ఞానము నిచ్చునదియు, మరియు మలత్రయాది మాయాగుణాత్మకమైన జీవ పాశబంధమును క్షీణింపజేయునదియు దీక్షయని (దీ) మరియు (క్షీ) రెండక్షర ములచే ఈసంస్కారము ప్రసిద్ధిగాంచినది.

సంసారరోగ దుఃఖస్య భేషజం ముక్తిసాధనం
స్థానస్త్రైశ్చ హే గౌరి శివదీక్షాతు కారయేత్॥ వీరశైవసుధానిధౌ॥

50 మాయాబద్ధుడైన జీవుడు సంసార కూపస్థుడై రోగదుఃఖాది క్లేశపీడితుడై యున్నను ఈదీక్షాసంస్కారము అమాయాత్మకమైన రోగమునకు వైద్యుడై

పాశబంధములచే విడిపించి ముక్తుని బొందజేయుననియు తత్కారణముననే అట్టి దీక్షాసంస్కారము అత్యావశ్యకముగా ప్రతిమనుష్యుడు బొందవలయు ననియు పరమేశ్వరుండు గౌరీదేవికి బోధించినట్లు ప్రతిపాదింపబడినది.

దీక్షయా ముచ్యతే దేహీ వివిధాద్భవబంధనాత్
శివత్వంయాతి సతధా నపునః పశుతాం వ్రజేత్॥

జీవుడు దీక్షవలననే దేహసంబంధ బహువిధ భవపాశబంధముల నుండి ముక్తుడౌ ననియు, శివసంబంధజ్ఞానసంప్రాప్తిచే శివైక్యమును బొందగలడనియు, అట్టి వ్యక్తికి మరల మలమాయాత్మకమైన పశుత్వము లేదనియు బోధింపబడినది.

సమస్త పదార్థములు జడములనియు అజడములనియు రెండు విధములు. జడసంబంధ జ్ఞానము మాయాపూరితమైనదనియు, చైతన్యమును బోధించు జ్ఞానము పరమజ్ఞానమనియు, ఈ మాయసంబంధ జ్ఞానమును భేదించు పరమజ్ఞానమే మోక్షదాయకమైనదనియు, జడజ్ఞానము తాత్కాలికాత్యల్పసుఖముల నిచ్చునదనియు, తత్సుఖము శాశ్వతము కాదనియు, ప్రతిమనుష్యుడు శాశ్వతి సుఖసంపాదన మాత్రమే చేయవలెననియు, అనేక వీరశైవ గ్రంథకర్తల ముఖ్యాభిప్రాయముగా తెలియుచున్నది. మాయాసంబంధ అజ్ఞానము వలన విషయవాంఛ లెక్కువౌచుండును ఆవృద్ధిజెందు విషయ వాంఛలచేతనే కర్మలు జేయబడును. తత్కర్మలే పునర్జన్మమునకు కారణములై పునఃపునః జననమరణము లను కాలచక్రము నడుపుచుండును. కనుక జీవుడు పాశబంధములను విడనాడ లేక ఘోరదుఃఖార్ణవమునందు సదా మునిగి తేలు చుండును. కాని ముక్తుడు కానేరడు. కనుక ఇట్టి దుఃఖకారణమైన మాయాపాశములను త్రెంచి సన్మార్గ మును జూపించి శాశ్వతసుఖము నిచ్చు జ్ఞానమును సంపాదించ వలయును. అట్టి మలత్రయములను బోనాడి యింద్రియములను జయించు విజ్ఞానమును సద్గురువుల అనుగ్రహాముతో సంప్రాప్తమవును. ఆసద్గురువర్యుల సద్బోధయే దీక్షయనియు, అసంఖ్యాకులయిన దీక్షాపరిజ్ఞానులు తెలిపియున్నారు. కనుక ఆసద్గురువుల సద్బోధరూపాత్మకమైన దీక్షయు సర్వత్రులకు అవశ్యమైనది.

శ్రీపతి పండితారాధ్యులవారు తమ శ్రీకరభాష్యమునందు పాశుపత దీక్ష అనగా శివదీక్షా విషయమునందు ఈ ప్రకారముగా వ్రాయుచున్నాడు.

నిగమాగమ ఉభయవేదాంత ప్రతిపాదిత, భక్తిక్రియా జ్ఞాన కాండత్రయ విహిత స్థూల సూక్ష్మ చిదాచిత్ ప్రపంచ ప్రకాశక, షట్స్థల పరశివ సాక్షాత్కారణ బహు జన్మ కృత శివార్పిత యజన యాజన తపో ధ్యానా ద్యనేక పుణ్య పూర్వఫలక శరీరత్రయ ఘటమలత్రయ ధ్వంసక కారుణ్య కల్యాణ కైవల్య విభూతిత్రయప్రదాయక అష్టావరణపంచాచార సద్గురుకరుణాకటాక్షలబ్ధ శక్తిపాతాద్యావాచ్ఛిన్న పరశివేష్టలింగధారణాత్మక పాశుపతదీక్షానంతర్యం ఇతి.

అనగా ఈ పాశుపతదీక్ష వేదాగమములందు ఉభయవేదాంత శాస్త్రములందు ప్రతిపాదింప బడినది. దీనివలన భక్తిక్రియా జ్ఞానములు లభించును. షట్స్థలుడయిన పరశివుని సాక్షాత్కారమగును. పూర్వజన్మములందు జేయబడిన యజ్ఞయాగాది తపోధ్యానాదులచే చేయబడిన పుణ్యములు శివార్పితము చేయబడును, కనుక శరీత్రయములయందు గల మలత్రయములు నశించును కారుణ్యము, కల్యాణము, కైవల్యములను విభూతిత్రయవరలు గలుగును. అష్టావరణ పంచాచార సద్గురుదత్త లింగధారణములచే గూడుకొన్న పాశుపతదీక్షానంతరము శిష్యుడు జిజ్ఞాసుడగునని చెప్పబడినది. కనుక ఇట్టి మోక్షప్రదాయకమైన దీక్షను పొందుట ప్రతివీరశైవున కత్యావశ్యకము.

రసం విద్ధం యథా తామ్రం తామ్ర భావాద్విముచ్యతే
సువర్ణేన సహైకత్వం గతం తద్యాతి హేమతాం॥
నవనీతం యథాతప్తం తత్స్వభావం పరిత్యజేత్
ఘృతస్యభావమాపన్నే సపునర్నవ నీతతాం॥
యథా శుక్తి గతం తోయం మౌక్తికత్వం నముంచతి
ఏవం శివతాం ప్రాప్తో నపునః పశుతాం వ్రజేత్॥
సర్పదంష్ట్రేన యద్దేహం తద్దేహం విషదేహకం
లింగదంష్ట్రేన యద్దేహం తద్దేహం లింగదేహకం॥ శివాగమే॥

తామ్రము సువర్ణ సంయోగమువలన సువర్ణమైనట్లు, నవనీతము అగ్నిసంస్కారమువలన ఘృతమైనట్లు, వర్షబిందువులు స్వాతినక్షత్రమునందు ముత్యపు చిప్పయందుబడి ముత్యములైనట్లు, సర్పదంష్ట్రముచేత దేహము విషదేహ మైనట్లు లింగసంపర్క శివసంస్కారములచే లింగదేహమే యగుచు, పూర్వపు తామ్రత్వము, నవనీతత్వము, మౌక్తికత్వము, దేహత్వము, ఆమూలాగ్రము నశించ

దీక్షైవ మోక్షదాపుంసాం చిదచిచ్ఛక్తి కారణం
నాస్తి దీక్షా సమం తీర్థం నాస్తి దీక్షా సమం తపః॥
నాస్తిదీక్షా సమం శీలం నాస్తిదీక్షా సమం ధనం
నాస్తి దీక్షా సమోధర్మో నాస్తి దీక్షా సమోగుణః॥
నాస్తి దీక్షా సమం జ్ఞానం నాస్తి దీక్షా సమం కులం
సాదీక్షా గురుణాకార్యా త్తస్యా భేద ఇహోచ్యతే॥

దీక్ష మనుష్యులకు జ్ఞానకారణమైనది. దాని సమానమైనది యేదియు లేదు. తీర్థము, తపస్సు, శీలము, ధనము, ధర్మము, గుణము. జ్ఞానము మరియు కులము ఇవియన్నియు, దీక్షాసమానము కానేరవు. కనుక యిట్టి పూర్వరూపమును మార్చి జ్ఞానరూపమును గలిగించు ఉత్కృష్టమైనదీక్షను పొందవలయును. వాటిభేదములను వివరింతును.

## త్రివిధ దీక్ష.

తనుత్రయ గతానాది మలత్రయ మసౌగురుః
దీక్షాత్రయేణ నిర్దగ్ధ్వా లింగత్రయ ముపాదశేత్॥

త్యాగ భోగ యోగ తనుత్రయముల నొందబడిన ఆణవ మాయా కార్మిక మలత్రయమును గురుమూర్తి వేధా, క్రియా, మాంత్రికదీక్షాత్రయము చేత దహించి, ఇష్టప్రాణ భావలింగత్రయమును, ఉపదేశించవలయును. అనగా శరీర, ప్రాణమానస, ములయందు మూడువిధములయిన దీక్షలు గావలయును.

౧ శరీర దీక్షః- ఆజ్ఞా, ఉపమా, కలశాభిషేక, స్వస్తికారోహణ, భూతిపట్ట, లింగాయత, లింగస్వాయత మని యేడు ప్రకారములు

౨ మనోదీక్షః- దృఢవ్రత, అహింసా, పంచేంద్రియార్పణ ఏకాగ్రచిత్త సంపత్తి, పరతత్వము, లింగనిజమనోలీనము, సద్యోముక్తి యని యేడు విధములు.

3 ప్రాణదీక్షః- సమయ, ఆసాచార, తత్వజ్ఞాన, అనుగ్రహా, అధ్యాత్మ శుద్ధవిద్యా, నిర్వాణమని యేడు విధములు

౧ గురువుయొక్క ఆజ్ఞను పాలించుటయే ఆజ్ఞాదీక్ష

౨ పురాతనుల సమయాచారమునకు సదృశమైనదే ఉపమా దీక్ష.

3 స్వస్తికమండలముపై శిష్యుని కూర్చుండబెట్టి మంత్రన్యాస పూర్వ

కముగా మన్త్రపిండమును జేయునదే స్వస్తికారోహణ దీక్ష.

౪ ఆగమోక్త స్థానములందు ఆయా మన్త్రములచే విభూతిధారణము గావించుటయే విభూతిపట్టదీక్ష.

౫ పంచకలశములందు తీర్థోదకమునింపి, శివకలలను స్థాపించి, ఆ కలశోదకముచేత శిష్యుని స్నానము చేయించుటయే కలశాభిషేకదీక్ష.

౬ ఆచార్యుడు శిష్యునకు ఉపదేశింప దగిన లింగమును అర్చించి శిష్యునకు చూపించుటయే లింగాయత్తదీక్ష.

౭ ఆ గురునాథునిచే ఉపదేశింపబడిన ప్రాణలింగమును శిష్యుడు భక్తి చేత స్వీకరించి తన ఉత్తమాంగాది స్థానములందు ధరించుటయే లింగ స్వాయత్త దీక్ష.

ఆ లింగస్వాయత్త దీక్షయు వేధాదీక్ష, క్రియాదీక్ష, మనుదీక్ష యని మూడు విధము లయినది.

౧ గురువు శిష్యుని మస్తకమును ఆగమోక్త విధానముచేత శివాసన మును చేయునదే వేధాదీక్ష యనబడును.

౨ దీక్షోత్తర క్రియతోగూడి, ప్రాణలింగోప దేశమును చేయునదే క్రియాదీక్ష యనబడును.

3 దేవత, బీజ, కీలక మొదలయిన వాటితో మన్త్రోప దేశమును చేయునదే మనుదీక్ష యనబడును.

ఇట్టి దీక్షచేత దేహియు త్రివిధపాశ బంధమువలన ముక్తుడై శివత్వమును పొందును. మరియు అతడు ఎప్పటికైనను పశుత్వమును పొందడు.

దేనిచేత విజ్ఞానముగలిగి పాశబంధము నాశనమై పోవుచున్నదో అదియే దీక్షాసంస్కారమని పూర్వముజెప్పబడినది. కనుక గురువు శిష్యునియొక్క తను త్రయములయందు గల మలత్రయములను వేద, మన్త్ర మరియు క్రియా యను దీక్షాత్రయములచేత కాల్చి, స్థూల-సూక్ష్మ - కారణములను దేహత్రయముల యందు క్రమేణ ఇష్టప్రాణ భావములను లింగత్రయమును స్థాపనముగావించును
51 శివజ్ఞానుడైన గురువర్యుడు సర్వత్ర శివాకార వృత్తిగల వాడైనందున, తన మంగళకరమైన హస్తమును శిష్యుని మస్తకముపై సంయోగము చేసి శివ స్వరూపదృష్టిచేత శిష్యుని వీక్షించి "నీవు శివుడవు" యని బోధించును.

ఆ గురువాక్యమును నమ్మినందున ఆ శిష్యునికి అజ్ఞాన నివృత్తియై శివస్వరూపము వ్యక్తమౌను. కనుక యిదియే వేదదీక్ష. యీదీక్షవలన గురువు శిష్యుని కారణతనువునందు భావలింగమును స్థాపించును. దీనిచేత అజ్ఞానమూలకమైన శుభాశుభ కర్మఫలవాసన దూరమౌను.

శిష్యునియొక్క కర్ణమునందు శివమంత్రము నుపదేశించుటయే "మంత్రదీక్ష యనబడును. మంత్రోపదేశము బొందిన తర్వాత మంత్రార్థమును చింతించు శిష్యుని యింద్రియములు బాహ్యశబ్దాది విషయముల నుండి పరాఙ్ముఖము గలవైనందున, ధ్యానమునకు వేద్యమైన "ప్రాణేష్వంతర్మనసో లింగమాహుః" (ఆగమ) అను ప్రకారము ప్రాణమునందు అనుష్ఠాన భూతమైన మనో బుద్ధ్యాదులకు సాక్షిరూపమై ప్రకాశించుచున్న చిన్మయ లింగము సూక్ష్మ మనోవృత్తియు నేకె, ఆ మనోవృత్తియు మంత్ర సంస్కారోత్తరమందు లింగ రూపమౌను. అనగా ప్రాణలింగాకారమై పరిణమించును. "మనసైవాను ద్రష్టవ్యః" యను ఉపనిషద్వచన ప్రకారము పరిశుద్ధమై అంతఃకరణముచేత సాక్షాత్కరింప బడిన చైతన్యమే ప్రాణలింగమని అర్థము. ఈ ప్రకారముగా సూక్ష్మ శరీరము (అంతఃకరణము) ప్రాణలింగ సంబంధము గలదైనప్పటికి దానిని (మనో బుద్ధ్యాదిరూప అంతఃకరణమును) ఆవరించియున్న మాయారూప మలము క్షీణించును. తరువాత అంతఃకరణము మొదటివలె విషయవ్యామోహముచేత భ్రమించదు.

శైవాగమముల యందునుకూడ చెప్పబడిన ప్రకారము దీక్షా మంటపమును స్థాపించి పూజింపబడు ఈశానాది పంచబ్రహ్మ మయమైన పంచకలశముల తీర్థముచేత, జగత్ప్రసిద్ధులైన శ్రీమద్రేణుకాచార్యుల సంప్రదాయాగతులయిన ఋత్విజులతోగూడి తదాచార్య సంప్రదాయ గతుడై పట్టాభిషిక్తుడై యున్న గురువు శిష్యుని యథాసారము అభిషేకించి, మిగిలిన క్రియలను విధ్యుక్త ప్రకారము గావించి, అధ్వ శోధన, కలా న్యాసాదులచే సంస్కృతమైన పంచసూత్రములుగల, శిష్యుని నిరతిశయ ప్రీతి కాస్పదమైన, ఇష్టలింగమును ఆ శిష్యుని హస్తమునందు స్థాపించుటయే "క్రియాదీక్ష" యనబడును. దీనిచే ఆత్మయొక్క సంకుచితభావము నివృత్తియగును.

గర్భాష్టమే కృతా దీక్షా ముఖ్యా సా షోడశావధి

గౌణా తదూర్ధ్వే మధమా వీరశైవాన్వయాయినాం॥
యను ఆగమ వచనప్రకారము వీరశైవబాలురకు ౭ సంవత్సరముల వయస్సు నందే దీక్షాసంస్కారము గావించుట ఉత్తమము, పదహారు సంవత్సరములకు చేయించిన మధ్యమము, పదహారుసంవత్సరములకు తర్వాత అధమము. కాని యేసంవత్సరము నందైనను దీక్షమై తీరవలయును.

## దీక్షాహీనత్వము.

శ్లో॥ శివసంస్కారహీనస్తు ద్విజో౽పి శ్వపచాధమః॥
శివ సంస్కారహీనుడు అనగా దీక్షారహితుడు ద్విజగర్భజనితుడైనను అధము డనియే పరిగణింపబడును, అని ముండకోపనిషత్తునందు చెప్పబడినది.

శ్లో॥ అదీక్షిత శ్చతుర్వేదీ శివలింగం యది స్పృశేత్
కల్పకోటి సహస్రాణి భవతి బ్రహ్మరాక్షసః।

దీక్షా రహితుడైన చతుర్వేది బ్రాహ్మణుడు కూడ శివలింగమును ముట్టుకున్నను అనేక సంవత్సరములు బ్రహ్మరాక్షసుడై యుండుననియు చెప్పియున్నది.

అదీక్షయా చ యో విప్రః కుర్యా ల్లింగస్య పూజనం
అరణ్యే నిర్జనే దేవి భవతి బ్రహ్మరాక్షసః॥

అదీక్షితుడగు విప్రుడు లింగపూజ సలిపిన నిర్జన ప్రదేశమైన అరణ్యమున బ్రహ్మరాక్షసుడై యుండును. అదీక్షితః శివం నస్పృశేత్ దీక్ష గాని వాడు శివుని ముట్టకూడదని యని బోధాయనప్రమాణముకూడ గలదు.

శ్లో॥ దీక్షావిహీనా విప్రా శ్చ మహాలింగస్య తస్య తు
అర్హా నాయా మహర్షే శ్చ క్షత్రియాద్యా శ్చ దీక్షితాః॥
తే సర్వే కారయామాసు రన్యై రన్యై స్తు భూసురైః
స్వస్థే లింగే౽థవా బాహ్యే పూజయేత్ సోమసుందరం॥

చాతుర్వర్ణ్యులు యెవరైనను దీక్షితులయినచో మహాలింగమును పూజించు యోగ్యులగుదురనియు స్పష్టముగా చెప్పబడినది.

వీరత్వం శైవే వర్తతీతి వీరశైవః- అనగా శివభక్తియందు వీరత్వముగల వాడే వీరశైవుడనియుఅర్థము. అట్టివీరశైవునకు యీ దీక్ష యావశ్యక మనియు,
శ్లో॥ క్రియతే వీరశైవానాం సాంప్రదాయాను సారతః

ఆగమార్థానుసారేణ న్యాయమార్గానుసారతః
దీక్షితానాం దైవయోగా దంతరాయే సమాగతే।

యని లింగప్రమాదాది విషయమందు ౨౩ వ ఉపదేశంబున వీరశైవునకు న్యాయాగమ సాంప్రదాయానుసారముగ దీక్షయగును యని మరియు

శ్లో॥ పంచవింశోపదేశే స్మిన్ శైవదీక్షావిధిక్రమః
వర్ణ్యతే వీరశైవానా మాగమోక్తానుసారతః

యని పంచవింశోపదేశమునందు వీరశైవదీక్ష వీరశైవులకొరకై ఆగమోక్తానుసారముగ వర్ణింపబడినది యని చెప్పబడినందున ప్రతివీరశైవుడు దీక్షాప్రాప్తుడు గావలయుననియు సిద్ధించెను. మరియు "గురుహస్తా జ్జాత ఇతి గురుహస్తః" యనియు "శిష్యః పుత్ర ఇతి ప్రోక్తః" మరియు "శిష్య శ్శిక్షాత్వ యోగతః" గురువుయొక్క శిక్షాయోగము వలననే శిష్యుడయినందున నతడు గురుహస్తుడనియు శిష్యుడనియు పిలువబడును. కనుక అతనికి గురూపదేశ మను దీక్షా సంస్కారము సిద్ధించును.

హంత తే కథయిష్యామి సర్వపాప విశోధనం
సంస్కారం పరమం పుణ్యం శివేన పరిభాషితం। ౩
సమ్యక్కృతాధికారః స్యాత్ పూజాదిషు నరో యతః
సంస్కారః కథ్యతే తేన షడధ్వపరిశోధనం ౪
దీయతే యేన విజ్ఞానం క్షీయతే పాశబంధనం
తస్మాత్సంస్కార ఏవాయం దీక్షేత్యపి చ కథ్యతే। శి వా స॥ ౧౩

ఉపమన్యుఋషియు శ్రీకృష్ణుని గురించి సర్వపాపనాశకమైన, శివునిచే బోధింపబడిన సంస్కారమును జెప్పెదను యని ప్రారంభించి మనుష్యుడు పూజాదులయందు అధికారియైన తర్వాత అతని షడధ్వశుద్ధి సంస్కారమును జేయవలయును. ఏది జ్ఞానము ననుగ్రహించునో ఏది పాశబంధమును లయింపజేయునో ఆ సంస్కారమే దీక్షాసంస్కార మనబడునని శివదీక్షయొక్క మాహాత్మ్యమును బోధించెను.

యథా పురోక్తమార్గేణ శివత్వం యేన జాయతే
నాఽశివ శ్శివ మభ్యస్యే న్నాఽశివ శ్శివ మర్చయేత్
నాఽశివ స్సుశివం ధ్యాయే న్నాఽశివ శ్శివ మాప్నుయాత్॥ ౧౩

ఏ సంస్కారముచేత శివుడగునో అట్టి సంస్కారమును పొందవలయును. అట్టి సంస్కారము చేత శివుడు గాకుండు వాడు శివుని ధ్యానించ గూడదు. శివుని పూజించగూడదు. శివుని ముట్టగూడదు.

తస్మాత్ శైవీం తనూం కృత్వా త్యక్త్వా చ పశుభావనాం
శివోహమితి సంచింత్య శైవం కర్మ సమాచరేత్॥

అందువలన శివదీక్షచేత శరీరమును శివరూపమును జేసి పశుభావమును వదలి, నేనే శివుడనను దృఢమైన భక్తిచే కూడిన శివభక్తుడే శివపూజాది శైవ కర్మలకు అధికారియగును. అని చెప్పిన తర్వాత కృష్ణుడు ఉపమన్యుఋషి చేత శివదీక్షను పొంది శివుని పూజించుటకు అధికారి యాయెను.

రుద్రోభూత్వాయజేద్రుద్రం నారుద్రో రుద్రమర్చయేత్॥
పాశబద్ధో భవే జ్జీవః పాశముక్త స్సదాశివః॥

తాను దీక్షాది సంస్కారమువలన పాశముక్తుడై అనగా రుద్రుడై రుద్రుని పూజింప వలయును. రుద్రుడుగాక అనగా దీక్షను పొందక రుద్రుని పూజింప గూడదు. దీక్షాసంస్కారము వలన పాశము దెగును. అందువలన జీవుడు బద్ధత్వమును వదలి సదాశివుడగును కనుక శివపూజాదికర్మలకు యోగ్యుడగును

## జాతిభేద రాహిత్యము

ఇక శివభక్తులందు అనగ వీరశైవులందు జాతిభేదము గలదో లేదోయను విచారము జేయవలయును. సద్గురువు జీవునకు లింగధారణ దీక్షజేసి అతని పూర్వాశ్రయ నిరసనము గావించును. మరియు అతనియందు సదాచారమునకు శిఖరప్రాయమైన ఇష్టలింగపూజ గురుపూజ, జంగమపూజ, మొదలైన అష్టావరణములందు నిష్ఠకల్పించి, శ్రీపంచాక్షరమంత్రోపదేశముచేత అంతఃకరణమునందు నిర్మలత్వమును గలుగజేసి, ఇటులే తనుమనములనుండి మాయావికారములను దూరముజేసి, ప్రకృతిజన్య దోషములను బోనాడి కేవలము గురుకరజాతుని జేయును ఇటులే గురువు శివభక్తుడై యున్నవాని మాంసపిండమును దీసి మంత్ర పిండముగ జేయుచున్నందున అతడు అప్రాకృత శరీరుడనబడును.
52 అందువలన వీరశైవ శాస్త్రమునందు భక్తునకు జంగమునకు నిర్దేహియను విశేషణ ముపయోగింప బడినది. (అనాది వీరశైవ సారసంగ్రహము) పగి 3-౩౨

నిర్దేహి యనగ దేహము లేనివాడు యను అర్థము కాదు. ఏలనన వీరశైవు లయిన భక్తజాగములందు మనము సప్తధాతువులచే గలిగియున్న శరీరమును ప్రతిదినము చూచుచున్నాము. అనగ ప్రకృతి సంబంధమైన సర్వ గుణములు నశించి అప్రాకృత గుణయుక్తుడై వర్తించుచున్నందున నిర్దేహి అథవా అప్రాకృత శరీరియని చెప్పియున్నది. లింగధారణ దీక్షచేత సద్గురువు శిష్యుని పావనము చేసియున్నందున అతడు గురుపుత్రు (గురుకర జాతు) డాయెను. సద్వంశము నందు పుట్టిన తండ్రి పుత్రులకు వేరేవేరే జాతి కులములను చెప్పకుందుమనో అటులే లింగధారులకు జాతిభేదము చెప్పుట అనావశ్యకము.

౧ స్త్రీ వా థ పురుష ష్షండ శ్చండాలో ద్విజవంశజః
న జాతిభేదో లింగార్చ్యే సర్వే రుద్రగణా స్స్మృతాః॥ లింగసారే॥
౨ బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రా యే చాన్యజాతయః
లింగధారణమాత్రేణ శివ ఏవ న సంశయః॥ ౨ పార॥ ప॥ ౧
౩ యస్త్వైవ శాంభవీదీక్షా జాతా గురుకృపావశాత్
పూర్వజాత్యాదికం తస్య న స్మరేత్ ప్రాకృతం హితత్ ౬౩
అప్రాకృతస్య భక్తస్య గురుహస్తామలాంబుజాత్
పునర్జాతస్యాత్మజన్మ జాత్యాది న చ కల్పయేత్॥ ౬౧
పాషాణాదికృతం లింగం యద్వత్పూజ్యం ప్రతిష్ఠితం
నీచవంశోద్భవ శ్చాపి భక్తశ్చ దీక్షరే తథా॥ ౬౫
భక్తస్య ప్రాక్తనం జన్మ నామజాత్యాదికం చ యత్
పృచ్ఛేద్వా కథయేద్వాపి స వై పాతకినాం వరః॥ ౬౬
తస్మాత్ సర్వప్రయత్నేన మమలింగాంగ సంగినాం
మామేవ మనుతే యస్తు సోఽపి ముచ్యేత బంధనాత్॥ ౬౮ సూ ప. ౫
౪ శివసంస్కారయుక్తేషు జాతిభేదో న విద్యతే
కాష్ఠేషు వహ్నిదగ్ధేషు యథా రూపం న విద్యతే॥ ౩౮
తస్మాత్ సర్వప్రయత్నేన శివసంస్కారసంయుతః
జాతిభేదం న కుర్వీత శివభక్తే కదాచన॥ ౩౯ సి. శిఖామణౌ॥
౫ శివసంస్కారయుక్తేషు జాతిభేదం న కారయేత్
శివలింగే శిలాబుద్ధిం కుర్వాణ ఇవ పాతకః॥ శివరహస్యే॥

౬. నజాతి భేద స్తత్రాస్తి లింగినాం శివయోగినాం
న దృష్టిస్పృష్టో దోషోవా సర్వ ఏవ శివాశివే॥ పార. ౭-౫౩

ఇట్లు లింగవంతులైన శివయోగులకు జాతిభేదము, దృష్టి స్పృష్టి దోషము లుంటకుండుననియు అనేక ప్రమాణములు గలవు.

౭ నగరీనిర్ఝరాద్యంబు గంగాం ప్రాప్య యథైకతాం
దీక్షా యోగాత్తథేశస్య శూద్రాదిః శివతాం వ్రజేత్॥
శ్వపచోఽపి మునిశ్రేష్ఠః శివసంస్కార సంయుతః
శివసంస్కార హీనస్తు ద్విజోఽపి శ్వపచాధమః॥
జన్మనా జాయతే శూద్రః సంస్కారాద్ద్విజ ఉచ్యతే
శివసంస్కారసంపన్నే జాతిభేదం న కారయేత్
దారుశ్మలోహమృద్రత్న జాత లింగ ప్రతిష్ఠితమ్
యథాపూజ్యం తథైవ స్యాద్భక్తశ్చాండాలవంశజః॥ శివరహస్యే॥

నగరు కాలువలు గంగానదిని చేరి ఒకే ప్రవాహమగునట్లు, శివదీక్షా బలము చేత శూద్రాది వర్ణములవారు శివత్వమును పొందెదరు. శివసంస్కార బలముచే యుక్తుడైన శ్వపచుడైనను మునిశ్రేష్ఠుడనబడును, శివసంస్కార హీనుడైన బ్రాహ్మణుడుకూడ శ్వపచునికన్న తక్కువవాడు (అధముడు). జన్మమునుండి శూద్రుడనబడి సంస్కారబలముచేత ద్విజుడనబడు చున్నాడు. శివసంస్కార సంపన్నులందు జాతిభేదమును చేయకూడదు. దారు, శిలా, లోహ, మృత్, రత్నాదులచేత చేయబడిన లింగము విధ్యుక్తముగ ప్రతిష్ఠింపబడిన ఎట్లు అది పూజ్యమగుచున్నదో అటులే చాండాల వంశమునందు పుట్టినట్టివాడు కూడ శివభక్తుడైనంతనే పూజ్యుడని గణింపబడును.

౮ యథా పంకే సరోజం స్యాద్యథా కాష్ఠే హుతాశనః
యథా సువర్ణం పాషాణే భక్తశ్చాండాలవంశజః॥
ప్రాగ్దేశజాతినామాని యః పఠేత్కథయేచ్చ సః
ప్రాయశ్చిత్త క్రియాసనర్హః పతేత్స మయశాసనే।
మాతా గిరిసుతా దేవీ పితా దేవో మహేశ్వరః
బాంధవాశ్శివభక్తాశ్చ స్వదేశం భువనం యథా। లైంగే॥

బురదయందు కమలము, కట్టెయందు అగ్నియు, మన్నునందు బంగారము పుట్టు

చున్నట్లు చాండాలవంశమునందు కూడ శివభక్తులు ఉదయించుచున్నారు. ఎవడిట్టి శివభక్తుని పూర్వదేశ, జాతినామములు చదివి చెప్పునో, అథవా వినునో, అట్టివాడు ప్రాయశ్చిత్త క్రియలకు గూడా అయోగ్యుడనబడి శివధర్మశాస్త్ర వచనప్రకారము పతితుడగును. శివభక్తులకు పార్వతీదేవియే తల్లి, పరమేశ్వరుడే తండ్రి, శివభక్తులే బాంధవులు, తమదేశమే తాముండదగిన గృహము.

౯ గురో రాలోకమాత్రేణ స్పర్శాత్సంభాషణాదపి
శివతత్త్వం సమాయాతి స పునర్భవతాం వ్రజేత్॥
యథా మౌక్తిగతం తోయం మౌక్తికం జాయతే ధ్రువం
న పున స్తోయతాం యాతి మౌక్తికత్వం న ముంచతి॥
ఏవం స శివతాం యాతి నపునః పశుతాం వ్రజేత్ వీ. శై. ప్రదీపిక॥

సద్గురుకృపాదృష్టి చేత, అతని స్పర్శచేత, అతని సంభాషణముచేత, భక్తుడు శివతత్త్వమును పొందును. అతడు పునర్భవమును జెందడు. కప్పచిప్పయందు చేరిన నీరు నిజముగా ముత్యమగుచున్నది. ముత్యమయిన పునః నీరు కానేరదు. ముత్యభావమును విడువకుండును. అట్లే భక్తుడు శివతత్త్వమును పొంది పశుత్వమున కాశ్రయుడు కానేరడు. కనుక అతనికి జాత్యాదులు గలుగకుండును.

౧౦ యే సంతి జాతిభేదై స్తా నేకవ చ్ఛివయోగినః
పశ్యే దఖిలజాతిస్థా నేక మాతృసహోదరాన్॥ ౪౦
న స్త్రీభేదో న పుంభేదో జాతివర్ణాశ్రమాదికమ్
సర్వాతీత మిదం విద్ధి వీరశైవ మిదం మమ॥ ౪౧
యదనాయాసతో దేవి భోగమోక్షౌ కరస్థితౌ
ధారణాన్మమ లింగస్య పూజనాచ్చ నిరంతరమ్॥ ౪౨
నాన్య త్కర్మ నవై కార్యం వ్రత మేత న్మహత్ శివే। పార ప ౫

జాతిభేదములు ఏవి గలవో అవియన్నియు (వీరశైవదీక్షగల వారియందు) ఒకే జాతియనియు శివయోగి తెలియవలెను. (దీక్షాపూర్వమునందు) భిన్న భిన్న జాతివారైనను (శివదీక్షయను శివానుగ్రహమైన పిదప) వారు తోడబుట్టిన సహోదరులని తెలియవలెను. ౪౦

(పాంకృతస్మార్త శాస్త్రములందువలె) స్త్రీపురుష భేదము లేదు. (స్త్రీలు ఉపనయనమునకు అర్హులు కారు పురుషులే అర్హులు యని అనునట్లు

గాదు. సర్వులు దీక్షకధికారులు) జాతి వర్ణాశ్రమాదులు లేవు. ఏవర్ణము వాడైనను, యే ఆశ్రమము వాడైనను, వీరశైవ దీక్షను పొందిన షట్స్థల సంపత్తిని పొందును. ఈ నా వీరశైవమతము స్త్రీపురుషులను, శూద్ర బ్రాహ్మణులను, బ్రహ్మచారి సన్యాసి యను నామసీమను మీరినదని తెలియును. సర్వులు సమాన హక్కుదారులనియే అర్థము.

ఏలననగా లింగమును అంగముపుండి విడదీయక సామరస్యభావముచేత ధరించి పూజించుటచేత ఈ ఒకే ధర్మముచేత అనాయాసముగ భోగమోక్షములు సర్వులకు సమానములు.

పార్వతీ! ఈ వీరశైవులకు ఎప్పటికైనను వేసటలేదు. శివలింగమును ధరించుట మరియు పూజించుట యనునది ఒక్కటియే క్రియయై యున్నది. దానిని మించి మరియొక కర్మము లేదు, కార్యము లేదు. ఈ వ్రతము వ్యాపకమైనది. మహత్తరమైనది

ప్రాకృత ధర్మమునందు వ్యాపక క్రియలేదు. దానియందు కర్మములు దేశకాలముల చేతను స్త్రీ పురుష భేదముచేతను, బ్రాహ్మణశూద్రత్వాది వర్ణములచేతను భిన్నభిన్నమై కర్మమువలన జాతియు, జాతివలన కర్మము అన్యోన్యముగ సంభవించుచు, ఆ ధర్మమునందు జాతిభేదములు గలుగ జేయును. ఈ అప్రాకృతధర్మమునందు ఒకేఒక ధర్మము గలిగియున్నందున ఇక్కడ జాతిభేదమునకు ఆశ్రయము లేదనియే తాత్పర్యము. అందువలన "వ్రతమేతన్మహత్" ఈ వ్రతము మహత్తరమైనది యనినందున మహత్తను విశేషణము వీరశైవుల యందు జాతిభేదము లేదనుటకు హేతు సూచకమై యున్నది. ఇట్టి విశేషణమును హేతుగర్భవిశేషణ మనియెదరు.

౧౧ అంగలింగ సమాయుక్తే భక్తే జాతివికల్పనాం

నైవ కుర్యామితి ప్రజ్ఞా శివాచారః సమీరితః॥ క్రియాసారము.

లింగాంగ సమాసక్తులందు జాతిభేదమును కల్పించనని నిశ్చయించుటయే శివాచారమని చెప్పబడినది.

53 ౧౨ మునీశ్వరేషు మర్త్యేషు బ్రాహ్మణేషు నృపేష్వపి

ఊరుజేష్వపి శూద్రేషు సంకరేష్వపి సర్వశః॥ ౧౭

వర్ణాశ్రమవ్యవస్థా శ్చ నైషాం సంతి మునీశ్వరాః

కేవలం శివరూపాస్తే సర్వే మాహేశ్వరాః స్మృతాః॥ ౧౨
అతివర్ణాశ్రమాః ప్రోక్తాః సర్వే వేదేషు సత్తమాః॥ క్రియాసారే॥

మునీశ్వరులందును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర సంకర జాతులందును శివసంస్కారమును పొంది మహాత్ములైన శివభక్తులు కలరు. వారియందు వర్ణాశ్రమవ్యవస్థయులేదు సమస్తులు అతివర్ణాశ్రమియులే యనబడెదరు. పూర్వమునందు బ్రాహ్మణాది సంకరాంతమైన ఏ జాతియందున్నను అష్టావరణ పంచాచారయుక్తమైన వీరశైవదీక్షవలన పునీతులయిన తర్వాత జాత్యాదులు మిగిలియుండవు. అతివర్ణాశ్రమము ప్రాప్తించును. వీరశైవదీక్షా విషయము నందును,

౧౩ యేషు యేషు మహాదేవి భక్తి రవ్యభిచారిణీ
యోగ్యా స్త ఏవ మంత్రస్య భక్తి రేవాత్ర కారణం॥ ౧౪
విశేషం యత్ర దీక్షాసు పూర్వికా భక్తి రస్తిహి
న తత్ర జాతిభేదో స్తి సర్వే రుద్రస్వరూపిణః॥
యత్ర స్యా ద్భాతి సామాన్యం తత్ర జాత్యాదికల్పనా
తస్మా దయోగ్యో యోగ్య శ్చే త్యేవం శంకా న తత్ర హి॥

శివదీక్షయైన తర్వాత జాతిభేదము జేయకూడదని భక్తియే ముఖ్య కారణమని సర్వత్రులు యీ వీరశైవావలంబనమునకు యోగ్యులని (అధికారులని) దీని యందు ఏమియు శంక జేయకూడదని క్రియాసార కర్తలైన శ్రీ నీలకంఠశివాచార్యులునుడివి యున్నాడు.

వీరశైవులకు శివకుల శివగోత్రముగాక వేరే కులగోత్రములు లేవు. శివశక్తులే వారికి తల్లిదండ్రులు, శివభక్తులే బంధువులు. ఇటులుండగ భక్తుల దొకజాతి, జంగముల దొకజాతి యనియెంచుట కేవలదురభిమానమైన సంగతి. యజ్ఞయాగాదులను చేయు కర్మకాండీయులు దేహమునందు తాదాత్మ్యబుద్ధిచేత సర్వకార్యములను చేయుచున్నందున వారియందు జాతికల్పనప్రచారము నందున్నది. అయినను మోక్షమార్గ సాధ్యమైన వీరశైవధర్మమునందు శివసంస్కార (శివదీక్షా) ప్రభావముచేత శివభక్తులందు ఒకసారి నష్టమైన తర్వాత పునః అది యేరీతిచేతను కలుగనేరదు. జాతివిచారము తలకెక్కినంతనే శివభక్తియు కుంగిపోవును. శివభక్తియు నష్టమైన నతడు భక్తుడుకాడు. జంగముడు కాడు. వారిద్దరు భవులే. దీక్షాబలముచేత శివభక్తుని దేహము మంత్రపిండమై కరణేంద్రి

యములు లింగేంద్రియములయి యుండ దానియందు జాతికల్పన శవకాశ మెట్లుండును. జాతిని యుంచిన ప్రాకృతజీవు లనబడుదురు. అట్టివారు అప్రాకృతులు ఎన్నటికి కానేరరు. మరియు భక్త, జంగమ, ఈ రెండు శబ్దముల నిరుక్త్యర్థమును పరిశీలించిన వాటినుండి జాతియు అథవా ఏదో ఒక వ్యవహార ద్యోతకమైన అర్థము వెడలదు.

ధార్వాడ జిల్లా న్యాయాధిపతియు ఉభయపక్ష శాస్త్ర శోధనమును జేసి తన అభిప్రాయమును ఈ దిగువ ప్రకారము వ్రాసియున్నాడు.

వాది ప్రతివాదులు జెప్పుచున్న జాతిభేదము లింగాయత ధర్మ మూలభూతమైన తత్వములకు బయటిది. ఈ ధర్మస్థాపనాచార్యులు బ్రాహ్మణాది చాతుర్వర్ణముల మరియు తత్సంబంధ కర్మములకు విరోధముగ తమ మతమును ప్రచారము జేసిరి. ఏ వర్ణము వారైనను ఈ ధర్మమును అంగీకరించ వచ్చును. ఈ ధర్మము శివభక్తుల కందరికి శివకులమేకాక వేరే కులము లేదు, సమస్త శివభక్తులు సహోదరులు యని భోధించును. శైవరత్నాకరము ౧౧౯ పుట ౫౬ శ్లోకమునందు శివసంస్కారమును పొందిన వారియందు జాతిభేదము నెంచకూడదు యని చెప్పబడినది. శివసంస్కారమనగ శైవధర్మమును అంగీకరించువారలకు చేయబడు నొక విశిష్టదీక్ష. పునః ఈ శైవరత్నాకరమునందే శివభక్తుడు పార్వతిని తల్లి యని, శివుడు తండ్రి యని, మిగిలిన శివభక్తులు అన్నదమ్ములని, జగత్తంతయు తనదేశమని, తెలియవలెనని చెప్పబడినది. దీని వలననే అనాది వీరశైవ సారసంగ్రహము నందు, సిద్ధాంత శిఖామణి గ్రంథమునందు, లింగాయతుల యందు జాతిభేదములు లేవని చెప్పబడినది. ఏ జాతి వాడయినను శివభక్తుడయిన అతనిని శివునిగా భావించ వలెను. శివభక్తుని జాతిపరీక్ష జేయు కారణము లేదని సిద్ధాంత శిఖామణి యొక్క అభిప్రాయమును నిచ్చియున్నారు. శివభక్తులయందు జాతులు లేవని న్యాయాధీశులు ఇంక అనేక శాస్త్రవచనములను తమ నిర్ణయమునందు ఉదహరించిరి.

వీరశైవ ధర్మస్థాపనా చార్యులు బ్రాహ్మణాది నాలుగు వర్ణములను తీసివేసియుండ పునః తమ శివధర్మమునందు అదే జాతిభేదములను గలుగ జేయు చున్నారన్న గొప్ప అసంభవమైన మాట. మరియు బ్రాహ్మణులందు కూడ లేని పద్ధతిని వారు ప్రచారము జేసిరనునది మరింత అసంభవము. పురో

హితుల కొడుకులే పురోహితులు కావలయునని బ్రాహ్మణ ధర్మమునందు కూడ చెప్పియుండలేదు. పురోహితులగు నధికారము సర్వబ్రాహ్మణులకు గలదు. భక్తులు జంగమ పదవిని అధికారములను పొందుచున్నట్లు అనేకాధారములు గలవు మరియు ఈ ఆచారము రూఢియందుకూడ గలదు.

అయినను రానురాను మొదలు వీరశైవమత ప్రవిష్టులందు పూర్వజాతి సంబంధమైన వికల్పనలు తలకెక్కినందున, ధర్మస్థాపనాచార్యుల ఉదార మరియు ఉదాత్త తత్వములు మాసి వాటికి బదులు జాతివిషయక సంకుచిత విచారములు కన్పడసాగెను. శివభక్తుడు శివస్వరూపుడయి యున్నందున అతని తృప్తివలననే శివుడు సంతుష్టుడవుచున్నాడు యని ప్రమాణము గలదు. భక్తుడు జంగముడు ఒకటేయనునది వీరశైవులు ఆచరించదగిన కరణప్రసాద సేవన యందు దాని ఘటనమునందు స్పష్టముగా కన్పట్టుచున్నది.

మనము సూక్ష్మరీతిగా విచారించిన, వీరశైవులందు జాతిభేదము లున్నట్లుగ మన వర్తనమునందు కన్పట్టదు. అష్టావరణ యుక్తులైన సర్వ భక్త జంగములు ఒకటే పంక్తియందు కూరుచుని భోజనము జేయుచుందురు. జాతిభేదము వీరశైవులందు గలిగిన ఈ కార్యములు ఎన్నటికి నడువకుండును. బ్రాహ్మణుని పంక్తికి బ్రాహ్మణుడే కూరుచుండును గాని ఇతర క్షత్రియాదులు కూరుచునుట ఎట్లు?

ఈ సాంప్రదాయమునకు విరోధమైయున్న వీరశైవ వర్తనము నడుచుచు వచ్చుచున్నందున వారియందు జాతులుండు టెట్లు? భక్తజంగములు తాత్వికముగ ఏకరూపమై యున్నదానినే ఆచరణమునందు కూడ స్థిరముగ నిలచి యుండవలెనని, వీరశైవులందు జరుగుచున్న కరణప్రసాద స్వీకార తాత్పర్యమై యున్నది. కరణ ప్రసాద స్వీకారము, గురుశిష్య భక్తజంగములు అభిన్నులని తెలియజేయు బహిరంగ గురుతై యున్నది. ఇటులుండ మనము శివభక్తుల ఉచ్చనీచత్వములను వివరించుట గొప్పపాపకరమైన కార్యము

శివధర్మ శాస్త్రములు, శివాగమములు, సమస్తులను ఒకేదేవుని భక్తునిగ చేసినందున వారందరు సమానస్థితిగలవారని గణించి, పరస్పర వైషమ్యమును మరచి ఒకేమనస్సుచేత సమస్త కార్యములను జేయుచుందురని శివుని పూజించువారలు అనగ ప్రస్తుతము మన వీరశైవులందరు ఒకే ధర్మాను

యాయులు, వీరియందు జాతిభేదములు లేవని యుగ యుగాంతర పూర్వము నుండి చాటింప బడి యున్నది.

## అత్యాశ్రమత్వము

లింగాంగసంగినః చైవ పునర్జన్మ న విద్యతే
యేషు పాశుపతో యోగః పశుపాశ నివృత్తయే
సర్వవేదాంతసారో యం అత్యాశ్రమ ఇతి శృతిః॥ శంకర సం॥

లింగాంగ సామరస్యాత్మకమైన వీరశైవులకు పునర్జన్మము లేదు. ఈ లింగధారణమే పాశుపతయోగము. దీని వలననే జీవులయొక్క మాయా పాశ బాధ నివృత్తి యగును. ఈ లింగధారణయే సమస్త వేదాంతముల యొక్క సారమైనది. ఇది అత్యాశ్రమ మని శృతులు చెప్పుచున్నవి.

లింగం శివో భవేత్ క్షేత్రం అంగం సంయోగ మాశ్రయః
తస్మా ల్లింగాంగసంయుక్తో యోపి సోత్యాశ్రమీ భవేత్॥ విజయాగ॥

లింగాంగ సామరస్యము గలవాడే అత్యాశ్రమీయు డనబడును.

ఆదిత్య లైంగ్య స్కాందపురాణము లందు కూడ అత్యాశ్రమ వ్రతమే వీరశైవులకు నిరూపింప బడినది.

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థో యతి స్తు వా
య స్తు లింగాంగసంయుక్తః స ఏవా త్యాశ్రమీ భవేత్।

అతడు బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, భిక్షుకుడైనను, సన్యాసియైనను సరే, లింగాంగి యైనంతనే అత్యాశ్రమీయు డగును. అనగా అతనియొక్క పూర్వాశ్రమములు వదలి అత్యాశ్రమమమే మిగులునని అభిప్రాయము కనుక వీరశైవులు ఏ ఆశ్రమమందు నుండని అత్యాశ్రము లనియే పిలువబడుదురు.

అత్యాశ్రమిత్వాత్ గణవంశజానాం లింగాంగసంగినాం తత్రాజన్మాంత దీక్షా యథా గంగాశివసంగాత్తథైవ న సూతకం వా నాప్యశుచిత్వ మేషాం.౧ ౨సి.శి॥ఉ.

54 లింగాంగ సామరస్యజ్ఞులైన వీర నంది భృంగి వృషభ స్కంద యనుప్రమథ గణముల యొక్క వంశజులయిన వీరశైవులకు అత్యాశ్ర మత్వము గలిగి యున్నందున అనగా: బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యా శ్రమాతీతము గలిగినందున,

ఆజన్మాంత శివదీక్ష గలిగినందున పంచసూతకములులేవు మరియు అశుచిత్వము గూడలేదు. శివసాంగత్యమున గంగాప్రవాహము శుచిఖ్యాతమైనట్లని తెలియవలెను. వివేకులు వర్ణాశ్రమములను వీరశైవుల తిక్రమించిరనియే తెలిసికొందురు.

హృదబ్జమధ్యే యల్లింగం ధృత్వా జ్యోతిషం విశంతి అత్యాశ్రమస్థాః పరిముచ్యంతే సర్వేలింగాంగశోభా మోక్షమార్గైకనిష్ఠాః తే బ్రహ్మలోకేషు పరాంతకాలే శివప్రసాదా త్పరిముచ్యంతి సర్వే లింగాంగసామరస్యాచ్చ శరీరే లింగధారణాత్ నియమేనైవ ధృత్వాశేముక్తాసంసారబంధనాత్॥ వీ. శై. ప్రదీపిక ఈ సూత్రమందుకూడ అత్యాశ్రమస్థులైనవారికని చెప్పబడినది.

అత ఏవాఽశ్రమాచార రాహిత్యం వీరశైవకే
అత్యాశ్రమియధర్మా శ్చ బహవో భాంతి చాఽగమే॥

వీరశైవమందు క్రమక్రమ సోపానాధిరూఢ ములై కాలవిలంబ మును జేయు ఆశ్రమాచారములు రహితమైనవి. అత్యాశ్రమధర్మములు అనేకాగమములందు చెప్పబడినవి.

అభివందే త్తదాఽన్యోన్యం న భేదో లింగధారిణాం
న బ్రహ్మచర్యనియమో న వానప్రస్థలక్షణం॥ ౮౯
న సన్యాసో నవైరాగ్యం యది లింగార్చనే రతిః
న ముండనం నాపి శిఖా న శుక్లో నాఽరుణః పటః॥ ౯౦

లింగధారులైన వీరశైవులకు బ్రహ్మచర్య వానప్రస్థ సన్యాసాది ఆశ్రమములు లేవు. ముండనముగాని శిఖగాని, కాషాయ వస్త్రధారణగాని ఉండవలెనను నియమములేదు. ఇందుచే వీరశైవులు అత్యాశ్రమియులనియే తెలియుచున్నది.

నస్త్రీభేదో న పుంభేదో జాతి వర్ణక్రమాదికం
సర్వాతీత మిదం విద్ధి వీరశైవమతం మమ॥ ౮౮

వీరశైవులకు వర్ణాశ్రమక్రమములేదు. స్త్రీపురుషభేదములేదు. కావున శివపూజాదికార్యము లందందరికిని సమానాధికారము గలిగినది.

సప్తధాతుసమం పిండం సమయోని సముద్భవం
ఆత్మజీవస ముత్పన్నం వర్ణానాం కిం ప్రయోజనం॥
పుణ్యపాప వినిర్ముక్తా స్సర్వదా పరమార్థతః
అహం చ సర్వదా విప్ర వర్ణాశ్రమ వివర్జితః॥ స్కాందే,

నేను వర్ణాశ్రమములు లేనివాడనని శివుడు స్వయముగా జెప్పెను.

అజ్ఞానాంబునిధౌ విప్రా నిమగ్నానాం శరీరిణాం
వర్ణత్వ మాశ్రమత్వం చ స్వభావా దనువర్తతే॥

అజ్ఞాన సముద్రమందు మునిగిన దేహధారులకు వర్ణాశ్రమ ధర్మములుస్వభావతః గలుగుచున్నవి. కావున శివభక్తులు అజ్ఞానాశ్రయ ములైన వర్ణాశ్రమ ధర్మముల నాచరింపరాదని స్పష్టముగా తెలియుచున్నది.

## పంచ సూతక రాహిత్యము.

పంచసూతకములనగా:— జననసూతకము రజస్సూతకము ఉచ్ఛిష్ట సూతకము జాతిసూతకము మరియు ప్రేతసూతక మనునవి. ఈ పంచసూతక ములను అలింగాంగులు మన్నింతురు కాని లింగాంగులు మన్నింపరు వీర శైవులయిన స్త్రీబాల వృద్ధాదులందరు ఆజన్మలింగ ధారులైనందున ప్రతిదినము అష్టా వరణ యుక్త శివవ్రతమును సలుపుచుందురు కావున సూతకములు వారినంటకుండును.

యతి ర్వ్రతీ బ్రహ్మచారీ నృపకారుక దీక్షిణః
నాఽశౌచభాజః కథితా రాజాజ్ఞాకారిణ శ్చ యే॥ శంఖ స్మృ॥౧౫॥

వ్రతస్థుడు, యతి బ్రహ్మచారి దీక్షితుడు వీరి కెట్టి సూతకమును లేదు. కావున ఆజన్మదీక్షితులైన వీరశైవులను పంచసూతకములంటవు. సూతకముల పాటించు వీరశైవుని అదీక్షితుడనియే తెలియదగును.

స్వతః తేజోరహితమైనను లోహ మగ్ని సంసర్గముచే అగ్ని రూపముగల దైనట్లు నిర్గుణ నిర్మాయా నిర్లేపుడైన పరశివసాన్నిధ్యముచే మానవుడు ప్రకృతితత్వమును వదలి అప్రాకృతుడగును. తైలయుక్తమైన వత్తి తేజస్సంబంధముచే తేజోమయమై దాహజనక మైనట్లే నిత్య శుద్ధ బుద్ధ ముక్త సచ్చిదానంద రూప పరశివ చిత్కలాధిష్ఠిత శివలింగ సంబంధము చేత శరీరము శివలింగ మయమే యగుచున్నది. అను శివరహస్యప్రమాణాను సారము లింగధారులగు వీరశైవుల కశుచిత్వము లేదు కావున పంచసూతకముల నెంతమాత్రము పాటింపరాదు.

గృహే యస్మిన్ ప్రసూతా స్త్రీ సూతకం నాఽత్ర విద్యతే
లింగార్చనరతాయా శ్చ ఋతౌ నార్యా న సూతకమ్॥
తథా ప్రసూతికాయా శ్చ సూతకం నైవ విద్యతే॥ వీరాగమే.

శివపూజాధురీణురాలైన స్త్రీలకు రజోదోషము ప్రసూతి సూతకములు లేవు.

న స్పృష్టి ర్న రజోదోషో న స్త్రీబాలాదికల్పనా
న జన్మమరణాశౌచం న స్నానాదివిధి ర్యతః। పార ౧-౫౭
శ్రాద్ధ పిండ ప్రదానాది సూతకం చ వివర్జయేత్
మాతాపిత్రో శ్చ మరణే పుత్ర మిత్ర మృతౌ తథా।
నాఽశౌచం న చ సంతాపం లింగదేహీ ప్రకల్పయేత్॥ వీరాగమే।

లింగధారులకు మరణసూతకము రహితమనియు మాతాపితలను శ్రాద్ధకర్మలనా వశ్యకములనియు విశ్వసించి సంతాపసూతకములను వీరశైవుడు త్యజింపవలెను.

గృహే యస్మిన్ ప్రసూతా స్త్రీ సూతకం నైవ విద్యతే
శివపాదాంబు సంస్పర్శా త్సర్వపాపం ప్రణశ్యతి॥
సూతకం నైవ విద్యేత జాతకం మృతకం తథా
తేషాం ప్రసాదతః శుద్ధిః ప్రసన్నం చ ప్రకల్పయేత్॥ బ్రహ్మా పు॥
తస్మా త్సూతక మాద్యంతం హిత్వా భోగం సమాచరేత్। శం. సం.

ప్రాణలింగాంగులకు అంగసూతకము లన్నియు వర్జితములు.

యథా విశ్వేశనికటా ద్గంగా సూతక వర్జితా
తథా లింగాంకితా భక్తాః పంచసూతక వర్జితాః॥ లింగసారే।

లింగార్చనాపరురాలైన స్త్రీకి రజోదోషము లేదని నొక్కి వక్కాణించుచు, ఈశ్వరసాన్నిధ్యముచే గంగకు రజోదోషము లేనట్లు లింగాంగులకు లింగము సర్వత్రదేహ మందుండి యున్నందున, పంచసూతకములను పాటింపరాదు.

న తస్య సూతకం వత్స ప్రాణలింగాంగ సంగినః
జననోత్థం మృతోత్థంచ విద్యతే పరమార్థతః।
లింగార్చనరతా నారీ రజస్సూతక సంయుతా
రవి రగ్నిః యథా వాయు స్తద్వ త్కోటిశుచి ర్భవేత్।

శివదీక్షానంతరము ప్రాణలింగాంగులగు వీరశైవులకు జననమరణ సూతకము లేదు. మరియు లింగార్చనాపరురాలైన స్త్రీకి రజస్సూతకముకూడ అంటదు. సూర్యాగ్ని వాయువులకన్న కోటిగుణము లధికము శుచి గలుగునని శంకర సంహితయందు జెప్పబడినది. మరియు సిద్ధాంతశిఖామణి యందు కూడ,

స్త్రియో జాతా స్తథా వృద్ధాః ఖంజాః కుబ్జాంధపంగవః
మల్లింగధారణా దేవ మద్రూపా ఏవ తే శివే।

శైవం దైవార్చనం యస్య యస్య చా గ్నిపరిగ్రహః
బ్రహ్మచారియతీనాంచ శరీరే నాస్తి సూతకమ్॥ పారాశరీయే॥

బ్రహ్మచారులకు యతులకు అగ్నిపరిగ్రహులకు శివపూజకులకు తమ శరీరము లందు సూతకములు లేవనియు మరియు లింగనిష్ఠాపరురాలైన స్త్రీ రత్నము సూతకము నందుగాని రజస్వలాకాలము నందు గాని సూర్యాగ్ని వాయువులకన్న కోటిగుణము లధికముగా శుచిర్భూతురాలై యుండుననియు మరియు జనన కాలమునందు సూతక సమయమునందు శివపూజను విడువకూడదనియు సదా లింగధారియై యుండవలయు ననియు చెప్పబడెను.

సర్వే పి వందనీయాః హి విధవా పుష్పిణీ ముఖాః
యస్యాస్తి భక్తి రీశాని వీరశైవమతా శ్చ యే
భక్తిమాత్రపవిత్రా హి సర్వ ఏవా ధికారిణః॥ పారమేశ్వరా॥

సమస్తులకు సమస్త కాలములందు లింగధారణ, లింగపూజాధికారము గల దనియు పురుషులు స్త్రీలు విధవలైనను, సుమంగలులైనను, వీరశైవ మతస్థులైనవారు ఈశ్వరభక్తిచే పవిత్రులయిరి. కనుక వందనీయులు వారికి సర్వాధికారములు గలవని జెప్పబడినది. కనుక వీరశైవులు పరమాత్మునివలె నిత్యశుద్ధ ముక్త స్వభావులై వర్తింతురు.

విశ్వాసయుక్తః పూర్ణాత్మా వర్జయే త్పంచసూతకాన్
సూతకం జన్మ మృత్యు శ్చ రజస్సూతక మేవ చ
అన్న సూతక ముచ్ఛిష్టం సూతకం పంచధా భవేత్॥

విశ్వాసయుక్త పూర్ణాత్ముడయిన భక్తుడు జనన మరణ రజ అన్న ఉచ్ఛిష్ట సూతకములను వర్జింప వలయును.

పంచసూతకరాహిత్యం మత్వా నిశ్చిత్య మానసే
యో వీరో తద్వినిర్ముక్త స్తచ్ఛీలం తు చతుర్దశ॥

అని శీలప్రకరణములో పంచసూతకములు జీవ సంబంధ వర్తనము లైనందున "అహం శివో హం" యను శివతత్వజ్ఞానులైన వీరశైవుల నంటనేరవు.

55 శివైక్య భావనాపన్న శివైక్యో దేహవా నపి
దేశికో హి న లిప్యేత స్వాచారైః సూతకాదిభిః॥

శివైక్యము వలన శివత్వముపొందిన శివలింగైక్యునకు దేహమును పొంది యున్నను, సూతకము మొదలైన స్వమతాచారములచేత సంబంధము గలవాడు గాడు. శివైక్యదశయందు శివభక్తుడు సూతకాదుల కట్టడికి లోబడడు.

## పునర్జన్మ రాహిత్యము

లింగాంగ సామరస్యరూప శివాద్వైత జ్ఞానము ద్వైతజ్ఞాన రూపములైన సుఖ దుఃఖమోహాది బంధములకు నివర్తకమైనందున ప్రతిబోధయని శృతి చెప్పు చున్నది. (కేనో-౧౨) ఈ జ్ఞానము గలవాడమృతత్వమును (ముక్తిని) పొందు చున్నాడు. ఈ విషయమునందు శివాద్వైతవిధి దృఢమైన జనన మరణములు నాశమగుచున్న వని "విద్యావినాశే జన్మవినాశః" శివసూత్రము చెప్పుచున్నది.

శివ ఏవ జగత్సర్వం శివ ఏవాహ మిత్యపి
భావయన్ పరమో యోగీ భవదోషై ర్న లిప్యతే॥ సిద్ధాంత శి॥

సమస్తజగత్తు శివరూపమైనది. ఆ శివుడే నే నని భావించు పరమశివయోగికి జననమరణరూపములయిన భవదోషము లంటకుండును అనగా అతడు పునః పుట్టడు చావడు నిత్యుడై యుండును.

సప్రపంచం పరిత్యజ్య హేయోపాదేయ లక్షణం
తృణాదికం తథా పర్ణం పాషాణం సచరాచరం॥
శివాద్యవనిపర్యంతం భావాభావోపబృంహితం
సర్వం శివమయం ధ్యాత్వా భూయో జన్మ నవాప్నుయాత్॥

హేయ ఉపాదేయ వస్తువులచేత కూడిన సమస్త ప్రపంచమును పరిత్యజించి తృణ, కాష్ఠ, పర్ణ, పాషాణ, చరాచర ప్రపంచము, శివాది భూమ్యంత తత్వ ములు, భావాభావములు శివరూపములే అగుచున్నవి. ఆ శివుడ నేనే నను ధ్యానతత్పరుడయిన వానికి పునర్జన్మము గలుగకుండును. జనన మరణముల బాధయేతప్పిపోవుచున్నది. అని శ్రీకంఠియను గ్రంథము ప్రమాణమై యున్నది.

ధ్యేయవస్తువునందు చిత్తము లీనమైనంతనే ధ్యాన మనబడుచున్నది. ఆ ధ్యానము వలన ధ్యేయవస్తువు యొక్క సాక్షాత్కార మగును. ఆ పైన ధ్యాత ధ్యేయస్వరూపుడే యగునని విశ్వేశ్వరసంహితయందు గలదు ఎలై పర

శివా! నీయొక్క స్వరూపుడ నే నేనని యెవడు భావనాభ్యాసమును జేసి అహంకార మమకారములను గ్రంథులను లయింపజేయునో అతడు శివస్వరూప మును ప్రత్యక్షముగా చూచియే తీరునని షాడ్గుణ్య వివేకమను గ్రంథమునందు వ్రాయబడినది. కనుక శివజీవైక్యమే లింగాంగసామరస్యము. ఇట్టి సామరస్య విద్యారసికులైన వీరశైవులు నదులు సముద్రమునందుకూడి తాదాత్మ్యమును పొందుచున్నట్లు పరశివ లింగమునందభిన్నత్వమును పొందుదురు. అటుపైన ఇతనికి పశుత్వము (జీవభావము) తప్పి శివభావము గలుగును. కనుక శివ యోగము వలన జీవునకు ప్రాప్తమైన శివభావము తప్పిపోయి పునః జీవ భావము ఎన్నటికి రానేరదు.

పశురూపుడయిన జీవుడను యంగమునకు శివలింగముయొక్క సంయో గమైన తర్వాత, ఆ యోగాభ్యాసముచేత సమనాంతమైన పాశజాలమంతయు నష్టమై పోవుటయే గాక శివత్వప్రాప్తియుకూడ యగుచున్నది. కనుక జీవునకు పశుత్వము మిగిలియుండదు. ఈ విషయమునందు,-

పాశయుక్తో భవేజ్జీవః పాశముక్తో భవేచ్ఛివః॥

పాశములచే కూడినవాడే జీవుడు, పాశములనుండి విడువబడినవాడే శివుడని ఆగమవాక్యము గలదు. కనుక దివ్యమైన యోగమార్గమను శివాద్వైత దృష్టి చేత ధ్యాతృ ధ్యాన ధ్యేయములను త్రిపుటిని యడగించి శాశ్వతమైన శివపద మునుపొంది పునః పుట్టకుండును.

సారాంశమేమనగా గురుకృపాకటాక్షమువలన శిష్యుడు త్రివిధ దీక్షల పొంది మలత్రయముల నశింపజేసి లింగత్రయముల ధరించుకొన్న వాడయి, ఆ లింగస్వరూపుడ నేనే నను దృఢజ్ఞానము గలవాడై, షట్స్థలయోగాభ్యాసము నందు ప్రవర్తించును. ఆ అభ్యాసము దృఢమైనంతనే అతనికి చిచ్ఛక్తి రూప మైన శివుడే నేనను జ్ఞానము సిద్ధించును. ఈ చిచ్ఛక్తియొక్క వికాసరూప అప రోక్షజ్ఞానము గలవాడయిన తుర్యావస్థ యనబడును. ఆ అవస్థ గలవాడే స్వతంత్రుడు అతడే అమృతత్వమును పొందును. అతనికి పునర్జన్మ పునర్మర ణములు సుఖదుఃఖములు లేకుండును.

# దహన, శ్రాద్ధ, తర్పణాదుల నిరసనము

గురుదీక్షా పరిప్రాప్తా శివలింగాంగ యోగతః
ద్విరేఫ కీటన్యాయేన శివైక్యం ప్రాప్తవాన్ ద్విజః
లింగాంగసంగిని మృతే సంప్రాప్త ద్వాదశే హని
సాపింద్యం నైవ కర్తవ్యం ప్రేతత్వాభావతో మునే॥

గురుదీక్షాసంస్కారమైన లింగాంగ సామరస్యము గల భ్రమర కీటక న్యాయ యమున శివైక్యమొందిన లింగాంగిమరణమందు ప్రేతభావము నెంచక ద్వాదశ దివసము, పిండక్రియలు చేయవలసి లేదు. యని మకుటాగమము చాటించు చున్నందున వీరశైవునకు దహన శ్రాద్ధ తర్పణాదులు చేయకూడదు.

గురువుచేత త్రివిధదీక్షబొంది ఐక్యమయిన భక్తునికి పిండప్రయోజన మెందుకని వీరాగమము ఘోషించు చున్నది.

తద్దినం దినదోషేణ తద్దినం దుర్దినం తథా
తదన్నం మాంసతుల్యం తద్గృహం శ్వపచాంగణం॥

తద్దిన మనగా మరణమైన దినము:- దినదోషముచే యాదినము దుర్దినము. (అనగా దుష్టదినము) యా అన్నముమాంస తుల్యము. ఆ తద్దినముచే యున్న యిల్లు శ్వపచాంగణ మని కూడ వీర శైవాచార ప్రదీపిక యందు చెప్పబడి యున్నందున వీరశైవులు శ్రాద్ధ తర్పణాదులు చేయకూడదు.

దగ్ధస్య దహనం నాస్తి పక్వస్య పచనం నహి
జ్ఞానాగ్ని దగ్ధ దేహానాం నచదాహోన చ క్రియా॥

కాల్చబడి మరల కాలదు. పక్వమై మరల పక్వముగాదు. అట్లే జ్ఞానాగ్ని దగ్ధ దేహము గాల్చుట, అంత్యేష్టిక్రియలు జ్ఞానసంపన్నులైన వీరశైవులకు లేవు.

శివజ్ఞానముచే అత్యంతశాంతియు, మోక్షము సిద్ధించు చున్నందున, శివ జ్ఞాన నిరతులకు అగ్నిసంస్కారమువలన యెట్టి ప్రయోజనముగలుగదు. కనుక దహన తర్పణాది క్రియలు త్యాజ్యములని సిద్ధించును.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఇతి శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి యందు శివదీక్షయను
ఆఱవ ప్రకరణము సమాప్తము.

ఓం

శ్రీ శివాయ నమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి

## అష్టావరణములు

### ఏడవ ప్రకరణము.

వీరశైవుడనేకజన్మసంచిత సద్ధర్మాచరణముల వలన మనోవాక్కాయకృత పాపసంచయము లెల్లను నాశనము గావించి నిర్మలాంతఃకరణుడయిన తర్వాత "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యను శృతివచన ప్రకారము సత్తుచిత్తు ఆనందమే స్వరూపముగాగల సర్వ వ్యాపకుడయిన సత్వాది గుణ రహితుడయిన అనంతకల్యాణగుణ పరిపూర్ణుడయిన ఆ పరశివుడు ఒక్కడే "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను శృతివచనప్రకారము ఆ శివాతిరిక్తమైన వేరే పదార్థము లేదని దృఢ సంకల్పుడయి తత్పరశివవిషయకమైన సద్భక్తి గలవాడయి ఈ దేహేంద్రియ బుద్ధులకు భిన్నుడయి అచ్యుతుడయి యున్న ఆత్మనే తానని జ్ఞానము గలవాడయి తచ్ఛివైక్య జ్ఞాన సంప్రాప్తికొరకు కొన్ని సాధనభూతములైన ఆచారములను మరియు సాధనములను చేయ నుద్యుక్తుడగును. ముముక్షువు అష్టావరణములు, పంచాచారములు మరియు షట్స్థలములతో తమ నిజాత్మ తత్వమును గ్రహించి ఆత్మైకత్వము ననుభవించునని వీరశైవ మత ప్రతిపాదితములైన శివాగమోక్త సిద్ధాంతముల వలన తెలిసినవారై తజ్జ్ఞాన సంప్రాప్తికొరకు సచ్చిదానంద పరిపూర్ణులై ఆత్మతత్వ విచారజ్ఞులై, శాంతులై యున్న సద్గురువును పొంది శివదీక్షా సంస్కారముచేత విగత ప్రాకృత పాపాచారులై అష్టావరణములను స్వీకరింతురు.

అష్టవిధ ఆధ్యాత్మికాచరణములకు ఆవరణములని పేరు. తోటమాలియు తన తోటయందు పశ్వాదులచే తొందరగలుగ గూడదని తోటచుట్టు కంప వేయునట్లు, రాజు తనకు శత్రువులచే అపజయము గాగూడదని తనపట్టణమునకు కోటనిర్మాణము జేసుకొనునట్లు, యోధుడు రణరంగమున తన దేహమునందు శస్త్రముల గాయము దగులకుండ అభేద్య కవచముచే ఆచ్ఛాదితుడైనట్లు, వీరశైవుడు కూడ సంసృతిబాధమునకు హేతుభూతములైన మల, కర్మ,

మాయాదిరూప శత్రువులచేత పీడ గలుగగూడదని తన బాహ్యాభ్యంతరరూప తనుత్రయమును, గుర్వాద్యష్ట విధాచరణ మను ఆవరణముచేత ఆచ్ఛాదింప బడుచున్నందున, ఆ యెనిమిది విధములైన ఉత్తమాచరణములు ఆవరణములను సంజ్ఞగలవై యున్నవి. గురు, లింగ, జంగమ, తీర్థ, ప్రసాద, విభూతి, రుద్రాక్ష, మంత్రములనునవే అష్టావరణములు. ఈ అష్టావరణానుష్ఠానమే ముముక్షువు నకు అత్యావశ్యకమై యున్నది. దీనివలననే లింగాంగ సామరస్యము సిద్ధించు చున్నది. కనుక అష్టావరణములు సంక్షేపముగ వివరింపబడు చున్నవి.

## ౧. గురువు.

నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

యను శుక రహస్యోప నిషద్వచన ప్రకారము శ్రీ గురువు సాక్షాత్ బ్రహ్మ స్వరూపుడనియు, జ్ఞానమూర్తి యనియు, తత్వమస్యాది అర్థాత్ లింగాంగ సామరస్య జ్ఞానము గలవాడనియు, నిత్యుడనియు, అమలుడనియు, గుణరహితు డనియు, అనేక విధముల కొనియాడబడెను. అట్టి సద్గుణ సంపన్నుడైన గురువునే ఆశ్రయించి భక్తుడు ముక్తి సామ్రాజ్యమును పొంది ఆత్మసుఖము ననుభవించ వలయును.

పాశమోక్షః పశూనాం హి పత్యా క్రియత ఇత్యతః
పాశమోక్షకర శ్శ్రీమాన్ స గురుశ్శివ ఇష్యతే॥ స్కాందే॥

జనన మరణాదులకు కారణములైన కర్మబంధములే పాశములు; తత్పాశములచే పీడితులౌచున్న మానవులే పశువులు. అట్టిపశువుల పాశములనుండి తొలగించి శివైక్యమును బోధించు బోధకుడే గురువు.

గుకారోంధతమః ప్రోక్తం రుకారో భాస్కరోదయః
మోహాంధకార హరణా ద్గురు రిత్యభిధీయతే॥ పార. ౧౪-౬౩
గుకార స్త్వంధకార స్స్యా ద్రుకార స్తన్నిరోధకః
అంధకారనిరోధత్వా ద్గురు రిత్యభిధీయతే॥ అద్వయ తారకోప ని॥
గుకారంచ గుణాతీతం రుకారం రూపవర్జితం

గుణాతీతం మహారూపం యో దద్యాత్స గురు స్స్మృతః॥

శిష్యునియొక్క హృదయమును వ్యాపించియున్న అజ్ఞానరూపాంధ కారమును నాశముగావించు సమర్థతగల యేజ్ఞానముగలదో అట్టిజ్ఞానముగలవాడే గురువు.

నిష్కలో౽పి మహాదేవో నిత్య జ్ఞాన మహోదధిః
సకలో గురురూపేణ సర్వానుగ్రాహకో భవేత్॥ సి. శి. ౧౧-౨౦

అప్రత్యక్షో మహాదేవః సర్వేషా మాత్మమాయయా
ప్రత్యక్షో గురురూపేణ వర్తతే భక్తిసిద్ధయే॥ శివరహస్యే.

సచ్చిదానంద రూపుడు, నిష్కలుడు, అవ్యక్తుడు, యను నామములచే సుప్రసిద్ధుడయిన పరశివుడు తనమాయచేత భక్తోద్ధారమునకై, భక్తిసిద్ధికై, కర్మక్షయమునకై అప్రత్యక్షుడయినను గురురూపముచేత ప్రత్యక్షుడగును. జనులకు మోక్షమార్గము నుపదేశించు చుండును.

హరరూపం సమాదాయ పూజాం గృహ్ణాతి సర్వదా
గురురూపం సమాదాయ భవపాశం నికృంతతి॥ శైవరత్నాకరే॥

హరరూపముచేత పరమశివుడు సర్వత్ర పూజనీయుడైనట్లు, గురురూపముచేత భక్తులయొక్క జననమరణములను భవపాశమును త్రెంపుచుండునని శైవరత్నాకరము అ. ౯ శ్లో. ౧౭ నందు వ్రాక్కుచ్చ బడినది. పుట్టంధునకు వస్తువుల యొక్క స్వరూప జ్ఞానమెట్లు గాకయుండునో అటులే గురూపదేశము లేనివానికి కల్పకల్పాంతరము నందు కూడ తత్వజ్ఞానము కానేరదు. కనుక గురుశుశ్రూష మోక్షసాధనకొరకు అత్యావశ్యకము.

యశ్శివ స్సగురుః జ్ఞేయో యోగురు స్సశివ స్స్మృతః సి. శిఖామణౌ॥
న గురోరధికం న గురోరధికం న గురోరధికం
శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥

యను వచనములచే గురువు శివుడేయని సిద్ధించు చున్నందున అట్టి శివస్వరూపుడైన సద్గురువునే సేవింప వలయును.

# గురు స్వరూపము.

సత్సంప్రదాయస్థం శ్రద్ధావంతం సత్కులభవం శ్రోత్రియం
శాస్త్రవాత్సల్యం గుణవంత మకుటిలం సద్గురు మాసాద్య॥ ౧ నా.ఉ.

ఉపైతి లోకవిఖ్యాతం లోభమోహ వివర్జితం
ఆత్మ తత్వవిచారజ్ఞం విముక్త విషయభ్రమం॥ ౨
శివసిద్ధాంత తత్వజ్ఞం ఛిన్న సందేహ విభ్రమం
సర్వతంత్ర ప్రయోగజ్ఞం ధార్మికం సత్యవాదినం॥ ౩
కులక్రమాగతాచారం కుమార్గాచార వర్జితం
శివధ్యానపరం శాంతం శివతత్వవివేకినం॥ ౪
లింగధారణ సంయుక్తం లింగపూజా పరాయణం
లింగాంగ యోగతత్వజ్ఞం నిరూఢాద్వైత వాసనం ౫
లింగాంగస్థలభేదజ్ఞం శ్రీగురుం శివవాదినం
సేవేత పరమాచార్యం శిష్యో భక్తిభయాన్వితః॥ ఇ సి శిఖామణి ప౭

పరశివతత్వమును కరబిల్వ ఫలము వలె సంపూర్ణముగా తెలిసిన వాడును, సత్కులమునందు జన్మించిన వాడును. ఆగమార్థములను యథార్థముగ తెలియు వాడును. సకల విషయ భ్రమరహితుడును, సత్యావి స్నేహ సంపన్నుడును, పరధర్మ సహిష్ణువు, స్వధర్మ నిష్ఠుడు, సన్మార్గగామిగాక గురువంశాను వర్తియైన వాడును, మంత్రరహస్యజ్ఞుడు, శివతత్వ వివేకియై శివజ్ఞానపరుడును, లింగధారణ యుక్తుడును, లింగాంగ సామరస్యజ్ఞుడు నైన సద్గురువుకు శిష్యుడు భయభక్తిచేత సేవించవలెను, కావున వీరశైవులు సాధ్యమైనంతవరకు సద్గురువుల సేవించి దీక్షితులు కావలయును.

స్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహిత మలయాచల ఖండమునందు:

బ్రహ్మనిష్ఠో మంత్రతత్వజ్ఞో మోక్షానుగ్రహతత్పరః
ప్రశాంతచిత్త సంతుష్ట స్స సుహృత్తితత్పరః॥
డాంబికం క్రోధనం మూర్ఖం తథా హంకారదూషితం
త్యక్తధర్మం చ విప్రేంద్ర గురుం ప్రాజ్ఞో న కల్పయేత్।

సద్గురువు బ్రహ్మనిష్ఠుడు గావలెను. శివతత్వముల దెలియవలెను శిష్యులకు మోక్షానుగ్రహమునందు తత్పరుడై శాంతచిత్తుడై, సదానందుడై, అన్యులకు హితము గోరువాడయి యుండవలెను ఇట్లుగాక గురువు డాంబికుడయినను, క్రోధపూరితుడయినను, మూర్ఖుడైనను, అహంకారము గలవాడయినను ధర్మములమీరి నడచు వాడయినను ప్రాజ్ఞుడైన శిష్యుడు విడచిపెట్టవలయును.

లేకున్న తానే చెడునదిగాక శిష్యుండలినంతను దురాచారమునందే ప్రవర్తింప జేసి ఇహమునందు సౌఖ్యము, పరమునందు మోక్షము, గలుగకుండ జేయును.

తస్మా దద్వైతతత్త్వజ్ఞం కామ క్రోధాద్య దూషితం
అడాంబికం శాంతచిత్తం గురుం ప్రాజ్ఞః ప్రకల్పయేత్॥

శిష్యుడు తాను గురువుగా జేసుకోదలంచి నపుడు ఆ గురువుయొక్క సల్లక్షణ ములనే పరీక్షించి చూడవలెను. గురువు శివాద్వైత తత్త్వముల దెలిసిన వాడును, కామక్రోధాది అరిషడ్వర్గములను జయించిన వాడును, బాహ్యా డంబరములచే లోకమును మోసము జేయని వాడును, చిత్తమునందు శాంతిము గలవాడును, అయిన సద్గురువునే తెలివిగల శిష్యుడు ఆశ్రయించ వలెను.

సర్వలక్షణ సంపన్నం సర్వజ్ఞం సర్వసమ్మతం
సదాచార రతం శుద్ధం శివభక్తం అలోలుపం॥ ౬౩
యథార్థ వాదినం శాంతం ద్వేషాసూయా వివర్జితం
విదితాఖిల శాస్త్రార్థ శివతత్త్వార్థ వేదినం॥ ౬౮
అర్థకాంక్షా విరహితం అకాముకం అవంచకం
వాగ్మినం షట్స్థల జ్ఞానసహితం హృష్టమానసం॥ ౬౫
గురుం శుశ్రూష మాణః (శిష్యః) సుఖేన వ శేత్॥ పా. ౧

గురువు నిత్యానిత్య విచారము గలవాడు, ఇహపరలోక సుఖమునందు ఉదా సీనుడు అంతర్బహిరింద్రియ నిగ్రహుడు, సద్వర్తనుడు, సదాచార సంపన్నుడు, మోక్షాభిలాషి, ఇట్లు సాధనచతుష్టయ సంపన్నుడయి యుండవలెను. ఇదిగాక అతడు తన ఆత్మానందమునందే లీనమునక్కడయి శాంతస్వభావము గలవాడై ప్రియభాషణము గలవాడై గంభీరుడై సత్యవాదియై ఎల్లప్పుడు సంతుష్టుడై, మరియు కరుణామూర్తియై యుండవలెను ఇంతేకాక అతడు నిరహంకారుడు, శుచిర్భూతుడు, ధర్మిష్ఠుడు, మత్సరభావము లేనివాడు, గుణగ్రాహియు, వేదా గమ పురాణ సకలశాస్త్ర అభ్యాసి, మంత్రార్థ ప్రతిపాది, శైవసిద్ధాంత తత్త్వజ్ఞుడు, సంప్రదాయాగత జ్ఞానము గలవాడు, లోభదాంభికాది దుష్టగుణ
57 దూరుడై యుండవలెను. ఇట్టి గురువుకే ఆరాధ్యుడనియు ఆచార్యుడనియు పర్యాయ నామములు గలవు. అనగ శివాగమార్థానుసంధానముగలవాడు, రాగద్వేషరహితుడు, శివధ్యాన శివజ్ఞాన సంపన్నుడై యున్నవాడే ఆరా

ధ్యుడు. శాస్త్రార్థములను తనశిష్యులకు విస్తరించి చెప్పువాడు, వారికి సదాచారములో వర్తించుట కుపదేశించి తాను సదాచారమార్గముచే నడచువాడు ఎవడో వాడే ఆచార్యుడనియు వీరశైవ శాస్త్రకారులు గురువు యొక్క లక్షణములను జెప్పియున్నారు.

అందువలన శిష్యుడు, మోక్షార్థియైనందున, నయవినయాది సంపన్నుడై, సద్గురుసేవా లబ్ధ శివజ్ఞాన, శివభక్తి శివాచారములచే సంపూర్ణజ్ఞానియై బ్రహ్మచారియై, వైరాగ్యము గలిగి మోక్షాభిలాషియై, యున్న సద్గుణమండిత గురువర్యునే ఆశ్రయించ వలెను. గురుస్థల మలంకరించు వారు నిర్దోషులు, సదాచార సంపన్నులు, ధర్మనిష్ఠులై యుండవలెను. అనాచారులు అజ్ఞానులు, కపటాచార యుక్తులు గురువులగుటకు యోగ్యులు కారు. వీరు అనాచారము గలవారు, మలినాత్ములుయైన శివకళ స్ఫూర్తి కానేరదు.

గురవో బహవః సంతి శిష్యవిత్తాపహారకాః

దుర్లభోఽయం గురు ర్దేవి శిష్యహృత్తాపహారకాః॥

శిష్యవిత్తమార్జించు గురువులే హెచ్చుగాని అతనిచిత్తము నాకర్షించి అతని సంసార బంధమునుండి ముక్తునిజేయు గురువులు దుర్లభము. ఇట్టి దాంభిక గురువులకు ముముక్షువుయైన శిష్యుడు లోబడక సద్గురువులనే ఆశ్రయించ వలెను.

కించిజ్జ్ఞా దాంభికా భ్రష్టా గురు రిత్యభిమానినః

వీరశైవం న జానంతి శఠాః పండితమానినః

అన్యస్మై బోధయంతి స్మ సర్వజ్ఞత్వం పరం ఖలాః

నాచరంతి స్వయం కించి దధస్తే నిపతంతి హి॥ పారమేశ్వరాగమె.

కిముంతకు తామే తెలిసిన వారమనుకొను వారు, వీరశైవమును తెలియనివారు, అవివేకులు, దాంభికులు, అల్పజ్ఞులు, నిజమైన గురుత్వముయొక్క గుణము లేకనే అభిమానము పడువారు, అన్యులకు బోధించి తాముమాత్రము స్వల్పమైనను నుడువునట్లు నడువనివారు అధోగతిని పొందుదురు. కనుక వీరశైవులు ఇట్టి దాంభిక గురువులకు లోబడరు.

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః

న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిం॥ పార. పట శ్లో౧౦౪

గురుశుశ్రూషజేయు శిష్యుడు కూడ శాస్త్రానుసారము నడుచువాడై యుండ

వలెనని యు, అట్టి శాస్త్రవిధిని విడిచి కామాతురుడై వర్తించువాడు మోక్ష సిద్ధిని అక్షయ సుఖమును సద్గతిని పొందనేరడనియు, కూడ బోధించు చున్నది. కనుక శిష్యుడుకూడ వీరశైవ మతాచారముల ననుసరించి సదాచార సంపన్నుడు కావలయును.

"యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ॥ శ్వేతాశ్వతర॥ గురుశివులందు ఒకేవిధమైన భక్తి యుంచవలెనని గలదు. కనుక గురువు దేవతా సమానుడు. అట్టి దేవతా స్వరూపుడయిన గురువునే భజింపవలెను.

## త్రివిధ గురు లక్షణము

౧. దీక్షా గురుస్థలము.

దీయతే చ శివజ్ఞానం క్షీయతే చ మలత్రయం

సా దీక్షా సంజ్ఞితా తస్యాం గురుర్దీక్షాగురు స్మృతః॥ వాతూ॥

శివలింగైక్యుడే దీక్షాగురువనబడును. ఏ సంస్కార విశేషము వలన ఉత్కృష్టమైన శివజ్ఞానము గలుగునో, మలమాయాది పాశబంధము క్షయించునో, ఆ సంస్కారమే దీక్షయనబడును. అట్టి జ్ఞానక్రియా లక్షణ లక్షితమైన దీక్షయందు శివతత్త్వోప దేశమును జేయగల శివలింగైక్యుడే దీక్షాగురు వనబడును.

గుణాతీతం గుకారంచ రూపాతీతం రుకారకం

గుణాతీత మరూపంచ యోదద్యా త్స గురుస్స్మృతః॥

ప్రాకృత గుణత్రయా తీతమైన అశుద్ధమాయా రూపాతీతమైన చిన్మయ వస్తువును అతడు ఉపదేశింప సమర్థుడు. ఈ గురువే వీరశైవశాస్త్ర రహస్యార్థములను విప్పి బోధించు వాడును, తనశిష్యులను సదాచారానుష్ఠాన సంపన్నులనుగా జేయు వాడును, "జ్ఞానాన్ముక్తిం దిశతి యస్సదేశిక ఇతిస్మృతః" యను కామికాగమ వచన రీత్యా ఎవడు వర్ణాధ్వాది షడధ్వములను మీరిన శివయోగము చేత సంపన్నుడయి యుండునో. అట్టి శివలింగైక్యుడై యున్న దేశికుడే మహా మాయయను సముద్రమును దాటింపతగిన ఉపాయమును చూపింపశక్యుడైన జగద్గురువై యుండును. ఈ దేశికుని కన్నులకు కాన్పించు జగద్వస్తువు లన్నిటి యందు అతని శివతాదాత్మ్య యోగ ప్రభావముచేత అఖండ సచ్చిదానంద చైతన్యమే కన్పట్టు చున్నందున ఇట్టి దర్శనము గలిగిన మహాగురువే జగత్ప్రకా

శకుడై యుండును.

౨. శిక్షా గురువు:- ఈ దీక్షాగురువే శిష్యుడు చేసిన ప్రశ్నలకు ఉత్తరమును చెప్పి ఉపదేశముద్వారా సంశయ నివృత్తిజేసి అతనిని శిక్షించు చున్నందున శిక్షాగురుస్థల సంపన్నుడగును.

అతడు శిష్యునియొక్క భవమను చీకటిని నశింపజేయుచు ప్రాపంచిక భేదభ్రాంతిని నివారించును. "పతిం విశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతం" యను నారాయణోపనిషద్వచనమునందు ప్రసిద్ధమైయున్న స్వాత్మాభిన్న శివ జ్ఞానమును ఆశ్రితులయిన శిష్యులకు అనుగ్రహించును. ప్రాపంచిక భేదమును జెప్పు ద్వైతమతమును ఖండించి శివాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించును. తన శిష్యుల హృదయ కమలమునందుగల నిజరూపచిత్రమును శివజ్ఞానమను దీపముచేత చూపించునో ఆశిక్షాగురువే మానవుల సంసారరోగమును పోగొట్టు ఉత్కృష్ట శివాద్వైత జ్ఞానమను పరమౌషధము నిచ్చి జనన మరణాది దుఃఖ నివృత్తి జేయును.

3. జ్ఞాన గురువు:- ఈ శాస్త్రస్థితమైన రహస్యార్థములను బోధించి శిష్యుని సంశయములను నివారించు దీక్షాగురువే అతనికి సాక్షాచ్ఛివజ్ఞానము ననుగ్రహించు వాడై జ్ఞానగురువన బడును. ఈ గురువుచేతనే శివజ్ఞానమును పొంది శిష్యుడు జీవన్ముక్తుడౌను.

శివరూపానుసంధానమై జ్ఞానం యేనోపదిశ్యతే
ముముక్షోర్మోక్ష సిద్ధ్యర్థం స జ్ఞాన గురు రుచ్యతే॥ వాతూలే॥

శాస్త్రరహస్యములను బోధించి సంశయ నివారణము జేయు ఆ శిక్షాగురువే సాక్షాచ్ఛివజ్ఞానము ననుగ్రహించి శివజీవైక్యము ననుభవింపజేయును. కనుక అతడే జ్ఞానగురువని పిలువబడును. సారాంశమేమనగా ఒక్కడే గురుడు శివ జీవైక్యోపదేశము జేయునప్పుడు దీక్షాగురువనియు, అందలి సంశయములను శాస్త్రోక్తరీత్యా నివారించు నప్పుడు శిక్షాగురువనియు, కడకు శివజీవైక్య జ్ఞానము ననుగ్రహించి ముక్తుని జేయునప్పుడు జ్ఞాన గురువనియు పిలువబడు చున్నాడు. అనేక గురువుల నాశ్రయించ వలెనని తాత్పర్యము గాదు. అట్టి త్రిగురుస్వరూప ప్రకాశితుడయిన సద్గురువును శిష్యుడు ప్రతిదినము ధ్యానించును.

# శ్రీగురు స్తోత్రము

౧ అంతస్తిమిర నిచ్ఛేద భానవే కామధేనవే
సదంతే వాసినాం కల్ప తరవే గురవే నమః॥ శైవరత్నాకరే.

౨ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥ వీరశైవాచారప్రదీ॥

3 అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

౪ భవారణ్య ప్రవిష్టస్య దిఙ్మోహ భ్రాంతచేతసః
యేన మే దర్శితః పంథాః తస్మై శ్రీగురవే నమః॥

౫ అనంతజన్మ సంప్రాప్త కర్మేంధన విదాహినే
జ్ఞానానల ప్రభావేనత స్మై శ్రీగురవే నమః॥

౬ యోగురుః స శివః ప్రోక్తోయః శివస్సగురుః స్మృతః
భుక్తిముక్తి ప్రదాతే చ తస్మై శ్రీగురవే నమః॥

౭ గురుదేవో మహాదేవో గురుదేవః సదాశివః
గురుదైవాత్పరం నాస్తి తస్మై శ్రీగురవే నమః

౮ బ్రహ్మా విష్ణు శ్చ రుద్ర శ్చ ఈశ్వర శ్చ సదాశివః
ఏతే గర్భగతా జ్ఞేయా స్తస్మై శ్రీగురవే నమః॥

౯ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం
నాదబిందు కలాతీతం తస్మై శ్రీగురవేనమః శివరహస్యే॥

౧౦ నగురోరధికం తత్త్వం నగురోరధికం తపః
తస్మాత్పరతరం నాస్తి తస్మై శ్రీగురవేనమః గురుగీతా॥

## ౨ లింగము

ఏపరబ్రహ్మమునందు చరాచర ప్రపంచమంతయు లయించి మరల మరల ఉద్భ
వించు చుండునో అట్టి బ్రహ్మమే లింగమనియు, అట్టిలింగమే సాక్షాచ్ఛివ
స్వరూపమనియు, ఆ పరశివుడే హృదయాకాశమునందు లింగరూపుడై వెలయు
చుండుననియు, ఆ హృదయస్థిత జ్యోతిర్లింగము సర్వులచే పూజనీయ మనియు,
ఆ ప్రాణలింగమే సద్గురువుచే ఇష్టలింగముగా స్థూలపూజకై అనుగ్రహింబ

బడుననియు, ఆ ఇష్టలింగము ఆజీవాంతము దేహముపై ధరించి, కరస్థలమునందే పూజించ వలయుననియు, ఈ కరస్థల లింగార్చనము చేతనే సర్వసిద్ధులుగలిగి శివసు్మక్తి గలుగుననియు, హరిబ్రహ్మాది దేవతలు, మనుష్య పశుపక్ష్యాదులు కూడ శివలింగార్చనము చేతనే ముక్తులైరనియు, ఈ లింగధారణము పరమ పవిత్రమైనదనియు అనేక ప్రమాణములచేత లింగతత్వమునందు ప్రతిపాదింప బడెనది. అనుగ్రహించి లింగతత్వమును జూతురు గాకయని కోరుచున్నాను.

## 3 జంగమ.

ఏక ఏవ శ్శివ సాక్షా త్సర్వానుగ్రహకః ప్రభుః
గురుజంగమ లింగాత్మా వర్తతే భుక్తిముక్తిదః॥
లింగం చ ద్వివిధం ప్రోక్తం జంగమాజంగమాత్మనా
అజంగమే యథా భక్తి ర్జంగమే చ తథాస్మృతా॥
అజంగమం తు యల్లింగం మృచ్ఛిలాది వినిర్మితం
తద్వరం జంగమం లింగం శివయోగీతి విశ్రుతం॥ సి. శిఖామణౌ.

సాక్షాత్ సర్వుల ననుగ్రహించు ప్రభువగు శివుడే గురులింగ జంగమాదులను. మూడు ప్రకారములుగా విభజింపబడి భుక్తిముక్తుల నొసగుటకు భూమియందు వర్తించుచుండును. లింగము చరాచరమని (అనగా జంగమ స్థావరములని) రెండు భేదములుగా గలదనియు, శిలాది నిర్మితమైన లింగమే అచర (స్థావర) లింగమనియు, శివయోగి యని ప్రసిద్ధిగాంచిన లింగమే జంగమమనియు అట్టి చరలింగమును జంగమస్వరూపము, స్థావరలింగము కన్న శ్రేష్ఠమనియు సిద్ధాంత శిఖామణి అభిప్రాయమై యున్నది. "ఈశ్వరోఽతిథిరేవ చరితస్త ముపాస్మహే" యను బృహదారణ్యక వచనప్రకారము ఈశ్వరుడే జంగముడై అతిథివలె సంచరించును.

"సర్వలోకోప కారాయ యోదేవః పరమేశ్వరః
చర త్యతిథి రూపేణ నమ స్తే జంగమాత్మనే। వీరాగమే.

లోకోద్ధారార్థమై శివుడే జంగము (అతిథిస్వరూపు) డై సంచరించు చుండును.

అహం మమత్వ శూన్యాత్మా నిజబోధైక రూపధృక్
స్వయమేవ స్వయం భూత్వా చరతీతి చర స్స్మృతః॥ వాతులే

వాతులాగమోక్త వచనాను సారముగ దేహకరణాది అహంకార మమకారము లను త్యజించి స్వస్వరూపమును తెలిసినవాడే తానేతానై చరించును. కనుక చరలింగమని, జంగముడని పిలువబడును. ఆచరలింగ నామకుడైన శివయోగియు కామక్రోధాద్యరిషడ్వర్గరహితుడయి అంతర్బహి రింద్రియ నిగ్రహుడై మృత్కాంచనములందు సమానబుద్ధి గలవాడయి దృశ్యరూప వస్తువులయందు శివభావము గలవాడై, సర్వమును బ్రహ్మమని తెలిసి యెల్లప్పుడు సంచరించు వాడైన, జంగముడని తెలియవలెను. ఆజంగముడు లింగాంగ సామరస్య రూప శివాద్వైత జ్ఞాన సంప్రాప్త పరమానంద సంతుష్టుడయిన చరలింగ యోగీశ్వ రుడు; లోకోత్తరములైన స్వగుణములచేత యితరులను సద్గుణ సంపన్నుల గావించుచు యితరులకు సామాన్య దేహివలెనే కన్పించు చుండును.

ప్రకృతి తత్వములచేత జన్మించిన బ్రహ్మవిష్ణ్వాదుల సంపత్తి యందు ఆశలేనివాడై చరలింగస్థల సంపన్నుడైన శివయోగియు (జంగముడు) చిదా నందమయమైన తన నిజస్వరూప చింతయందుండి

నాహం మనుష్యో న చ దేవయక్షో న బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాః
న బ్రహ్మచారీ న గృహీ వనస్థో భిక్షుశ్చనాహం నిజబోధరూపః॥ యోగజా॥

యనను నట్లు తాను దేహసంబంధాభి మానమును విడచి పరమానందము ననుభ వించు చుండును. అతడే జంగముడు. ముముక్షువులచే సేవనీయుడు.

ఏకమూర్తిస్త్రయో భాగాః గురులింగంతు జంగమం
జంగమంచ గురుర్లింగం త్రివిధం లింగముచ్యతే॥

యను శైవాగమాను సారముగ ఒకడేయైన పరశివుడు గురులింగ జంగమము లను మూడు పర్యాయ నామవాచకములచే పిలువబడును. "జంగమో ఈశ్వరో రూపః" యను మాహేశ్వరోప నిషద్వాక్యాను సారము జంగముడే ఈశ్వర రూపమనియు "జంగమ రూపశ్శివః శివః ఏవ జంగమరూపః" యను ఋగ్వే దోప నిషత్కణ్వ శాఖయందు జంగముడే శివుడనియు శివుడే జంగమ రూపు డనియు, మరియు గురుడే శివుడు శివుడే గురుడని చెప్పబడినందున గురులింగ జంగమాదు లందు అభిన్నత్వము సూచింప బడినది.

నిరాకృతం నిరంజనం యన్మాయా మోహ విజృంభితం
యేన స్వరూప సిద్ధేన స భవేద్ధి నిరంజనః॥

జ్ఞానా త్యతిశయా ద్యోహి శివం విశ్వప్రకాశకం
స్వస్వరూపతయా సోహి జంగమః పరికీర్తితః॥ ఇతి॥

నిర్వేదం, నిరవగ్రహం, నిరశనం, నిష్కారణం, నిష్కలం,
నిస్సంగం, నిరుపాధికం, నిరుపమం, నిష్ప్రక్రియం, నిశ్చితం,
నిష్పుణ్యం, నిరనుగ్రహం, నిరధికం, నిర్వాసనం, నిర్వహం,
నిర్భేద్యం, నిరఘం, నిరంజనపదం, చైతం భజే జంగమం॥
ఆద్యంత రహితం జ్యోతి రనాది ప్రభురవ్యయః
అనాది త్వా దజాతశ్చ జంగమ స్స్యా న్నిరంజనః॥

పై నుదహరింప బడిన లక్షణములచే గూడినవాడే జంగముడని తెలియవలెను. అట్టి వానికే లింగాంగ సామరస్య జ్ఞానము కలదు.

భూతి రుద్రాక్ష పాషాణ లింగధారీ న జంగమః
లింగాంగ సంగమజ్ఞాని జంగమః పరికీర్తితః।

భూతి రుద్రాక్షాది బాహ్యాడంబరములచేత జంగముడు కానేరడు. శివజీవైక్య జ్ఞానము గలవాడే జంగముడని పిలువబడును.

జ్ఞానం త్యతి శయా ద్యేతు శివం విశ్వప్రకాశకం
స్వస్వరూప తయా తేతు జంగమా ఇతి కీర్తితాః ౩౬
యే పశ్యంతి జగజ్జాలం చిద్రూపం శివయోగతః
నిర్ధూత మలసం స్పర్శా స్తే స్మృతాః శివయోగినః। ౩౭ సి.శిం

జం-గమ్యంత ఇతి-అతిశయేన గచ్ఛంతీతి-జంగమాః అతిశయమైన మార్గము నందు వర్తించువారు అనగ అతిశయమైన జ్ఞానసంపన్నులైనవారు జంగములని తెలియవలెను. ఇట్టి జంగముడాణవాది మలసంబంధమును విడనాడి, దృశ్య మాన చరాచరాత్మక ప్రపంచమును శివసంబంధము చేతచిత్క్రియా రూపము గలదైనదనియు తెలిసినవాడే శివయోగియు, కామక్రోధములను జయించిన వాడును, అభేద భావముగలవాడును, సత్పురుషుడైనవాడు శత్రుమిత్రులందు ఏక భావము గలవాడు, ప్రత్యక్ష పరశివుడయిన వాడు, అశాహంకార రహితుడైన వాడే శివయోగి కనుక ఇట్టి సద్గుణ మండిత శివయోగియైన జంగమునే సదా సేవించు చుండవలయును.

దేహ జీవేశతత్వార్థ బోధార్థమై ముక్తి మిచ్ఛతాం
స్వస్వరూపోప దేశార్థం జంగమోస్మి మహేశ్వరి॥ వీరాగమే.

ఓ పార్వతీ ఎవడు దేహజీవేశ్వర తత్వార్థ బోధయును ముక్తిని కోరుచున్నాడో వానికి తన స్వరూపోప దేశముకొఱకు జంగమరూప ముగుచున్నానని శివునిచే పార్వతికి జెప్పబడెను. గాన శివుడే సాక్షాత్ జంగముడని సిద్ధించును.

మద్రూపం జంగమం దేవి మమప్రాణం మమాధికం
మద్గురుం చ మదంగం చ మన్నాధం చరలింగకం॥

ఓపార్వతీ! నాయొక్క రూపము, ప్రాణము, శరీరము, జంగమమనిన్ని నాకంటె అధికుడు నాకు గురుడు నాయొక్క ప్రభువు జంగమమని పరమ రహస్యమందు ఈశ్వరునిచే చెప్పబడెను.

జకారో గురురూపం చ గకారో లింగరూపకం
మకారో జంగమం చైవ సర్వకర్తాచ జంగమః। వీరాగమే.

## ౬ భస్మము

భస్మధ్యానాత్సాధానం భవతి భస్మధ్యానాత్పాచాఖం
స్మరణంభవతి తస్మాద్ధ్యానాత్ స్వాత్మత్వం గచ్ఛతి
స ఏవ భస్మజ్యోతి స్సఏవ భస్మజ్యోతిః

యను భస్మజాబాలోప నిషద్వచన ప్రకారము భస్మమనగ జ్యోతిర్లింగము మనుష్యుడట్టి జ్యోతిర్లింగమయమైన భస్మధారణముచేత శుద్ధాత్ముడవును. ఆ భస్మ పరశివాపరనామపరబ్రహ్మము. కనుక ఆ జ్యోతిర్లింగ స్వరూపముచేత ఉజ్వలించు చుండును. అందువలననే దానికి భసితమని పేరుగలదు. ఆ మహా భస్మము జ్యోతిర్మయమైన మహాదేవస్వరూపమని భావించి ఏలింగధారులు వర్తించుచుందురో ఆశ్రేష్ఠులైన జనులు నిరుపాధిక భస్మధారులని పిలువబడు దురు. పంచబ్రహ్మ మంత్రన్యాసాది సంబంధములచేత శివమంత్ర సంస్కృతా గ్న్యాదులచేత ఏభస్మము చేయబడునో ఆభస్మమును సోపాధిక భస్మమని శివా

59 గమాభిజ్ఞులు దెలిపిరి. ఈ సోపాధిక భస్మము వేరేవేరే ఐదుకారణములచేత,

విభూతి భసితం భస్మ క్షార రక్షేతి భస్మనః
ఏతాని పంచనామాని హేతుభిః పంచభిః భృశం।

విభూతి, భసిత, భస్మ, క్షార, రక్షాయను పంచసార్థక నామములతో ప్రసిద్ధి జెందెను.

౧ విభూతి - అణిమాద్యష్ట విభూతి ప్రదానమైనది.

౨ భసిత - శివతత్వ ప్రకాశకరమైనది.

౩ భస్మ-మనోవాక్కాయక పాపభయోత్పాత భంగము గలిగించునది.

౪ క్షార - అధ్యాత్మికాది తాపత్రయాత్మక దుఃఖ విపన్నాశకర మైనది.

౫ రక్ష - గ్రహాది భీతులనుండి రక్షించునది.

ఇట్టి పవిత్ర భస్మమును సర్వాంగము లందు నమశ్శివాయ యను పంచాక్షరీ మంత్రమును ఏడుసారులు జపించి భస్మస్నానము (లేపనము) జేయవలయును.

శిరస్సు, లలాటము, కర్ణములు, కంఠము, భుజములు, హృదయము, నాభి, వీపు, బాహువులు, పిరుదులు, మరియు మణిబంధములను నీ పదిహేను స్థలములయందు పంచాక్షర మూలమంత్ర పూరితమైన త్రిపుండ్ర ధారణము జేయ వలయును. ఏ పురుషుడు త్రికాలములందు భస్మత్రిపుండ్ర ధారణము జేయునో అతడు శివాచార సంపన్నుడై వేదత్రయీ స్వరూపుడయి నిస్సంశయముగ శివస్వరూపుడే అగునని నమ్మవలయును,

విభూతి ధారణము అత్యంత పవిత్రమైనది. అది అంతరంగ జ్యోతి ప్రకాశముయొక్క బాహ్యచిహ్నము. గురువు దీక్షాకాలమునందు ఆణవాది మలత్రయంబుల నశింపజేసి సంసారబంధము నుండి ముక్తుని గావించి, శివతత్వజ్ఞాన జ్యోతిని హృదయ కమలమునందు గలుగజేయును. యీ జ్యోతి ప్రకాశము చేతనే జీవుడు పాశము నుండి ముక్తుడై మోక్షమును గలుగజేయు శివసాయుజ్యమునే పొంద ప్రయత్నించు చుండును. కనుక భస్మము జ్యోతిర్లింగమనిన నెట్టి సంశయము గలుగకూడదు. ఇదియే నిరుపాధిక భస్మము, తద్బాహ్యచిహ్నమయినదే సోపాధిక భస్మమనబడును. అది గోమయమునుండి మంత్రాగ్నులచే సంస్కరింపబడినందున భస్మమని పిలువబడును. గోమయము నందుగల పూర్వరూపములు మంత్రాగ్నులచే నశించు చున్నవి. గోమయము మలసంబంధమైనది. దానియందు నల్లని తమమునకు సమానమగు వర్ణముగలదు వాసన మరియు క్రిమికీటకాదులకు ఆశ్రయమైనది. వికారము నొందునది, కాని మంత్రాగ్నులచే గాలినందున ఆ గోమయమే తన నిజస్వరూపమును మారి భస్మమాయెను. ఈ

భస్మము మలసంబంధ నామరూపములు లేక నిర్మలమైనది. శుభ్రమైనది. తెలుపురంగు గలిగినది. వాసన మరియు క్రిమికీటకాదులు నశించినది, మరియు పునః ఆశ్రయములేనిదైనది. భస్మము కాల్చబడినది. కనుక పునః వికారమును బొందనేరదు. ఇట్టి భస్మమును సర్వాంగములయందు ధరించినందున చర్మగత క్రిమికీటకాదులు నశించును. శీతోష్ణాదుల బాధతగ్గును. ఆయురారోగ్యము ప్రాప్తించును. ఇంతియేకాక చూచువారల కంతరంగమునందుగల జ్యోతిప్రకాశ మును సూచించు చుండును. భస్మము త్రిపుండ్రముగ ధరింతురు. అనగ సత్వ రజో తామసములను త్రిగుణములను తన స్వాధీనము చేసుకున్న వాడనియు ఆణవ మాయాకార్మిక మలము లణచినవాడనియు అజ్ఞానాంధ కారమును నశింప జేసి చిత్ప్రకాశము గలవాడనియు, అంతశ్చక్షు దృష్టి గల వాడనియు, దారేషణ ధనేషణ పుత్రేషణ అను ఈషణత్రయముల విడచిన వాడనియు, కర్మ జ్ఞానేంద్రియాంతఃకరణ శుద్ధి గలవాడనియు, జన్మజరామరణాది వికారములను పొందకుండు వాడనియు, కామక్రోధలోభమదమోహ మాత్సర్య రాగ ద్వేష ములు లేక పరిశుద్ధాత్మ గలవాడనియు, విషయ సుఖములను తుచ్ఛముగా జూచువాడనియు, సద్గురు హస్తమస్తక సంయోగము చేత దీక్షితుడై, సచ్చి దానంద లక్షణుడైన వాడనియు, ఈసోపాధిక భస్మము నిరుపాధిక భస్మమును ప్రకటన జేయుచున్నది. అందు చేతనే భస్మమునకు పై నుదహరించిన పంచ నామములు సార్థకమైనవి. అంతరంగమందు జ్ఞాన జ్యోతి ప్రకాశ మైనంతనే జీవునకు నేనను అహంకారము నశించి సోహమను భావముత్పన్నమగును. కాన తత్వజ్ఞాన స్వరూపుడైన పరమాత్మ నష్టైశ్వర్యములనే తనవని తెలియును. అష్టైశ్వర్యమ లనగా విభూతి యని అమరకోశమునందు చెప్ప బడినది.

విభూతిర్భూతిరైశ్వర్య మణిమాదిక మష్టధా
అణిమా మహిమాచైవ గరిమా లఘిమా తథా॥

ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః॥

అణిమా - సూక్ష్మముకన్న సూక్ష్మమైనది, మహిమా - గొప్పదానికన్న గొప్పది గరిమా సర్వార్థములను దెలిసి ఉపదేశించునది, లఘిమా - అతి శీఘ్రముగా తెలియునది, ప్రాప్తి - ఇష్టప్రాప్తి గలుగ జేయునది, ఈశత్వం - అందరి కన్న గొప్పది. వశిత్వం - స్వాధీనేంద్రియత్వము గలదియని అష్టైశ్వర్యములు విభూతి

మరియు భూతియనియు చెప్పబడినవి.

శివతత్వము ప్రకాశమగును కనుక భసితమనియు, పాపాదులు నశించుచున్నందున భస్మమనియు, దుఃఖములునశించి ఆనందమే ప్రాప్తమగుచున్నందున క్షారమనియు, భూతప్రేతాదుల సంశయము నివారించి తద్భీతి లేకున్నందున రక్షయనియు వివిధనామములు గలిగినవి. త్రిపుండ్రముల మాత్రము బహిర్గతముగా పూసుకొని అంతర్జ్యోతియొక్క ప్రకాశమును గురుదీక్షచే బొందకున్న అది దాంభికమనియే తెలియదగినది.

విభూతిర్భూతిరైశ్వర్య విధికర్మ వినాశనీ
యమలోక భయం నాస్తి శివలోకేమహీయతే
ఆపాద మస్తకాంతశ్చ రోగదోష నివారణమ్
లోకవశ్యకరం పుణ్యం భస్మ త్రైలోక్యపావనం॥
భూతిర్భూతికరీ పవిత్రజననీ పాపౌఘవిధ్వంసనీ
సర్వోపద్రవనాశనీ సుఖకరీ సర్వార్థ సంసాధనీ
తేజోరాజి విశేషమోక్షజననీ సంస్తారిణి సంహారిణీ
భూతప్రేత పిశాచరాక్షసహరీ భూతిః సదాధార్యతాం॥

యని పుణ్యాత్ములయిన వీరశైవులు భస్మస్నానము యొనర్పు భస్మ ఫలాఫలముల బోధించు ఇట్టి మంత్రగర్భిత శ్లోకముల నచ్చరించుచుందురు.

బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ దేవాశ్శక్ర పురోగమాః
త్రిపుండ్రం ధారయంత్యేవ భస్మనా పరికల్పితం॥
వసిష్ఠాద్యా మహాభాగా మునయశ్శ్రుతి కోవిదాః
ధారయంతి సదాకాలం త్రిపుండ్రం భస్మనాకృతం॥
శైవాగమేషు వేదేషు పురాణేష్వఖిలేషుచ
స్మృతీతిహాసకల్పేషు విహితం భస్మపుండ్రకం॥
ధారణీయం సమస్తానాం శైవానాంచ విశేషతః। సిద్ధాంతశిఖామణి.
దివా వా యదివా రాత్రౌ నారీవాఽథనరోపివా
పూజార్థం సజలం భస్మ త్రిపుండ్రే నైవధారయేత్॥ ౧౯
త్రిపుండ్రం సజలం భస్మ ధృత్వా పూజాం కరోతియః
శివపూజాఫలం సాంగం తస్యైవ హి సునిశ్చితం॥ ౨౦

భస్మవై శివమంత్రేణ ధృత్వాహ్యత్యాశ్రమీ భవేత్
శివాశ్రమీతి సంప్రోక్తః శివైకపరమో యతః॥ ర౭ శి॥పు॥వి.స౧౬

స్త్రీపురుషులుభయులు పగలురాత్రులందును శివపూజకాలమందు జలమిశ్రిత భస్మమును త్రిపుండ్రములుగా ధరించ వలెను. జలమిశ్రిత భస్మధారణచేకే సాంగమైన శివపూజాఫలము లభించును. శివమంత్రోచ్చారణ పూర్వకమైన భస్మమును ధరించుకొను వాడే అత్యాశ్రమియగును. ఇతనినే శివాశ్రముడని యనెదరు. భస్మధారణము త్రిపుండ్రముగానే ధరించవలయును,

**మానస్తోకేతి మంత్రేణ మంత్రితం భస్మధారయేత్**
**ఊర్ధ్వపుండ్రం భవేత్సామ మధ్యపుండ్రం యజూంషిచ**
**అధః పుండ్రమ్ఋచస్సాక్షా త్తస్మాత్పుండ్రం త్రియాయుషం॥ భీమాగ**

**మరియు ఈవిభూతిధారణ విషయమున** అనేక ప్రమాణములు గలవు.

"భూత్యైన ప్రమదితవ్యమ్" యజుర్వేదవచనము.

**ఈ మంత్రముయొక్క అర్థమునే మానవపు**రాణము నందిట్లు చెప్ప**బడి**నది.

అగ్నేస్సముత్థియాభూత్యా తయాదేహావకుంఠనం
లలాటే హృదిదోర్ద్వంద్వే త్రిపుండ్రస్యచ ధారణం॥
ఉద్ధూళనం త్రిపుండ్రం చ యైస్సమాచరితం ముదా
త ఏవ శిష్టావిద్వాంసో నేతరే మునిపుంగవాః
నైవ ప్రమది తవ్యం వైభ్రమాదపి కదాచన॥ **మానవపురాణే॥**

**ఈ వచనములచే కూడ విభూతియొక్క** త్రిపుండ్రధారణము సిద్ధమగు చున్నది.

సర్వతీర్థేషు యత్పుణ్యం సర్వయజ్ఞేషు యత్ఫలం
తత్ఫలం కోటిగుణితం భస్మస్నానాన్న సంశయః॥ జాబాలోప ని॥

సమస్త తీర్థములందు గలుగు ఫలములకన్నను, సమస్త యజ్ఞములు జేయుట వలన గలుగు ఫలములకన్నను భస్మస్నానము అత్యధిక ఫలమునిచ్చునది యని వక్కాణింప బడినది.

## త్రిపుండ్ర ధారణ మాహాత్మ్యము

60

పంచాక్షర జపం భస్మస్నానం లింగార్చనం త్రయం
కదాచిదపి నత్యాజ్యం యథాశక్తి సమాచరేత్॥

ఉద్ధూళనం త్రిపుండ్రంచ మాయాపాశ నివృత్తయే
ఆమనంతి మునిశ్రేష్ఠా అథర్వశిరసి స్థితాః॥
శివేన విష్ణునా చైవ బ్రహ్మణా వజ్రిణామరైః
ధృతం యద్ధారయేద్భస్మ త్రిపుండ్రోద్ధూళనాత్మనా॥
ఉద్ధూళనం త్రిపుండ్రంచ శ్రద్ధయా నాచరంతియే
తేషాం నాస్తి శివజ్ఞానం కల్పకోటి శతైరపి॥
సత్యం శౌచం తపో యజ్ఞం తీర్థం దేవాగ్ని పూజనం
సర్వమే తద్భవేద్వ్యర్థం యస్త్రిపుండ్రం నధారయేత్॥
శివప్రియా శ్శివేభక్తా శ్శివపాదార్చనే రతాః
త్రిపుండ్ర ధారిణో యేచ తేవై భాగవతోత్తమాః॥
సితేన భస్మనాకుర్యాత్త్రి సంధ్యం యస్త్రిపుండ్రకం
సర్వ పాప వినిర్ముక్త శ్శివలోకే మహీయతే ॥సనత్కుమార సం॥

సాధ్యమైనంత వరకు పంచాక్షర జపము సర్వాంగ భస్మలేపనము లింగార్చనము ఈ మూడిటిని శివభక్తుడెడ తెగక ధరించుచుండ వలెను. త్రిపుండ్రధారణముచే మాయాపాశములు తొలగునని మునులు వచించుచున్నారు, అథర్వశిఖోపని షత్తుగూడ ఈ యభిప్రాయమునె వెల్లడించుచున్నది. బ్రహ్మ విష్ణు సదాశివ ఇంద్రాది అమరులుగూడ భస్మమును త్రిపుండ్రముగ ధరించిరి. కావున నెల్లప్పుడు త్రిపుండ్రమును ధరింపవలెను. ఇట్లు ధరించనివానికి అనంత జన్మము లెత్తినను శివజ్ఞానము లభింపదు. సత్యశౌచములు తపోయజ్ఞ తీర్థములు అగ్నిదే వాదిపూజలు త్రిపుండ్ర ధారణము లేనివానికి వ్యర్థము లగుచున్నవి. కావున శివునియందు ప్రీతిగల శివపాదార్చనము నందనురాగముగల భక్తులు త్రిపుండ్ర మును త్రికాలములందు జలమిశ్రితముగా ధరింప వలయును ఇట్లు ధరించు భాగవతోత్తములు సర్వపాపములనుండి ముక్తులగుదురు. సర్వాంగభస్మ లేపన ముచే పైనుదహరించి నట్లనేక ఫలములు గలుగుచున్నవని వేదాగమ పురాణేతి హాసములన్నిటియందు ఘంటాఘోషముగా చెప్పబడియున్నది.

స్మృతయ శ్శ్రుతయ స్సర్వాః పురాణా న్యఖిలాన్యపి
వదంతి భూతిమాహాత్మ్యం తతస్తాం ధారయే ద్బుధః॥ గరుడ పు.

సమస్త స్మృతి శృతిపురాణములందు విభూతిమాహాత్మ్యము చెప్పబడి నందున బుద్ధిమంతులు భస్మమును ధరింప వలయును.

త్రిపుండ్రలేపనం నిత్యం యః కరోతి సదా ముదా
స ఏవ ధన్యో విద్వాంశ్చ నేతరో మునిపుంగవాః॥ మానవ పు.

త్రిపుండ్రము నెల్లప్పుడు ధరించువాఁడు ధన్యుడు విద్వాంసుడు; ఇతరుడుకాడు.

భస్మస్నానా త్పరం స్నానం పవిత్రం నైవ విద్యతే
ఇత్యుక్త్వా మునిదేవేభ్యః స్నాతో యస్సశివ స్స్వయం॥ స్కాందే

మునీశ్వరులు, దేవతలు భస్మస్నానమును మించినస్నానము లేదనియు అట్టి భస్మస్నానముచేత శుచిర్భూతుడైన భక్తుడు సాక్షాత్ శివుడని వచించియున్నారు.

భస్మస్నానా ద్విశుద్ధాత్మా జితక్రోధో జితేంద్రియః
మత్సమీప ముపాగత్య న భూయో వినివర్తతే॥ లింగపురాణె.

భస్మస్నానముచే ఆత్మశుద్ధియగును క్రోధాదులు జయింపబడును. ఇంద్రియ నిగ్రహము గలుగును. శివసాయుజ్యము గలుగును. ఇట్టి భస్మలేపాంగునకు పునర్జన్మములేదని శివుడు వక్కాణించెను.

నతద్ధ్యానం న తద్దానం నతద్జ్ఞానం నతత్తపః
వినా తిర్యక్త్రిపుండ్రాంకం విప్రేణ యదనుష్ఠితమ్॥
త్రిపుండ్రధారణం త్యక్త్వా ముక్తి మిచ్ఛంతి యేనరాః
విషపానేన నిత్యత్వం వాంఛమానా ఇవా ప్యమీ॥ కూర్మపు.

త్రిపుండ్ర ధారణములేని విప్రుడు చేయునట్టి ధ్యానదానజ్ఞాన తపస్సు లన్నియు వ్యర్థము. త్రింపుండ్రధారణ రహితుడైనవాడు మోక్షమును గోరుట విషపానము జేసి అమృతత్వముగోరి నట్లు నిష్ఫల మగును.

కి మత్ర బహునోక్తేన భాషణేన పునః పునః
భక్త్యా త్రిపుండ్రంధృత్వా మోక్షమాప్నో త్యసంశయః॥ బ్రహ్మాండే॥

త్రిపుండ్ర ధారణముచే మోక్షము సిద్ధించుచున్నది. ఇందుకు సందేహములేదు.

దానం ధర్మ శ్చ యజ్ఞ శ్చ శృతి శ్చాఽపి వ్రతానివై
ఏతే సర్వే పి ఫలదాః కృతంచే ద్భస్మధారణమ్॥
బహునోక్తేన కిం భస్మ ధారణం మోక్షసాధనం
భస్మనా సదృశం పుణ్యం నాస్తి లోకత్ర యేపిచ॥ క్రియాసారే.

భస్మధారణముచే దాన ధర్మ యజ్ఞములు శృతివ్రతములు సర్వము ఫలించు చున్నవి. అధికప్రసంగముతో నేమి ప్రయోజనము? భస్మధారణమె మోక్షసా

ధనము. భస్మధారణకు సమానమైన పుణ్యము ముల్లోకములందు లభింపదు.

తస్మాత్సర్వప్రయత్నేన యుక్తః మద్భస్మనా బుధః
స్వాంగే త్రిపుండ్రం సంధార్యం సర్వదా శివ మర్చయేత్॥
విభూతి మాత్రమాహాత్మ్యం వక్తుం బ్రహ్మా న శక్నుయాత్
కఃపుమాన్ సంసక్య తాంగ్స్యత్తాం భూతిం వక్తుం సముత్సహేత్॥

కావున ఎట్టిప్రయత్నముచేనైన త్రిపుండ్రమును ధరించియే సజ్జనులు శివుని పూజింపవలయును. ఈ విభూతి మాహాత్మ్యము బ్రహ్మకైన వర్ణింప నలవి గానిదై యుండ మానవులకు వర్ణింప శక్యమగునా?

శివమంత్రాత్పరో మంత్ర స్తత్వం చాపి శివా త్పరం
శివార్చనా త్పరం పుణ్యం నహి తీర్థం చభస్మనః॥ శైవసం॥
వృథావేదా వృథా యజ్ఞా వృథా దానం వృథా తపః
వృథా వ్రతోపవాసాని త్రిపుండ్రం యోన ధారయేత్॥ బోధాయనే.

ఇట్లనేక శాస్త్రములందు త్రిపుండ్రధారణ మాహాత్మ్యము వర్ణింప బడినది. కావున భస్మధారణ మత్యావశ్యకమని సిద్ధాంతమగు చున్నది.

బ్రహ్మాదిదేవతలు నారదాదిరుషులు సనకాదియోగులు బాణాది దానవులుగూడ భస్మస్నాన సంపన్నులై శివభక్తి తత్పరులై సకల దోషవిముక్తులై శుద్ధులైరని యనేక ప్రమాణములు గలవు. మరియు భస్మజాబాలో పనిషత్తునందు భస్మధారణోత్కృష్ట మహిమాభి వర్ణనము విస్తారముగ నున్నది.

"నమశ్శివాయ" యను పంచాక్షరీ మంత్రమును ఏడు సారులు జపించి సర్వాంగభస్మస్నానము (అనగా: లేపనము) జేయవలయును. త్రిపుండ్ర ధారణముకూడ జేయ వలయును. ఈ త్రిపుండ్ర ధారణ మునకు పదునైదు ముఖ్యస్థానములు—

ఉత్తమాంగే లలాటే చ శ్రవణ ద్వితయే తథా
గళే భుజద్వయే చైవ హృది నాభౌచ పృష్ఠకే॥
బాహుయుగ్మే కకుద్దేశే మణిబంధద్వయే తథా
త్రిపుండ్రం భస్మనా ధార్యం మూలమంత్రేణ సాధకైః॥

శిరస్సు, లలాటము, కర్ణములు, కంఠము, భుజములు, హృదయము, నాభి, వీపు, బాహువులు, పిరుదులు, మణిబంధములు, అను ఈ ౧౫ స్థలములందు పంచాక్ష

రీమంత్రపూరితమైన త్రిపుండ్ర ధారణము చేయ వలెను. ఇదే యర్థమును శృతి వచనమందు జూడుడు.

శిరో లలాట కంఠ స్కంధ వక్షస్థలేషు త్రి యాయుష
త్రియంబకై స్త్రిస్రో రేఖాః కుర్వీత వ్రతమేత చ్ఛాంభవం॥

మరియు భస్మము నెడమచేతిలో బట్టుకొని ఆ చేతిని కుడితొడ యందుంచి భస్మముపై కుడిచెయ్యి నుంచి,

అగ్నిరితి భస్మ వాయురితి భస్మ జలమితి భస్మ స్థలమితిభస్మ వ్యోమేతి భస్మసర్వగ్ంహవా ఇదం భస్మ మన ఇత్యేతాని చక్షూంషి భస్మాని॥

అను అథర్వశిరోపనిషన్మంత్రముచేత భస్మమును ముట్టుకొని, ఏడుసారులు మూల మంత్రముచేత అభిమంత్రించి, తర్వాత ఆభస్మమును జలముచేత మిశ్రమము జేసి, పూర్వోక్త స్థానములందు మూడురేఖలుగా ధరింప వలయును. ధరించిన పుణ్యపురుషుడు రాగద్వేషాది రహితుడై మంగళప్రదుడైన పరశివుని పొందును.

య ఇదం త్రిపుండ్రం ధరతే స వేదత్రయధారీ భవతి, స సంతతం త్రేతాగ్నిర్భవతి, సపుష్కరత్రయస్నాతో భవతి, యస్త్రిపుండ్ర ధారీ పురుష స్స రుద్ర స్స పరమేష్ఠీ, య ఇదం త్రిపుండ్రం ధృతవంతం పురుషం పశ్యతి, ససర్వపాపే భ్యో వినిర్ముక్తో భవతి, స సర్వవేదా ధ్యయన భస్మఫలవాన్ భవతి॥

యను వృద్ధ జాబాలశృతివచన ప్రకారము యేపురుషుడు త్రికాలములందు భస్మ త్రిపుండ్రధారణము గావించుకొనునో, అతడు శివాచార సంపన్నుడై వేదత్రయ స్వరూపుడై నిస్సంశయముగ శివస్వరూపుడే యగును.

## ౫ రుద్రాక్ష ధారణము

లింగభూతి యుతస్యాంగే ముద్రారుద్రస్య యోభవేత్
రుద్రాక్షధారణా దేవ రుద్రైక్యపథగామినీ॥

శివలింగ భస్మధారణ సంపన్నుడైన వీరశైవునిదేహమందు రుద్రచిహ్న ప్రకటనార్థమై యేశివలాంఛనము ధరింపబడునో అదియే రుద్రాక్షయని తెలియు వలయును. అదియె శివైక్య మార్గమును పొందించునని శివాగమవచనము కలదు.
61 కావున రుద్రాక్షధారణ మత్యావశ్యకము. ఈ రుద్రాక్షధారణచే జీవభావము వదలి శివైక్యభావము సిద్ధించుననియు, అట్టిరుద్రాక్షధారి అనంతకోటి జీవులందు

శివభావమునే గమనించుననియు, చేతనాచేతన వస్తువులందు భేదబుద్ధి లేనివాడనియు తెలియు చున్నది. మరియు పంచాచారములను అరువది నాలుగు శీలములను తనకు యోగ్యాచారములని నడచువాడనియు, షట్స్థలజ్ఞాన మార్గగామియనియు బోధయగుచున్నది.

రుద్రుని మూడవదైన జ్ఞాననేత్రమునుండి రుద్రాక్షపుట్టినందున అది ధరించినయతడు రుద్రసంబంధజ్ఞానము తెలిసినవాడనియు, సర్వత్ర రుద్రభావము గలవాడనియు, సగుణబ్రహ్మము యొక్క గుణములనే పొందినవాడనియు అవగతమగుచున్నది. కావున యీరుద్రాక్ష ధారణచే దుష్టులు, దురాచారులు, అజ్ఞానులు, తమపూర్వ పాపాచారములను విడచినకాని తద్ధారణఫలముగలుగదు.

బ్రాహ్మణో వాంత్యజో వాపి మూర్ఖోవా పండితోపివా
రుద్రాక్షధారణా దేవ ముచ్యతే సర్వపాతకైః॥ సి. శిఖా.

ఉత్తముడైనను అధముడైనను రుద్రాక్ష ధారణచే సర్వపాతక రహితుడై ముక్తిబొందును. "యో రుద్రాక్షం ధత్తే స సత్యం పరమ శ్శివః స సత్యం పరమ శ్శివః"

రుద్రాక్షధారణచే ప్రతిమనుష్యుడు సాక్షాత్పర శివుడేయగునని ఉపనిషద్వచనము చాటుచున్నందున ప్రతిమనుష్యుడు రుద్రాక్షమును ధరింప వలయు ననియే అవగతమగు చున్నది. బ్రాహ్మణాది వర్ణములందు బ్రహ్మచర్యాది ఆశ్రమములందు ఉత్తముడైయుండు వానికన్న భూతిరుద్రాక్ష ధారియైనవాడే శాస్త్రములచేతపొగడ బడుచున్నాడు.

యస్యాంగే నాపి రుద్రాక్ష ఏకోపి బహుపుణ్యతః
తస్య జన్మ నిరర్థం స్యా త్త్రిపుండ్ర రహితం యతః॥

భస్మధరించని వానిజన్మము నిరర్థకమగునట్లు, పుణ్యప్రదమైన రుద్రాక్ష ధరించని వాని జన్మము వ్యర్థమగు చున్నదని అనేకప్రమాణములు గలవు.

## ౬ మంత్రము.

విద్యాసు శృతిరుత్కృష్టా రుద్రైకాదశినీ శ్రుతౌ
తత్ర పంచాక్షరీ తస్యాం శివఇత్యక్షరద్వయం॥

అను పురాణవచన ప్రకారము చతుర్దశవిద్యలందు వేదమే శ్రేష్ఠమైనది. అందు

శ్రీరుద్ర ఏకాదశానువాకము శ్రేష్ఠము. ఆ పంచాక్షరీ మంత్రము నందు "శివ" యనురెండక్షరములే శ్రేష్ఠములనియు, వేదసమ్మత ములనియు సిద్ధించుచున్నది.

"నమ శ్శివాయ చ శివతరాయచ" "తస్మాత్స ర్వగత శ్శివః" "శివ ఏకో ధ్యేయ స్సర్వ మన్య త్పరిత్యజ్య" "అపి వాయ శ్చండాల శ్శివ ఇతి వాచం వదే త్తేనసహ సంవదే త్తేనసహ సంవసే త్తేనసహ భుంజీత"

అను వేదవచనాను సారము శివశబ్దము సకల నిష్కల బ్రహ్మ ప్రతిపాదకమై సర్వాతిశాయియై సర్వవేదాను సారియైనది. అట్టి శివశబ్దమే పంచాక్షరీ మహామంత్రమందు అడగియున్నందున యీ మంత్రమే సర్వోత్కృష్ట మైనది.

సప్తకోటిషు మంత్రేషు మంత్రః పంచాక్షరో మహాన్
బ్రహ్మవిష్ణ్వాదిదేవేషు యథాశంభు ర్మహత్తరః॥
అశేషజగతాం హేతుః పరమాత్మా మహేశ్వరః
తస్య వాచకమంత్రోఽయం సర్వమంత్రైక కారణమ్॥

పరశివుడు సర్వజగత్తునకు మూల భూతుడై నందున, మహేశ్వరుడు, పరబ్రహ్మ యని పిలువబడి సర్వోత్తముడై నందున యీమంత్రము సర్వోత్కృష్టమైనది.

సప్తకోటి మహామంత్రై రుపమంత్రై రనేకశః
పంచాక్షరే ప్రలీయంతే పునస్తత్ర వినిర్గతాః॥
అస్మిన్ వేదా శ్చ శాస్త్రాణి సర్వే పంచాక్షరే స్థితాః॥

సర్వమంత్రోపమంత్రములు వేదశాస్త్రములు పంచాక్షరీమంత్రము నందు గలవు.

వాచకో వర్ణరూప స్స్యా ద్వాచ్య స్తు పరమేశ్వరః

అను ఆగమ వచనప్ర కారము మంత్రము శివవాచకము. శివుడుత దర్థము. శివుడెట్లు జగన్మూలుడైయుండునో అట్లే యాతని మంత్రము కూడ సకలమంత్ర మూలమై యుండును.

నమ శ్శబ్దం వదే త్పూర్వం శివాయేతి తతః పరం
మంత్రః పంచాక్షరో హ్యేష స్సర్వశ్రుతి శిరోగతః॥

పంచాక్షరీ మంత్రమందు నమకారముచే ఉపాసకమైన జీవత్వము శివశబ్దముచేత నమస్కారపాత్రమైన పరబ్రహ్మత్వము అయశబ్దముచేత "అయగతౌ" అనుధాత్వర్థము ననుసరించి ఐక్యార్థము సిద్ధించును. కావున యీమంత్రము శివజీవైక్య ప్రకాశక పరమైనదని తెలియవలెను.

అంగం నమః పదమిదం శివఏవ లింగం
సంబంధ ఆయపదమేవ తయో రభేదం
లింగాంగ సంగమ పదద్వయ బోధనార్థం
పంచాక్షరోఽయ మభిధాస్యతి మంత్రరాజః॥
ఓంకార పూర్వో మంత్రోఽయం పంచాక్షర మయః పరః
వేదమాతా చగాయత్రీ మంత్రమాతా షడక్షరీ
శైవాగమేషు వేదేషు షడక్షర ఇతి స్మృతః॥
సర్వలోకపితా శంభు ర్భర్గో దేవస్య ధీమహి॥

ఈ సర్వోత్కృష్ట పంచాక్షరి ఓంకారముచే కూడి షడక్షర మంత్ర మగునని వేదాగమ ములందు చెప్ప బడినది. "బ్రహ్మ శివోమేఽస్తు సదాశివోమ్" అను శృతివచన ప్రకారము" ఓంకారాత్మ తయాభాతి శాంత్యతీతః పర శ్శివః" అను ఆగమవచన ప్రకారము.

శివో వా ప్రణవః ప్రోక్తః ప్రణవో వా శివ స్స్మృతః
వాచ్యవాచకయో ర్భేదో నాత్యంతం విద్యతే క్వచిత్॥

యను పురాణవచన ప్రకారము ఓంకారరూప ప్రణవము శివవాచకమై శివుడు తద్వాచ్యుడై యున్న కారణమున శివునకు ప్రణవమునకు ఐక్యము సిద్ధించుచున్నది. ఈ ప్రణవ యోగము చేతనే, పంచాక్షరి "షడక్షరి" యని పిలువబడు చున్నది.

పంచాక్షరేణ మంత్రేణ బోధ్యతే నిష్కల శ్శివః
పంచాక్షరేణ మంత్రేణ మంత్రబ్రహ్మతను స్తథా॥

ఈ పంచాక్షరీ మంత్రము నిష్కళ పరమాత్ముని బోధించు చున్నది గనుక యీ మంత్రజపముచే మనస్సునందు శివస్వరూప శివజ్ఞాన శివాత్మైక్య స్వరూపములు స్థిరపడును.

జపస్తు త్రివిధం ప్రోక్తం వాచకోపాంశు మానసాః

ఇతరులకు వినబడునట్లు ఉచ్చరింప బడుజపము వాచకమనియు వినరాకుండ నోటి యందుచ్చరించునది ఉపాంశువనియు, చిత్తమునందు ధ్యానించునది మానసికమనియు మూడువిధముల జపములు గలవు.

మానసో హి జప శ్శ్రేష్ఠో ఘోరసంసార నాశకః

ఈ త్రివిధ జపములలో ఘోరసంసార నాశకరమైన మానసిక జపమే శ్రేష్ఠమైనది.

జపే త్పంచాక్షరీ మేతాం విద్యాం పాశవిముక్తయే
అనేన మూలమంత్రేణ శివలింగం ప్రపూజయేత్॥

మలమాయాది పాశనివృత్తికై యీపంచాక్షరీ జపయుక్తముగా శివలింగమును పూజింప వలయును.

పంచాక్షరీం సముచ్చార్య పుష్పం లింగే వినిక్షిపేత్
యస్తస్య వాజపేయానాం సహస్రఫల మిష్యతే॥

ఎవడు పంచాక్షరీ మంత్రయుక్త పుష్పము నొక్కదానిని పెట్టి లింగమును పూజించునో అతనికి వాజపేయ యజ్ఞ సహస్ర ఫలము లభించును.

కిమిహ బహుభి రుక్తై ర్మంత్ర మేకం సుశాస్త్రం
ప్రణవసహిత మాద్యం యస్తు పంచాక్షరాఖ్యం
జపతి పరమభక్త్యా పూజయన్ దేవదేవం
స గతదురితబంధో మోక్షలక్ష్మీం ప్రయాతి॥

ఓంకారసంయుక్త పంచాక్షరీపూర్వక శివపూజచేత యెంతవాడైనను పాప బంధముక్తుడై మోక్షసంపన్నుడు కాగలడు.

తస్మాత్తపాంసి యజ్ఞాశ్చ వ్రతాని నియమాస్తథా
పంచాక్షరార్చనస్యైతే కోట్యంశేనాపి నో సమాః॥ సి. శిఖా

తపోయజ్ఞ వ్రతనియమములు పంచాక్షరి సమానములుకావు. కావున ప్రతి వీర శైవుడు ఓంకారయుక్త పంచాక్షరీ మంత్రమును సర్వదా జపించు చుండుటయే శివధ్యాన మనబడును.

సర్వాన్ దేవాన్ పరిత్యజ్య యజేత్పంచాస్య మీశ్వరం
సర్వాన్ మంత్రాన్ పరిత్యజ్య జపేత్పంచాక్షరీం సదా॥ కారణసం
సర్వమంత్రాధిక శ్చాయ మోంకారాద్య ష్షడక్షరః
సర్వేషాం శివభక్తానా మశేషార్థ ప్రసాధకః॥ వాయు. సం. ౧.౨

62 సర్వమంత్రములందు అధికమని పించుకొనిన షడక్షరమంత్రము సర్వార్థముల ననుగ్రహించును. యీ శ్లోకమును శ్రీనీలకంఠ శివాచార్యులు తనక్రియా సార మందుగూడ ఉదహరించియున్నారు.

# శివ మంత్రము,

షడక్షరోఽష్టాక్షరో వా శైవో మంత్రో జపనీయః ఓ మిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్ తత శ్శివాయే త్యక్షరద్వయం! ఓ మిత్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్ తతో మహాదేవాయేతి పంచాక్షరాణి నాఽతస్తారకః పరమో మంత్రః తారకోయం పంచాక్షరః కోయం శైవో మనుః శైవ సారోయ ముపదిశ్యతే మను రవిముక్తే శైవేభ్యో జీవేభ్యః శైవోఽయమేవ మంత్రః స్తారయతి. స ఏవబ్రహ్మోపదేశః॥ భస్మజాబాలో పనిషత్.

ఓం నమశ్శివాయ - ఇది షడక్షర మంత్రము.

ఓం నమో మహాదేవాయ - ఇది అష్టాక్షర మంత్రము.

ప్రణవసహిత నమశ్శివాయ యనుమంత్రమే తారక మంత్రము. ఈ మంత్రము ఉపదేశింపబడును. దీనిచే జీవులయొక్క ఉద్ధారముజరిగి, బ్రహ్మసాక్షాత్కారము కాగలదు. ఇదియే బ్రహ్మవిద్య. దీనితో జీవులకు బ్రహ్మ జ్ఞానము గలుగును. ఈ తత్వజ్ఞానముచే ఆనందపూర్ణ బ్రహ్మముయొక్క ఆవిర్భావరూపమైన ముక్తిగలుగును. అని శ్రీశంకరుడు భుసుండ మహర్షికి దెల్పెను.

సర్వజ్ఞః పరిపూర్ణ శ్చ సచ్చిదానంద లక్షణః
స శివో యత్ర రమతే శైవపంచాక్షరే శుభే॥
ఏతేన మంత్రరాజేన సర్వోపనిష దాత్మనా
లేభిరే మునయ స్సర్వే పరం బ్రహ్మ నిరామయం॥
నమస్కారేణ జీవత్వం శివేఽత్ర పరమాత్మని.
ఐక్యంగత మతో మంత్రః పరబ్రహ్మమయో హ్యసౌ॥
మంత్రాధి రాజరాజోయం సర్వవేదాంత శేఖరః
సర్వజ్ఞాననిధానం చ సోయంచైవ షడక్షరః॥
కైవల్యమార్గదీపోఽయ మవిద్యా సింధుబాడబః
మహాపాతకదావాగ్నిః సోయం మంత్ర షడక్షరః॥ స్కాందే.

పరమశుభప్రణవసహిత పంచాక్షరియందు సర్వజ్ఞపరిపూర్ణ సచ్చిదానంద రూప శివుడు స్వనిష్ఠ ప్రతిపాద్యతా నిరూపిత ప్రతిపాదకతా సంబంధముతో రమించుచుండును. ప్రణవ పంచాక్షరీమంత్రము భగవత్ప్రతిపాదక మైనది మరియు సర్వో

త్మానందనిధి శివుడు మంత్రప్రతి పాద్యుడగును. ఈ మహామంత్రమువలన బ్రహ్మ రూప శివజ్ఞానము గలుగును. ఇందుచే ఈ మంత్రము బ్రహ్మవిద్య యని తెలియ వలయును. సర్వోపనిషద్రూపమైన యీ మంత్రరాజమునే మననము చేయు మహాత్ములు నిర్వికార బ్రహ్మమును పొందిరి. ఈ మంత్రార్థమును దెలుసుకొని దీనిచే సర్వాత్మశివునకు నమస్కరించు జీవుడు శివుడే కాగలడు. కావున యీ మంత్రము పరబ్రహ్మమయమైనది. అర్థాత్ పరబ్రహ్మముయొక్క జ్ఞాపక మైనది. ఈ షడక్షరి మంత్రరాజములకన్న ర్హాజైనది. మరియు సమగ్రవేదాంత శిరోభూషణమైనది. సర్వజ్ఞానములయొక్క భండారమైనది. కైవల్యముక్తి యొక్క దీపకమైనది. అర్థాత్ మోక్షమార్గమును చూపించునది. సముద్రజలమును బడబాగ్ని యెట్లు శోషింపజేయుచున్నదో అటులే యీ షడక్షరి అవిద్యా రూపాంధకార మయ సంసారమును నాశనము జేయును. దావాగ్ని వనమునెట్లు నశింప జేయునో అటులే యీ మంత్రము పాపరూప వనమును నశింపజేయును. అతః యీ ఓం నమశ్శివాయ యనుమంత్రమహిమ అద్భుతముగా చెప్పబడినది.

శివేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే
సప్తజన్మకృతం పాపం భస్మీభవతి తస్య వై॥ పద్మపు॥

శివయను మంగళ శబ్ద మెవరి ముఖమునుండి యుచ్చరింప బడునో వారి సప్త జన్మకృతపాపములు నశించిపోవు చున్నవి. కావున శివనామ స్మరణమే శ్రేష్ఠము.

శివో వా ప్రణవో హ్యేవ ప్రణవో వా శివ స్స్మృతః
వాచ్యవాచకయో ర్భేదో నాత్యంతం విద్యతే యతః॥ వి.౧౬ ౬౧

శివుడే ప్రణవము, ప్రణవమే శివుడు; శబ్దార్థములకు భేదములేదు గాన ప్రణవ మను ఓంకార శబ్దముచేత నెల్లప్పుడు శివరూపమగు నర్థము ఎల్లకాలమును స్ఫురించుచున్నదని భావము.

స్వపూజకానాం యోగీనాం స్వమంత్రజాప కస్య చ
సర్వకర్మక్షయం కృత్వా దివ్యజ్ఞానం తు నూతనమ్॥ ౬

తన ప్రణవార్థ స్వరూప ధ్యానరూపపూజను సలుపు వారలైన మరియు ప్రణవ మంత్రము జపించువారలైన యోగులయొక్క కర్మక్షయము గావింపజేసి దివ్యాత్మజ్ఞానము గలుగజేయును.

తమేవ మాయారహితం నూతనం పరిచక్షతే
ప్రకర్షేణ మహాత్మనాం నవం శుద్ధస్వరూపకమ్। ౭
నూతనం వై కరోతీతి ప్రణవం తం విదుర్బుధాః॥

ఇది మహాత్ములకు అత్యంతనవీన శుద్ధరూపప్రదానము జేయునట్టిదై మాయారహితమైన నూతనత్వము గలిగించు చున్నందున దీనిని పండితులు ప్రణవమందురు.

బ్రహ్మాది స్థావరాంతానాం సర్వేషాం ప్రాణినాం ఖలు
ప్రాణః ప్రణవ ఏవాఽయం తస్మాత్ప్రణవ ఈరితః। శివపు.

బ్రహ్మను మొదలుకొని స్థావరపర్యంతము ప్రాణిమాత్రమునకు ఈ ప్రణవమే ప్రాణము. ఇందుచే దీనిని ప్రణవమందురు.

## ప్రణవము యొక్క మహిమ.

శాస్త్రములందు ప్రసిద్ధమైనదే మనగా:—

"మంత్రాణాం ప్రణవస్సేతుః" ఎట్లు సేతువుయొక్క ఆశ్రయమువల్ల, మనుష్యులు నదులను దాటుదురో అట్లే "నమశ్శివాయ" యను మంత్రముతో "ఓం" కారమును జోడించి జపించుట వలన, ఆమంత్ర శక్తితన ప్రభావముచే సంసారము నుండి మనుష్యుని తరింపజేయును. కనుక ఛాందోగ్యోపనిషత్తునందు:

తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవ మేవోం
కారేణ సర్వా వాక్సంతృణ్ణా, ఓంకార ఏవేదం సర్వమ్।

సూదితో గ్రుచ్చబడిన ఆకు లెట్లుండునో ఆప్రకారమే ఓంకారముచే నిఖిలశబ్దములు నిబిడీకృతమైయున్నవి. ఇందువలన ఓంకారమే సర్వస్వమైయున్నది. స్మృతులయందుగూడ ఓంకారముయొక్క మహిమ విపులముగా చెప్పబడినది.

మాంగల్యం పావనం ధర్మ్యం సర్వకామప్రసాధనమ్
ఓంకారః పరమం బ్రహ్మ సర్వమంత్రేషు నాయకమ్॥
ఆద్యమంత్రోఽక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా
సర్వమంత్రప్రయోగేషు ఓమిత్యాదౌ ప్రయుజ్యతే।
తేన సంపరిపూర్ణాని యథోక్తాని భవంతిహి
సర్వమంత్రాధియజ్ఞేన ఓంకారేణ న సంశయః॥

పరబ్రహ్మరూపమగు ఓంకారము సర్వమంత్రములకు శిరోభూషణమును, పర

మ మాంగళ్యమై సకలకామములకు సాధకమైనది. ఋక్కు, యజు, సామ యను వేదత్రయ ప్రతిష్ఠ కిది మూలమైనది. మరియు "నమ శ్శివాయ" యను ఆది మంత్రముయొక్క ప్రయోగమునందు, ఓంకారమే మొదట నుచ్చరింప బడు చున్నది; ఏలననగా సమస్త మంత్రములకు సిద్ధిగలిగించుశక్తి ఓంకారము చేతనే గలుగుచున్నది. అందుచే సకలమంత్రములలో మొదట ఓంకారము ఉచ్చరింప బడుచున్నది.

ప్రణవాద్యాస్తథా వేదాః ప్రణవే పర్యవస్థితాః
వాఙ్మయం ప్రణవంసర్వం తస్మాత్ ప్రణవమభ్యసేత్॥

ఋగాది సమస్త వేదములు ప్రణవముచేతనే ఆరంభ మగుచున్నవి. పునః ప్రణవ మునందే సమాప్తమగుచున్నవి సంపూర్ణ వాణిమాత్రమే ప్రణవమై యున్నది. ఇందువలననే ముముక్షువులకు ప్రణవము యొక్క అభ్యాసమే చేయదగినది. మహాఋషి యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు గదా:

ఏక ఏవ తు విజ్ఞేయః ప్రణవో యోగసాధనమ్
గృహీతః సర్వసిద్ధై స్తైరితరైః బ్రహ్మవాదిభిః॥

యోగము యొక్క ప్రకృష్ట సాధనము ఒక ప్రణవమే అయివున్నది. అందు వలననే ఓంకార స్వరూపమును యథార్థ స్వరూపముచే తెలియ వలెను. సమస్తసిద్ధులు, సమస్త బ్రహ్మవాదులు, ఈ ఓంకారమును లక్ష్యప్రాప్తి కొరకు సాధనరూపముచేత గ్రహించిరి

అకారో విష్ణు రుద్దిష్ట ఉకారస్తు మహేశ్వరః
మకారేణోచ్యతే బ్రహ్మ ప్రణవేన త్రయో మతాః॥

అకారము విష్ణువాచకము ఉకారము మహేశ్వరవాచకము. మరియు మకారము బ్రహ్మ వాచకమనియు శాస్త్రములందు చెప్పబడినది కనుక ఓంకారము యొక్క అ,ఉ, మ యను మూడుమాత్రలకు ముగ్గురు దేవతల సంబంధము చూపబడినది. ఈ ముగ్గురికొంటమే పరమశివుడని తెలియవలెను కనుకనే ఓంకారము దివ్య మంత్రమని చెప్పబడినది.

63

ఓంకారమునకు ప్రణవము, మరియు ఉద్గీథము యనునామము కూడ గలదు. ఋగ్వేదము ఓంకారమును ప్రణవమనియు, సామవేదము ఓంకారమును

ఉద్గీథమనియు, మరియు యజుర్వేదము ఓంకారమును ఓంకారమే యనియు చెప్పుచున్నవి. ముండకోపనిషత్తునందు.

ఓమిత్యేవం ధ్యాయత ఆత్మానం స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్.

ఓంకారరూపముతో తన ఆత్మను ధ్యానించుము. దీనిచే మీయొక్క కల్యాణము గాగలదు మరియు మీ అజ్ఞానాంధకారము విధ్వంసమై స్వయంజ్యోతి స్వరూపము గలుగును.

ఓంకార మహిమ సంపూర్ణ వేద, స్మృతి పురాణాది శాస్త్రములందు నిండియున్నది. "అవతిరక్షతి సర్వానితి ఓం" ఈఉత్పత్తిచేత ఓంకారము సర్వరక్షక పరమాత్మునియొక్క నామముగను "తస్యవాచకః ప్రణవః॥" ఈ యోగసూత్రముచేతనుకూడ పరమాత్మునియొక్క నామము ప్రణవము(ఓంకారము) అగును.

ఓంయను మంత్రోచ్చారణము చేతనె యోగ, ధ్యాన, హోమ, వేదాధ్యయనాది శుభక్రియలు జేయుదురు, "తేనే యం త్రయీ విద్యా వర్తతే" ఈ ఛాందోగ్య శ్రుతికూడ ఓంకారము యొక్క ఉచ్చారణ పూర్వకముగనే వేదత్రయమునందు విహితవైదిక కర్మముల ప్రారంభమగుచున్నదని చెప్పుచున్నది.

ప్రణవము ఓంకారనామము. పరమార్థరూప చిన్మాత్ర ఓంకారమందు నీచిత్తమును లగ్నము జేయుము. ఏలనన ఓంకారమే నిర్భయ బ్రహ్మము ఓంకారముయొక్క చింతనమునందు ఏ అధికారి సర్వదా తగిలియుండునో ఆతనికి ఎక్కడనైనను, ఎప్పుడైనను, ఎవనితోనైన లేశమాత్రమైన భయములేదు. ఓంకారము సగుణ బ్రహ్మము కూడనగును మరియు ఓంకారము నిర్గుణ బ్రహ్మము కూడ యగును. అపూర్వ (కారణరహిత) అనంతర (యావత్ భేదశూన్య) అబ్రహ్మ (బ్రహ్మవస్తుశూన్య) అనపర (కార్యరహిత) అవ్యయ (వికార రహిత) రూపము ఓంకారమయినది. ఆకాశాది సమస్త ప్రపంచము యొక్క ఆదియందు మధ్యయందు తథా అంత్యమందు ఏకమాత్ర ఓంకారమే యుండును. ఈప్రకారము ఓంకారము యొక్క యథార్థ స్వరూపమును దెలిసి మరియు దాని ఉపాసనజేసి అధికారియు ఓంకారముయొక్క విశుద్ధ స్వరూపమును పొందును సర్వచరాచర ప్రాణిమాత్రుల హృదయమందు సాక్షి చేతన రూపముతో వర్తమానుడైన సర్వవ్యాపి పరమేశ్వర రూపమైన ఓంకారము యొక్క యథార్థ స్వరూపమును తెలుసుకొనును. ఓంకారము యొక్క యథార్థ స్వరూపమును

నిరంతరము మననము జేయుధీరులు ఎప్పుడును శోకింపరు. ద్వైత ప్రపంచ రహిత కల్యాణస్వరూప అమాత్ర ఏవం అనంత మాత్రరూప ఓంకారమును ఎవడు తెలియునో అతడే మునియన బడును. అన్యుడు కాడు. కఠోపనిషత్తునందు నచికేతుని గురించిధర్మరాజు ఓంకారముయొక్క మహిమ ముక్తకంఠముచే కీర్తించెను.

సర్వే వేదా యత్పద మామనంతి
తపాంసి సర్వాణి చ యద్వదంతి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి ఓ మిత్యేతత్॥
ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఎతద్ధ్యేవాక్షరం పరం
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్॥
ఏత దాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరం
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥

ఓ నచికేతుడా! సంపూర్ణ వేదములు ఏపదమును జెప్పుచున్నవో సంపూర్ణ తపముల ఫలములు ఏ యుపాసనచే గలుగుచున్నవో ఏ పదము గోరి బ్రహ్మచర్యము జేయబడుచున్నదో ఆపదమును నేను నీకు సంక్షేపముగ జెప్పుచున్నాను. అదియే ఓంకారపదము ఈఓంకారమే సగుణబ్రహ్మము ఇదియేనిర్గుణబ్రహ్మము. ఈ సర్వవ్యాపక అవినాశి అక్షరమువలన ఎవడు ఏఫలమును గోరునో ఆ ఫలమునే పొందగలడు. ఈ ఓంకార రూపావలంబనమే అత్యంత శ్రేష్టము. ఈ ఆవలంబనము చేతనే బ్రహ్మలోకము నందు ఈమహామహిమ ప్రాప్తి గలుగును. ఛాందోగ్యోపనిషత్తునందు ఓంకారమహిమ.

"దేవా వై మృత్యో ర్బిభ్యత స్త్రయీం విద్యాం ప్రావిశన్"

ఒక సమయమునందు దేవతలు మృత్యువుచే భయభీతులై వేదత్రయీ విహిత యోగాదికర్మముల అనుష్టానము జేసి, ఈ కర్మానుష్టానము ద్వారా తమను వేదములతో ఆచ్ఛాదింప జేసుకొనిరి. ఈ కర్మరూప జలమునందు ప్రవిష్టులైన దేవతలను కూడ మృత్యువు చూచెను. అర్థాత్ కర్మజలక్షయము నందు దేవతలను మృత్యువు చంప నిశ్చయించెను. దేవతలు మృత్యువుయొక్క అభిప్రాయము తెలుసుకొనిరి. అప్పుడు వారు కర్మానుష్టానమును వదలి ఓంకారముయొక్క ఉపాసనయందు తత్పరులైరి.

"యదేత దక్షర మమృత మభయం ప్రవిశ్య దేవా అమృతా అభయా అభవన్" ఏది ఓంకారాక్షరమో అదియే అమృత అభయరూపమైనది. అతః దేవతలు అమృత, అభయ, ఓంకారముయొక్క ఉపాసన జేసి అమృతులు అభయులైరి. ఈ వర్తమాన కాలమునందు కూడ ఎవరు శ్రద్ధచే ఓంకారము యొక్క యదార్థ స్వరూపమును తెలిసి ఓంకారోపాసన జేసెదవారు దేవతల సమానము అమృత అభయరూపులగుదురు. దీనియందు సందేహము లేదు. ఇటులే అనేక ఉపనిషత్తులందు ఓంకారమహిమ విశదముగా జెప్పబడినది కనుక అట్టి ఓంకార స్వరూపుడైన పరమేశ్వరుని ధ్యానించుట అత్యావశ్యకము. చిలుకలవలె శివ నామ పఠనము చేయక ఓంకారశివ స్వరూపము యొక్క భావగర్భిత అర్థమును గ్రహించి ప్రతిదినము జపించవలెను. ఆ ఓంకారస్వరూపము యొక్క నిజార్థము యిట్లు తెలియవలెను.

ఓంకారము ఈశ్వరుని అథవా బ్రహ్మయొక్క నామము ఓంకారమందు అకార, ఉకార, మకార, మరియు అర్ధమాత్ర యీనాలుగు అక్షరములు గలవో అటులే శివునియందు శకార, ఇకార, వకార, అకార యను నాలుగు అక్షరములు గలవు. ఇందువలననే ఓం మరియు శివనామము యొక్క సమానతగలిగెను. శకారము స్థూలశరీరవాచకము ఇకారము సూక్ష్మశరీరవాచకము. వకారము కారణశరీరవాచకము, మరియు అకారము కారణాతీతముయొక్క వాచకము.

శకారము జాగ్రదవస్థయు, ఇకారము స్వప్నావస్థయు, వకారము సుషుప్త్యవస్థయు మరియు అకారము తురీయావస్థయు నగును. అథవా.

శకారము విశ్వము, ఇకారము తైజసము, వకారము ప్రాజ్ఞ మరియు అకారము ఆత్మ యగును అథవా.

శకారము విరాట్టు, ఇకారము హిరణ్యగర్భము, వకారము ఈశ్వరుడు, మరియు అకారము పరమాత్మ యగును. అథవా

శకారము ఋగ్వేదము, ఇకారము యజుర్వేదము వకారము సామవేదము, మరియు అకారము బ్రాహ్మణభాగ - వేదశిరోభాగ - ఉపనిషత్తు యగును. ఈప్రకారము సమస్తవిశ్వము శివరూపమయినది మరియు శివుడు విశ్వరూపుడాయెను కారణకార్యములయొక్క అభేద మాయెను. ఏలనన శివునియందే విశ్వము ఉత్పన్నమాయెను. అథవా నామ నామధారుల యొక్క అభేదము సిద్ధించును అందువలన శివనామము మరియు శివతత్వముల అభేదము సిద్ధించును.

# ౭. పాదోదక మాహాత్మ్యము.

వీరశైవులు తమలింగార్చన సమయము నందు లింగమున కర్పించిన జలమును సేవించుదురు. ఇదియేపాదోదకము. అన్యము పాదోదకముగాదు.

లింగాభిషేకజం తోయం యత్తులింగోదకం భవేత్
తత్పిబే ల్లింగశరణో హ్యాన్యచ్చేన్మద్య మాంసవత్॥ ౧॥
లింగస్నాతం లింగతోయం లింగపీతం తథైవచ॥
తత్పిబేల్లింగ శరణాశ్చాన్య న్మద్యశ్వ మూత్రవత్॥ ౨॥
లింగావగాహనం చైవ లింగాంబు శుచితద్భవేత్
తేనస్నానంచ పానంచ హ్యాన్యచ్చాండాల తోయవత్॥ ౩॥
లింగప్రక్షాళనం తోయం లింగతోయం తథైవచ
తత్తోయం సర్వదాగ్రాహ్య మన్యశ్చాండాల తోలవత్॥ ౪ లింగసారే

లింగమున కభిషేకము జేయించిన జలమే శివశరణులకు పానయోగ్యమైనదికాని అన్యముగాదని స్పష్టముగా జెప్పబడినది. కనుక అట్టి లింగోదకమును సేవించుట వలనగలుగుచున్నట్టి ఫలాఫలములను విమర్శింప వలయును. ఈ లింగోదక సేవనమువలన తాపత్రయములు నశించుచున్నవి. మరియు జ్వరాదివ్యాధులు హరించి పోవుచున్నవి. మృత్యుభయము నిర్మూలమగుచున్నది. ఉత్సాహము, పౌరుషము, సౌఖ్యము, శౌర్యము, సంతానము, అక్షయసుఖము మరియు కాయశుద్ధి ఇత్యాదులు గలుగుచున్నవి. ఇట్టి లింగోదకమును పానముజేయు వారికి పంచసూతకములు అశుచిభావన లేకుండునని అనేక వీరశైవ గ్రంథములందు జెప్పబడినది.

లింగాభిషేకం కుర్వీత తల్లింగోదక ముచ్యతే
తత్ర స్నాత్వా చ పీత్వాచ నాశయేదఖిలామయం॥
అభిషిక్త జలం ప్రాతః పిబేన్నిత్యం దినేదినే।
శూలకుష్ఠాద్యపస్మార జ్వరాణాం భేషజం ప్రియే॥ వైద్యశాస్త్రము

శూలరోగము కుష్ఠురోగాదులు, అపస్మారాది జ్వరాదులు అన్నియు లింగాభిషేకమువలన హరించునని శివుడు బోధించియున్నాడు. మరియు.

నిర్మాల్య సలిలం ప్రాశ్య దేవదేవస్య శూలినః
క్షయకుష్ఠ జ్వరాద్యైస్తై ర్ముచ్యతే సర్వకిల్బిషైః॥

ప్రసాదితం తు సలిలం ప్రసాద సలిలం భవేత్
గృహీతం పావనం హ్యేత ద్వ ద్విట్సలిలం భవేత్॥

లింగార్పితమైన సలిలమువలననే క్షయ, కుష్ఠు, జ్వర, ఆయాసాదులు మరియు మనోగతమైన కిల్బిషాదులన్నియు హరించుచున్నవి లింగోదకమే పావన మైనది.

సర్వమంగల మాంగల్యం సర్వపావన పావనం
సర్వసిద్ధికరం పుంసాం శంభోః పాదాంబు ధారణం॥

శివపాదోదక ధారణము సమస్త మంగళ వస్తువులయందు మంగళ కరమైనది. సమస్తపాప వినాశకమైనది. సర్వసిద్ధులనిచ్చునది యనియు చెప్పబడినది.

## ౮. ప్రసాదము.

నైర్మల్యం మనసో లింగం ప్రసాదఇతి కథ్యతే
శివస్య లింగరూపస్య ప్రసాదాదేవ సిద్ధ్యతి॥
శివప్రసాదం యద్ద్రవ్యం శివాయ వినివేదితం
నిర్మాల్యం తత్తు శైవానాం మనోనైర్మల్య కారణం॥

మనస్సునిర్మలమై యుండుగుణమే ప్రసాదము. యిది లింగరూప పరశివానుగ్రహముచేతనే లభ్యమగును కనుక పరశివునకు ఏవస్తువు సమర్పింప బడునో ఆ అర్పితనిర్మాల్యమే వీరశైవుల మనోనైర్మల్యమునకు కారణమగును. లింగనిష్ఠవలన మనోనైర్మల్యము గలుగును. నిర్మలశివజ్ఞాన కారణభూతమైన ఆశివనిర్మాల్యమును మనఃప్రసాదసిద్ధికై స్వీకరించువాడే వీరశైవుడు. ఆశివప్రసాదముచేతనే చిత్తశుద్ధిగలుగును, వైరాగ్యముత్పన్న మగును. సకలపాపములు నాశనమగును

రుద్రేణాత్తమశ్నంతి రుద్రేణపీతం పిబంతి॥
రుద్రేణా ఘ్రాతం జిఘ్రంతి। జాబాలశ్రుతౌ॥
భుంజీయాద్రుద్రభుక్తాన్నం రుద్రపీతం జలంపిబేత్
రుద్రా ఘ్రాతం సదాజిఘ్రేదితిజాబాలకే శ్రుతిః।

యని యున్నది. గనుక రుద్రార్పిత ప్రసాదమునే భుజించి రుద్రార్పిత జలమునే సేవించి మరియు రుద్రార్పిత ప్రసాదకుసుమమునే ఆఘ్రాణించ వలయును.

అర్పయిత్వా నిజే లింగే పత్రం పుష్పం ఫలం జలం
అన్నాద్యం సర్వభోజ్యంచ స్వీకుర్యాద్భక్తి మాన్నరః॥

భక్తిసంపన్నుడైన పురుషుడు పూలు, పత్రి, నీరు, అన్నము మొదలైన సర్వ వస్తువులను మొదలు లింగార్పితము గావించి యీవస్తువు నీదనియు, నీతో కృపయా యివ్వ బడెననియు తత్ప్రసాదముచే కృతార్థుడనైతి ననియు భుజించ వలెను.

రుద్రేణాన్నమమృతం దేవావైభోక్తుకామా వేదాః కామయంతే।

రుద్రభుక్తాన్నమే అమృతము, ఆశివప్రసాదముకై దేవతలు మరియు వేదములు కూడ అపేక్షించెదరని యజుర్వేద వచనము సిద్ధించుచున్నది. కనుక గురులింగ జంగమూర్తుల ప్రసాదము యన వారి అనుగ్రహమునియే తెలియువలెను. సమస్త పదార్థములు రుద్రునిచేతనే కల్పింపబడినవి. రుద్రునిచేతనే మనకొసగబడినవి. కనుక రుద్రుని కర్పించియే రుద్రభుక్తశేషాన్నమే సేవించిన ఆయురారోగ్య సంపన్నులై సకలయైశ్వర్యములను పొందగలమనుటచేతనే కృతజ్ఞతా సూచకత్వము ప్రకటింపబడుచున్నది. ఎల్లప్పుడు కాలాకాలములు లేక నియతిలేక భుజించుట వలన అజీర్ణాదిరోగములు గలిగి ఆయుష్యము తగ్గును. కనుక లింగ పూజానంతరము భోజ్యపదార్థములను గురులింగ జంగమూర్తుల కర్పించి అట్లాగా అతిథి సత్కారములను సల్పి లింగమును భోగింపజేసి ప్రేమగా, ఈ భోజ్యపదార్థములు నీచే కృపయా యివ్వబడినవి. కనుక తత్పదార్థములచే కృతార్థుడనైతిని అని ఆత్మానంద సంతృప్తితో భుజించవలెను. ఈ శుభ్రమైన ప్రసాదాన్నభుక్తము చేత దేహమునందలి సమస్త ధాతువులు శుభ్రపడి అంతర్బహిరింద్రియములు నియమమును గలిగివర్తిల్లుచుండును. మనస్సు నిశ్చలమైనందున దుష్టసంకల్పముల యందు ప్రవర్తింపక సద్బుద్ధినే బుట్టించును. అహంకార మమకారములు తగ్గును. సర్వత్రశివభావము వృద్ధిపొందును. సద్భావనల వలనను శాంతియుతుడై శివైక్య ప్రాప్తినిగాంచును గనుక శివప్రసాదము నే సేవింప వలయును. మరియు అతిథుల సత్కారము జేయవలయును. తద్వారా సర్వభూతదయాళుత్వము సిద్ధించును.

గురుత్వాత్సర్వభూతానాం శంభో రమితతేజసః
తస్మై నివేదితం సర్వం స్వీకార్యం తత్పరాయణైః॥

"ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం" యను శృతి వచనప్రకారము సకలగురువు సర్వభూతాధిపతియై యున్నందున అనంత తేజశ్శాలి యైన పరశివునికి సకలవస్తువులను నివేదించి, తత్ప్రసాదమునే స్వీకరింపవలయును.

పత్రం పుష్పం ఫలం తోయ మన్నపానాద్య మౌషధం
అనివేద్య న భుంజీత యదాహారాయ కల్పితం॥

ఇక్షుఖండం ఫలం పుష్పం ఖాద్యాని వ్యంజనాని చ
ప్రసాదా న్నైవ భోక్తవ్య మన్య ద్గోమాంస విట్సమం॥
సర్వం చ తృణకాష్ఠం చ భక్ష్యం చై వా నులేపనం
గంధో మృగమద శ్చై వ కర్పూరం తైలమంజనం॥
కర్మణా మనసా వాచా త్రివిధం చార్పితం శుభం
నో చే దనర్పితం భుక్తే ప్రసాదం నిష్ఫలం భవేత్॥ లింగపురాణే।

శివుని కర్పించని వస్తువు నేదియైనను భుజింపకూడదు. మరియు తన శరీరముపై లేపనముకూడ జేయరాదు. అన్నమేగాక ఔషధముకూడ లింగమున కర్పింపక సేవించగూడదు. అని వీరశైవుల కర్తవ్యము నిర్ధారణ జేయబడినది.

వ్రతోపవాసనియమై ర్యేన కేనా పి హేతునా
పూజా ప్రసాద లోపా శ్చే న్నానసా వాప్నోతి తత్ఫలమ్॥

వీరశైవుడు ఏ హేతువుచే నైనను ఉపవాసవ్రతము సలిపి, ప్రసాదలోపమును జేసిన ప్రసాదఫలము లభింపకుండు నని ఉపవాసవ్రతనిషేధము, జేయబడినది.

ప్రసాదానుభవస్యై వ మాహాత్మ్యం ప్రతిపాదితం
ఇదం పవిత్రం పరమ మఖిలాగమచోదితమ్॥
వేదవేదాంత తత్వజ్ఞైః పవిత్రం పరిభాషితం
ఇతిహాస శివాచార సారభూత ముదాహృతమ్॥
నానాపురాణవేదేషు రహస్యం పరిభాషితం
తస్మా త్సర్వప్రయత్నేన గోపనీయ మిదం త్వయా॥ బ్రహ్మాండ పు.

ఈ ప్రసాదముయొక్క మహిమ ప్రసాదికొరకయి చెప్పబడినది. ఈప్రసాదము పరమ పవిత్రమైనదని సమస్తాగమములు ఘోషించుచున్నవి. వేదవేదాంత పారగులు యీప్రసాదము పవిత్రమైనదని పలుకుచున్నారు. మరియు ఇది ఇతిహాసశివాచారముల సారమైయున్నది. నానాపురాణములుకూడ యిట్టి రహస్యమునే దెలుపుచున్నవి. కనుక ఈ ప్రసాదమాహాత్మ్యము అత్యంత గోపనీయమైనదని శివుడు తెలిపెను.

ఓం శాంతిః శాంతిః శాంతిః।

ఇతి శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణియందు
అష్టావరణములను
ఏడవ ప్రకరణము సమాప్తము.

ఓం
శ్రీ శివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి

## పంచాచారములు.

### ఎనిమిదవ ప్రకరణము.

"ఆచార ఏవ సర్వేషా మలంకారాయ కల్పతే" సి. శిఖామణౌ
"ఆచారహీనః పురుషో లోకే భవతి నిందితః"
"జ్ఞానేనాచారయుక్తేన ప్రసీదతి మహేశ్వరః
తస్మాదాచారవాన్ జ్ఞానీ భవేదా దేహపాతనం"

ప్రతివీరశైవునకు ఆచారమే భూషణము. ఆచారము లేనివాడు లోకమునందు నిందితుడగును. ఆచారయుక్త జ్ఞానమువలననే పరమేశ్వరుడు ప్రసన్నుడగును. గావున దేహమున్నంతవరకు ఎంతటి జ్ఞానియైనను ఆచారము చేయుచునే యుండవలయును. వీరశైవునకు పంచాచారములే ముఖ్యమైనవి

లింగాచార స్సదాచార శ్శివాచార స్తథైవచ
గణాచారః భృత్యాచార పంచాచారాః ప్రకీర్తితాః వీ. ఆ. ప్ర॥

లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారములనునవే పంచాచారములు.

## ౧. లింగాచారము

గురుణాదత్త లింగాద్వై నాస్తి దైవం మహీతలే।
ఇతి భావాను సంధానం లింగాచార స్స ఉచ్యతే॥

గురుదత్త లింగముకన్న భూతలమునందు ఇతరదైవము లేదని నిశ్చయముగ నుండుటయే లింగాచార మనబడును. గావున అనేకజన్మ పుణ్యకృత పరిపాక వశమున సంస్కారాసక్తుడైన శిష్యుడు శుభలక్షణాన్వితుడైన సద్గురునిచేత దీక్షితుడై ఆణవ మాయా కార్మిక మలత్రయమును వేధా, క్రియా, మాంత్రిక దీక్షాత్రయముచే దహించి ఇష్ట, ప్రాణ, భావలింగ త్రయమును పొందును. అట్టిలింగత్రయమును భక్తుడు ఎల్లప్పుడు పూజించును. సమస్తమును అట్టి లింగమునందే జూచు
65 చుండవలయును. లింగమువినా ఇతర దైవముల పూజించకూడదు "సర్వత్ర లింగంమన్యేత్" ఇదియే లింగాచారము.

## ౨ సదాచారము

ధర్మార్జితేన ద్రవ్యేణ తృప్తిశ్చ కురుతేసదా
గురుజంగమ లింగానాం సదాచారః ప్రకీర్తితః॥

న్యాయార్జిత ద్రవ్యముచేత గురుజంగమ లింగముల యొక్క తృప్తి సదాజేయు చుండుటయే సదాచారము. నీతితోడ నడచుటయే సదాచారము. ఏమార్గము చేత భక్తుడుతాను సంతుష్టుడై యితరులను సంతుష్టిజేయునో అదియే సదాచార మని సూక్ష్మాగమ వచనముగలదు. దీనియందు ఎనిమిది ముఖ్యశీలములు గలవు.

౧. ఉత్పన్నశీలము - శివదీక్షనుపొంది లింగాంగియై వర్తించుట

౨. ఆచారశీలము - తనవలె తన పత్నీసుతాది బాంధవుల నందరిని శివ భక్తులగాజేసి సదాచారుల జేయుట.

3. ఉద్యోగశీలము - ఉద్యోగియై జీవించుటయే వీరశైవుని కర్తవ్యము. సత్కార్యార్జితమైన ద్రవ్యమే వీరశైవు డుపయోగించ వలెను.

౪. ఉత్కటశీలము - తనపుత్రులను వీరశైవ ధర్మాచార యుతులై భక్తిచేత ధార్మికాచరణముల యందుంచ వలెను.

౫. సంబంధశీలము - శైవమార్గములలను, భవిపాక మరియు తామసా హారములను విడువ వలెను.

౬. ప్రసన్నశీలము - భక్తుడు షడక్షర మంత్రధ్యానము నందు నిరతుడై షట్స్థల జ్ఞానమునుపొంది లింగాంగులను ప్రేమించుట.

౭. ఉత్తమశీలము - గురులింగ జంగమాదుల పూజించుట.

౮. జ్ఞానశీలము - అపేయపానము, అభక్ష్యభక్షణము విడుచుట

ఇట్టిశీలములతో కూడియుండుటయే సదాచారము. వీటి విచారము ప్రత్యేక ప్రక రణము నందు జూడ గోరుచున్నాను.

## 3 శివాచారము

శివ ఏవ పరబ్రహ్మ సర్వలోకైక కారణః
అన్యథా శరణం నాస్తి శివాచారస్య లక్షణం॥

సమస్తలోకైక కారణుండగు పరబ్రహ్మమైన శివుడొక్కడే కాక రెండవ వాడు లేడనే భావమే శివాచారమన బడును. కనుక శివునియందు మనస్సు లీనముజేసి శివసంస్కార యుతుడై జాతిభేదము లెంచకుండుటే శివాచారము.

ద్రవ్యం క్షేత్రం గృహం భాండం తృణకాష్ఠంచ పీటికాం
పాకం రసం భవం భూతం భావశుద్ధిం సుఖప్రదాం॥
మార్గం కాలం చవాక్శుద్ధిం జనశుద్ధం వరాననే॥

ఇట్టి షోడశ శుద్ధులను గ్రహించి శుచిర్భూతుడై యుండవలెను. మరియు - భవి శబ్దము, పాపశబ్దము, హింసశబ్దము, శ్వపచశబ్దము, అసత్యశబ్దము, అష్టవిధశబ్దము లను వినకుండ లింగార్చనము జేయవలయును. మరియు నిర్లోభము. నిష్ప్రయత్నము, శీలము, శాంతము, దయా, నిస్పృహత్వము, అనసూయ, దోషారోపణ శూన్యతతో ప్రయత్నపూర్వకముగా వర్తించవలెను. ఈ యేడువిధముల మనోశుద్ధినిబొంది లింగార్చనజేయ వలయును. ఇదేశివాచార ధర్మము.

## ౪ గణాచారము

స శృణోతి సదాచార శ్శివనిందాం సదా భువి
గణాచారోయ మాఖ్యాత శ్శైవ వ్రత పరాయణైః!

సదాచారుడు శివనింద వినకుండుటయే గణాచారమన బడును. శివనింద వినిన నిందితుని దండించవలయును, అథవా ఆక్షేపించ వలయును, అట్లు గాకున్న ఆ చోటువిడచి వెడలిపోవలయును.

అన్పృతం చాస్థిరం వాక్యం వంచనం పంక్తిభేదనం
ఉదాసీనం నిర్దయత్వం షడ్విధాం తర్భవిస్థితిః ॥

అసత్యము, నిలకడలేనిమాట, మోసపుచ్చుట, పంక్తిభేదము జేయుట ఇష్టముతేనిమాటాడుట, నిర్దయత్వము, ఈ ఆరు అంతర్భవులు వీటిని సద్భక్తుడైన వీరశైవుడు వదలవలెను.

అక్రోధం సత్యవచనం భవిభక్త విభేదనం
అనుగ్రహః క్షమా పాత్రద్రవ్యార్పణ విధింపరం ॥
ఏవం షడ్విధ మాచారం పరిగృహ్యా సముక్తితః
బుద్ధికౌశల్య సంపన్న శ్శివలింగే రతి శ్చరేత్॥

బుద్ధికుశల సంపన్నుడైన భక్తుడు క్రోధరహితము, యథార్థ వాక్యము, భవి భక్తవిమర్శనము, అనుగ్రహము, ఓర్పు, సత్పాత్ర దానము వీటిని యథావిధి ఆచరించవలెను. మరియు.

విశ్వాసయుక్తః పూర్ణాత్మా వర్జయేత్పంచ సూతకాన్

సూతకం జన్మమృత్యుశ్చ రజస్సూతక మేవచ
అన్నసూతక ముచ్ఛిష్టం సూతకం పంచధా భవేత్॥

అనగా భక్తుడు పంచసూతక వర్జితుడుగా నుండవలెను మరియు ౬౪ శీలముల నాచరించవలెను. ఇట్టిగుణములచే కూడినదే గణాచారము.

## ౫ భృత్యాచారము

శివభక్తజనా స్సర్వే వంద్యాః పృథివీతలే
తేషాం భృత్యోస్మి నా మిత్యేత ద్భృత్యాచార స్స ఉచ్యతే॥

భూతలమునందు గల సమస్త శివభక్తులందరు శ్రేష్ఠులేయని నమ్మి వారికి నేను భృత్యుడనని భావించునట్టిదే భృత్యాచారము. శివశరణులే పెద్దలు, తానే చిన్నయని భక్తితో వారి నాదరించుటయే భృత్యాచారము. ఇట్టి ఆచార సంపన్నుడే సజ్జనుడు. దాసత్వము, వీరదాసత్వము, భృత్యత్వము, వీరభృత్యత్వము, సమయాచారత్వము, సకలాచారత్వము, యని ఆరు సజ్జన లక్షణములు.

౧ నియమముతో అనగా దీక్షాప్రతిజ్ఞ గలవాడై గురులింగ జంగమాదులందు తనుమన ధనము లర్పించుటయే దాసత్వము.

౨ శివునియందే అనురక్తి గలిగి పరదైవ నిరాసకుడై నిరంతరము శివభక్తియందే యుండునదే వీరదాసత్వము.

3 జంగములను మహేశ్వరులను భుజింపజేసి శేష ప్రసాదమును భుజించుటయే భృత్యత్వము.

౪ భస్మాది ప్రసాదాంతము అష్టావరణసిద్ధితో గూడుకున్నవాడై దారేషణ, ధనేషణ, పుత్రేషణ, యను ఈషణాత్రయమును వర్జించి క్రియాలోపమైన ప్రాణములను సహిత మర్పించుటయే వీరభృత్యత్వము.

౫ తన సర్వ సంపత్తులు జంగముల కర్పించుటయే సమయాచారత్వము

౬ సమస్తమును శివసంబంధ స్వరూపమని స్మరించుటయే నిర్మల నిరహంకారమే సకలాచారత్వము. మరియు జాత్యాశ్రమ కులగోత్ర నామరూప క్రియారహితుడై గురురూపావస్థచేత గురుప్రత్యక్షుడయి, ఆగురువువలన చిద్ఘన మహాలింగమునుపొంది ఆలింగ సహితుడయి భక్తిజ్ఞాన వైరాగ్య పాదోదక ప్రసాద విభూతి రుద్రాక్ష మంత్రాది షట్స్థల మార్గముచేత భక్తగణములందు

పంచసూతకములు కల్పించక వారుండు స్థలమునకు పోయి తన తనుమన ధన ములను సమర్పించి వారి శేషప్రసాదమును భుజించి హస్తాంజలిబద్ధుడై ప్రత్యుత్తర మివ్వకుండునదే భృత్యాచార మనబడును.

## వీరశైవుని సామాన్య ధర్మములు

అంగలింగైక్య సంబంధా ద్వీరశైవో భవేన్నరః
జీవోంగం లింగమీశస్స్యాత్తయో రైక్యం హి సంగతిః॥

మానవుడు అంగలింగైక్య సంబంధము వలన వీరశైవుడగును. జీవుడే అంగము. శివుడేలింగము; ఈఅంగలింగైక్యమే సంయోగము (సద్గతి) యని తెలియవలెను.

యావద్భేదమతి స్తావత్సంసారో నైవ నశ్యతి
భేదబాధక మద్వైతం వీరశైవాఖ్య మంగనే॥

ఓ పార్వతీ ఎంతమట్టుకు మనోభేదము గలదో అంతవరకు సంసారమునశించదు. భేదబాధకమైన శివాద్వైతమే వీరశైవమని తెలియనగును.

సామాన్య మపివక్ష్యామి సదాచారం తు శైవినాం॥ ౯౬
యేన సర్వే ప్రపద్యంతే భక్తి మవ్యభిచారిణీం
త్రికాలం భస్మనా స్నానం లింగార్చన మనుత్తమం॥ ౯౭
జపమీశ్వర చింతా చ దయాసర్వత్ర సర్వదా
సత్యం సంతోష మాస్తిక్య మహింసా సర్వజంతుషు॥ ౯౮
హ్రీః శ్రద్ధాధ్యయనం యోగః సదా పంచాక్షరీ జపః
వ్యాఖ్యానం శివశాస్త్రస్య శ్రవణం చ తపః క్షమా॥ ౯౯ పార ౧౨

త్రికాల భస్మస్నానము. లింగార్చనము, ఈశ్వరచింతనము సర్వభూత దయాళుత్వము, సత్యము, సంతోషము, ఆస్తిక్యము. అహింసా, శ్రద్ధా, శాస్త్రాధ్యయనము, శివయోగము, సదా పంచాక్షర జపము, శివశాస్త్ర వ్యాఖ్యానము, శివకథా శ్రవణము, తపస్సు క్షమా, ఇవియే అఖండ శివభక్తి గలిగిన ప్రతిశైవుని యొక్క సామాన్య ధర్మములు. అనగా వీరశైవుడు గూడ శైవుడైనందున ఆతనికి సామాన్య ధర్మములు మరియు విశేషధర్మములు గూడ గలవు.

66 క్షమా శాంతిశ్చ సంతోషః సత్యమస్తేయ మేవచ
బ్రహ్మచర్యం మమజ్ఞానం వైరాగ్యం భస్మ సేవనం॥ ౧౦౩

సర్వసంగ నివృత్తి శ్చ దశైతాని విశేషతః
సర్వం లింగమయం ధ్యాయే జ్జగదేత చ్చరాచరం॥ ౧౦౪

క్షమా, శాంతి, సంతోషము, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, శివ జ్ఞానము, వైరాగ్యము, భస్మ సేవనము, సర్వసంగ నివృత్తి యనునవే వీర శైవునియొక్క విశేషధర్మములై యున్నవి ఈ వీరశైవుడు సమస్త చరాచర ప్రపంచమంతయు లింగమయమే యని తెలియును. మరియు

శమోదమ స్తితిక్షోపర తిశ్రద్ధా సమాధయః
షడంగాని మహాదేవి వీరశైవస్య లింగినః॥
యద్యేకే నాపి చైతేషాం విహీనో హీన ఏవ సః
అంగహీనో భవేదంగీ తేనాంగం స పతేత్ప్రువి॥

శమ- శాంతి, కామక్రోధాదులు లేకుండుట, దమ-దాంతి, బ్రహ్మచర్యాది క్లేశ మును సహించుట, తితిక్ష - సహనము; ఓర్పు - స్వభావముగా ఇతరుల మేలో ర్చుట, శ్రద్ధా - శివునియందు అతిశయభక్తి గలిగియుండుట, సమాధి - ఇంద్రియ నిగ్రహమునందు మనస్సు లెస్సగా నుంచుట. యనునవే వీరశైవునకు షడంగములు. వీటిలోనుండి ఒకఅంగమైనను లోపమైన వీరశైవుడు హీనుడగును. అంగవికలములు గల దేహివలె అతడు పతితు డగుచున్నాడు. కనుక ప్రతి వీర శైవుడు షడంగములను ఆచరింప వలెను. మరియు

సాధుష్వపి చ పాపేషు దుర్జనే సుజనేపి చ
స్వమతే విమతే మూర్ఖే పరాత్మే చాఽపకర్తరి
సర్వత్ర భావయే దేకం వీరశైవస్స ఉచ్యతే॥

సాధువులు, పాపులు, దుర్జనులు, సుజనులు, స్వమతీయులు, పరమతీయులు, మూర్ఖులు, బుద్ధిమంతులు, ఉపకారులు, అపకారులు యను తారతమ్యము నెంచక సమస్తులందు ఏక భావము నుంచువాడే వీరశైవుడని జెప్పబడినది. కనుక వీరశైవులు భేదబుద్ధిని యుంచకూడదు.

## సదాచారములు.

ఆరోగ్యజీవనము:-"శరీరమాద్యంఖలు ధర్మసాధనం" యను ఆర్యోక్తినను సరించి ప్రతిమానవుడు తనదేహమును బలపరుచుకొని ఆరోగ్యస్థితి యందుంచుకొన వల యును. ఆరోగ్యమునకు శుద్ధమైన జలము, వాయువు మరియు ఆహారము ఈ

మూడే ముఖ్య మైనవి. ఇట్టి ఆరోగ్యవస్తువులను గమనించియే వీరశైవులు తమ ఆచారమునందు శీలములను ఏర్పాటుచేసి యున్నారు. త్రికాలస్నానము, శుభ్ర జలపానము, భాండశుద్ధి ఇత్యాదులను ప్రాముఖ్యముగ గమనించి ఆచరణ యందుంచిరి తమగృహములను పరిశుభ్రపరచి వాయువును మలినముగాకుంచిరి. ఆవుపాలను త్రాగుట, ఆవులను పెంచుట, గోరక్షణ ఇత్యాది శీలములను బహు జాగ్రతగ కాపాడుచుండిరి. అభక్ష్యపానీయములను త్యజించి అహింసాతత్వమును కాపాడిరి. ఇట్లు అనేక శీలములు ఆరోగ్యమును సాధించినదనే చెప్ప వచ్చును.

ఉద్యోగము;— వీరశైవులు ఎట్టి శివజీవైక్య సాధారణ సంపన్నులైనను అదృష్ట వశాత్ పదార్థములు లభించుచున్నవని తెలిసిన వీరులుగాను "ఉద్యోగంపురుష లక్షణం" యను వాక్యోక్తిని ఘట్టిగానమ్మియున్నారు. ఇందువలననే తమసంఘము లందు నిత్యనైమిత్తికకృత్య ములుచేయుట యందు ముందంజ వేసి యున్నారు. తమ జీవితమును సాగించుటకై ఎట్టిఉద్యోగమును చేసినను తప్పులేదని భావించి అన్ని ఉద్యోగములు ఆచరణీయములనియే నమ్మిరి కనుకనే వీరశైవులందు సర్వ వర్ణముల ఉద్యోగస్థులు లభించుచున్నారు. ఉత్తమ ఉద్యోగములేకాక కనిష్ఠపు ఉద్యోగములను కూడవారివారి మేధాశక్తి ప్రకారము చేయుచున్నారు. శాస్త్ర ములభ్యసించుట, కృషివాణిజ్యములు చేయుట ఇత్యాది గౌరవ కార్యములే కాక సాంఘికమునకు సేవాచారమున కుపయోగమైన చాకలి, మంగలి, కుమ్మరి, ఇత్యాది ఉద్యోగములు చేయువారుగలరు. ఇట్టి సర్వతెగలవారు లేకున్న సంఘ ము ఇతరులకులోబడియుండును. తమయొక్క వృద్ధిని తాము జేసుకొనలేకుందురు. కనుక అట్టి ఉద్యోగములను వృద్ధిజేయుటకే అలింగాంగుల సంబంధమునువదిలిరి. తమ మతస్థులందే ఉద్యోగప్రాబల్యముగావలెననియు, లింగమతము సర్వత్రులకు లభించ వలెననియు, మరియు లింగమతము నందెట్టి కొరతలు లేకుండ వలె ననియు సౌకర్యములను కల్పించిరి. కనుక ఉద్యోగశీల మనునది వీరశైవు లందు అతిమహత్తర మైనది.

అహింస;— "అహింసా పరమోధర్మః" యనువాక్యమును పరిపాలించుటకే అభక్ష్యభక్షణీయములను ముట్టక సర్వభూత దయాళుత్వమును తమ ముఖ్యాచ రణముగా భావించిరి. వీరశైవులు "లింగంసర్వమయం జగత్" యనుశివసర్వాత్మ కత్వమును నమ్మినవారైనందున పశుహింసలను జేయుట అసంభవము. తమఉదర

పోషణార్థమేకాదు బలితర్పణాదులయందు యోగ్యమని చేయబడుచున్న హింస లనుకూడ తుచ్ఛములుగా నెంచిరి. యజ్ఞ యాగాదులను హీనముగా జూచిరి. సమస్త జడచేతన ప్రపంచము నందాత్మస్వరూప మొక్కటేయని భావించు వీర శైవుడు ఇట్టి ఘోరకృత్యములకు పాల్పడకుండును. ఈ అహింసా ధర్మమును తన కులశీల మని ఆజన్మాంతము పాలించును, ఆహారము వలన తమోగుణములు వృద్ధిబొందుచున్నవని తెలియును. హింసాత్మికాహారములు తామసగుణ జనితము లని నమ్మును.

జ్యోతిషము:— వీరశైవులు తిథివార, నక్షత్రములను, ఫలాఫలములను జూడ కుందురు. అన్నియు శివనిర్మాణములే యైనందున దుష్టవారములు తిథులెట్లు గలుగును. ఇవియన్నియు మానవుల సంకల్ప దోషములే గాని సత్యముగావని వీరశైవులు దృఢముగానమ్మెదరు. కోటిసూర్యుల ప్రకాశముగల పరశివునాశ్రయించినవానిని నక్షత్రములయొక్క ఘాతయేమి చేయుచున్నది.

అన్యవ్రతములు:— శివవ్రతమే జీవనవృత్తిగాగల వీరశైవునకు అన్యవ్రతములతో ఏమిపనిలేకుండును. త్రికాలలింగపూజ, లింగతీర్థప్రసాద భోగోపభోగమైన వానికి అన్యవ్రతలబ్ధ తీర్థప్రసాదములెట్లు రుచించును. త్రికాలములందు లింగప్రసాదము భుజింప వలయునను నేమము గలవానికి ఉపవాసము, ఏకాదశులు, కృఛ్ర చాంద్రాయణాదులతో పనియేముండును. ఈ తుచ్ఛ ఉపవాసాదుల నాచరించిన తనలింగపూజకు కొరత గలుగును, అదివీరశైవుడు సైరించ కుండును.

సామాన్యధర్మములు:— సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అక్రోధము, భూతదయ, పరస్త్రీనిర్వాంఛ ఇత్యాది సత్యగుణములనే పాలించును, దంభము, క్రోధము, అహంకారము పిశునత్వము విషయ లోలుపత్వము, కామ్యము ఇత్యాది దుష్కర్మలను పరిత్యజించును. ఇట్టి సద్గుణమండితుడే వీరశైవుడు.

మత ప్రచారము:- సద్బోధ తన ఆత్మోన్నతికే కాక ఇతరులను కూడ తరింపజేయును. కనుక తను వీరశైవమునందడగి యున్న సత్తత్వములను అన్ని తెగలవారికి అందించి బోధించి అందరిని తమ స్వరూపుల జేసుకొనుట మానవుని ముఖ్యకర్తవ్యమని వీరశైవులు నమ్మెరి. మతము సర్వత్రుల సొత్తు సర్వులు అనుభవించ వలెను అందరు శివుని తత్వములను దెలసి లింగాంగ సాయుజ్య సామ్రాజ్యము ననుభవించుటకు అధికారులేయని నమ్మె వీరశైవ

ధర్మమును సమస్తప్రాణిమాత్రులకు ముక్తిద్వారముగా పంచిపెట్టిరి. కనుక బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో యేవర్ణమువారైనను లేక యే ఇతర జాతివారైనను శివభక్తియందు రతిగలవారైన, అతనికి శివధర్మమును బోధించి, దీక్షచే శుద్ధిగావించి, అతివర్ణాశ్రమియనుగ జేసి తమ వీరశైవులలో కలుపుకొని, పిమ్మట అతనిపూర్వజన్మ నామరూపములను లెక్కింపగూడదని వీరశైవులు ఘోషాఘోషముగా చాటించిరి. ఈ మత ప్రచారమనునది కూడ వీరశైవునకు ఉర శీలములలో ఒకశీలమైయున్నది.

భవుల సాంగత్యము:— "సత్సంగత్వే నిస్సంగత్వం" యను వాక్యానుసారము సత్పురుష సహవాసము సత్ప్రవర్తననే గలిగించును. దుస్సాంగత్యము దుష్ప్రవర్తననే కల్పించును. కనుక వీరశైవులు దుష్టుల, అసత్యవాదుల, దురాత్ముల, అలింగుల సహవాసమునుండి దూరముగనుందురు. ఇట్టి ప్రవర్తనములు గలవారే భవులనబడుదురు. అట్టిభవుల సహవాసమువలన దినక్రమేణ ఆత్మయొక్క పరిశుభ్రత నష్టమగును. కనుక భవిసాంపర్కమును త్యజించుటయే వీరశైవునకొక ముఖ్యశీలమైనది.

తీర్థయాత్రలు:— పుణ్యక్షేత్రముల గురించి పోవుట, గంగాదినదులందు స్నానము గావించుట, శివేతర దేవతా ప్రసాదముల స్వీకరించుట, కామ్యకర్మములను సల్పి క్షణికసుఖము లగోరుట, "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను దృఢసంకల్పమును వదలి తన నిజలింగమునందు చిత్తచాంచల్యమును లయింపజేయలేక, దేవుడెక్కడనున్నాడో యని భూప్రదక్షిణములు చేయుట, ఇష్టలింగమును వదలి నదులను, సర్పములను, తరువులను, మనుష్యులను పూజించుట, వాటినుండి ఫలముల నాశించుట, ఇత్యాదిపాపకార్యములను కృతజ్ఞులైన వీరశైవులు హేయముగ జూచి, జగన్నిర్మాణకారకుడైన పరశివుని తమ ఆత్మయందే ధ్యానించి సర్వతీర్థములను క్షేత్రములను తమ హృదయకుహరమునందే భావించి ఎల్లెడల లింగమూర్తినే గన్గొని తమగురుదత్తలింగమునే పూజించుచు ఆనందించుచుందురు. దీని
67 వలననే మనస్సు దృఢమగును. చిత్తము ఏకత్ర యుండును. భావము స్థిరమగును. ఐక్యము లభించును. కాని దేశభ్రమణమువలన మనోభ్రమయే గలుగునని వీరశైవులు దృఢముగ తెలియుదురు. కనుక వారికి తీర్థయాత్రలు నిషిద్ధములైనవి.

అన్యదేవతార్చన నిరసనము.

శివే స్థితే సర్వదేవాధిరాజే భరద్వాజ నిర్జరైః కిం తథాన్యైః॥ సి.శి.ఉ.

ఓ భరద్వాజా! బ్రహ్మాదిదేవతలకు నిగ్రహానుగ్రహ సమర్థుడైన స్వార్చనార్పణ చింతన ధారణ శ్రవణమననాద్యాసక్త భక్త చింతామణియైన స్వప్రకాశతాశక్తివిశిష్టుడైన ఇష్టలింగ రూపుడైన సదాశివుడు పూజకుయోగ్యుడై, అర్పణకు యోగ్యుడై, అనుసంధానమునకు యోగ్యుడై, శ్రవణ మననాదులకు యోగ్యుడైయుండ మరి ఇతరదేవతలతో నేమి ప్రయోజనము? అనగా శివేతర దేవతలు పూజార్హులుగారని అర్థము. రేణుక భగవత్పాదాచార్యులవారు,-

సతీవ రమణే యస్తు శివే శక్తిం విభావయన్
తదన్యవిముఖః సోఽయం జ్ఞాతః శరణనామవాన్॥
పరిజ్ఞాతే శివే సాక్షాత్ కో వాన్య మభికాంక్షతి
నిధానే మహతి ప్రాప్తే కః కాచం యాచతేఽన్యతః॥
శివానందం సమాసాద్య కో వాన్య ముపతిష్ఠతే
గంగామృతం పరిత్యజ్య కః కాంక్షే న్మృగతృష్ణికాం॥
సంసారతిమిరచ్ఛేదే వినా శంకరభాస్కరం
ప్రభవంతి కథం దేవాః ఖద్యోతా ఇవ దేహినాం॥
సంసారార్తః శివం యాయా ద్బ్రహ్మాద్యైః కిం ఫలం సురైః
చకోర స్తృషితః పశ్యే చ్చంద్రం కిం తారకా అపి॥

సతియు తనపతియందు పాతివ్రత్య ధర్మముచేత వర్తించు నటులే శరణనామకుడైన వీరశైవుడు శివవ్రతముచేత వర్తించవలెను. అనగా శివేతర దేవతలను పూజించగూడదు; పూజించిన శివవ్రతభంగము గలుగును. మరియు దేవదేవుడైన పరశివుని స్వరూపమును తెలుసుకొని మరియొక దేవుని ఎన్నటికి కోరనేరడు. ద్రవ్యనిధిని బొందిన మనుష్యుడు గాజును యాచించుట కొరకు ఇతరుల నాశ్రయించునా? నిరతిశయమైన శివానందమును పొందినవాడు అల్పానందము నేల కాంక్షించును; శుద్ధగంగామృతమును వదలి మృగతృష్ణను ఎవడు కోరును.

శంకరుడను సూర్యుని వదలిన మిణుగురుపురుగులవలె వెలుగు దేవతలు ప్రాణుల సంసారమను కాడుచీకటి నెట్లు పోగొట్టెదరు. అందువలన సంసారమను గాఢాంధకారముచేత పీడింపబడుచున్నవాడు మహాదేవునే ఆశ్రయించవలయును

గాని బ్రహ్మాది దేవతల నాశ్రయించుట వ్యర్థము. దాహముచే పీడిత మైన చకోరపక్షియు చంద్రునే ఎగురు చూచును గాని నక్షత్రముల కాశించదు. అనగా చకోరపక్షివలె సంసారతాపముచేత పీడితుడైన మానవుడు చంద్రునంతటి శివునినే చూచునుగాని నక్షత్రములవలెయున్న మిగతదేవతలను వీక్షించకుండును. "ఆదిత్య మంబికాంవిష్ణుం గణనాథం మహేశ్వరం" యనుస్మృతి ప్రకారము సూర్య, దేవి, విష్ణు, గణపతి, మహేశ్వర యను ఈ ఐదుగురు దేవతలలో తమ మనస్సుకు వచ్చినట్లు ఏదోఒక దేవతా మూర్తిని ప్రధానముగా పూజించి మిగిలిన దేవతలను అప్రధానముగ పూజించుట విద్వాంసుల లక్షణము గాదు. సమస్తదేవతల యందు సమానబుద్ధి గలిగి ఒక్క దేవతను విశేషముగ మరియొకదేవతను గౌణముగా పూజించిన దేవతల కోపమునకు పాత్రులగుదురు. మహేశ్వరుని ఇతర దేవతలవలె భావించుట అనర్థ మునకు కారణ మగును. మహేశ్వరునకు మరియు ఇతరదేవతలకు సమానత్వమును జూపించిన దోషము వచ్చునని గ్రంథములందు స్పష్టముగా జెప్పబడినది.

అందువలన ఆపరమకారణుడైన మహేశ్వరునియందు యితరదేవతలందు సమానమైన అభేదబుద్ధినికల్పించుట వివేకుల కర్తవ్యముగాదు. భక్తులకు చింతా మణిస్వరూపుడైన పరశివుడొక్కడే భక్తులఇష్టార్థమును పూర్తిజేయ సంసిద్ధుడై యుండగ మరితరులను ఎందువలన సేవించ వలెను.

ఏకమేవాద్వితీయం సత్యం జ్ఞాన మానందం

ఇత్యాది. శృతివచన ప్రకారము తనకు సజాతీయ మైన మరియొక పదార్థము లేదు. తనకు విజాతీయమైన మరియొక పదార్థములేదు. వృక్షము నందు పత్ర శాఖాదులు గలిగి యున్నట్లు పరశివ బ్రహ్మమందు స్వగతమైనది యేది ఒకటి లేదను నట్లు అగును. అటులైన ఈప్రత్యక్ష రూపమును గల ఈజగత్తు ఎక్కడి నుండి గలిగెను. విచారించిన ఆ పరశివుని యందు ఒక చిత్ర శక్తిగలదని సిద్ధమ గును అదియే అవిద్యాశక్తి అద్వైత వాదీయుల ప్రకారము మిథ్యా భూతమైన దిగాదు. ఇదిపరశివుని శక్తిసామ్రాజ్యము. ఈ సర్వశక్తిమత్వము ఈశ్వరునందు ఆరోపింపకున్న శక్తికి స్థానాంతరమేలేదు. స్థానమే లేకున్న కల్పన ఎట్లగును. మరియు ఆపరశివుడు ఇష్టార్థములను ఎట్లు ఎవ్వరికివ్వ గలడు? కనుక అవిద్యా శక్తికి పరమ శివుడే స్థానభూతుడనియు తెలియ నగును.

చింతామణౌ స్వరూపేణ నకించి దుపలభ్యతే॥
అథచా భిమతం సూతే బ్రహ్మైవా సర్వశక్తి కం॥

చింతామణిని స్పృశించిన ఫలము లభింపదు కానిదానిని పవిత్రస్థానము నందుంచి ఫలముల సంకల్పముచేసిన ఫలముల నిచ్చునట్లు పరశివుడు సర్వ ఫలముల నిచ్చు శక్తిగల వాడగును. మరియు

పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ॥

యను శ్రుతివలన శివుని శక్తియు యథార్థమైనది. శివస్వరూపమైనది. యని గోచరించు చున్నది. కనుక నానదేవతలను ఉపాసన చేయుగూడదు. కొందరు వీరశైవులలో మూఢులై దేవపూజ స్తుతి మొదలైన వాటిని, నూతనవ్రతములు యాచన చేయుట వారికగలదు. అయిన అది వీరశైవులకు విరోధమైనదియగును.

విహాయ సాంబం శివం యజాతే దేవ తాంతరం
తేనుహా ఘోర నరకే పాతాత్యేవ న సంశయః॥

యని పారాశర పురాణము నందు అన్యదేవతార్చనము పాపమైన నరకము గలుగ జేయునని చెప్ప బడినది.

యస్తు లింగార్చనం త్యక్త్వా దేవమన్యత్ర పూజయేత్
రత్నం విహాయ మూఢాత్మా యథా రౌప్య ముపేక్షయేత్॥ శి॥ గీ॥

ఎవడు లింగార్చనము విడచి అన్య దేవతలను పూజించు చున్నాడో వాడు రత్నములవిడిచి రౌప్యవస్తువుల కోరునట్టి మూఢాత్ముడని తెలియ వలయును.

శివపూజాపరో భూత్వా యోన్యం దేవ మనుస్మరేత్
అష్టావింశతి కోట్యశ్చ నరకం యాతి సధృవం॥ బ్రహ్మాగీతయందు
లింగార్చనైక శరణో యోన్య దేవం తు వందతే
నాయకం నరకం గత్వా తిర్యగ్ యోనిషు జాయతే॥ లింగసారె.

లింగార్చన పరుడు అన్యదేవతల పూజించిన నరకమునందు అష్టకోటి కాలము వరకు యుండుననియు మరియు ఎదయో యొక పశువు యోనియందు జన్మించునియు అనేక వాక్యములు గలవు.

లింగ మధ్యే జగత్సర్వం త్రైలోక్యం సచరాచరం లింగ బాహ్యాత్పరంనాస్తి॥ యనువచనాను సారము లింగమునందే సమస్త దేవతాగణము గలదు కావున లింగమును వదలి దేవియు వేరులేదు గనుక వీరశైవులు దేవీ పూజాదులు

మరియు ఇతరదేవతా పూజాదులు జేయగూడదు. ఇట్లు అన్యదేవతల యాచించిన కామధేనువును వదలి అశక్యమైన ఒంటెపిల్ల పాలు పితుకుటకాశించి నట్లగును. మహేశ్వరుని కన్న మరి యేదేవతయు, శ్రేష్ఠముగాదనియు, మహేశ్వరుని పూజ వలన సర్వదేవతల పూజ యగుననియు, మహేశ్వరునకు ఎవరు సమానులు లేరనియు లింగ పురాణమునందు, బ్రహ్మ గీతయందు, శ్రీమహా వ్యాస మహా ఋషులు స్పష్టముగా చెప్పియున్నారు. ఉదాహరణార్థముగా

" పూజితే దేవదేవేశే పురాణే సర్వకారణే
పూజితా దేవతాః సర్వా ఇతి వేదాంత నిశ్చయః॥
త్వం విశ్వహర్తా తవనాస్తికర్తా త్వం విశ్వభర్తా తవనాస్తి భర్తా॥
మాయాబలేనైవ హరిం శివేన సమానమాహుః పురుషాధమాశ్చ
మోహేన కేచిన్మమ సామ్యమాహుర్మాయాతు శైవి ఖలు దుస్తరేయం॥

ఈశ్వరోపాసనమే శ్రేష్ఠము. ఇతర దేవతోపాసనము జేయుట పురుషాధముల మార్గమని స్పష్ట మగుచున్నది.

## మూర్త్యుపాసనా నిషేధము

వీరశైవులు కరచరణాద్యవయవములు గల మూర్తిమంతములైన శివేతర దేవతలను పూజించ కుందురు. ఏలననగా ఆ దేవతలందు బ్రహ్మత్వము లేదు. ఈ విషయమునందు యోగవాసిష్ఠము యొక్క వాక్యములు ప్రమాణములైనవి.

శృణు బ్రహ్మ విదాం శ్రేష్ఠ దేవార్చన ముత్తమమ్
న దేవః పుండరీకాక్షో న చ దేవ స్త్రిలోచనః॥
న దేహో దేవ ఇత్యుక్తో న దేవ శ్చిత్తరూపకః
అకృత్రిమ మనాద్యంతం దేవనం దేవ ఉచ్యతే।
ఆకారాది పరిచ్ఛిన్నే మితే వస్తుని తత్కుతః
అకృత్రిమమనాద్యంతం దేవనం చిచ్ఛివం విదుః॥
అజ్ఞాత శివతత్త్వానా మాకారాద్యర్చనం కృతం
68 యోజనాధ్వ న్య శక్తస్య క్రోశాధ్వా పరికల్ప్యతే।

బ్రహ్మవేత్తలందు అగ్రగణ్యుడవైన ఓ వశిష్ఠా! ఉత్తమమైన దేవతార్చనము వివరించెద వినుము. పుండరీకాక్షుడయిన విష్ణువు దేవుడుగాడు. త్రిలోచనుడైన

సాకారమూర్తియు దేవుడుగాడు, దేవరూపము గలవాడు దేవుడుగాడు, సత్స్వరూపము గలవాడు దేవుడుగాడు, అకృత్రిముడు అనగా మనుష్యులచే చేయబడనివాడు, అనాద్యనంతుడు అనగా ఆది మధ్యాంత రహితుడు, అయిన దేవుడే దేవుడనబడును. ఆకారాదులచే పరిచ్ఛిన్నుడయి వస్తుపరిమితి గల దేవుడు దేవుడెట్లగును. కనుక అకృత్రిముడైన, ఆదిమధ్యాంత రహితుడైన దేవుడే శివుడని తెలియును. ఆకార దేవతార్చనము శివతత్త్వము దెలియని మందబుద్ధులైన అజ్ఞానులకొరకు చెప్పబడినదేకాని ఉత్తమాధికారులకు గాదు యని ఈశ్వరుడు వశిష్ఠుని గురించి బోధించెను.

దీనిచే దెలియునదేమనగా మూర్తి పూజ జేయుగూడదు. ఆకారాదులు గల దేవతలను పూజించగూడదు. ఆకార శూన్యుడయిన శివుడే లింగరూపముచే పూజనీయుడు. అందుకు సిద్ధాంతాగమము నందు;-

ప్రతిమాకార శూన్యస్య లింగస్య పరమాత్మనః
ప్రతిమాకార దేవానాం సాదృశ్యం కథ మిష్యతే॥

లింగము ప్రతిమాకారము గాదు. కనుక అది పరమాత్మ స్వరూపమైనది. అనగా లింగమునకు కరచరణాద్యవయవములు లేవు. కనుక అట్టి లింగమునకు ప్రతిమాకారముగల శివేతర దేవతల మూర్తులు సమానములగునా యని సిద్ధాంతాగమమునందు జెప్పబడినందున మూర్తిపూజ నిరసింపబడినది.

ప్రతిమాకారము చేత పరిచ్ఛిన్నులయిన దేవతలు బ్రహ్మరూపులుగారు. శివలింగమునకు ఆకారము లేకున్నందున విష్ణ్వాది దేవతలకు ఆకారము గలిగినందున శివలింగమే బ్రహ్మమని చెప్పబడినది. కనుక శివలింగమునకు బ్రహ్మత్వమున్ను ఉపాస్యత్వమున్ను అవశ్యముగా స్వీకరింప బడుచున్నది. ఇదియే శృతిసమ్మతము. మరియు త్రిశూలచంద్ర కలాధారియైన పరమాత్మ లీలావిగ్రహమునకు కూడ బ్రహ్మత్వము లేదు. ఉపాస్యత్వము లేదు. అది వీరశైవునకు ఉపాస్యముగాదు. చంద్రకలాది విశిష్ట ఘోరమూర్తియు ఆపరమాత్ముని అఘోరమాయాశక్తిచేత పరికల్పితమైనందున, సంసారమునందు బడియున్నది. అందువలన ముముక్షువులైన వీరశైవులకు ఉపాస్యముగాదు. తానేబద్ధుడైన తర్వాత ఇతరులను నిర్వహించుటెట్లు? ఇట్టి ఘోరమూర్తిని ఆశ్రయించినట్లయిన మనుష్యుడు రాయిగట్టుకొని సముద్రమునందు మునిగి పోవునట్లు సంసార సముద్రమును ఎన్నటికి దాటనేరడు.

"హృత్పుండరీకం విరజం విశుద్ధం" యని ఉపక్రమించి "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం" యను పర్యంతము ఉపనిషత్తు యొక్క వాక్యములచేత అంతర్లింగమునకు త్రిలోచన చంద్రకలా ధారణ మొదలయిన ఘోరమూర్తి యొక్క స్వరూపము చెప్పబడి యున్నది. అయినను వీరశైవోత్తమాధి కారికి చెప్పిన వాక్యములు గావు. మరియు ఆనీల కంఠత్వాది స్వరూపము స్వాభావికము గూడ కాదు. అధోమాయా కల్పిత మైనది. అందువలననే రేణుక భగవత్పాదాచార్యులు;-

నిష్కలంకం నిరాకారం పరబ్రహ్మ శివాభిదం
నిధ్యాతు మసమర్థోఽపి తద్విభూతిం విభావయేత్॥

నిష్కలంకుడు, నిరాకారుడు, అయిన పరశివనామక పరబ్రహ్మ వస్తువును ధ్యానముజేయ అసమర్థుడైన వాడు ఆ శివుని చంద్రకలాది విశిష్టమూర్తి స్వరూపమును లింగమునందు కల్పించి ఉపాసించ వలయునని చెప్పియున్నారు. చంద్రకలాది విశిష్టరూపము సంసారబంధమైనను స్థూలారుంధతి న్యాయముగ కనిష్ఠాధికారికి కించిదుపయుక్త మగునని చెప్పబడినదే కాని ఉత్తమాధి కారియైన వీరశైవునకు గాదు.

## విగ్రహారాధన నిషేధము

"నిష్కలః సకలః శంభుఃలింగమూర్తి ర్విరాజతే" యను ఆగమవచనాను సారము, పరశివుడు నిష్కలుడు సకలుడయి యున్నాడు. ఇటులే మాధవా చార్యులవారు సూతసంహితా వ్యాఖ్యానమునందు, "ద్వివిధం హి పారమేశ్వరం రూపం నిష్కలం సకలం చేతి" యని వక్కాణించి యున్నారు అందువలన పర శివుడు నిష్కల రూపుడై లింగమందును సకలాత్మకుడై విగ్రహ మందును పూజించబడు చున్నాడు. శివేతర దేవతలు పరబ్రహ్మత్వము లేనివారైనందున నిష్కల స్వరూపులు కారు. వారికి లింగరూపత్వము సిద్ధించదు. అందువలన కేవల విగ్రహమునందే పూజింపబడుచున్నారు. ఇక కొందరు శివునికూడ ఉమా మహేశ్వరాది విగ్రహములందు పూజించు చున్నారు. అయినను "లింగరూపి ణం మాం సంపూజ్య చింతయంతి యోగినః సిద్ధాః" యను జాబాలోప నిష ద్వచన ప్రకారము లింగమునందు శివుని పూజించుటయే పూర్ణార్చనమని చెప్ప బడు చున్నది. అగ్నిపురాణము ౧౧౫ వ అధ్యాయమునందు;-

"పూజో్య హరస్తు సర్వత్ర లింగే పూర్ణార్చనం భవేత్"

యని ప్రతిపాదింప బడినది. శ్రీగురు నిర్దిష్ట ప్రకారము వీరశైవుడు స్వేష్టలింగ మునందు పరశివుని యథార్థమైన నిష్కల స్వరూపమును అనులక్షించియే అనుసంధానార్చనాదులను చేయును. కనుక కరచరణాద్యవయవ విశిష్ట రూప ముగల కేవల సగుణాత్మక లీలావిగ్రహములందు శివుని ఆరాధించుట కన్నను ఆ పరమాత్ముని నిష్కల స్వరూప ద్యోతకమైన లింగమును పూజించుటయే సర్వోత్తమమై యున్నది

తం త్యక్త్వా తాదృశం దేవం యస్సేవేతాన్య దేవతామ్
స హి భాగీరథీంత్యక్త్వాకాంక్షతే మృగతృష్ణికామ్. పద్మ॥శి॥గీ॥౧-౩౦

అలాటి శంకరుని వదలి యెవడితర దేవతల నారాధించునో వాడు గంగా మహా నదిని వదలి ఎండమావుల గోరువాడగును.

ఇష్టలింగం పరిత్యాజ్య అన్యదైవ ముపాసతే
ప్రసాదం నిష్ఫలం చైవ రౌరవం నరకం వ్రజేత్॥ ౨ వీరశైవా॥ప్ర॥
శివ మేవ పరిత్యాజ్య అన్యదైవ ముపాసతే
తృషితో జాహ్నవీతీరే కూపం ఖనతి దుర్మతిః॥ ౬
అన్యదైవ నమస్కార మన్యదైవస్య పూజనం
అన్యదైవ జపం స్తోత్రం నరకే కాలమక్షయం॥ ౭

శివలింగమును విడచి అన్యదేవతారాధనము జేయుట బుద్ధిమాలిన తనమనియు నరకమునకు హేతువనియు జెప్పబడినందున శివేతర దేవతల పూజింప గూడదు. యని సిద్ధమగుచున్నది.

భవి

భవబంధన మస్యాస్తి భవినామః ప్రవర్తతే
తద్భవిస్యాచ్ఛరీరం చ సుక్లశోణిత సంయుతం॥

అతనికి జననమరణ బంధమున్నందున భవి యనబడును. ఈ భవి శరీరము రేతో రక్తములతో గూడుకొని యున్నది.

మద్యపానీ మాంసభక్షీ చాన్యదైవస్య పూజకః
అలింగీ చమురాచారీ పంచైతే భవిన స్సృతాః॥

మద్య పానము జేయువాడును మాంసము భక్షించు వాడును శివేతర దేవ తార్చన జేయు వాడును లింగధారణ లేనివాడును శాస్త్ర విరుద్ధాచార సంపన్నుడును యీ ఐదుగురు భవులని చెప్పబడుదురు.

భవి శబ్దము భూ (పుట్టు) ధాతువువలన పుట్టియున్నది. భవ అనగా పుట్టుట. భవము గలవాడే భవి. పుట్టుక కలవానికి మరణము కూడకలదు. అందువలన జనన మరణములు గలవాడే భవి యనబడును. అర్థాత్ పుట్టు చావులుగల దేహమే తానని తెలియు వారందరు భవులని గణింప బడుదురు. సమస్త శరీరములందు లింగము గలిగిన మాత్రముననే లింగవంతులు కా జాలరు. ఎవరు సద్గురుకటాక్ష వీక్షణముచేత లింగస్వరూపమును తెలుసుకొని తత్తేజోమయ లింగమును ధరించెదరో అనగా లింగమే తన స్వరూపమని అను భవజ్ఞులై యుందురో వారే లింగవంతులు. యితరులు భవులనబడుదురు.

"లింగధారణ మాత్రేణ శివయేవ నసంశయః"

అను ఆగమోక్తి ప్రకారము అంగమునందు లింగము గలిగిన మాత్రముననే సాక్షాత్ శివుడే యని నిస్సంశయముగ చెప్పబడినను అంగముపైన లింగము కట్టిన మాత్రముననే లింగాంగ సమరసము గలిగి శివుడు కానేరడు. సద్గురు కృపవలన లింగ స్వరూపమును తెలుసుకొని అహంకార మమ కారములను విడచి భ్రమర కీటకన్యాయమువలె సర్వవ్యాపక సర్వజ్ఞ మూర్తియయిన లింగ మును ఆశ్రయించి తానే లింగమవువరకు కేవల బాహ్యలింగధారణ మాత్ర మునసే లింగవంతులు కానేరరు.

"అంగమాత్మాశివో లింగం" యను ఆగమ వచన ప్రకారము అంగ మనగా జీవాత్ముడు లింగమనగా శివుడని తెలియబడును. కనుక ఆత్మయందు శివస్వరూపము స్థిరమవుటయే లింగధారణము. ఈ ప్రకారము అంగమునందు లింగము గలవారే లింగవంతులు. తదితరులే భవులు. మరియు

అనృతంచాస్థిరం వాక్యం వంచనం పంక్తిభేదనం
ఉదాసీనం నిర్దయత్వం మద్విదాంతర్భవిస్థితిః॥ వీరశైవాచార ప్రదీపిక.

అసత్యము, నిలుకడలేని మాట, మోసపుచ్చుట, పంక్తిభేదము, ఇష్టము
69 లేనిమాట, నిర్దయత, ఈ ఆరు అంతర్భవి లక్షణములు కనుక యీ లక్షణములు కలవాడే భవి యనబడును. యిట్టి దుర్లక్షణయుక్త మాన

వుల సహవాసమే భవిదర్శన మనబడును. కనుక వీరు త్యాజ్యులనిఅభిప్రాయము.

శివజ్ఞాన శివధ్యాన శివపూజా తపః ఫలం
నిష్ఫలం యాంతి దేవేశి భవిసంసర్గ కారణాత్॥

అను ఆగమ వచనాను సారము శివభక్తుడు (వీరశైవుడు) భవిజన సంఘము చేత తన జ్ఞాన, ధ్యాన, పూజా, తపాదులను నిష్ఫలము కావించు కొనునని చెప్పబడినది.

శరీరేంద్రియాదులే భవులు.

౧ వీటిలో నేను నాదను అహంకార మమకారములను విడుచుటయే భవులను ముట్టకుండుట.

౨ కామ క్రోధ లోభ మోహ మద మత్సరములను నవియే భవులు. వీటి దిక్కునకు తన వృత్తిని పోకుండ ఉంచుటయే భవులను చూడకుండుట.

3 మధు మాంసాది తామసాహారములను, అతిరుచి గల రాజసాహారములను అతిశయ ఆహారములను, తినుటచే కామాది వికారములు గలిగి తన స్వరూప స్థితికి మరుపు గలుగును. ఇందుచే నిద్ర, ఆలస్యాదులు, కామాది వికారములు గలుగకుండ నియమిత భోజనమే భవులకన్నమిడకుండుట.

౪ శరీరేంద్రియాదుల నిత్య క్రియలు నావి యనుటయే భవులతో సహవాసము జేయుట. కారణ ఆయా కార్యములను ఆయా ఇంద్రియాదులు చేయునే కాని నేను చేయను. వాటికి నేను సాక్షిమాత్రుడనై యుందును. అథవా సర్వ కార్యములను శివుడే చేయును. నేను కర్తను గానని తెలిసి వర్తించుటయే భవులతో వ్యవహరింప కుండ ఉండుట.

ఇట్లు అంతరంగ భవులను నాశము జేయుటయే అభ్యాసము. బహిరంగ భవులను విడుచుట యేమి గొప్ప?

౧ అరిషడ్వర్గమను ఆరు కుక్కలు మొరుగు చున్నవి. భూ స్త్రీ ద్రవ్యాదులను నక్కలు కూయు చున్నవి. క్షుధ తృష్ణ నిద్ర ఆలస్యములను పందులు చుట్టి యున్నవి. సప్త వ్యసనములను పిల్లులు చీల్చు చున్నవి. పంచేంద్రియములను పంచవర్ణములు గల పులి తనను మ్రింగు చున్నది. రక్తమాంసాది సప్త ధాతువులను మాదుగులు ముట్టి యున్నారు. ఇట్టి తనుమనసములకు చెందిన అవగుణములను భవిని విడువక బహిర్భవుల విడచిన ఎవరు మెత్తురయ్యా సిద్ధేశ్వరా!

౨ అంతరంగ విచారమును తెలియకయే పాడు సంకల్పముల చేత బహిరంగ భవులను విడచి ముక్తి పొందుదు మను యుక్తివాదులకు బంధనములు వదుల లేదు. జననమరణములు వదలలేదు. మాయా మోహము తగ్గ లేదు. వీరి యుక్తి పుట్టలోని పామును చంపెదనని పుట్టపై కొట్టు మూఢుని వలె ఆయె. చూడు అఖండేశ్వరా!

బహిరంగ భవులను కూడ వదలుటశక్యము. ఏలనన భూమి యందు పుట్టిన సర్వ ఉద్భిజములు భవులు. అరణ్యములందు గల సింహ శార్దూలాది మృగజాతులు, పశుపక్ష్యాది క్రిమికీటకాదులు, భవులు. మనుష్యులు తిను సర్వపదార్థములు భవులు. అందు వలన ఎన్నటికైనను భవుల సంగము తప్పదు. పృథివ్యప్తేజో వాయురాకాశములు కూడ భవులు. ఏలనన వీటియందు ప్రత్యేకముగా ౭౧ లక్ష జీవరాసులు జన్మించి లయించు చున్నవి. ఈపంచ మహాభూతముల విడువక పోయిన భవిసంగము తప్పదు. వీటిని వదలుట యెవరికిని సాధ్యము గాదు. అనంతకోటి ప్రజలుగల పరమ పవిత్రుడైన పరశివుని యందు భవులు గలుగరు.

"సర్వమిదం లింగమయం" అనునట్లు వీరశైవునిదృష్టి యందు సర్వము లింగ స్వరూపము గానే తోచును. కాని అన్యథా తోచదు. "సర్వత్రేశ్వర తాదాత్మ్యం వీర శైవస్య లక్షణం॥" అను ఆగమ వచనాను సారము వీర శైవుడు సర్వమును ఈశ్వర స్వరూపమనియే తలచును. విరక్తి యనగా సర్వ వస్తువులందు గల మమతను విడచుట. వస్తువులందు గల భవితనమును విడచుట కాని వస్తువులనే విడచుట అసాధ్యము.

సారాంశమేమనగా: మద్యపానులు, మాంసభక్షకులు, అన్యదేవతార్చకులు, అలింగులు, దురాచారులు, అనృత వాదులు, మోసగాండ్రు, నిర్దయులు ఇత్యాదులే భవులు. ఇట్టి దుష్టుల సహవాసముచేత సద్భక్తులు తమ సద్గుణముల విడచి దుర్గుణముల సంపాదించు కొందురని, భవులసహవాసము, సహభోజనము వర్జింప వలయునని ఉపదేశింప బడినది. కావున దురాచారులనే కాక దురాచారములను కూడ త్యజించ వలెను. దుస్సాంగత్యముచే దుర్గుణములవశ్యముగా చేకూరు నను ఆర్యోక్తి సుప్రసిద్ధమైనది. కావున భవులను విడచుటయే న్యాయమని సిద్ధాంతమగుచున్నది

# అర్ధశిఖా (జుట్టు) ధారణ నిషేధము.

వీరశైవులు సామాన్యముగా పూర్ణశిఖా (జటా) ధారణమైనను లేకున్న పూర్ణముగా ముండనమైనను, జేసుకొందురు. కాని అర్ధశిఖా ధారణము (జుట్టు) మాత్రము నిషేధింతురు. ఈ అర్ధశిఖా (గోవుపాదమంత వెంట్రుకలుంచుట) ప్రాకృత బ్రాహ్మణ లక్షణమైనందున మరియు కర్మజేయువారల చిహ్నమైనందున శివదీక్షా సంస్కారులగుటవీరశైవులు దానిని అంగీకరించరు. మోక్షార్థియైన ప్రాకృత యతికూడ ఈ శిఖాసూత్రములను ఆచరించడు. కనుక వీరశైవమార్గ నిరతులైన ముముక్షువులకు శిఖాసూత్రము లుండకూడదు.

వీరశైవస్య భక్తానాం శిరోముండన ముత్తమం
శిరః కేశ సమాపూర్ణా మథవర్తన మాచరేత్॥ వీ. శై. ప్ర॥
అర్ధముండీ భవేద్యస్య పూర్వపుణ్యం వినశ్యతి
ఇహం నాస్తి పరం నాస్తి నాస్తి నాస్తి వరాననే॥

వీరశైవునకు శిరోముండనమే ఉత్తమము. లేకున్న పూర్ణముగా వెంట్రుక లుండుటమంచిది. సగము శిరము కొరగబడిన పూర్వార్జిత పుణ్యమునశించును.

వీరశైవ మహాదీక్షాం ప్రపన్నః శ్రుతి కోవిదః
నోధారయేత్కుటింబీసః శిఖాం ప్రాకృత విప్రవత్॥ వీరాగమే॥
శిఖా సూత్ర విహీనాశ్చ పంచసూతక వర్జితాః
జటినో ముండినో భూత్వా వర్తంతే మహిమాన్వితాః
జ్ఞానమేవ శిఖాతేషాం శివసూత్రం చ పావనం
సూత్రం మదాత్మకం ప్రాణ మిష్టలింగం మహేశ్వరి॥ వాతులాగమే॥

జుట్టు జనివారము మరియు పంచసూతకము లేనివారు జటాధారులై లేక పూర్ణముండనము గలవారై భూమిపై సంచరింతురు. వారికి జ్ఞానమే శిఖా మరియు శివసూత్రమే పావనకరమైనది. వారు ఇష్ట ప్రాణ లింగాత్మక సూత్ర ధారులైయుండవలెను. కనుక జుట్టు నిషేధింప బడుచున్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి శ్రీవీర శైవ సిద్ధాంత శిరోమణి యందు పంచాచారములను
ఎనిమిదవ ప్రకరణము సమాప్తము.

ఓం
శ్రీశివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి
# లింగాంగ సామరస్యము.

## తొమ్మిదవ ప్రకరణము.

## నేనెవరు? (అహం ఆత్మా)

నిరాకారం నిరాలంబం నిర్మలం నిర్వికల్పకమ్
నిర్గుణం నిశ్చలం నిత్యం పరాత్పరపదం గురుః॥

నేనని తెలుసుకొనియున్న ఈ స్థూలదేహము యొక్క స్వరూపమును మొదలు తెలుసుకొన వలయును. తల్లిదండ్రులు భుజించిన అన్నముచేత క్రమక్రమముగా అయిన తండ్రి వీర్యము మరియు తల్లి రక్తము వీరుభయుల సంపర్క కాలము నందు కూడి, తల్లిగర్భము నందు నిండి తల్లిరక్తమునుండి రక్తమాంస చర్మములు, తండ్రి రేతస్సు నుండి అస్థి మజ్జాదులు అయి దినక్రమేణ పెరిగి నవ మాసములు నిండిన తరువాత తల్లిగర్భమునుండి వెడలివచ్చి, పాలు మొదలైన అన్నముచేత రక్షణమై, ధర్మ అర్థ కామ మోక్షములను చతుర్విధపురుషార్థములను సంపాదించుటకు తనకు సాధనము గలదియై మరణాంతరము అన్నరూపమైన భూమియందు లయమగు దేహము స్థూలదేహమనబడును. ఇది కేవలము అన్నము వలననే యుండునది కనుక దీనిని అన్నమయ కోశమనియెదరు. ఈ స్థూల దేహము నాకు అన్యమైనది. కనుక యీ స్థూలదేహము నేనుకాను.

దేహము పంచభూతములచేత గలిగినది కనుక ఇది జడపదార్థము. నిద్ర మరణాద్యవస్థలయందు అన్యపదార్థములను తెలియజాలదు. నేను తెలియువాడను కనుక చేతనుడను ఈ జడమైన దేహము నాకు భిన్నమైనది. కనుక ఈ జడదేహము నేనుకాను.

దేహము స్వతః జడమైనను ప్రాణాది వాయువుల శక్తిచేత గమనాది
70 వ్యవహారము గలిగిన దాయెను. ప్రాణముండు వరకు సమస్త వ్యవహారములు నడచును. తర్వాత దేహము కట్టెవలె పడియుండును యేవస్తువునందు నాదియను అభిమానము గలదో ఆవస్తువుయొక్క సుఖదుఃఖములు కూడ తనకు యున్నట్లే

తోచును దేహముయొక్క సుఖదుఃఖములు తనకున్నను నిద్రయందు దేహము యొక్క సుఖదుఃఖము తనకు కావలసియుండును. కాని నిద్రయందు ఈ స్థూల దేహము తనకు తెలువదు. అప్పుడు ఈ దేహమే నేను నాదియను అభిమానము తనకు యుండదు. అందువలన దేహము యొక్క దుఃఖము నిద్రయందు తనకు కాదు. కావున అభిమానమే దుఃఖము నిరభిమానమే సుఖమని తెలియవలెను. ఈ దేహమునందు నేను నాదియను అభిమానము కలిగి యున్నంతవరకు కోటి జన్మములలో నైనను తపస్సువలన తన నిజస్వరూపము తెలియదు. మరియు నిజానందము ప్రాప్తించదు. అనేక దోషములుత్పన్న మగుచుండును

పుట్టుట పెరుగుట జీర్ణించుట చచ్చుట ఇవే దేహధర్మములు ఈ స్థూల దేహము తనది కానందున యీ జనన మరణములు తనవికావు. ఇవేకాక ౧ జాతి (మనుష్య, పశు, పక్ష్యాదులు) ౨ వర్ణ (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర, 3 ఆశ్రమ (బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ, సన్యాసి) ౪ కుల (కురుబ, మొదలైనవి) ౫ గోత్ర (వీర, నంది మొదలైనవి) ౬ నామ (శంకర భీమ రామ, ఇత్యాది) మొదలగు షడ్భ్రమలు ఈ దేహమునకు సంబంధించి యున్నవి. అందువలన ఈ జాతి వర్ణాశ్రమాదులు కూడ నాకు గలుగవు. ఇట్లు తండ్రి, తల్లి, కొడుకు, గురువు, శిష్యుడు, స్వామి, సేవకుడు, బంధుబలగము మను సంబంధము దేహమునకే యున్నది. కనుక ఇట్టి సంబంధము నాకు లేదు. ఇది యంతయు భ్రాంతిమయ మైనది.

నేతి నేతీతి నేతీతి శేషితం యత్పరం పదం
నిరాకర్తు మశక్యత్వాత్తదస్మీతి సుఖీభవేత్॥

అను వాతూలాగమ వచనప్రకారము స్థూల దేహమునకు చెప్పిన ప్రకారము ఇది నేనుకాను ఇది నేనుకాను యని ప్రతివస్తువును విచారించుచు అంతమున యేది శ్రేష్ఠ పదమున నిలుచునో దేనిని నిరాకరించుటకు అశక్యమో ఆవస్తువే నేనని తెలిసి సుఖ గావలయును.

ఏదియో ఒకరిని ప్రసంగ కాలమునందు చేయి, కాలు, కన్ను, చెవి మొదలయిన వాటిలో యేదియో వకటి పోయినను చింతలేదు. కాని ప్రాణము మాత్రము పోగూడదనెదరు. ఇంద్రియముల కన్న అధికప్రేమ ప్రాణమునందు కలదు. ఇవి నన్ను సంబంధించినవి. ఈ యింద్రియములు నాశమైనను నేను

అటులే నిలచి యున్నందున ఈ ఇంద్రియములు నేనుకాను వాటికి అన్యుడను కారణ జడమైన ఇంద్రియము నేనుకాను.

౫ కర్మేంద్రియములు, వాక్కు, పాణి, పాద, పాయు (గుద) ఉపస్థ, (గుహ్య) ౫ జ్ఞానేంద్రియములు త్వక్చక్షు శ్రోత్రి జిహ్వ ఘ్రాణేంద్రియములు ఈ కర్మజ్ఞానేంద్రియముల కార్యములు। ఆయా ఇంద్రియములే చేయు చుండును. ఆ కార్యములు నావి కావు.

రాత్రి నిద్రావస్థయందు ప్రాణవాయువు జాగ్రత్తగా యున్ననూ పైని ఆభరణములను దోరుడు తస్కరించు చుండగ నేను అతనిని నిర్బంధించను. మరియు ఏ స్నేహితులు వచ్చినను సన్మానించను మరియు వానిని తెలుసుకొనను కావున ప్రాణము జడమైనది. నేను చేతనుడనై యుండిన ఆ ప్రాణము నేనుకాను.

సంకల్ప వికల్పములు మనస్సుయొక్క ధర్మములు, కామ, క్రోధ, లోభ మోహ, మద, మత్సరములు మనస్సుయొక్క వికారములు, సుఖ దుఃఖములు మనస్సునకు గలవు. జాగరణ స్వప్నముల యందు మనస్సు సంచరించు చున్నందున అట్టి కాలములలో దుఃఖము తోచుచున్నది. నిద్రయందు మనస్సు లేనందున అప్పుడు దుఃఖము కలుగదు. దుఃఖము కామాది వికారములచే పుట్టును. మరియు నిద్రయందు నాకు దుఃఖము లేనందున ఆ దుఃఖము మనో ధర్మముగాని అది నా ధర్మము కాదు.

ఇది అదియను తెలియునదియే బుద్ధి. అది మందతనమును చురుకు తనమును గలిగినది. నా బుద్ధిమందమైనది. చురుకైనది యనిన - బుద్ధియొక్క మంద చురుకు దనములను స్వరూపములను నేను తెలియు చున్నాను. కనుక బుద్ధియు నేనుకాను.

కర్మేంద్రియము ఐదు, జ్ఞానేంద్రియము ఐదు, ప్రాణములైదు ప్రాణాపానోదాన సమాన వ్యాన) మనో బుద్ధులను రెండు అంతఃకరణములు గలిగిన ఈ ౧౭ తత్వములతో కూడినదే సూక్ష్మ శరీరము. ఇదియే లింగదేహము భోగాంగము. దీనియందే ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయమను 3 కోశములు గలవు. కనుక ఈ సూక్ష్మ శరీరమున్ను ఈ సూక్ష్మశరీర ధర్మములున్నూ నేనుకాను.

ఈ సూక్ష్మ శరీరము, మరణ, మూర్ఛా, నిద్ర, ప్రళయ. అజ్ఞాన, ములను ఈగి అవస్థలయందు తనకు కారణమైన అవిద్యయందు (కారణ శరీర మునందు) అడగియుండును మరియు పూర్వసంస్కారము వలన కర్మానుసార ముగ స్వర్గనరకాది లోకములయందు సుఖదుఃఖములను అనుభవించి ఉచ్చ నీచయోనులయందు జన్మించును. అనగా ఇహ లోక పర లోకముల యందు గమనాగమనములు గలది శుభాశుభకర్మలు చేయునది. ఆకర్మ ఫలమైన సుఖ దుఃఖములను అనుభవించునది, రాగద్వేషాదులు సంస్కారము (వాసన) నేను నాదియను భావనయు, భేదబుద్ధియు, ఇవియన్నియు సూక్ష్మశరీరము యొక్క ధర్మములు కనుక ఈ సూక్ష్మశరీరము మరియు సూక్ష్మశరీరధర్మము నేనుకాను

ఈదేహాము నందు స్థూలసూక్ష్మ శరీరాదులు నేనుకానని తీసి వేసినను ఏమియు మిగిలిలేదు యని అనుచున్న నేను యుండి మరియు ఏమితోచదను అవ స్థను నేను తెలియుచున్నాను కనుక యేమి తోచదను నది నేనుకాను.

కోడియు సాచార వేళ యందు తన పిల్లలను బైలుకువిడిచి రాత్రియు తన పిల్లలను దాచుకొని ఒకస్థానము నందు నిద్రించునట్లు అజ్ఞానము అథవా అవిద్యయు, మనోబుద్ధీంద్రియములను తనపిల్లలను జాగరణము నందు, స్వప్నము నందును, విషయ సుఖము ననుభవించుటకు బయిటికి విడచి యుండును. విశ్రాంతి కాలమునందు వాటినన్నిటిని తనయందు అడకము చేసుకొని ఆత్మ యొక్క ఆశ్రయమునందు స్వస్థముగా యుండును. అందువలన యేమి తోప కుండు అవస్థయే నిద్ర. అదేకారణ శరీరము (మరుపే - అవిద్య) దీనినే స్థూల సూక్ష్మ శరీరోభయముల కారణమైనదై యున్న కారణశరీర మనియు శివలింగము నందు ఐక్యాను సంధాన లక్షణముగలదై నందున యోగాంగ మనియు శివయోగులకు సుఖము దొరుకుట వలన ఆనందయ కోశమనెదరు.

ఎంత సుఖముగా నిద్రించితిని నిద్ర నుండి మేల్కొంచితిని యనునేను నిద్రావస్థ యందు లేకున్న నిద్రసుఖమును అనుభవించ లేను నిద్ర యందు నేనుయున్నాను కనుక అట్టినిద్ర (మరుపు అవిద్యా) కూడ నన్ను సంబంధించి నది కనుక ఆ నిద్ర నేనుకాను

సర్వత్యాగాంతరే నాస్తి జ్ఞానమాత్ర ప్రదర్శకం॥

యను ఆగమవచన ప్రకారము సర్వవస్తువులను (శరీరాదులను) నేను గానని

వాటినన్నిటిని త్యాగము చేసిన తరువాత ఏమియు మిగుల లేదు కాని యేమియు లేదు యనునదొక జ్ఞానము మాత్రము కలదు. ఆ జ్ఞానమే నన్ను చూపునట్టిది. అనగా ఈ స్థూలశరీరము మొదలు అజ్ఞానాంతమువరకు సమస్తము నా వలన తెలుసుకొన బడినవి తుదకు సమస్తమును తెలుసుకొను యే తెలివిగలదో ఆ తెలివియే (జ్ఞానమే) నేనని సిద్ధమవుచున్నది.

లింగ శబ్దము గమ్ ధాతువువలన పుట్టినది. గమ్ ధాతువు జ్ఞానార్థము గలది. కారణలింగము చిద్రూపమైనది తెలివే నేనైనందున చిద్రూపమైన లింగమే నేనని సిద్ధమవుచున్నది. నాకే ఆత్మయని నామముగలదు. ఆ తెలివినే ఆత్మ జీవ, లింగ, పరబ్రహ్మ, పరశివ, పరమాత్మ, పరమేశ పరంజ్యోతి యనిపిలుతురు.

| | | |
|---|---|---|
| ౧ అన్నమయకోశము. | స్థూలశరీరము | (స్థూలాంగము) |
| ౨ ప్రాణమయకోశము. | } | |
| ౩ మనోమయకోశము. | సూక్ష్మశరీరము. | (భోగాంగము) |
| ౪ విజ్ఞానమయకోశము. | } | |
| ౫ ఆనందమయకోశము. | కారణశరీరము. | (యోగాంగము) |

ఈ పంచకోశములు నశించునవి కనుక దీనివలె నశింపులేక సమస్తమును ప్రకాశింపజేయు శివ (లింగ) స్వరూపమే నా స్వరూపమని తెలియవలెను. ఇదియే లింగాంగ సామరస్యము యొక్క రహస్యము.

# నిర్వాణ షట్కమ్.

మనోబుద్ధ్యహంకారచిత్తాని నాహం న చ శ్రోత్రజిహ్వే న చ ఘ్రాణనేత్రే
నచవ్యోమభూమిర్న తేజో నవాయు శ్చిదానందరూపః శివోహంశివోహం। ౧
న చ ప్రాణసంజ్ఞో న్నవై పంచవాయు ర్నవా సప్తధాతు ర్నవా పంచకోశః
న వాక్పాణిపాదం నచోపస్థ వాయూ చిదానందరూపః శివోహం శివోహం॥
నమే ద్వేషరాగౌ నమే లోభమోహౌ మదో నైవ మే నైవ మాత్సర్యభావః
న ధర్మో న చార్థో న కామో నమోక్ష శ్చిదానందరూపః శివోహంశివోహం।
71 నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం నమంత్రో నతీర్థం నవేదా నయజ్ఞః
అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా చిదానందరూపః శివోహం శివోహం॥
న మృత్యు ర్న శంకా నమే జాతిభేదః పితా నైవ మే నైవ మాతా చ జన్మ

నబంధుర్నమిత్రం గురుర్నైవశిష్య శ్చిదానందరూపః శివోహం శివోహం॥ ౫
అహం నిర్వికల్పో నిరాకారరూపో విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణాం
నచాసంగతం నైవ ముక్తిర్నమేయ శ్చిదానందరూపః శివోహం శివోహం॥ ౬

# లింగాంగ సామరస్యము

అంగం శక్తిరితి ప్రోక్తం శక్తిమాన్ లింగముచ్యతే
అనయోరైక్య విజ్ఞానం సంబంధ ఇతి ఉచ్యతే.

౧ అంగమే శక్తి, లింగమే శక్తివంతుడయిన శివుడు, ఆశివశక్తుల కూడిక యొక్క జ్ఞానమే లింగాంగ సామరస్యము.

౨ లింగమే శివుడు, అంగమే చరాచర జగత్తు, అంత్యకాలము నందు శివుని యందీజగత్తు లీనముపొందును. తల్లీనమే లింగాంగ సామరస్యము.

3 భక్తియే జీవుని అంగము, శివుడే లింగము, భక్తిచేత జీవుడు శివుని యందు ఐక్యమగుటయే లింగాంగ సామరస్యము.

౪ లింగమే శివుడు, అంగమే జీవుడు, వీరుభయుల ఉత్తమ ప్రకారముగ కూడికయే లింగాంగ సామరస్యము.

# గురుశిష్యుల సంవాదము.

శి - మహాలింగమునందు ఐక్యమవుటకు సాధనమేమి?

గు - పాలయందు పాలు చక్కెరయందు చక్కెర గూర్చిన యేకత్వము కలుగును. తద్వత్తే యీ శరీరమునందు గల జీవాత్ముడు సర్వవ్యాపియై యున్న శివుడు ఒకటియే యని తెలియుటయు, శివుడే నేనని దృఢమైన నిష్ఠయే జ్ఞాన మనబడును. ఈ జ్ఞానము చేతనే జీవుడు శివునియందు ఐక్యమగును.

శి - శివుడు ఒక్కడు. జీవులు అనేకులు అయిన శివజీవులుఒక్కరెట్లు?

గు - వాయువు ఒక్కటైనను ప్రాణరూపమును పొంది సకల ప్రాణుల దేహమునందు యెట్లు వ్యాపించుచున్నదో పరిపూర్ణమైన ఒక ఆకాశమే కుండల యందు యిండ్లయందు నిండి యున్నను ఒకదానికొకటి భిన్నము గాక యెట్లు ఒక్కటేయై యున్నదో మరియు నది సరోవర తటాకము మొదలయిన జలా

శయములయందు సూర్యుడు ప్రతిబింబ రూపముచేత అనేకమయి కనబడినను యెట్లు ఒక్కడయి యుండునో అట్లే.

"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" యను ఉపనిషద్వచన ప్రకారము ఒక్కటే మహాలింగము దేవమానవాది సర్వ ప్రాణుల శరీరమునందు ఆత్మరూపము చేతను, బ్రహ్మాండమునందు శివస్వ రూపము చేతను నిండియున్నది. మేఘమునందుగల నీరు ఒక్కటి యైనను భూమియందు పడినమాత్రమున స్థలభేదము వలన అనంత ప్రకారములై అనగా నానారూప వర్ణరుచులు గలదైనది. యేరులను పేరుచేత ప్రవహించి పునః సముద్ర రూపముచేత ఒకటే యగునట్లు మూల లింగము ఒక్కటేయై యుండి మాయావశముచేత ఆ లింగాంశమే జీవస్థితిని పొంది పునః మాయయొక్క నిజ స్వరూపమును తెలిసిన తరువాత ఆ జీవస్వరూపమును విడచి లింగము నందు గలిసిపోవును. కనుక శివునకు జీవునకు భేదములేదు.

శి - జీవునకు జనన మరణములు తాపత్రయములు గలవు, శివునకు యివిలేవు. అందువలన జీవుడు శివుడెట్లగును?

గు- న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా నభూయః
అజో నిత్యః శాశ్వతో ఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే।

యను ఆగమ వచన ప్రకారము జీవుడు యెన్నడు చావడు. ఇప్పుడు పుట్టలేదు. ముందెన్నడు పుట్టలేదు. యికముందు పుట్టబోడు. అందువలన జీవుడు అజు డనియు, నిత్యుడనియు, పిలువబడు చున్నాడు. మరియు అత్యంత పురాతనుడు శరీరము నాశమైనను జీవుడు స్వల్పమైన నాశనము కాడు.

శివుడు యెట్లే నిర్లేపుడు, సంగరహితుడు, వాసనలేనివాడు, తద్వత్తే జీవుడు కూడ యుండును. ప్రాణాంత సమయము నందు జీవుడు పోయె ననెదరు. కాని జీవుడు చచ్చెనని యనరు. జీవుడు ఒక శరీరగృహమును విడిచి మరియొక శరీరగృహమును పొందును కనుక జీవునకు మరణము లేదు పుట్టుకలేదు.

శోకహర్ష భయ క్రోధ లోభ మోహ స్పృహాదయః
అహంకారస్య దృశ్యంతే జన్మ మృత్యు శ్చ నాత్మనః॥

యను ఆగమ వచనప్రకారము తాపత్రయములు, ఆనంద, భయ, క్రోధాదులు జననమునుండి మరణము వరకు గలుగు సమస్త వికారములు అహంకారమునకే

అవుచున్నవి. జీవునకు సంసారమే లేదు.

శి - శివుడు జీవుడు ఒక్కటియైనను శివునియందు గల సర్వజ్ఞత్వాది గుణములు జీవునియందు యెందుకు గలుగవు?

గు - శివుడు పూర్ణజగత్తును పుట్టించు చున్నను, జీవుడు కూడ అంశ మాత్రమున పుట్టించు చుండును. శివుడు సమస్తమును తెలియు చున్నను, జీవుడు అల్పము నయినను తెలియు చుండును. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ వీరల సృష్టి (పుట్టించుట) స్థితి (రక్షించుట) సంహార (లయించుట) నియమ, అనుగ్రహ (అంతఃకరణ పూర్వకముగ ఉపదేశించుట) ములను పంచ శక్తులుకూడ అంశమాత్రము చేత జీవునందు కనిపించుచునే యున్నవి. ఈ పంచ కృత్యములు కలవాడే పరశివుడు. అందువలన ఆ శివునియందు యేయే గుణములు గలవో ఆయా గుణములు అంశమాత్రముగా జీవునందు కూడ గలిగియే యున్నవి. దీనిచేతను కూడ జీవుడు శివుడేయని సిద్ధమవుచున్నది.

శి - శివుడు పూర్ణుడు, ఆనందమయుడు, పరోక్షుడు, స్వతంత్రుడు, జీవుడు ఖండితుడు, దుఃఖియు, అపరోక్షుడు, పరతంత్రుడు, జీవుడు భ్రాంతిసహితుడు, కనుక శివజీవులు ఐక్యమవు టెట్లు?

గు - బయలు పూర్ణమై యున్నను కుండలో యున్నందున ఖండితమైనట్లు కనిపించిననూ అదియెట్లు నిజముకాదో అట్లే జీవుడు పూర్ణుడైనను జీవుని యందు కన్పట్టు ఖండితత్వము మొదలైన గుణములు అవిద్యవలన గలిగినవైనవే కాని నిజమైనవికావు. భ్రాంతివలన అవి సత్యమై తోచుచున్నవి. కనుక ఇట్టి అవిద్యా జనిత భ్రాంతియు లింగాంగ సంబంధము వలన నాశన మవును.

శి - ఏజీవుని అంగమనెదరు?

గు - మలత్రయముల వలన ఆవరింపబడిన జీవుని సంసారి జీవుడనెదరు. ఈ జీవుడు శివునియందు ఐక్యముగాలేడు. ఏజీవము తనను అవరించియున్న మల త్రయములను నాశము గావించి ఇష్ట ప్రాణ భావలింగ స్వరూపుడౌనో అతడు శుద్ధజీవుడనబడును. శివుడు ఈ శుద్ధజీవునిని అంగీకరించి సమరసము చేసుకొను టము వలన ఈ శుద్ధజీవాత్ముని అంగమనియెదరు.

అమితి బ్రహ్మ సన్మాత్రం గచ్ఛతీతి గముచ్యతే
రూప్యతేఽంగ మితి ప్రాజ్ఞై రంగతత్వ విచింతకైః॥

యను ఆగమ వచనప్రకారము సద్రూపుడయిన శివుని యందు చేరిన వానికి మరియు సదాశివుని ధ్యానమునందు మునిగియున్న ఆత్మకు అంగమనియు లింగ తత్వ చింతన చేయుచుండు జ్ఞానులచేత చెప్పబడి యున్నది. అనగా జనన మరణములేని మహాలింగము దిక్కు భక్తిచేత ఎవడు పోవుచున్నడో ఆజీవునినే అంగ మనియెదరు. ఇతరులు కారు.

శి - మలత్రయముల స్వరూప మేమి? వాటిని వదలుటెట్లు?

గు- ఆణవ, మాయా, కార్మిక మలములే మలత్రయము. శివునియందు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు సంకోచమై త్రిమల స్వరూపమును పొందును. యీ త్రిమలములచేత ఆవరింప బడిన శివచైతన్యమే జీవుడనబడును.

౧ పరశివుని సంకల్పము అథవా అంతఃకరణ రూపమైన యే చిచ్ఛక్తి గలదో, అనగా నేను సర్వాత్ముడను సర్వత్ర పరిపూర్ణుడను యను వృత్తికి కారణమైన యే ఇచ్ఛాశక్తి గలదో, అది కాష్ఠయోగము వలన అగ్నికణము లుత్పన్న మైనట్లు వికాస స్థితిని పొందుట వలన చిత్తనబడును. ఈ చిత్తు అరివర్గ మరియు పంచక్లేశ (అవిద్యా, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశ) ముల చేత కూడియుండుట వలనను, ఆత్మయొక్క సంసారమునకు కారణమైనందు నను దీనికి అజ్ఞాన గ్రంథి యనియు, అవిద్య యనియు పేరు గలదు. దీనిచేత కూడిన శివచేతనమే జీవమనబడును. ఈ అవిద్యయు తనయందు గల చేతనము పరిపూర్ణ శివుడైయున్నను, ఆ చేతనమునకు నేను శివుడను గాను యను బుద్ధిని, తాను గాని అణురూపమైన దేహాదులయందు తాను యను బుద్ధినిన్ని పుట్టించెను. అనగా ఆ శివచేతనమును అణురూపమగునట్లు చేసెను. అందు వలన దీనిని ఆణవమల మనియెదరు దీనియందు అవిద్యాతత్వ మొక్కటే గలదు.

౨ జ్ఞానశక్తి సంకుచితమై (వికారమును పొంది) సర్వజ్ఞత్వమునకు బదులుగా కించిజ్ఞత్వమును పొందుట వలన నేను అజ్ఞుడను (శివజ్ఞానము లేనివాడను) యను కార్య వ్యవహారమే మాయామల మనబడును. ఇదే
72 సూక్ష్మ శరీరరూపముచేత జీవునకు రెండవ ఆవరణమై యున్నది. శివుడుతప్ప అన్యవస్తువులే లేకున్ననూ ఈ మలము జడజడములయందు భేదము, జీవ శివుల యందు భేదము, జీవజడములందు భేదము, జడ (జగత్) శివులయందు భేదము

శివజీవులయందు భేదము, ఇట్లు పంచభేద జ్ఞానమును పుట్టించి తనను పొందియున్న జీవుని కించిజ్ఞుడని కల్పించి నందున దీనిని మాయామల మందురు. దీనియందు ఆరు మిశ్ర తత్వములు గలవు.

3 క్రియాశక్తియు సంకుచితమై సర్వకర్తృత్వమునకు బదులుగా కించిత్కర్తృత్వమునుపొంది శుభాశుభవాసనచేత కార్మికమల స్వరూపమాయెను. ఇది జీవునకు శుభాశుభకర్మములను చేయువాడునూ, కర్మఫలములను భోగించువాడునూ తానే యను అభిమానము కలుగజేసెను. దీనివలన జీవుడు పుణ్యాపాప కర్మములచేత నేను సుఖి దుఃఖి యను వ్యవహారము గలవాడాయెను. దీనియందు ౨౮ అశుద్ధ తత్వములు గలవు. ఈ మలత్రయముల వలన ముక్తియు లింగాంగ సామరస్యము చేత కలుగును.

శి - లింగాంగ సామరస్యము దేనిచేత గలుగును?

గు - మహావాక్యమైన పంచాక్షరమంత్ర జ్ఞానమువలననూ, షట్స్థల బ్రహ్మజ్ఞానము వలనను, కలుగును.

శి - మహావాక్యములు పంచాక్షరమంత్రములు ఏమి బోధించు చున్నవి?

గు - నాలుగు వేదముల మహావాక్యములు శివజీవులు ఒక్కటే యని బోధించు చున్నవి. వాటియందలి సామవేదము యొక్క ఛాందోగ్యోపనిషత్తు యొక్క "తత్వమసి" (తత్ - ఆ లింగరూప శివుడే, త్వం - నీవు, అసి - అయి యున్నావు) యను మహావాక్యము, సకలవేద శిరోంతర్గతమై యున్న "నమశ్శివాయ" యను పంచాక్షరీమంత్రము లింగాంగ సంయోగమును చెప్పుచున్నది.

"లింగం తత్పదమాఖ్యాత మంగం త్వం పదమీరితం
సంయోగోఽసి పదంప్రోక్త మనయోరంగ లింగయోః॥"

యను ఆగమ వాక్యానుసారము తత్వమసి యను ఈ మహా వాక్యమునందు తత్ - త్వమ్ - అసి ఇట్లు మూడు పదములు గలవు. వాటియందు తత్పదార్థము లింగము, త్వం పదార్థము అంగము, అసి పదార్థము లింగ, అంగముల సంయోగము అయి యున్నది, అందువలన ఈ మహావాక్యము లింగాంగ సంయోగమును చెప్పుచున్నది.

పంచాక్షరి మంత్రమునందు నమః, శివ, అయ, యను మూడుపదములు గలిగి నమః పదము అంగమును, (నమస్కరింపు చున్న జీవుని) శివ పదము

లింగమును, అయ పదము అంగలింగముల సంబంధమును బోధించు చున్నది. లింగ, అంగ మరియు వాటి సంబంధమును ఈ మూడు పదములను సూచించు చున్నందుననే ఈ మంత్రమైనది. దీనికి వేదాంతము మరియు ఆగమములందు మంత్రరాజమని పేరు గలిగినది. అందువలననే శివజీవుల అభేదమే లింగాంగ సమరసమనబడును. కనుక శివునకు జీవునకు (అనగా నీకు) భేదము లేదు.

శి - ఉపాధి యనగా నేమి? శివజీవులకు యే ఉపాధులు గలవు?

గు - ఉపాధి, తనయందుగల ధర్మములను యితర వస్తువునందు గలిగి యున్నట్లు కాన్పించుట ఉపాధి యనబడును. ఉదాహరణము యెఱ్ఱపుష్పము నందు గల ఎరుపు వర్ణము తనపై పెట్టియున్న స్ఫటికమునందు కలుగునట్లు తోచును. స్ఫటికము స్వతః స్వచ్ఛము వర్ణరహితము గలదైనను ఎఱుపు పుష్పము యొక్క సంబంధము వలన చూపరులకు ఎఱుపు స్ఫటికమువలె కాన్పించును. ఇట్లే శివునకు మాయయూ జీవునకు అవిద్యయు ఉపాధులై మాయయందుగల సర్వజ్ఞత్వాది గుణములు శివునందునూ, అవిద్యయందు గల అల్పజ్ఞత్వాది గుణములు జీవునియందునూ, ఉన్నటులే కన్పట్టు చున్నవి. అయినను స్ఫటికము నందు కనబడుచున్న యెఱ్ఱవర్ణము ఉపాధియైన పుష్పమునందే కాక స్ఫటికమునందెట్లు కాదో, అట్లే సర్వజ్ఞత్వ అల్పజ్ఞత్వాది గుణములు ఉపాధులైన మాయా మరియు అవిద్యలవే కాని శివజీవులవి కానేరవు. కారణ శివ జీవులు ఒక్కటే.

శి - మాయా, అవిద్యా ఉపాధులు ఎక్కడినుండి, యెట్లు రాబడినవి.

గు - స్వగతాది భేదములు లేని మహాలింగము నందు సచ్చిదానంద లక్షణమును గల పరా (చిత్) శక్తియు అభిన్నమయి యున్నది. అనగా మహా లింగమును విడిచి శక్తియు లేదు. పుష్పమునకు సువాసనకు, అగ్నికి ఉష్ణతకు, నీకు నీయందుగల శక్తికి, నిత్యసంబంధము గలిగినట్లు లింగమునకు శక్తికి నిత్య సంబంధము గలదు.

"ధర్మరూపా పరాశక్తిః ధర్మరూపః పరశివః"

యనునట్లు పరశివుడు ధర్మియై యుండి శక్తిధర్మమై యున్నది. ధర్మియైన అగ్నికి ధర్మమైన ఉష్ణతకు యెట్లు భేదము లేదో నట్లే పరశివునకు పరాశక్తికి భేదము గలుగదు. తెరుచుట. మూయుట నేత్రముయొక్క స్వభావమైనట్లు జగత్తును

పుట్టించుట లయించుట శక్తియొక్క ధర్మమైయున్నది. ఈశక్తి సమస్తజగత్తును పుట్టించు కాలమునందు మన్నే కుండయగునట్లు తానే ఉపాదాన కారణము వలన జగత్తయి తోచుచున్నది. మరియు ప్రళయకాలము నందు శివేచ్ఛ వలన జగత్తెల్లను ప్రళయించి తనయందు లీనము గావించుకొని శివునకు అభేదముగల దౌను. అనగా శక్తి శివునియందు లీనమగును.

సత్వ, రజ, తమములను మూడు గుణములను తన గర్భము నందుంచు కొనియున్న శక్తియు జగత్తును పుట్టించు కాలమునందు క్రమముగా, మాయ, ప్రకృతి, మహాతత్వములై పరిణమించి కడకు ఉత్కృష్టమైన శుద్ధ సత్వగుణము గలమాయ (విద్యా) రజోగుణ మధికమైయున్న అవిద్యా, తమోగుణ మధికమై యున్న ప్రకృతి ఇట్లు మూడు మూడుభాగములాయెను. యెట్లనగా బీజమునందు గల మొలకయే బీజశక్తి, దానిని బురదయందు యుంచగా పుట్టుటనకు కారణమైనదే మాయ. బీజమునందు గల కఠిన అవస్థ లోపించి మృదు అవస్థ గలుగుటయే ప్రకృతి అది ఉబ్బుటయే మహత్తత్వము. అనంతరము అది మొలకయెత్తుట, తద్రూపమును పొందుట మరియు క్షీణించుట యనునదే విద్యా, అవిద్యా, విద్యావిద్య మయ మను మూడు భాగములనియు తెలియ గలిగినది. పరమాత్మ నేనేనను స్వజ్ఞప్తియే చిచ్ఛక్తియు ఈశక్తియందు జగత్తను భావన గలుగుటయే మాయ, జగద్రచన యొక్క సూక్ష్మ భావమే ప్రకృతి. ఆ భావము విస్తారమగుటయే మహాతత్వము. అదేభావము మంచి, చెడ్డ, మంచిచెడ్డ యను మూడు గుణములు గల జగత్తయినదని తెలియ దగినది. మాయా, ఉపాధి ఒక్కటే యయినను, దీనిచేత పరమాత్ముడు శివుడాయెను. కాచిన యినుపకడ్డినుండి అగణిత మిణుగురులు బైలు వెడలునట్లు అవిద్యయు అనేక విధములాయెను. ఆ పరశివుడే ఈ అవిద్యయొక్క నానా ఉపాధులచేత నానా ప్రకారమైన (౮౪ లక్ష) జీవులై తోపుచుండును. మూడవ ప్రకృతియే పంచమహా భూతములై అవి ఒక్కటిలో ఒక్కటికూడి జీవునకు పిండాండము (స్థూలదేహాదులు) శివునకు బ్రహ్మాండము అయినట్లు తోచును. అనగా ఆ చిచ్ఛక్తియే తానే శివజీవులై తోచెను.

శి - అవిద్యయొక్క ధర్మములేవి? అవి జీవుని యందెట్లు గలిగినవి? దానిచేత జీవునకు గలిగిన పరిణామమేమి?

గు- కల్లయందు నిజమనుబుద్ధియేఅవిద్య. అవిద్యయందు రజోగుణాధిక్యము వలన విపరీత తెలివియు (భ్రాంతి) విషయాదుల యందు ఆశగలదియై దుఃఖము గలదియై యుండును. సత్వగుణము అల్పము గలదైనందున స్వల్ప తెలివి గలిగినది. మాయయొక్క కార్యమైనందున పరతంత్ర అల్పశక్తి గలిగినది. తమోగుణము వలన ఆలస్యము, మదము, మందత్వము గలిగినదై యున్నది. ఈ అశుద్ధోపాధి యందు ఆవరణ శక్తియున్నందుచేత తనను ఆశ్రయించిన వారికి స్వరూపము మార్చి అనిత్య, అశుచి, అనాత్మలగు దేహేంద్రియాదుల యందు నిత్య, శుచి, ఆత్మ (తాను) యను మోహమును గలిగించి నందున ఇది అవిద్య అధోమాయ యనబడు చున్నది. జీవాత్ములు ఈ అశుద్ధమైన అవిద్యయొక్క అనేక భేద ములచేత అనేక ప్రకారులైరి

అవిద్యచేత కూడిన తెలివియే జీవుడయినందున పుష్పకాంతి స్ఫటికము నందు కన్పించినట్లు అవిద్యయందు గల పై ధర్మము జీవుడయి నీయందు ఉపాధి వలన కన్పట్టు చున్నది. ఆ ఉపాధి ధర్మములు నిజముకావు. అయినను సంగ దోషము వలన సజ్జనుడు దుర్జనుడయి నట్లు జీవుడు సర్వసాక్షియైన తెలివే తానని తెలియక అవిద్యాసంగము వలన దానికి అధీనుడై (మోహితుడై) భ్రాంతిచేత అవిద్యా ధర్మములనే తన ధర్మములని తెలియు చుండును. అనగా అవిద్యయొక్క కార్యమైన అహంకారసంబంధముచేత దేహాదులు తాను కాకున్నను తానని అభిమానించి దేహమును పోషించుటకై రాగద్వేషములు గలవాడాయెను. మద యింద్రియాదులు క్రియాదుల చేయునట్లు వాటిఫలమును అనుభవించు ధర్మము ను తనయందు సంబంధించుకొని రెండవవాడు చేయు దానిని తాను చేసితిననిన యెట్లు శిక్షబొందునో అట్లే దుఃఖమును అనుభ వించును. జీవాత్ముడు అహంకారము తోడ ఎంతవరకు అభేదరూపము చేత కూడుకొని యుండునో అంతవరకు జనన మరణరూప దుఃఖము ననుభవించును. ఆత్మ అహంకారముల కూడికయే హృదయగ్రంథి యనబడును. ఇదే సర్వ అనర్థ ములకు కారణమైనది. కారణ అవిద్యోపాధి నాశము కాగానే అవిద్యా

73 ధర్మము నాశమై జీవుడు శివుడగును.

శి - మాయయొక్క ధర్మములేవి? అవి శివుని యందెట్లు గలిగినవి? వాటిచేత ఏమి పరిణామము గలిగెను?

గు - మాయయందు కేవలము సత్వగుణము గలదు. సత్వగుణము కేవల ప్రకాశముగలదై యందున యథార్థ తెలివిగలిగినది. సకల కార్యములకు కారణమైనది. సర్వశక్తి మంతమైనది. జ్యోతి ప్రతిబింబగ్రహణము జేయు సామర్థ్యము గలిగినదై నందున ప్రకాశ స్వరూపము గలిగినదాయను. అగ్నియొక్క జ్యోతియు సామాన్య ప్రకాశమాన మైనదైనను, నిర్మలగ్లాసు ఆవరణము వలన యెట్లు అతిశయప్రకాశము గలదానో అట్లే సామాన్యమైన పరిపూర్ణ (జ్యోతి) శుద్ధమాయోపాధి చేత విశేషప్రకాశము గలదై సర్వజ్ఞత్వాది గుణములను దాల్చెను. సృష్టియొక్క రచన లయాదులు సహా మాయయొక్క ధర్మములయి అవి కూడ శివునియందు ఉపాధివలన గలిగి యున్నవి. ఈ మాయోపాధి వలననే శివుడు బ్రహ్మాది దేవతలకు అధిపతియై వేడువారి కిష్టార్థములనిచ్చు శక్తిగలవాడాయెను. ఈ మాయయందు ఆవరణశక్తి (తనను మఱిపించుశక్తి) లేనందున శివుడు తన స్వరూపమును మరువక మాయను తన అధీనము నందుంచుకొని యుండును. ఈ మాయోపాధియు తనను ఆశ్రయించిన వారికి మోహమును గలుగజేయక యున్నందున మహామాయా, అథవా శుద్ధవిద్యాయని పిలువబడును. దీని స్థూలరూపమునే పార్వతియనెదరు. ఇట్లే మాయా అవిద్యలను ఉపాధులచేత కూడిన శివజీవులయందు విరుద్ధ ధర్మములు తోచుచున్నవి. ఈ రెండు ఉపాధులు రాజసేవకుల పోషాకులవలె మిథ్యమైయున్నవి. ఉపాధులు నశించినంతనే శివుడవే నీవని తెలియుము.

శి - శివుడనే నేనైన తర్వాత శివునివలె నాకు సృష్టి రచనాదులు యేల తెలియవు?

గు - సరోవరములోని నీరు పాత్రలోని నీరు ఒకటియే యైనను, సరోవరమునందు ఓడలు నడచునట్లు పాత్రయందు నడువలేవు. మరియు చెరువునీరు వలన తోటలలో చెట్లు పెరుగును. చెంబునీటితో చెట్లు పెరుగవు. సరోవరము యొక్క పాత్ర పెద్దది కనుక కార్యము పెద్దది. చెంబుపాత్ర చిన్నది కనుక కార్యము చిన్నది. కాని నీరుమాత్రము ఏక గుణము గలిగినదే. నీరు ఒకటియైనను పాత్రభేదము వలన కార్యములు భిన్నమవుచున్నవి. తద్వతే శివుని మాయోపాధియు కారణమై గొప్పదైనందున సృష్టి మొదలయిన గొప్ప కార్యములు గలుగును. జీవుని అవిద్యోపాధియు కార్యమై చిన్నదైనందున సమస్త సృష్టి

యొక్క రచనయు కానేరదు. మరియు ఈ సమస్త కార్యములు ఉపాధి సంబంధమైనవేకాని శివునివికావు. అనగా సృష్టినిపుట్టించుట శివునికర్తవ్యముగాదు.

శి - మాయా అవిద్యోపాధులు మిథ్యయెట్లు?

గు - లేకున్ననూ యున్నట్లు తోచి మూలకారణ వస్తువును మరిపించి తానే ముందుకువచ్చి నామరూపములు గల కార్యవిశేషమే మాయ.

"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"

యనునట్లు సత్యమైన మన్నునందు దానికార్యమైన గణపతి మొదలైన మూర్తులు కేవల శబ్దమాత్రమై యున్నందున యెట్లు మిథ్యయనుపించు చున్నవో అట్లే సద్రూపమైన పరశివునందు నామరూపములు గల మాయకూడ (సృష్టి)మిథ్య యనబడును. మరియు మాయ రజ్జువునందు కన్పట్టు సర్పమువలె అవిచార కాలమునందు తోచి, విచార (పరశివుని స్వరూపమును తెలిసిన) కాలమునందు మిథ్యయగును. రజ్జువునందు తోచిన సర్పమను భావన బీజమై సర్పము కాదని తెలిసినంతనే సర్పమను భావనకూడ యెటుల పోవుచున్నదో అట్లే జగత్తను భావనయే జగదుత్పత్తికి కారణమై జగత్తంతయు అబద్ధము (కారణ లింగము) యని తెలిసిన మాత్రముననే జగత్తను భావన (మాయా) కూడ నాశమగును. భావము స్థిరమైనది కాదు. కడకు పరశివునియందు లీనమవును. అందువలన మాయ మిథ్యయైనది. లేని కారణమును కార్యరూపముగా తెలియుటయే మిథ్య (అబద్ధము) యని తెలియవలెను. మరియు మాయయొక్క కార్యమైన అవిద్యకూడ మిథ్యయే. ఒకవేళ అవిద్య సత్యమైన పక్షమున దానిచే గలిగిన సంసారము జీవునకు సత్యమైయుండును. యే ఉపాధి చేతను నాశము గాకయుండును. కనుక మాయా అవిద్యలు రెండు మిథ్యయైనవి.

శి - మాయా అవిద్యోపాధులను నశింప జేయుటెట్లు?

గు - రజ్జువునందు సర్పమును, మోట ముఖమునందు దొంగను కల్పించు చున్న తర్వాత అవి కేవల మూలవస్తువుయొక్క జ్ఞానముచేతనే నాశనముపొందు నట్లు ఈరెండు ఉపాధులు మూల లింగముయొక్క స్వరూపమును తెలియుట చేతనే నశింపగలవు.

౧ పృథివ్యాది మాయాంతము వరకు సర్వనామ రూపములు కల్లయని తెలిసియు అనగా కార్యమును కారణరూపముగ తెలియుటయే మాయ నాశ

నము, అథవా ఆకాశమువలె నిరవయవుడూ అవిరళుడూ, పరిపూర్ణుడు అయిన పరశివునికన్న అతనియంత లేక, అతని విరుద్ధ జాతి వస్తువేలేదు యను తెలివియే మాయానాశనము. మరియు జ్ఞానము వినా అన్యభావన పుట్టకుండుటయే మాయానాశనము.

౧ అగ్నియొక్క ధర్మమైన కాల్చుగుణము నశింపగా అగ్నియు తానే యెట్లు నశించునో అట్లే అవిద్యయొక్క ధర్మములు నశింపగా, అవిద్య తానే నశించును. విపరీతజ్ఞానము గల అవిద్యయొక్క ధర్మములు యదార్థజ్ఞానము చేత తామే నశించును. ౧ విచారించగ లింగము వినా సర్వము అనిత్యమైనవి. ౨. లింగమొక్కటే పవిత్రమైనది. లింగము వినా దేహాదులు అశుచి యైనవి. 3. లింగమొక్కటే పరమానందము గలది స్త్రీ మొదలయిన విషయములు విషమువలె దుఃఖకరమైనవి. ౪ దేహము మొదలుకొని అజ్ఞానమువరకు సమస్తము నాచేత తెలియబడినందున అవి నేనుకాను. సమస్తమును తెలియు తెలివియే నేను. శరీరమునందుగల ఇంద్రియాంతఃకరణాదులే కర్మములను జేయును. అట్లే కర్మముయొక్క ఫలములను అనుభవించును. నాకు కర్తవ్యము ఎంతయు లేదు. అందువలన జనన మరణరూప సంసారము నాయందు యెప్పుడు లేదను దృఢజ్ఞానము గాగను సూర్య ప్రకాశము వలన అంధకారము నశించినట్లు అవిద్యయు నశించును.

శి - అవిద్యా మాయలు మిథ్యయని తెలిసిననూ వాటియొక్క కార్యములైన దేహ బ్రహ్మాండములు నిజమేయై తోచుచున్నవి. దీనికి ఉపాయ మేమి?

గు - అగ్నియు నాశనమైనను దాని కార్యరూపమైన పొగ కొంతకాలము యుండును. యుద్ధభూమి యందు వైరత్వముచేత ఆయుధములను ధరించి యుద్ధము జేయుచున్న వైరి ప్రాణము నాశమైనను అతను దేహముతో మొదటి వలెనే ఆయుధధారియై పడియున్ననూ అతనితో భయము యెట్లు లేదో అట్లే సత్యమతిచేత దుఃఖము కలిగించుచున్న నామ రూపములుగల జగత్తు మిథ్యయనియు తెలియగా అదినీకు మొదటి దానివలె తోచినను దుఃఖము గలిగింప జాలదు. పెట్టెలోనుండి కర్పూరము తీసివేసినను కొంతకాలము వరకు కర్పూరము వాసన యుండునట్లు మరియు ఆ వాసన తనకుతానే పోవునట్లు అవిద్యయు నశింపగానే అవిద్యయొక్క కార్యమైన దేహాదులు కర్మయొక్క

వాసనయు కొన్నిదినములవరకు తోచిదామే నశింపగలవు. వాటిని నశింపజేయు యత్న మనావశ్యకము. మరియు నామరూపముగల జగత్తుకల్ల. సమస్తములింగ మని తెలిసినతర్వాత మిగిలియున్న వ్యవహారము బాధముగలుగ జేయ నేరదు. యేలననగా ముసిమబ్బున రజ్జువునందు తోచినసర్పము కాటువలనవిషము యొక్క మరణమును బొందినవారుగలరా? శ్రేష్ఠమైనగరుడ మంత్ర (పంచాక్షరీ) జపమువలన సర్పము (అహంకారము) కరిచినవిషము వేగరము దిగిపోయి పునః ఆవిషము (సంసారదుఃఖము) యొక్క సామర్థ్యము ఆపురుషునకు మొనటివలె యెట్లు మోహమూర్ఛను గలుగజేయుదో, ఎట్లు స్వప్నావస్థయందు కామిని యొక్క సంగమును మనస్సుకు వచ్చినట్లు అనుభవించినను ఆమెను గర్భము గలిగి పుత్రసంతానము గలుగజాలదో అయితే స్త్రీ మొదలైన విషయములు మిథ్యయని తెలిసిన తర్వాత వ్యవహారము గలిగియున్నను దేహ విషయాదుల యందు నేను, నాదియను అభిమానము లేనందున సంసారబంధము నీకు లేదు.

అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపిణః

జీవన్ముక్తస్య ధీరస్య మాయా కైంకర్య వాదినీ।

యను వచన ప్రకారము పరిపూర్ణ సచ్చిదానంద లక్షణము గల మహాలింగమే తానని తెలిసినవాడు, జీవన్ముక్తుడు, దేహాదులయందు అభిమానము లేనివాడు, జితేంద్రియుడు, అయిన శివయోగి ఎదుట మాయ సేవకురాలై నిలచియుండును. యనగా మాయ బహుశక్తి సంపన్నురాలై యేమి అడ్డములేక సమస్త జగత్తును మోహింప జేయునదైననూ లింగాంగ సామరస్యమును పొంది ధీరుడై యున్న శివయోగియందు ఆమె మోహితురాలై నిలువ సమర్థురాలు కాక దాసివలె యుండునని తెలియవలెను. అందు వలన నీకు దేహబ్రహ్మలు తోడ్పడినను భాధ గలుగదు.

శి - జీవభావముయొక్క సంశయములు నశించుట కుపాయమేమి?

గు - నీవే పరశివుడవని భోధించి నిన్ను ఉద్ధారముజేయుచున్న పంచాక్షరీ మంత్రము మరియు త్వం తదసి (నీవు ఆ శివుడవే అయి యున్నావు.) తత్వమసి

74 ఇత్యాది మహావాక్యములందు పూర్ణనమ్మిక నుంచుము. పరపూర్ణ జ్ఞానమే నీ యొక్క స్వరూపమనునది విడచి సంశయాదుల చేత జీవభావమునందు జిక్కిన, చింతామణి చేజిక్కి యున్నను పాషాణమని విసిరినట్లు అనర్థమునకు గురియగు

దువు. సంశయాత్ముడు పుట్టపైని పగ్గము ముట్టినను చచ్చును. సంశయ రహితుడు సర్పము ముట్టినను కూడ చావకుండును.

తత్త్వమసి మరియు పంచాక్షరీ మంత్రముయొక్క అభిప్రాయమును తెలిసి సత్యమని నమ్మినవానికి జననమరణములు గలుగవు. నమ్మిననూ నీవే శివుడవు. సందేహించిన "సంశయాత్మా వినశ్యతి" యను నట్లు నాశ మందెదవు.

శి - జీవ వ్యవహారము తొలగకుండ ఉపాయ మేమి?

గు - దేహ మారోగ్య స్థితి యందున్ననూ పుష్టి కొరకు ఔషధము సేవించునట్లు లింగాంగి జీవన్ముక్తియొక్క విలక్షణానందము నను భవించుటకై ఆరు ప్రకారముల జ్ఞాన సమాధు లను జేయ వలెను. అనగా విజాతీయ రూపమైన సమస్త ప్రపంచము తొలగిపట్టను. కావున వాటిని చక్కగా గుర్తించి వాటివలెనే ఆచరించును.

౧ మనుష్యునందు యేకాలమునందైనను కామాదివికారములు పట్టినను అవి నీ చేత తెలియబడుచున్నవి. అవి నీవికావు. వాటిని తెలిసికొను తెలివియే నేనను బిరుదును విడువకుండుటయే అంతరంగముయొక్క మొదటి సమాధి. అనగా మామిడికాయ మొదలైనవి ఉప్పు వలన ఉప్పు మయమై ఉప్పుకాయ యనిపించు కొనినట్లు సంసారమును పొంది సంసార మయమై యున్న మూఢుని వలె వర్తించక, కుమ్మరి పురుగు బురదయందున్నను ఏ లేపము లేనిదై యున్నట్లు సంసారమునం దున్నను సంసార లేపము లేనట్లుగా యుండవలెను. మరియు నర్తకియు స్వర, అభినయ, తాళ, రస భావములను సరిగా నడిపించుచున్నను తలపై యున్న పాత్రను యెట్లు మరువకుండునో అట్లె కర్మేంద్రియములు తను ధన వనితాది విషయ భోగములం దున్నను తాను మాత్రము జ్ఞానము దప్పకుండ యుండవలెను.

౨. మనసునందు యే వికారములు లేకుండ యుండి అహంకారాదులను కూడకుండు శుద్ధస్వయం ప్రకాశమైన జ్ఞానమే తానని అనుసంధానము పొందుటయే అంతరంగము యొక్క రెండవసమాధి.

3 స్త్రీ మొదలయిన యేవస్తువుల్ల జూచినను వాటి నామరూపములను కల్లజేసి, మిగిలిన అస్తి భాతి ప్రియాదులనే శివుడని తెలియుచుండుట బహిరంగముయొక్క మొదటిసమాధి. అనగా కృత్రిమ గారడివాని ఆటను నిజమని

నమ్మియున్న మూఢునివలె వర్తించక గారడీ ఆటవలె ఈ అఖిలజగము కల్లయని మోహరహితుడవయి యుండవలెను.

౪ సచ్చిదానందనిత్యపరిపూర్ణుడైన పరశివునితప్ప ఏ వస్తువును చూడకుండుట; అనగా పరిపూర్ణజ్ఞానానుసంధాన మందుంటుట బహిరంగముయొక్క రెండవ సమాధి. ఇట్లు అంతరంగ బహిరంగముల రెండేసి సమాధులు బహుకాలాభ్యాసముచేత నభ్యసించిన తరువాత నిర్వికల్ప సమాధుల చేయవలెను.

౫. భ్రమరము కమలమధ్యమును ఆశ్రయించి సూర్యాస్తమైన తర్వాత దానినుండి వెడలలేక అందే మాయబడి యుండునట్లు మనస్సు లింగమునందు లీనమైయుండుటయే అంతరంగము యొక్క నిర్వికల్ప సమాధి.

౬ తరంగములు లయించిన సముద్రమువలె భావరహితుడై లింగమునందు లయించియుండు స్థితియే బహిరంగ నిర్వికల్ప సమాధి.

అంతర్బహిరంగములందు ఈప్రకారము అభ్యాసము జేయుచుండ శరీరధర్మాశలు నశించి, మనస్సు ఎటుతిరిగినను లింగమునందే కూడియుండును. ఈ సమాధిబలముచేత భేదము నశించి నిజ జ్ఞానము వలన శివజీవులు యేకమవుదురు.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరాపరే॥

యను శృతి వచనప్రకారము పరిపూర్ణ జ్ఞానసాక్షాత్కారము కాగానే (అనగా పర - శివ, అపర - జీవ, తస్మిన్ దృష్టే- శివ జీవుల స్వరూపము తెలియగా అర్థాత్ లింగదర్శనమునందు నిపుణుడుకాగానే) ఆత్మ అహంకారముల తాదాత్మ్య అధ్యాసము గలిగిన (ఆత్మధర్మము అహంకారమందు అహంకారధర్మము ఆత్మయందు తోచుచున్న) హృదయ గ్రంథి నాశన మవును. రాజు నాశనమైనంతనే సైన్యము నలుదిక్కుల పరువిడునట్లు దారము (సూత్రము) తెగినంతనే ముత్యములు వేరు వేరైనట్లు, హృదయగ్రంథి నాశన మైనంతనే ఇంద్రియములు వేరు వేరై వాటి కార్యము తెలియక యుండును. లింగమే తానను దృఢజ్ఞానముచేత సర్వసంశయములు లేకుండ యవును. స్వప్నమునందు తోచిన దుఃఖము జాగ్రతయందు యెట్లు నాశనమవునో అట్లే అవిద్యా నాశనము కాగానే అవిద్యయొక్క అవరణ శక్తివలన గలిగిన జన్మజన్మాంతర అపక్వ సంచిత కర్మసమూహము కూడ నాశనమగును. అహంకారము నశించినంతనే

దానిని ఆశ్రయించియున్న ఆగామి సంచిత కర్మములు జలముచే లిప్తము గాని జలజముభంగి శివయోగిని అంటకుండును. అనగా:—

౧ శివయోగియొక్క— ధన, గృహ, మద, పుస్తకములను పుత్రులు అథవా శిష్యులు తీసుకొందురు.

౨ జ్ఞానమును ముముక్షులు తీసుకొందురు.

3 శుభకర్మ ఫలములను సకామ భక్తులు తీసుకొందురు.

౪ అశుభ కర్మ ఫలములను నిందకులు తీసుకొందురు.

ఇట్లు సంచిత, ఆగామి కర్మములు నశించి ప్రారబ్ధ కర్మరూపమైన దేహము మాత్రము నిలుచును. నిలచినను దానియందు నిరభిమానము గలిగినందున జీవన్ముక్తుడే యనబడును. యీ శరీరము నశించిన పిదప విదేహ కైవల్యము లభించును. ఈ ప్రకారము భేదములు పోగా నిశ్చింతచేత రెండులేక ఒకటే పరిపూర్ణ మహాలింగరూపమై నీవే కన్పట్టు చుందువు. మాయా నివృత్తి వలన జీవుని సర్వ వ్యవహారములు నాశ మైనందున జీవన్ముక్తుడ వగుదువు.

శి - జీవన్ముక్తుడైన శివయోగికి శరీరము వదులువరకు కర్మముజేయుట అవశ్యము గాదా?

గు - శివుడు తనచే చెప్పంబడిన ఆగమములయందు శివార్చ నాదులను దేహము వొదలువరకు ఆచరించు చుండవలెనని విధించెను. తాను జీవన్ముక్తుడైనను అజ్ఞులు తనను చూచి ధర్మాచారములను నడచుకొందురు కనుక ధర్మములను చేయుచుండ వలెను.

"జ్ఞానామృతేన తృప్తోపి యోగీ ధర్మం న సంత్యజేత్"

శివయోగి జ్ఞానామృత పానముజేసి తృప్తుడయిన స్వధర్మములను విడువకూడదు. జ్ఞానులు లోకహిత దృష్టిచేత ధర్మమును ఆచరించవలెను.

శి - జ్ఞానయోగి యే ఆచారములను ఆచరించ వలెను?

గు - ఏ శివయోగికి సర్వజగత్తు శివరూపమై కన్పట్టుచున్నదో అతడు స్వేచ్ఛచేత యే ఆచారమును ఆచరించినను అది అంతయు శివ పూజ యయి పరిణమించును. కనుక జ్ఞానయోగి చేసిన సేవా, గమన, వచన, కార్య, బుద్ధి స్తుత్యాదులు శివారాధనయే యనబడును. కనుక వేరే నియమముల చెప్పరాదు.

శి - శివుడయిన తర్వాత స్వస్థుడయి యుండవలె ననగా యేమి?

గు - స్వ-తన స్వరూపమునందు స్థ-యుండుట అనగా ద్వైతదర్శనమ్ము లేక శివ స్వరూపమునందు స్థిరమై యుండుటయే స్వస్థమన బడును. యే శివ యోగి నిరాకారుడయి భేదరహితుడై యున్న పరశివునియందు, ఈ కాన్పింపు చున్న జగత్తంతయు శివస్వరూపమే యని తెలియు చున్నాడో అతడు జ్ఞానా చారి యనబడును. అతడే స్వస్థుడై యుండును.

శి - పరాత్పర లింగ స్వరూపమునందు యున్న జ్ఞానయోగి పరశివుని పూజ చేయవలయునా?

గు - నీటియందు మునిగి యున్న వానికి నీటిదప్పి కలుగనట్లు శివ యోగికి ఆరాధనాది కోరికలు పుట్టకుండును. యేలననగా అతనినితప్ప అన్య దేవుడే లేడు. పరశివునియందు లీనమైనదే పరాపూజ. ఆపరశివునకు కేవల జ్ఞానమే అర్పణీయము. కనుక ఈ పరాత్పర లింగమునందు ఐక్యమై యున్న శివయోగికి యితర పూజోపచార వందనములు సిద్ధించవు.

పరిపూర్ణ వస్తువును పిలుచుట, సర్వాధారమైన వస్తువునకు ఆసనము వేయుట యెట్లు? సదా శుచియు పవిత్రుడు మరియు నిర్మలుడయిన వానికి అర్ఘ్యపాద్య స్నానాదులచేత ఉపయోగమేమి?

విశ్వాతీతునకు వస్త్రధారణము, నిరాలంబునకు యజ్ఞోపవీతము, నిర్వాస నునకు పుష్పము, నిర్లేపునకు గంధధారణము మంగళకరునకు ఆభరణము యెట్లు ఉపయోగము?

స్వయం ప్రకాశునకు దీపారాధనము, నిత్యతృప్తునకు నైవేద్యము, గుణా తీతునకు తాంబూలము ఎట్లు సిద్ధించును?

అనంతునకు ప్రదక్షిణము, వేదవిదూరునకు (వేదవాక్యములచేత అగో చరునకు) స్తోత్రము యెట్లు?

తానే పరాత్పరుడయిన వానికి నమస్కారము జేయుటెట్లు? అంతర్బ హిరంగ పరిపూర్ణునకు విసర్జన మెక్కడిది? ఈ ప్రకారముగా సర్వ కాలముల యందు బ్రహ్మజ్ఞానములచేత పరశివుడు పూజింపబడ దగినవాడు.

75 జ్ఞానయోగి పరిపూర్ణమునందు ఐక్యమును పొందగా మాయా శక్తి నష్టమైనందున దానివలన తోచబడు జగత్తుయొక్క దర్శనమే కాకుండును. అట్లే పుణ్యకర్మములవలన లభించు దేవతాజన్మము కేవలము

పాపకర్మములచేత లభించు క్రిమికీటకముల జన్మము మరియు స్వర్గాది లోకముల గమనాగమనములు అతనికి గలుగవు. యెందుకనగా అతడు పరిపూర్ణ మహా లింగస్వరూపుడే అయియుండును.

శి - మహాలింగమునందు ఐక్యమయిన శివయోగికి జగద్దర్శనము గాక అది యెక్కడ లయమై యుండును? అప్పుడు శివయోగి యేమగును?

గు - రజ్జువుయొక్క జ్ఞానము లేనందున రజ్జువునందు కన్పట్టు చున్న సర్పము, రజ్జు జ్ఞానము గలిగినతరువాత రజ్జువునందే లయమైనట్లు, పరశివునిస్వరూపము తెలియనందున అతనియందు దోచట్టుచున్న జగత్తు, అతని స్వరూపము తెలిసిన తర్వాత జగద్రూప ప్రపంచము తనకు కారణమైన చిచ్ఛక్తి యందే లయమవును. ఆ పరశివుడే తానను స్వజ్ఞప్తియే చిచ్ఛక్తి. అందువలన ఆ శివయోగి చిచ్ఛక్తి స్వరూపము గలవాడౌను.

శి - చిచ్ఛక్తి వలన జగత్తు జన్మించు చున్నట్లు శివయోగికి పునఃసంసారము ప్రాప్తించునా?

గు - లేదు? ముత్యము నీరునందుపుట్టి మరల నీరుగు పొందునా? పాలు సంస్కార రూపముచేత పెరుగు రూపమును పొంది మరల పాలు యగునా? స్పర్శవేది జనిత సువర్ణము మరల యినుము యవునా? సర్పమునకు కూసము విడిచిన తరువాత ఆ కూసముయొక్క సంబంధము యెట్లు గలుగదో అటులే దేహాదులను వదలి సర్వమును తెలిసిన పరిపూర్ణ పరశివుడే తానైనందు వలన జనన మరణరూప సంసారము అతనికి యెన్నటికి పునః లభించదు.

శి - షట్స్థల బ్రహ్మజ్ఞానమువలన గలుగు లింగాంగ సామరస్య మెట్లు?

గు - షట్స్థల బ్రహ్మము వలన గలుగు లింగాంగ సామరస్యవిధి అతి శ్రేష్ఠమైనది. యేల ననగా ఈ మార్గమునందు భక్తస్థలమునుండి ఐక్య స్థలము వరకు క్రమముగా సాధించుచు కడకు మహాలింగమునందు ఐక్యమగుట చేత సాయుజ్యముక్తి నిరాయాసముగ దొరుకును. కనుక నిదియే సంపాదించ దగినది.

శి - షట్స్థల బ్రహ్మజ్ఞానము దేనిచే సాధ్యమగును?

గు - భక్తిచేతనే సాధ్యమగును.

శి - జ్ఞానమే ముక్తికి సాధనమై యుండగా భక్తిమహాత్వమేమి?

గు - ముక్తి ప్రాప్తికి భక్తి సమానమైన అన్యోపాయమే లేదు. భక్తి

వలన జ్ఞానము గలుగును. మరియు భక్తి అభ్యాసము వలన ఆ జ్ఞానము దృఢ పడును. దృఢజ్ఞానముచేత యోగము (శివునియందు కూడుట) సాధ్యమవును. జ్ఞానము మరియు యోగము ఇవిరెండు సాధ్యమయి ముక్తుడవును.

జ్ఞానమనగా తెలివి. భక్తియనగా అనుభవము, అనగా: ఆనందించుట. జ్ఞానము తెలుపుచున్నది. భక్తియు తత్సాక్షాత్కారము జేయుచున్నది. కనుక జ్ఞానము మొదలు తర్వాత భక్తి తోడ్పడును. యెట్లన శర్కర తీపియని చెప్పునదియే జ్ఞానము. శర్కరను సేవించి రుచిచేత ఆనందించుటయే అనుభవము. ఈ అనుభవ మునే భక్తి యనెదరు. జ్ఞానము శివజీవులు ఒకటియే యని చెప్పును. భక్తియు వాటిని ఒకటిగా జేయును. మరియు జ్ఞానమనగా తెలియుట, భక్తియనగా ప్రేమ జేయుట. వస్తుజ్ఞానము లేక యెట్లు ప్రేమ గలుగ నేరదో అట్లే శివుని జ్ఞానము లేక ప్రేమ పుట్టనేరదు. కనుక ఇట్టి భక్తిచేత ప్రాప్తమవుచున్న షట్స్థల బ్రహ్మ జ్ఞానమే సంపాదించ వలెను.

శి - ఉపాసనముచేతనే ముక్తి దొరుకు ననుటకు ఆధారములు గలవా? ఉపాసనమే యోగము. సంయోగమే భేదమును తెగించును. భేదము నశించు టయే నివృత్తి, ఈ నివృత్తియే విశ్రాంతి. విశ్రాంతియే పరమపద మనియెదరు

సమ్యగ్యోగోహి సంయోగో భవేల్లింగాంగయోః సదా
సంయోగ ఏవ సాయుజ్యరూపా ముక్తిర్న సంశయః॥

యను ఆగమవచనానుసారము సదాలింగాంగముల ఉత్తమప్రకారముగా కూడు టకే సంయోగము గాక శ్రేష్ఠముక్తి వేరేలేదు. శ్రేష్ఠతరమైన ముక్తియే భక్తి (ఉపాసన) యని ఉత్తమ శృతి యొక్క అభిప్రాయమై యున్నది.

శి - లింగాంగముల సదానందయోగము యెట్లువుండును?

గు- దీపము ప్రకాశము, నీరు తంపు, కర్పూరము వాసన ఇవి ఒకటికొకటి శబ్ద భేదము గలిగినను స్వాభావికముగా యెట్లు సంయోగము గలిగి యుండునో అట్లే లింగాంగ సంయోగ రూపముచేత ఆత్మయందు బీజరూపముగా యున్న పరాభక్తి అన్ని భాగములయందు యిమిడి యుండును.

శి - లింగాంగ సంగముగల శివయోగికి జగత్తు తోచకుండునా?

గు - పురుషుడు ప్రియకరమైన స్త్రీని ఆలింగనము జేయగా యెట్లు అతడు లోన బయట ఏభిన్న భావము తెలియడో అట్లే ప్రాజ్ఞుడైన పురుషుడు

మహాలింగమును ఆలింగనము జేయగా (ఐక్యముగాగా) మహాలింగము వినా యేమియు తెలియదు. అద్వైత భక్తిచేత పరశివుని పూర్ణ ప్రసాదము సిద్ధించి నందువలన అతనికి సర్వజగత్తు శివరూపమై తోచును.

శి - అద్వైతభక్తి గలిగిన కర్మలోపము యెందుకుకాదు?

గు - అద్వైతభక్తిగలవాని సర్వ క్రీడాక్రియలు ఫలాపేక్ష కొరకై కాక స్వాభావిక క్రీడా రూపముగ యుండును. రూపక్రియలు శివార్చన శివార్పణ రూపముగా యుండును.

శి - అద్వైతభక్తి గలవానికి ఫలాపేక్ష యెందు కుండదు?

గు - పరిపూర్ణ పరశివస్వరూపమే తానైనవాడు ఇతర క్షుద్రవిషయముల కోరడు. అమృతమునకు ఆకలి, జలమునకు దప్పి యెట్లు గలుగదో అట్లే ఆనంద స్వరూపమే తానై యున్న భక్తియోగికి విషయముల కోరిక యుండదు.

శి - అద్వైతభక్తిగలవానికి ముక్తియొక్క కోరిక యెందుకు గలుగదు?

గు - క్షీరసాగరములో నున్న హంస పాలను, పుష్పములో యున్న తుమ్మెద పరిమళమును యెట్లు కోరకుండునో అట్లే పరిపూర్ణ శివస్వరూపుడైన శివయోగి ముక్తిని కోరకుండును. ఏలననగా ముక్తి అతనికి సహజ స్వభావము.

ఈ షట్స్థల బ్రహ్మజ్ఞానము వేదాంతసారమై యున్నను అతిరహస్య మైనది. దీనియందు అంగము లింగమునందు ఐక్యమగు రీతియు వివరింప బడినది. ఇదియేలింగాంగ సామరస్య విధి. పరిపూర్ణవస్తువే తానని తెలిసి యున్న జ్ఞాన యోగి దేహము గలిగినను ముక్తుడే యగును. అగ్నివనమునుకాల్చి తానుకూడ నశించునట్లు తెలియదగినవేరు వస్తువుయున్నంత వరకు జ్ఞానము యుండును. తెలియదగిన మరేవస్తువలు లేకుండగా జ్ఞానము లేకుండ ఉండును. నిద్రయందు నేను ఇతరుడ నను భావము, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయమును త్రిపుటి మరుజగత్తు లేనందున స్వయం ప్రకాశుడై ఆనంద రూపముచేత యెట్లు యుందువో అట్లే తెలివియే నేనను జ్ఞానశక్తి అడగిపోగా సచ్చిదానంద నిత్యపరి పూర్ణ రూప మైన మహాలింగమే నీవై ప్రకాశించు చుందువు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి యందు లింగాంగ సామరస్యమను తొమ్మిదవ ప్రకరణము సమాప్తము.

ఓం

శ్రీ శివాయనమః

# శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి

# షట్‌స్థలములు

## పదియవ ప్రకరణము.

ఆదౌ భక్తస్థలం ప్రోక్తం తతో మాహేశ్వరస్థలం
ప్రసాదిస్థల మన్యం తు ప్రాణలింగిస్థలం తతః॥
శరణస్థల మాఖ్యాతం షష్ఠ మైక్యస్థలం మతం॥

వీరశైవులు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్య యను స్థల నామకభేదముచే ఆరు విధములైరి. వీరశైవశాస్త్రము కూడ స్థలభేదముచేతను, ఆయా స్థలములందు బోధింపబడిన ఆచారభేదము చేతను, అధికార భేదము చేతను, ఆరు ప్రకారములైనది. వీరశైవశాస్త్ర ప్రసిద్ధమైన షట్‌స్థలములలో మొదటిది భక్తస్థలము, రెండవది మాహేశ్వర స్థలము, మూడవది ప్రసాది స్థలము, నాల్గవది ప్రాణలింగి స్థలము, ఐదవది శరణస్థలము, ఆరవది ఐక్య స్థలము; ఈ రీతిగ స్థలము ఆరు ప్రకారములైనది.

వీరశైవ సిద్ధాంతమునందు పరశివ బ్రహ్మము "స్థల" మని చెప్పబడును.

స్థీయతే లీయతే యత్ర జగదేత చ్చరాచరం
త ద్బ్రహ్మస్థల మిత్యుక్తం స్థలతత్త్వ విశారదైః॥

యనుప్రమాణానుసారము చరాచరాత్మకమైన ఈ జగత్తు దేనియందు ఉత్పత్తిలయములను పొందుచున్నదో, ఆ పరబ్రహ్మము స్వలీలచే అంగ లింగ మని రెండు ప్రకారము లాయెను. చిచ్ఛక్తివిశిష్ట జీవమే అంగ మనబడును, చిచ్ఛక్తి విశిష్ట పరశివుడే లింగ మనబడును. లింగాంగపదవాచ్యులైన శివజీవుల ఐక్యమే "లింగాంగసామరస్య" మనబడును. ఈ స్థలము భక్త, మహేశ, ప్రసాది, ప్రాణ లింగి, శరణ, ఐక్యయను భేదమువలన ఆరు ప్రకారములైనది.

## షట్‌స్థల స్వరూప నిరూపణము.



౧ గురౌచ జంగమే లింగే తారతమ్యవిశేషతః
పూజ్యతే త్రివిధం రూపం తద్భక్తస్థల ముచ్యతే॥

౨ యో గురూక్తేన మార్గేణ లింగపూజారతః సదా
జంగమా నర్చయేద్భక్త్యా సహి మాహేశ్వరః స్మృతః ॥ ౧౩

3 యోఽనర్పితం మహేశాని నార్చయిత్వాపి జంగమాన్
నాశ్నాతి నత్యజే స్మహ్యా మర్పితం కృచ్ఛ్రగోఽపి వా ॥ ౧౪
సోయం ప్రసాదీ కథితః సోఽహమేవ న సంశయః

౪ యథా ప్రాణే తథా లింగే యథా లింగే తథా శివే ॥
ప్రాణ లింగ శివేష్వేక బుద్ధిమాన్ ప్రాణలింగకః ॥ ౨౦

౫ ఈషణత్రయ నిర్ముక్తో నిత్య మేకాంతసేవనః
మమ ధ్యానరతో నిత్యం శరణః పరికీర్తితః ॥ ౨౩

౬ న పూజా నైవ చ ధ్యానం న యోగ కరణాదికం
అహంతాభావనాధీరః శివలింగైక్య సంజ్ఞకః ॥ ౨౫

౭ ఇదం షట్స్థలం నామ రహస్యం పరమం పదమ్ ౨౮
యద్జ్ఞాత్వా ముచ్యతే సద్యో జన్మసంసారబంధనాత్ ॥ పార.ఆ.ప.౫

గురు, లింగ, జంగము లను తారతమ్యముతో త్రిమూర్తులను పూజించు వాడే భక్తుడు. గురూక్త మార్గప్రకారము లింగపూజయందు అత్యంత ప్రీతిగలవాడు, జంగమ మూర్తులను అఖండభక్తిచేత పూజించువాడు మాహేశ్వరు డనబడును. జంగముల కర్పించక మరియు లింగార్పితము గావించక భుజించకుండువాడు, మరియు చరాచర లింగార్పితమును త్యజింపనివాడు ప్రసాది యనబడును. ప్రాణమునందును, లింగమునందును మరియు శివునియందును ఏకబుద్ధిగలవాడే ప్రాణలింగి యనబడును. దారేషణ, ధనేషణ, పుత్రేషణ యను ఈషణత్రయ ముల వదలినవాడు, ఏకాంతవాసము జేయువాడు, ఎల్లప్పుడు శివధ్యానము నందునిరతుడయి యుండువాడు శరణుడనబడును. పూజా, ధ్యాన, యోగాదు లనువాటిని వదలి "అహం శివోహం" యను భావము దృఢమైన వాడే శివ లింగైక్యు డనబడును. ఈ షట్స్థలములు అతి రహస్యమైనవి. ఈ షట్స్థలజ్ఞుడు జన్మసంసారబంధమును వదలి పరమపదమును పొందును.

త్యక్తాభిమానో దేహాదౌ భక్త ఇత్యుచ్యతే బుధైః
తచ్చిత్త మచలం యస్య సవై మాహేశ్వరః స్మృతః॥

చిత్తశుద్ధి ర్భవేద్యస్య స ప్రసాదీ ఉదాహృతః
త్యక్తజీవభ్రమ శ్చాయం లింగాత్మా ప్రాణలింగకః॥
శివనిత్యత్వ నిశ్చింతః సానందః శరణోభవేత్
శివజీవోభయభ్రాంతీ రహిత శ్చైక్య ముచ్యతే॥ శివాగమే॥

ఎవనికి దేహాదులందు, దేహసంబంధ విషయాదులందు అభిమానము వదలి పోవునో అతడే భక్తుడని చెప్పబడును. అందువలననే భక్తస్థలమునకు నివృత్తి కలయే వీరశైవశాస్త్రములందు చెప్పబడినది. మరియు తాను భక్తుడై విశ్వాత్మకుడయిన శివుడే నేనను అంతఃకరణ వృత్తియు శివునియందు అచలమైననే మాహేశ్వరు డనబడును. ఆ అంతఃకరణము శుద్ధమైన ప్రసాది యనబడును. అనంతరము నేను సుఖిని, నేను దుఃఖిని, నేను కించిజ్ఞుడను, నేను పూర్ణుడ గాను, నేను జీవుడను, పరశివుడను గాను యను జీవభ్రమ లయమొందిననే, అనగా సూక్ష్మశరీరముయొక్క అభిమానము అడగిననే ప్రాణలింగమునందు ప్రీతిగలిగి ప్రాణ లింగి యగును. పశ్చాత్ నేను శివస్వరూపుడను శివునివలె నేను నిత్యుడను. నాకు జనన మరణములు లేవు యని తెలిసినవాడై వాటికై చింతించక ఎల్లప్పుడు ఆనందపరవశుడై వవాడే శరణు డనబడును. ఆ సర్వాత్మకశివస్వరూపమే నేను యను శివాద్వైత (లింగాంగ సామరస్య) జ్ఞానము దృఢమైనంతనే ద్వైత జ్ఞానముబాసి ముక్తుడగును. ఇతడే ఐక్యుడనబడును.

శివే భక్తి స్సముత్పన్నా యస్యాసౌ భక్త ఉచ్యతే
తస్యానుష్ఠేయ ధర్మాణో ముక్తి ర్భక్తస్థలం మతం॥
కేవలం సహజే దానే నిష్ణాతః శివతత్పరః
బ్రహ్మాది స్థాన విముఖో భక్తో మాహేశ్వరః స్మృతః॥
మనః ప్రసాద సిద్ధ్యర్థం నిర్మల జ్ఞాన కారకం
శివప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీత్యేవ కథ్యతే॥
లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిం విభావయన్
తద్రూప లింగ విజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే॥
సతీవ రమణే యస్తు శివేభక్తిం విభావయన్
తదన్యవిముఖః సోఽయం జ్ఞాతః శరణ నామవాన్॥
ప్రాణలింగాదియోగేన సుఖాతిశయ మేయివాన్

శరణాఖ్యః శివేనైక్యభావనా దైక్యవాన్ భవేత్॥

ఎవని యందు నిజమైనశివభక్తి యుత్పన్నమై యున్నదో, అతడు భక్తుడనబడును. సహజ దానమునందు నిష్ఠ గలవాడు, శివాసక్తుడు, బ్రహ్మాది స్థాన విముఖుడు అయినవాడే "మాహేశ్వరు" డనబడును. ఈ మహేశ్వరుడు తన మనః ప్రసన్నతకై నిర్మలజ్ఞాన కారణమైన శివప్రసాదమును స్వీకరించుచున్నందున ప్రసాది యనబడును. పరశివబ్రహ్మము చిత్స్వరూపమనియు, ఆపరశివ బ్రహ్మమునందు గల శక్తియు ప్రాణస్వరూప మనియు తెలియు ప్రసాదియే "ప్రాణలింగి" యనబడును. తన పతినిగాక పరపురుషులందు విముఖురాలయిన పతివ్రతాస్త్రీవలె ఎవడు తనను శివుని విషయమునందు సతిగా భావించి అన్యదేవతల విషయము నందు విముఖుడగునో ఆ ప్రాణలింగియే "శరణు" డనబడును. ఈ శరణుడు ప్రాణలింగాది యోగముచేత సుఖాతిశయమును పొంది శివోహం భావనచేత శివునియందు ఐక్యమును పొందుట వలన "ఐక్యు" డనబడును. యని సిద్ధాంత శిఖామణియందు శ్రీ రేణుక భగవత్పాదాచార్యులవారు షట్స్థల స్వరూపమును నిరూపించి యున్నారు.

## షట్స్థల సామాన్య లక్షణములు

సదాచారః శివే భక్తి ర్లింగజంగమయోకధీః

లాంఛనే శరణే భక్తి ర్భక్తస్థల మనుత్తమం॥ ౧

సదాచారము, శివునియందు భక్తి, లింగజంగములందేక భావము, శివలాంఛన యందనురక్తి గలిగియుండుట ఇవియే భక్తస్థల లక్షణములు.

పరస్త్రీయం పరార్థకం చ వర్జయన్ భావశుద్ధిమాన్

లింగ నిష్ఠా నియుక్తాత్మా మాహేశ్వర మహాస్థలః॥ ౨

పరస్త్రీని, పరద్రవ్యమును వర్జించుచు పరిశుద్ధ భావముగలవాడయి లింగనిష్ఠ యుక్తాత్ముడగుటయే మాహేశ్వర స్థలముయొక్క లక్షణము.

లింగార్పిత పదార్థం చ సుభోగీ లింగమోహితః

అనర్పిత వివర్జీ చ ప్రసాదస్థల ముచ్యతే॥ ౩

లింగమోహియై లింగార్పిత పదార్థములను భుజించుచు లింగానర్పిత పదార్థము విడుచుటయే ప్రసాదిస్థల లక్షణమని చెప్పబడినది.

వాయుప్రాణగుణె లింగం లింగ ప్రాణ సమాహితః
సుఖదుఃఖోభయం నాస్తి ప్రాణలింగ స్థలం భవేత్॥ ౪

ప్రాణవాయువు గుణమునందు లింగమును భావించి లింగప్రాణ సమాహితుడై సుఖ దుఃఖములు రెండు లేనివాడై యుండుటయే ప్రాణ లింగస్థల మగును.

పతి ర్లింగం సతీ చాహం హృదియుక్త స్స్వయం ప్రభుః
ప్రాపంచిక సుఖం నాస్తి శరణస్థల ముత్తమం॥ ౫

ఆత్మాంతర్యామియైన పరమాత్ముడు తానే లింగస్వరూపమైన మగడు, నేను భార్యనని లౌకికసుఖము లేనటువంటివాడే శరణస్థలుడు ఈస్థలమే ఉత్తమమైనది.

షడూర్మయ శ్చ షడ్భావా నాస్తి చాష్టవిధార్చనం
నిభావో నిజలింగైక్య శ్శిఖి కర్పూర యోగవత్॥ ౬

షడూర్ములు, షడ్భావములు అష్టవిధార్చనములు లేక భావశూన్యుడై శిఖి కర్పూర సంయోగమువలె నిజలింగైక్యు డగుటయే ఐక్యస్థల లక్షణము. కనుక ఈ షట్స్థల లక్షణయుక్తుడైనవాడే వీరశైవుడనబడును: కనుక అట్టి షట్స్థలములయొక్క సవిస్తార విచారము జేయవలయును.

## అంగస్థలము

### భక్తస్థలము.

నిజమైన శివభక్తిగల మానవుడే భక్తుడనబడును. ఆ భక్తుడు అనుష్ఠింపదలచిన ధర్మముల ఉపదేశమే భక్తస్థల మనబడుచున్నది. బహు జన్మములందు జేసిన పుణ్యములచేత పాపసమూహము నశించి జీవుడు శుద్ధాంతఃకరణయుక్తు డగుచు ఆ శుద్ధాత్ముడయిన జీవుడు శివ జీవోభయ భేదాభేదములను తెలిసినవాడంబు తనజీవత్వమును శివతత్త్వమునందు ఏకీభవించుటకై ప్రయత్నించును. జీవులు తమ తమ కర్మానుసారముగ అన్యయోనులయందు జన్మించి, జాతి ఆయుష్య సుఖ దుఃఖ ఇత్యాదులచే పీడితులగుదురు యని ఈ కర్మయంత్ర నియంత్రితమైన ఈ సంసార చక్రమునందుండి దాటు ప్రయత్నము జేయును. ఈ నిత్యపరివర్తనము
77 జెందుచున్న శరీరసంబంధ జడపదార్థములు నేనుగానని తెలిసి ఆత్మమాత్రము నాశరహితమైనదని తెలిసి, నిత్యానిత్య వివేకియై, ఆత్మానాత్మ జ్ఞానియై జీవుని కన్న ప్రేరకుడయి యున్న ఈశ్వరుడు భిన్నమైయున్నాడని జీవాత్మ పరమాత్మ

స్వరూపమును తెలిసి, ఈ నశ్వరమైన సంసారమందు హేయబుద్ధిగలవాడయి, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను తాపత్రయములను దూరము జేయుటకై మార్గాన్వేషణము జేయనారంభించును. సతీసుతాది బంధువర్గమంతయు తన శ్రేయానుయాయులు మాత్రమె యని తెలిసినవాడయి, సమస్త వస్తువుల యందు అనిత్య బుద్ధి గలవాడయి శ్రేష్ఠమైన వైరాగ్యమును అవలంబించును. ఇట్టి వానికే పరశివబ్రహ్మమునందు జిజ్ఞాస పుట్టును ఆ నిత్యానంద స్థానభూతుడైన, జగత్సంసార దుఃఖనివారకుడయిన, చంద్రచూడామణియైన శివునియందు శుద్ధభక్తి యుత్పన్నమగును.

ఈ సంసార విముక్త మనస్సు గలవాడు నిర్మలాంతఃకరణుడై, శరీరాత్మ వివేకము గలవాడై, విరాగియై యున్న సాధకుడు సత్యవాదియై శివాద్వైత సిద్ధాంత తత్వ వివేకియై, విషయవిభ్రముడై, శివధర్మనిష్ఠుడయి, కుత్సితాచార దూరుడై, శివధ్యానాసక్తుడై, శాంతుడై, శివస్వరూపజ్ఞాతయై, భస్మ, రుద్రాక్ష శివలింగధారణ యుక్తుడై, శివలింగపూజానిరతుడై, లింగాంగసామరస్య స్వరూపజ్ఞుడై, శివాద్వైతవాదియై, శివాగమసిద్ధాంత ప్రతిపాదితాచరణా గ్రగణ్యుడై యున్న సద్గురువు నాశ్రయించును.

ముక్తియందు ప్రీతి, సంసారమందు ద్వేషము, శివభక్తులందు భక్తి, శైవ శాస్త్రములందు శ్రద్ధ ఇత్యాది గుణ విశిష్టుడైన శిష్యుని శివశక్తి పాతత్వమును పరీక్షించి ఆ సద్గురువు శిష్యునకు శివదీక్ష యను సంస్కారము చేయును. ఈ సంస్కారముచే శిష్యునికి అజ్ఞానతిమిరనాశకమైన శివజ్ఞానము బోధింప బడును. ఈ దీక్ష మూడు విధములైనది. వేధాదీక్ష, మంత్రదీక్ష. క్రియాదీక్ష శ్రీగురువు యొక్క కృపా కటాక్ష వీక్షణ మాత్రమున హస్త మస్తక సంయోగము చేత ఏ జ్ఞానక్రియాత్మక తత్వసమావేశము ఉత్పన్నమగుచున్నదో అది వేధాదీక్ష యన బడును. శివ పంచాక్షరీ మంత్రోపదేశమును జేయుటయే మంత్ర దీక్ష యన బడును. పంచకలశముల నిర్మించి దీక్షాంగభూతక్రియలచే యుక్తమైనదే క్రియా దీక్షయనబడును. ఇట్టిత్రివిధదీక్షలను గావించి ఆ సద్గురువు శిష్యునకు లింగధారణముగావించును. తర్వాత ఆ లింగముయొక్క ఉత్కృష్టతను, పూజాక్రమమును, ధారణక్రమములను బోధించును. ఈగురుదత్త ఇష్టలింగము ప్రాణలింగమే యనియు, ఈ శివలింగమును తన ప్రాణమువలెనే కాపాడి ఎల్లప్పుడు త్రికాల

ష్ఠులందు పూజించుచుండుమని బోధించును. ఇట్లు శ్రీగురువువలన దీక్షమరియు లింగ మంత్ర విభూతి యను గురుకారుణ్యములను పొంది, అంతర్బాహ్యాలింగార్చనాసక్తుడై, ఇష్ట ప్రాణ భావలింగ ములను ఏకీభవించుకొని నిత్య శివైక్యమను సమాధినిష్ఠయందు నోలలాడుచుండును. ఈలింగధారణమునకు అంగభూతమై యున్న భస్మధారణము, రుద్రాక్షధారణము, పంచాక్షరీమంత్ర జపమును నిత్యనైమిత్తికములుగ జేయుచుండును. గురు లింగజంగమాదులను ఏకభావముగ భావించి పూజించుచుండును. సమస్తవస్తువులు పరమేశ్వరునివలన ఉత్పన్నములై పరమేశ్వరుని వలననే స్థితినిపొంది పరమేశ్వరునియందే లయించుచున్నందున తనస్వకార్యము ఏమి లేదని తెలిసి సమస్త కార్యములు శివార్పణ బుద్ధిచే జేయుచుండును. తానుభుజించు పదార్థములు, త్రాగునీరుకూడ శివుని అనుగ్రహమువలననే గలిగినవని కృతజ్ఞతా పూర్వకముగా సేవించును. అనగా పరమేశ్వరున కర్పించియే గ్రహించును. కనుక శివార్పితమైన జలమే తీర్థ మనబడును, అన్నమే ప్రసాదమనబడును. ఈ విభూతి, రుద్రాక్ష, మంత్ర, గురు, లింగ, జంగమ, తీర్థ, ప్రసాదము లను అష్టావరణములు గలవాడే భక్తస్థలుడు. ఈ అష్టావరణములను మనసా, వాచా కర్మణా ఆచరించు భక్తుడు తన ఆచారమునందు నిశ్చలుడై యుండుటయే కాక, ఆచార భంగ కాలాసన్నము గలిగిన ప్రాణత్యాగమునకు కూడ సంసిద్ధుడగును గురుజంగమాదులకు, అతిథులకు అన్నపానాదులచేత తృప్తి పొందించును. పాత్రాపాత్రమును దెలిసి దానము జేయును. గురులింగ జంగమాదులకు తన తనుమనోధనములను అర్పించి నిర్లేపుడగును. ఇట్టి వీరవ్రతయుక్త వీరశైవభక్తుడు శివేతర దేవతలను, స్థావరలింగాదులను, మనుష్యులను గౌరవించునే కాని పూజింపడు. వాటి నిర్మాల్యమును సేవింపడు. స్వర్గమును మాత్రము నిచ్చు అగ్నిష్టోమాది బ్రాహ్మణ కర్మలను జేయకుండును. ఫలాపేక్షరహితుడై నందున కామ్యకర్మముల జేయకుండును. సర్వకాలములందు త్రివిధలింగధారణమువలన పరిశుద్ధుడై యున్నందున, అట్టి భక్తునకు పంచసూతకములు అంటకుండును. శివపాదోదకమే పావనముజేయగల పరమసాధన మని తీర్థ ప్రసాదముల గ్రహించి పరిశుద్ధు డగును. ఈ భక్తస్థలోక్తా చార యుక్తుడైన శివభక్తుడు సహజదానముల జేయుచు, శివాసక్తుడై బ్రహ్మాదిస్థాన విముఖుడై, వైరాగ్యాతిశయముచేత ప్రాప్త శివభక్త్యాధి

కృత గలవాడై, నిత్యానిత్య వివేకశాలియై మాహేశ్వర స్థలమును పొందును. అనగా మాహేశ్వర స్థలాచారముల జేయ నారంభించును.

## మాహేశ్వర స్థలము.

శివుడు సకల ప్రపంచముకన్న నధికుడయి సమస్త ప్రపంచము ననుగ్రహించు వాడు. జననమరణాదులచే పీడితులయి ఆణవాది మల విశిష్టులైన బ్రహ్మ విష్ణ్వాది దేవతలు శివుని సమానులు గారని గ్రహించి, సర్వ ప్రాణులకు శివుడే స్వామియను స్థిరబుద్ధితో ముక్తి నివ్వ సమర్థుడు శివుడే యని తెలిసి, బ్రహ్మవిష్ణ్వాదుల సంపత్తు నాశయుక్తమని, అల్పసుఖదాయకమని తెలిసికొని శివసుఖమునందే ప్రీతి గలవాడును, పరస్త్రీ సంగరహితుడు, పరద్రవ్య పరాఙ్ముఖుడు, శివాగమ పరాయణుడు, అహంకార మమకార దూరుడు, కామక్రోధాది నిరసనుడు, నిత్య శివ లింగైక్యుడు, సర్వోపకారము జేసెడువాడు, సర్వము తనవలెనే భావించువాడును వీరమాహేశ్వరు డనబడును.

ఈ వీరమాహేశ్వరుడు తన శివపూజా వ్రతము లందు నిశ్చలుడై యుండును. లింగపూజలేక తీర్థ ప్రసాదములను గ్రహింపడు. శివేతర దేవతలను పూజింపడు. శివేతర స్వర్గాది ఫలముల నాశింపడు. ఆతని మనస్సు శివలింగమునందు లీనమై, వాణి శివస్తుతి నిరతమై, హస్తము శివలింగ పూజాసక్తమై యుండును. ఇట్టివానిని రుద్రసమానుడని తెలియవలెను. ఈ శివ లింగైక్యనిష్ఠాపరుడగు మాహేశ్వరుడు తన శివాచారధర్మములకు విరుద్ధములగు పూర్వాశ్రమధర్మములను, ప్రాకృతాచార ధర్మములను విడువవలయును, ఏలనన శివ సంస్కారము వలన పరిశుద్ధులయిన మహాత్ములకు పూర్వ జాతి సంబంధ ధర్మములతో నేమి ప్రయోజనము? అవి అలింగాంగులగు ప్రాకృతులకే ఆచరణీయములు. వర్ణాశ్రమ ధర్మములు ప్రాకృతులకే గాని శివ భక్తులకు గాదు; శివోక్త ధర్మములే శివభక్తుల కాచరణీయములు.

ఈ స్థలమునందు మాహేశ్వరుడు తనను శివుని కన్న కించి దజ్ఞుడ ననే భేదమును తెలిసి శివపూజాసక్తు డగును. శివ జీవుల భేద వ్యవహారమే శివ పూజాదిక్రియలకు కారణమైయున్నందున శివ జీవులందు అద్వైతము ఒప్పదు. సంస్కారయుక్తము లైన లింగములందు శివుడెల్లప్పుడు యుండి యున్నందున

ప్రతినిత్యము అహ్వాన, విసర్జనాదుల జేయగూడదు. పృథివ్యాది ఆత్మపర్యంతము అష్ట విధము లైన ప్రపంచము ( పృథివి - అప - తేజస్సు - వాయు - ఆకాశ - సూర్య - చంద్ర - ఆత్మ ) శివుని శరీరమై యున్నది. శివుడు సర్వతత్వనియామకుడై ఆత్మయనబడుచున్నాడు కనుక ప్రపంచమునకు శివునకు పారమార్థిక భేదము గలదు. ఈ భేదాభేదము గల దనునదే వీరశైవ సిద్ధాంత రహస్యము. శివుడు సర్వత్ర వ్యాపించియుండునని శాస్త్రప్రసిద్ధమైనది; ఐనను తనకు ఆధార భూతమైన ఇష్టలింగమునందు మాత్రము పూజకొరకై విశేషముగా నివసించి యుండును. కనుక మాహేశ్వరుడు సర్వప్రయత్నములచేతను ఇష్టలింగమందే శివుని పూజించవలెను గాని అన్యభావనచే స్థావరాది లింగములను పూజించ గూడదు. ఇదియే సర్వగత్వ నిరాసక మనబడుచున్నది. ఈ భేదబుద్ధి శివపూజా కాలమునందు మాత్రమే యుండవలెను అన్యత్ర శివ సర్వ వ్యాపకత్వమునే తెలియవలెను. మృణ్మయఘటము మన్నునుండియు సముద్రజనితతరంగబుద్బుదఫేనము సముద్రమునుండియు, వృక్షము పత్రశాఖాదులనుండి వేరు గానట్లు శివుని నుండి ఉత్పన్నమైన చరాచరాత్మక జగత్తు కూడ శివస్వరూపమే అయి వుండును. కనుక జగత్తు సత్యమైనది. శివుని పరిణామరూపమైన దని స్పష్టముగ సిద్ధాంతమునందు నిరూపింపబడినది. మిథ్యయని నమ్మిన శివద్రోహు లగుదురు.

విశుద్ధేషు విరక్తేషు వివేకిషు మహాత్మసు
శివ స్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛనధారిషు॥

శివుడు సకలచరాచరాత్మక జగత్స్వరూపుడై యున్నను, భక్తుల హృదయమునందు విశేషముగ విరాజించుచుండును. కనుక విశుద్ధులు, వైరాగ్యశాలురు, జ్ఞానులు, మహాత్ము లయిన శివలాంఛనధారులందు సర్వాత్మకుడైన శివుడు ఎల్లప్పుడు వసించియుండును. కనుక అట్టి ధర్మాత్ముల సేవించుట వలన శివజ్ఞాన ప్రాప్తియై శివసాయుజ్యము గలుగును.

ఈ మహేశ్వరస్థలధర్మము నాచరించువాడు పశుకర్మల నాచరించక
78 శివకర్మలనే జేయుచు శివేతరదేవతల యందు ప్రీతిశూన్యత్వము గలిగి, తన ష్టలింగమునందే శివుని జూచుచు, చరాచరప్రపంచమును శివస్వరూపముగ దెలియుచున్నందున ఇకమును ప్రసాది యనబడును.

# ప్రసాది స్థలము.

నైర్మల్యం మనసో లింగం ప్రసాద ఇతి కథ్యతే॥

ప్రసాదముయొక్క మహిమను బోధించునదే ప్రసాది స్థల మన బడుచున్నది. మనస్సుయొక్క నిర్మలత్వచిహ్నమే ప్రసాద మనబడును. ప్రసాదము శివలింగ రూపుడైన శివుని ప్రసాదమువలననే సిద్ధించును. అనగ శివప్రసాదమువలననే మనస్సు నిర్మలమై నిశ్చలభావమును పొందును. ఏ వస్తువు శివున కర్పించబడునో అది శివప్రసాద మనబడుచున్నది. ఈ శివప్రసాదము వీరశైవుల మనోనైర్మల్యమునకు కారణమయినది. మనోనైర్మల్యరూప ప్రసాద సిద్ధికొరకు శివజ్ఞాన కారణమైన శివప్రసాదమును స్వీకరించు ఈ మాహేశ్వరుడే ప్రసాది యనబడుచున్నాడు. అన్నశుద్ధివలననే సమస్తప్రాణుల తత్వశుద్ధి యగుచున్న దని శాస్త్రోక్తి గలదు. ఏది శివునకు సమర్పింపబడుచున్నదో అది పరిశుద్ధమైన ప్రసాద మనబడుచున్నది. లింగనిష్ఠ గలవాడు ఎల్లప్పుడు శివ ప్రసాదమునే స్వీకరించవలెను దానిచే శివజ్ఞానకారణమైన మనోనైర్మల్యమును పొందుదురు. ఆ శివప్రసాదము శివుడు భవరోగవైద్యుడైనందున మానవులకు ఆరోగ్యకారణ మగును. చిత్తశుద్ధిగలుగజేయును. ఆధ్యాత్మిక ఆధిభౌతిక, ఆధిదైవికరూప తాపత్రయములను మహారోగములను నాశనముజేయును. ఆత్మవిద్యావికాసమునకు మూలసాధన మగును, కృత్రిమ దోషములను బోగొట్టును. శివ జ్ఞానము ఆవిర్భవించును. మోహనాశనము, వైరాగ్యసంపత్తి, నిత్యానందాభివృద్ధి గలుగును. ఈ ప్రసాదము బ్రహ్మాది దేవతలచేతను వసిష్ఠాది మహాఋషుల చేతను మోక్షసిద్ధ్యాకాంక్షచే స్వీకృతమైనది. కనుక శివభక్తుడు శివార్పితప్రసాదమునే భుజించవలెను.

"న గురో రధికం" "నాస్తి తత్వం గురోః పరం" ఇత్యాది వాక్యముల చేత శృతులు గురువుయొక్క మహిమను విశేషముగా కొండాడుచున్నవి కనుక గురువుకూడ శివుని స్వరూపుడని తెలిసి శివునివలెనే గురువుయందు కూడ భక్తి నుంచవలెను. ఇట్లు గురుమాహాత్మ్యమును, జంగమమాహాత్మ్యమును, భక్తమాహాత్మ్యమును, శరణమాహాత్మ్యమును ప్రసాదమాహాత్మ్యమును తెలిసినవాడై గురు లింగ జంగ మాదులందు తనుమనోధనముల నర్పించి, శివభక్తులందు ఆత్మ గౌరమునుంచి, శరణార్థియై శివప్రసాదములను గ్రోలుచు చిత్తనివృత్తి గలిగిన మహాపురుషుడైన ప్రసాదియే ప్రాణలింగి యనబడును.

# ప్రాణలింగస్థలము:

కర్మకాండోక్త క్రియాప్రాధాన్యమువలన ఒక్కడే భక్తుడనియు, మాహేశ్వరుడనియు, ప్రసాదియనియు ఇంతవరకు చెప్పబడినది. ఇకముందు జ్ఞానకాండోక్తమైన జ్ఞాన స్థలములు యోగము చెప్పబడుచున్నది. భక్త, మాహేశ్వర, ప్రసాది, ఈ మూడు కర్మప్రధానమై, ప్రాణలింగి, శరణ, ఐక్య, ఈ మూడుస్థలములు జ్ఞానప్రధానమై యున్నవి. యనిభావము. వీరశైవుడు శరీర ముండువరకు కర్మ జ్ఞానముల రెంటిని ఆచరింప వలెను. వీరశైవసిద్ధాంతము కర్మజ్ఞాన సముచ్చయాత్మకమైనది. చిత్స్వరూపమైన బ్రహ్మము శివలింగ మైనది. శివలింగ పీఠ శక్తియు ప్రణవాత్మక ప్రాణస్వరూపము గలదైనది. శ్రీగురువు యొక్క ఉపదేశాను సారముగ ప్రాణవాయువు మరియు ఆపానవాయువుల సంఘట్టనముచేత నాభి కంద మధ్యము నుండి యేజ్యోతి ఉత్పన్నమగు చున్నదో, అదే ప్రాణలింగ మనియు, ప్రాణాపాన వాయునిరోధులైన శివయోగుల మతమై యున్నది సూర్యచంద్రనాడుల యొక్క సంఘర్షణముచేత ప్రాణ వాయువు పరబ్రహ్మ స్వరూపమైన యే శివలింగమునందు అడగుచున్నదో అదే ప్రాణలింగ మనబడు చున్నది. ఈ ప్రకారము ప్రాణలింగమును ధరించువాడే ప్రాణలింగి యనబడును.

ప్రకాశస్వరూపమై పరబ్రహ్మ రూపమైన ఆ ప్రాణలింగము శివయోగముచే కూడిన జ్ఞానుల హృదయ కమలమునందు దీపమువలె ప్రకాశించుచుండును ఈ హృదయ కమలాంతర్గతమై, చిత్స్వరూపమై, శివమయమై, శ్రేష్ఠమై యున్న ప్రాణలింగము అంతః కరణ వృత్తి విశేషముల చేత అర్చనకు యోగ్యమైనది. ఇదియే ప్రాణలింగార్చన మనబడును. ఈ ప్రాణలింగమును గురూపదేశాను సారముగ ధ్యానించి, మానసిక వస్తువులచేత ఎల్లప్పుడు పూజించు చుండ వలెను. క్షమయే అభిషేక జలము, నిత్యానిత్యవస్తు వివేకమే వస్త్రము, సత్యవచనమే ఆభరణము, వైరాగ్యమే పుష్పమాలిక చిత్తైకాగ్రతయేగంధము, నిరహంకారమే అక్షతలు, శ్రద్ధయే ధూపము, విశ్వప్రకాశమైన మహాజ్ఞానమే దీపము, అజ్ఞాన కారణ శరీరా ద్యహంకార వర్గ నివేదనమే నైవేద్యము, మౌనమే ఘంటానాదము, శబ్దాదివిషయార్పణమే తాంబూలము, విషయసుఖ భ్రాంతి రాహిత్యమే ప్రదక్షిణము, లింగరూపమునందు ఆసక్తిగలబుద్ధియే నమస్కారము. ఈ ప్ర

కారముగ భావశుద్ధములైన మానసికోపచారముల చేత అంతర్ముఖ మైన మనస్సుగలవాడై హృదయకమలమునందు ప్రాణలింగమును పూజించవలెను.

ఈ ప్రాణలింగ పూజాక్రమ ములచేత అంత రంగపూజా నిరతుడైన ఈ ప్రాణలింగి యొక్క శివజీవైక్యాను సంధానరూప సంపత్తె శివయోగ సమాధి యనబడును. మహాలింగమే పరబ్రహ్మము ప్రాణమేజీవము, అపరబ్రహ్మ (లింగ) జీవ (అంగ)ముల ఏకత్వచింతనచేత ప్రాణలింగి శివయోగసమాధిస్థు డనబడును. చరాచరాత్మకమైన ఈజగత్తు బహిర్వాసనల వలన నానావిధమైనసంకల్పవికల్ప రూపముగ తోచుచున్నది.

వాసనా చిత్తమునందు శివానందము ప్రకాశించును. ప్రాణలింగిఆనంద ఘర్షణముచేత ఆత్మ యను అరణి (కర్ర) నుండి ఉత్పన్నమైన శివజ్ఞానరూప అగ్నివలన విశ్వ రూపమైన సమస్తపాశ సమూహమును నాశముగావించును. ధర్మాధర్మరూప కర్మము లను మూలములు గలదై, అవిద్యాపంచ క్లేశములను పణాములుగలదై యున్న సంసార మను విషవృక్షమును ఛేదించుటయందు శివ ధ్యానము గొడ్డలివంటిది. అజ్ఞాన మను రాక్షస నేత్రోన్మీలనము జేయుటకు, ఆత్మను సంహరించదగినట్టిదైన సంసారమను గాఢాంధకారములకు శివధ్యానము ప్రచండ మార్తాండ స్వరూపమైనది. శరీరము నందు ఆధార స్వాధిష్ఠాన మణిపూరక, అనాహత విశుద్ధి ఆజ్ఞాన నామక షట్చక్రరూప కమలములను భావించవలెను. ఆరు చక్రములు క్రమముగ గుద గుహ్య నాభి హృదయ, కంఠ భ్రూ మధ్యము నుండి బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివ పరశివ యను దేవతలకు స్థానములై యున్నవి. భ్రూమధ్యము యొక్క మేల్భాగము నందు గల బ్రహ్మరంధ్రమునందు వేయిరేకులుగల కమలమును భావించవలయును. ఆకమల మునందు స్వచ్ఛమైన చంద్ర మండలమును భావించి, ఆ చంద్రమండల మధ్య మునందు అత్యంత సూక్ష్మ రంధ్రమును గురుముఖముచే తెలియవలెను. అదే కైలాసస్థాన మైనది. అందున్న శివునిని బ్రహ్మదిసకల కారణ పురుషులకు కారణు డని భావించవలెను. పృథివ్యాది షట్ త్రింశత్తత్త్వముల కన్న పైనున్నవాడు సచ్చిదానందముల చేత ప్రకాశించువాడు స్వప్రకాశముచేతనే ప్రకాశించు వాడు అనిర్దేశ్యుడు, వాఙ్మనో శరీరాగోచరుడు, చిత్స్వరూ పుడైన తనయందు నిత్య సంబంధముచే యున్న ఉమా నామక మహాశక్తి చేత ప్రకాశించు వాడు, హంస

శించువాడు, హంస రూపుడైన పరమాత్మని సోహం భావముచేత (అతడే నేనను భావముచేత) ధ్యానించవలయును. శివ జీవుల ఐక్యస్థితియే శ్రేష్ఠమైన శివయోగసమాధి యనబడుచున్నది.

తన అంతరంగమునందు గల శివలింగము యొక్క ప్రత్యక్షానుభవస్థితి యేది గలదో, అదే మహాలింగముయొక్క నిజస్వరూప మని ఆత్మతత్త్వజ్ఞానుల మతము జగత్తుకు మూలకారణమైన మాయాతత్త్వము లింగముగాదు. పర బ్రహ్మస్వరూపమైన యేలింగమువలన జగదుత్పత్తి యగుచున్నదో ఆదేలింగము. ఆ లింగము సచ్చిదానంద స్వరూపమైనది. దోష రహితమైనది. సాక్షాత్ శివరూపమైనది. దీనిని విడచి ఇతరవస్తువుల లింగ మనకూడదు. బ్రహ్మాది దేవ తలు, వేదాగమాదులు ఏ వస్తువునందు లయమును పొంది పునః ఏవస్తువునుండి పుట్టుచున్నవో అదే పరబ్రహ్మ నామక లింగ మనబడును ఆ లింగమే జగ దాధారభూతమైనది. అదే శివనామకమైనది. అదే ప్రకాశమయమైనది. సూర్య చంద్ర, అగ్ని, నక్షత్రము లన్నియు ఆ లింగ ప్రకాశత్వము నుండియే ప్రకాశించుచున్నవి. కనుక ఈ చరాచరాత్మక జగత్సృష్టి స్థితి లయము లకు ఏకారణతత్త్వము స్థానభూతమైయున్నదో అదియే లింగ మనబడును. అదియే శ్రేష్ఠతత్త్వము. అట్టి లింగమునే గ్రహించి ప్రాణలింగి ధ్యానించవలెను.

శివజ్ఞానముగల జీవుడు అంగమనియు, శివజ్ఞానవిశిష్ట జీవ సాక్షాత్కారణీ యమైన శివుడు నిత్యమైన లింగమనియు, ఆ అంగలింగములు రెండు యే ప్రాణ లింగియందు గలవో అతడు అంగలింగి యనియు తెలియవలెను. జీవాత్మయందు శివలింగసామరస్యము పొందుట శివలింగమునందు జీవాత్ముని సామరస్యము పొందుట ఈ రెండు బీజాంకుర న్యాయమువలె ఎవనియందు గలదో అతడే అంగలింగి యనబడును. ఎవడు తన హృదయకమలమునందు గల జ్యోతిస్స్వరూప మైన శివలింగమును తెలిసి భావరూప కుసుమముల చేత ఎల్లప్పుడు పూజించు చుండునో అతడు అంగలింగి యనబడును. ఈ విధ ప్రాణలింగార్చనమును భావ నాప్రముఖోపచారములచేత కూడినవాడై చేయుచున్నాడో, జీవాత్మను లింగ
79 స్వరూపము చేత భావించు వాడగుచున్నాడో ఆనాల్గవస్థలము వాడైన ప్రాణ లింగియే శివజ్ఞానపరిపాకమువలన "శరణు" డనబడును.

# శరణ స్థలము

శివజ్ఞాన స్వరూపుడు లింగాంగ సామరస్యము గల అప్రాణలింగియు తానే సతి యనియు, శివుడే పతి యనియు, తెలియును. స్త్రీపురుష సంబంధము నందెట్టి సౌఖ్య ముత్పన్న మగుచున్నదో, అంగ లింగ రూప సతి పతి భావముచేత ఉత్పన్నమై సంతటి సౌఖ్యము గలవాడే శరణు డనబడును. ఈ శరణుడన్య దేవతల విషయమునందు పతివ్రతా స్త్రీ పర పురుషుల విషయము నందు వలే విముఖుడై యుండును. అన్యదేవతల పూజ జేయకుండును. శివుని వలన అనంత సుఖమును పొందిపరమానందవిశిష్టుడైన శరణుడు శివేతరదేవతాచింతనచేత ఆనం దవిశిష్టుడు గాడు. ఎల్లప్పుడు శివధ్యానమునే జేయుచు నిరతిశయమైన శివానంద మునే పొందుచుండును.

ఎవని జ్ఞానము తమోగుణమిశ్రితమైనదో అతనికి సద్గతి ప్రాప్తముగాదు. జ్ఞానయోగమునకు నిర్మలమైన సత్వగుణమే సాధనమని జ్ఞానులమతము. శాంతి (అంతరింద్రియ నిగ్రహము,) దాంతి (బహిరింద్రియనిగ్రహము) వివేకము, (నిత్యానిత్య వస్తు విచారము) వైరాగ్య విషయవిరక్తి అఖండజ్ఞానము, క్షమ. భూతదయ, సత్యవస్తుసంభవమైన విశ్వాసము, శివభక్తి, శ్రేష్ఠమైన శివధర్మము వీటిచే కూడిన శివయోగిసాత్వికు డనబడును.

కామ, క్రోధ, లోభ, మోహ, మద మత్సరము లను ఏనుగులు శివజ్ఞాన మను సింహము ముందు నిలువ సమర్థము గాకున్నందున పారి పోవుచున్నవి. రాజస తామస గుణములను శివయోగి శివ జ్ఞానముచేత దూరము జేయును. అనగా శివయోగి సాత్విక గుణయుక్తుడై యుండవలెను. ఈ తామస రాజస గుణనాశకమైన శ్రేష్ఠమైన శివతత్వజ్ఞాన మును ఏసద్గురువు బోధించునో అట్టి గురువు గురుశ్రేష్ఠు డనబడును. ఆ స్వస్వ రూప జ్ఞానముచేత సాక్షాత్కృత శివస్వరూపము గల జీవన్ముక్త స్వభావము గల శివాద్వైతభావనాసక్తుడైన గురువును సేవించి శివతత్వజ్ఞానమును ప్రాప్తి జేయవలెను. ఆచార్యులచే ఉపదిష్టమైన శివతత్వజిజ్ఞాసయే శీలమనబడుచున్నది. అట్టి శివతత్వజిజ్ఞాసారూపశీలము గలవాడే శీలవంతు డనబడును. ఈ లింగాంగ జ్ఞానమునందు నిరతుడు శివునియందు సతిపతిన్యాయము గలవాడు శివునియందే అభిమానరూప శీలమే అలంకార యుక్తుడైన శరణుడే శివైక్య డనబడును.

# ఐక్య స్థలము

తమోగుణ నిరాకరణము చేతను, జ్ఞాన నిర్దేశము చేతను, శీలసంపాదన చేతను, అంతర్లింగ పూజాది ధ్యానయోగము చేతను, సుఖాతిశయమును పొందుచున్న శరణుడు, శివునితో ఏకత్వమును భావించు చున్నందున ఐక్యుడన బడును. శుద్ధాంతకరణుడైన శరణుడు అల్ప విషయానందమందు నిస్పృహుడై, ఆణవాది మలమాయాది సంబంధమును దూరముజేసి, నిష్కళంకమైన మనస్సుతో శివుడే నేనను భావన చేత శివైక్యమును పొందిన వాడే ఐక్యుడన బడును. ఈ శివైక్యుడు చిదానంద రూప శివునితో ఏకత్వమును పొందినందున మాయా శక్తి పరికల్పిత వైభవము గల ఈవిశ్వము నంటకుండును. సర్వ ప్రపంచమును శివమయముగా చూచునదే భావము. మాయా శక్తి రూప బంధము నష్టమైనంతనే శివాద్వైతము కన్న భిన్నమైనది ఏదియు నుండదు. జీవ రూపమైన పశుత్వము గాని, శివరూపమైన పతిత్వము గాని, మాయా శక్తి మోహము చేత ఉత్పన్న మగు చున్నది. ఈఉభయము లయము గాగ పశు పతి భేదమే నిలువకుండును.

జడాజడభేద, జీవాజీవభేద, జీవజడ భేద, జీవేశ్వరభేద, జడేశ్వర భేదములను పంచ భేద రూప వల్మీకమందు గల భయంకర సంసార సర్పమును, జడచేతనైక్య రూప శివాద్వైత భావనయే నాశనము జేయుటకు దివ్యౌషధమైనది. అనగా శివైక్యుడు శివాద్వైతభావనా స్థిరత్వము గలవాడగును.

ఇట్టి శివైక్యము చేత శివత్వమును పొంది లింగైక్యమును పొందిన శివయోగి నిలచి యున్నను, నిద్రించినను, మేల్కని యున్నను, శివ జ్ఞానానుసంధానుడై నందున, ఎల్లప్పుడు శివపూజాసక్తుడై యుండును. శివలింగైక్యుడు ప్రపంచమునందు ప్రేమపూర్వకముగా ఏవస్తువుల జూచునో, ఆయావస్తువులందు ఆమహాత్మునకు శివదర్శన సంపత్తియే ప్రాప్తమగును. అనగా సర్వ వస్తువులందు ఆమహాత్ముడు శివునే జూచు చుండునని భావము. అతని ధ్యానమే శివధ్యానము. అతని నుడియే శివస్తోత్రము. అతని ప్రతి క్రియయు శివ పూజ యన బడుచున్నది. తనను, ప్రపంచమును, శివుని, అద్వైత భావము చేత చూచు చున్నందున ఏక కూటత్వము గలుగును. శివైక్యుడు ఏక కూటత్వము వలన గలిగిన శివప్రసాదమందైక్య భావన గలవాడు గావలయును.

సర్వ వ్యాపార శూన్యము, క్షోభరహితము, శివైక్య భూతము, ఐనతన హృదయమందే యేశివయోగి ఎల్లప్పుడు వినోదించు చుండునో, అతడు జీవన్ముక్తుడన బడును. సాక్షాత్ చిత్స్వరూపుడైన ఆత్మానంద శివుని, గురువును, ప్రపంచమును ఏకరూపము చేత ఎల్లప్పుడు సంయోజన చేయుటయే సహభాజన మనబడును. ఇతడు శివుడు, ఇతడు గురువు, ఇది చరాచరాత్మక జగత్తు, నేనను భేదబుద్ధి ఎవని యందు గలుగ కుండునో, అతడే విశ్వభాజకుడన బడును ఇతడు స్వామి, ఇతడు సేవకుడు, ఇతడు గురువు, నేను శిష్యుడను, యను భేద బుద్ధి యేపురుషుని యందుండకుండునో, అతడేశివాద్వైత పదాధికారి యగును ఇట్లు జనన మరణ రూప సర్వక్లేశములను నివారించు నట్టి, దోషరహితుడై నట్టి చిదాకాశరూప పరమాత్ముని యందు జీవాత్మను సామరస్య స్వభావము చేత లీనుని జేయ వలెను సచ్చిదానంద స్వరూపుడైన పరమాత్ముని యందు స్వస్వరూపమును లయము జేయ వలెను. సత్, చిత్, ఆనందమును ప్రకాశింప జేయు, జగన్మోహమును నివారించు, ఈవిద్యయే పరావిద్య యన బడును. ఇదియే ముక్తియని జ్ఞానుల మతమై యున్నది.

భక్త మహేశాది నామములు గల శివయోగి ఉత్కృష్ట శివ ధర్మము చేత ఊర్ధ్వహృత్కమలమధ్యస్థిత చిదాకాశ స్వరూపుడైన శివునితో పరమాశ్చర్యము చేత ఏకత్వ సామరస్యమును పొందిన వాడై మోక్షము నొందును

ఇంతవరకు అంగస్థలాంతర్గత భక్తాది షట్స్థల స్వరూపము నిరూపింప బడినది ఇకముందు లింగ స్థలాంతర్గత భక్తాది షట్స్థల స్వరూపము నిరూపింప బడును.

## లింగ భక్త స్థలము.

ఏ సంస్కారముచేత శిష్యునకు శివజ్ఞానము అనుగ్రహింపబడు చున్నదో మరియు మలమాయాది పాశబంధము నాశము చేయ బడుచున్నదో ఆసంస్కారము దీక్ష యనబడుచున్నది. ఏగురువువలన ఈదీక్షాసంస్కారము గావింపబడునో ఆగురువు దీక్షాగురు వనబడును. "గు" యను అక్షరము ప్రాకృత గుణ రాహిత్యమును బోధించును. "రు" యను అక్షరము ప్రాకృత రూపరాహిత్యమును బోధించును. ఇట్టి ప్రాకృత గుణాతీతము, ప్రాకృత రూపాతీతము గల పరశివబ్రహ్మ స్వరూ

ష్యమును ఎవరనుగ్రహించు చున్నారో వారే గురువులన బడుదురు. ఎవరుశిష్యులకు వీరశైవశాస్త్రోక్త రహస్యార్థములను బోధింతురో, శిష్యులనువీరశైవాచారమునందు ప్రవర్తింపజేసి. తదాచారమునే స్వయం ఆచరించుచుందురో, వారే ఆచార్యులబడుదురు. ఏగురువు భువనాధ్వ వర్ణాధ్వ పదాధ్వ కలాధ్వ తత్వాధ్వ మంత్రాధ్వములను షడధ్వములను మీరిన యోగమువలన శిష్య సమూహము నుద్ధరించ యత్నించునో, అతడు మాయా సముద్రమును దాటు ఉపాయమునకు కారణీ భూతుడైన మహాగురు వనబడును. తనయందు గల శివయోగ ప్రభావము చేత సర్వ వస్తువుల యందు అఖండ చైతన్యము ఎవని వలన వ్యక్తమగుచున్నదో అతడే విశ్వప్రకాశక గురు వనబడును.

ఈ దీక్షాగురువే శిష్యునకు భోధకుడై శిష్యుని ప్రశ్నములకు సదుత్తరములనిచ్చి వేదోపనిషదాది శిక్షణ కారణుడైన దీక్షాగురు వనబడును. శివ సిద్ధాంతమును శివజ్ఞానము నుపదేశించి ఈదీక్షాగురువు శిష్యునియొక్క హృదయ కమలమునందు గల ఆత్మరూప చిత్రమును జ్ఞానము దీపము చేత ప్రకాశింప జేయును. ఈ శివాద్వైత శ్రేష్ఠమైన ఔషధము చేత సంసారమను రోగమును నాశము గావించు గురువే దీక్షా గురువన బడును.

ఉపదేశ యోగ్యమైన వేదాంత వాక్య రహస్యార్థములను ఉపదేశించు నట్టి, శిష్యసందేహముల నివారించునట్టి ఆ శిక్షాగురువే, జ్ఞానము ననుగ్రహించు చున్నందున జ్ఞానగురు వనబడును శక్తి విశిష్ట శివాతిరిక్త జగ ద్భేద శూన్యము నిర్వికారము అయిన చిదాకాశరూప పరమాత్మ తత్త్వమును ఎవరు స్వానుభవ యుక్తిచేత ప్రత్యక్షీకరించునో అతడే జ్ఞానగురు వని పిలువబడును. భోగమోక్ష రూప సమస్త ప్రయోజనములకు సాధకమైన జ్ఞానవిశేషమును ఉపదేశించుట యందు తత్పరుడు సమస్త ముముక్షువులకు అనుగ్రహము జేయువాడు సాక్షాత్ శివుడు అయినవాడే జ్ఞానగురు వనబడును.

జ్ఞానగురువుయొక్క విశేష జ్ఞాన యోగముచేత ఏలింగమునందు క్రియ లయ మగుచున్నదో అదే క్రియాలింగము అర్థాత్ ఇష్టలింగ మని సమస్త
80 శివాగమజ్ఞులచే చెప్పబడినది. నిత్యానంద స్వరూపము జ్ఞాన స్వరూపములయిన పరబ్రహ్మనే సమస్త సత్ఫలముల సిద్ధికై సద్రూపత్వము చేత యుక్తుడై క్రియా (ఇష్ట) లింగరూపముచేత కనబడుచుండును. అద్వితీయమైన పరజ్యోతిస్వరూపమే

ఇష్టలింగ మని తెలియవలెను. లింగపూజవలననే సమస్త సత్కర్మ ఫలములు ఉదయమైనవి. సనకాది సమస్త యోగులు సకల యోగాదులను వదలి సకల యజ్ఞాదుల విడచి కఠిన తపస్సులను త్యజించి, లింగపూజ యందు ప్రీతిగలవారై మోక్ష సామ్రాజ్యమును పొందిరి. జగన్నిర్మాణాది క్రియాదికారులు సుప్రసిద్ధు లయిన బ్రహ్మ విష్ణ్వాది సమస్త దేవతలు శివ లింగమును ఆశ్రయించిన వారై తమతమ స్థానమునందు పరిశోభించిరి.

క్రియవలెనే భావముకూడ ఏలింగమునందు లయమును పొందుచున్నదో, ఆ లింగము భావలింగ మనబడును. షడ్గుణైశ్వర్య సంపన్నుడైన పరశివుడు భావ ముచే గ్రహింపబడుచున్నాడు.

అఖండ పరమానంద స్వరూపుడైన, పరశివుడుమానసికోపచారముచేత, మనస్సన్నివేశము చేతను, భక్తులకు ప్రసన్నమగునే కాని వట్టి బాహ్యాడంబర పూజలచేత ప్రసన్నుడు గాడు. అనగా అంతర్లింగార్చనమే శ్రేయస్కర మని శృత్యాగమములు బోధించుచున్నవి. స్వానుభవ ప్రమాణ గమ్యమైన జ్యోతిర్లిం గము చేత యుక్తుడైన ఈశివయోగి శిలా మృత్తికా కాష్ఠాదుల చేత నిర్మితమైన లింగమును పూజించకుండును. శివుని విషయమునందును కర్మకాండోక్తమైన ఏక్రియారూప పూజ విధింప బడినదో అది అల్పజ్ఞుల కొరకై చెప్పబడినది. అంత రంగికమైన భావపూజయు పూర్ణజ్ఞానుల కొరకు చెప్పబడినది. మహాజ్ఞాను లైనవారు శివుని గంధాక్షత ధూప దీపాది బాహ్యోపచారముల చేత పూజించక శాంతి వివేకాద్యాంతరోపచారముల చేత పూజించ వలయును.

ఆ ప్రాణలింగప్రకాశమైన జ్ఞానము ఏలింగమునందు లయమును పొందు చున్నదో జ్ఞానాశ్రియభూతమైన ఆ లింగము జ్ఞానలింగము ( తృప్తిలింగము ) మని శివతత్వజ్ఞానుల చేత చెప్పబడినది. బ్రహ్మ, విష్ణు, రుద్ర రూప మూర్తి త్రయ భేదరహితమైనదని, సత్వ రజ స్తమో గుణాతీత వైభవము గలదని ఏ పరబ్రహ్మము బోధింప బడుచున్నదో, ఆ పరశివ బ్రహ్మమే జ్ఞానలింగ ( తృప్తి లింగ ) మనబడును. స్థూలరూప ఇష్టలింగమునందు క్రియా రూపపూజాప్రాప్తి యగును. సూక్ష్మ రూప ప్రాణలింగమునందు నిర్మలభావప్రాప్తి యగును. స్థూలసూక్ష్మాతీత మైన జ్ఞానలింగము ( తృప్తిలింగము ) నందు కేవలజ్ఞాన ప్రాప్తి యగును. పరమేశ్వరునకు స్థూలసూక్ష్మరూపములు కల్పితములు కనుక

పర బ్రహ్మరూప జ్ఞాన లింగమునే సర్వోత్కృష్ట మని తెలియవలెను: ఇట్లు జ్ఞానలింగార్చకుడే జ్ఞానలింగి యనబడును.

ఎవడు ఇష్టలింగసంబంధబాహ్యాపూజను, ప్రాణలింగసంబంధాంతరధ్యాన పూజను విడచి, అఖండ జ్ఞాన లింగ స్వరూపమును పొందుచున్నాడో అతడే ముక్తుడనబడును.

ఆ జ్ఞానలింగ స్వరూపమును తెలియు జ్ఞానము ఎవరియందు గలుగునో అతడే స్వజంగము డనబడును. ఆ స్వజంగముడు స్వేచ్ఛాచారసంతుష్టుడు, జ్యోతిర్లింగనిష్ఠుడు, మునిశ్రేష్ఠుడు, మాయారహితుడు, శరీరాభిమానశూన్యుడు, అవిద్యాది పంచ క్లేశదూరుడు, లోష్టాశ్మకాంచనాదుల యందు సమబుద్ధి గల వాడు. భస్మనిష్ఠుడు, జితేంద్రియుడు, భిక్షుకుడు, పరమానందస్వరూపమైన మహాలింగమునందు లీనాత్ముడు. అతనికి శివధ్యాన, శివజ్ఞాన, భిక్షాన్నసేవన మరియు ఏకాంత వాసము లను నాలుగు కర్మలే మిగిలియుండును. మిగత కర్మలు జేయకూడదు.

స్వస్వరూపజ్ఞాన సంపన్నుడైన అహంకార దూరుడైన, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, వర్జితుడైన, శాంతి, దాంతి, గుణయుక్తుడైన సర్వత్ర శివభావన గల స్వజంగముడే చరజంగమ నామకుడై సమబుద్ధిచేత సంచరించుచుండును. ఈ స్వస్వరూప జ్ఞానియే పరజంగముడనబడును. నిత్యుడు నిర్మలస్వరూపుడు, ఉపమారహితుడు, సమస్త దోష దూరీకృతుడు, సచ్చిదా నందస్వరూపుడు, అయిన పరబ్రహ్మమునందు జ్ఞాతృత్వ కర్తృత్వ యోగము చేత సమానత్వమును పొందినవాడు. ప్రాకృత వర్ణాశ్రమ ధర్మ శృంఖలము నుండి విడువబడినవాడు, స్వేచ్ఛాచారము గలవాడు, జీవన్ముక్తుడు అయిన శివ యోగి, దేహముండి యున్నను, ఆశ్చర్యకర మహిమా సంపత్తిచే గూడిన వాడై సర్వోత్కృష్టుడై వర్తించును.

## లింగ మహేశ్వర స్థలము

పూర్వోక్త లింగ భక్త స్థలుడైన శివయోగీశ్వరుడే ప్రత్యక్ష శివుడు. అతని పూజయే క్రియ యన బడుచున్నది. శివుని పూజకొరకై ఆగమములు క్రియాప్రధానము లైనవి. విధిలోపము గాకుండ శివుడు ప్రసన్నుడగునట్లును ఆగమ ప్రమాణాను సారముగ పూజా కర్మమును ఆచరించవలెను ఈ విధియు

శివ పూజా రూపమైనది. అందు వలన జ్ఞాని శాస్త్ర విహితమైన కర్మమునందు శివారాధనబుద్ధిచే నిరతుడు గావలెను. గురూపదేశానుసారముగ శివలింగమును పూజించ వలెను. శివలింగమును పూజించిన సమస్త దేవతలను పూజించి నట్లగును. ఇట్టి శివారాధనలచే మలమాయాది పాశముక్తు డగును. శివయోగి పరాపర ముక్తి రూప ఫలోత్పత్తి యందు కర్మ జ్ఞానములు రెండున్ను ఆచరించవలెను. కర్మ జ్ఞానములు రెండును లేక కేవలము ఒక్క కర్మచేతనే గాని లేక ఒక జ్ఞానముచేతనే గాని మోక్షము లభించదు. జ్ఞానులకు జ్ఞాన సిద్ధియైనను నిష్కామకర్మ విధింపబడినది. అందుచే ఫలాపేక్షశూన్యమైన కర్మను విడువగూడదు. ఏ ఫలమును అపేక్షించకనే శివపూజా కర్మమును జేయుచుండవలెను. పరమేశ్వరుడు ఆచారయుక్తమైన జ్ఞానముచేతనే ప్రసన్నుడగును. అందువలన జ్ఞానియు స్థూలశరీరమును విడుచువరకు ఆచారయుక్తుడై యుండవలయును.

నేనే శివుడ నను భావమే శివత్వప్రాప్తికి కారణమగుచున్నది. కేవల జ్ఞానముగాని కేవలాచారముగాని శివత్వప్రాప్తికి కారణము గానేరదు. శివ భావముగలవాడే శివస్వరూపు డగును. జ్ఞానము "ఈ వస్తువు ఇట్టిది" అను వస్తుస్వరూపమును మాత్రము నిర్ణయించును అయినను ధ్యానము నిర్ణీతమైన వస్తుప్రాప్తికి కారణమగును. అందువలన జ్ఞానియు శివుని తెలియుటకే శివభావయుక్తు డగును. అర్థాత్ శివస్వరూపుడగు నని భావము. అర్థశూన్యమైన వాణియు, పతిరహితురాలైన స్త్రీయు, వేదాగమసమ్మతముగాని జ్ఞానము ఎట్లు ప్రయోజనకరములుగావో అటులే భావశూన్యమైన క్రియయుకూడ నిష్ప్రయోజన మగును. కనుక పరమేశ్వరుని ధ్యానశుద్ధమైన మనస్సుచేత పూజించవలెను. మానవునకు కేవల భావము చేతను, కేవల కర్మ చేతను, ఏ ఫలము గలుగదు. భావ కర్మములచే కూడిన జ్ఞానమే మోక్ష దాయకమైనది. జ్ఞాన హీనమైన కర్మ ఎప్పుడును మానవుల సంసార ప్రవృత్తికి కారణమగు చున్నది. అర్థాత్ కర్మజ్ఞాన యోగమే ముక్తి కారణమని యవగతమగు చున్నది. అందు వలన నిగమాగమ ప్రసిద్ధ వీరశైవ శాస్త్రాభ్యాసాది ప్రయత్నముల చేతను, సద్గురువు ఉపదేశము చేతను, శివజ్ఞానమునే ప్రధానముగ అభ్యసింప వలెను. నాశ శీల స్వర్గాది ఫలప్రదాయకమైన కర్మల చేత ప్రయోజనమేమియు లేదు. శివ

తత్వము కన్న అతిరిక్తమైన తత్వమే లేనందున, చరాచర వస్తువులకు శివునితో సిద్ధమైన అద్వైతమే స్థిరమను పరిపక్వ నిర్ణయమే జ్ఞానమనబడును. ఆజ్ఞానము చేతనే సంసార బంధము నుండి ముక్తి గలుగును సర్వ ప్రపంచము శివ స్వరూపమైనది. శివుని నుండి వేరైనదేదియు లేదు. ఇట్టి అద్వైత భావన గలుగ కున్న మోహము నష్టము గాదు.

శరీరము క్రియా భావ జ్ఞానములకు ఆవశ్యకమైనది. శరీరము లేకుండె నేని క్రియాభావజ్ఞానములకు స్థానమే లేదు. ఇందుచే శివ యోగి శరీరము గలిగి యుండుటయే ఆవశ్యకము. శివైక్య జ్ఞాన యుక్తుడైన మహాత్మునకు భోగమోక్షాదులు శరీర సబంధము చేతనే సిద్ధించు చున్నవి. కట్టె లేకున్న అగ్ని ప్రకాశించ నట్లు, శరీరము లేక శివయోగి ఆత్మ తత్వ ప్రకాశకుడు గానేరడు. నిష్కలుడు, పరిపూర్ణుడు, మహాదేవుడైన ఆపరమేశ్వరుడు గూడ జగత్సృష్ట్యాది సిద్ధికై సాకారుడై గన్పట్టును. బ్రహ్మాది దేవతలు, మోక్షాపేక్షులైన మునులు కూడ, శరీరులై సర్వ సిద్ధుల కొరకు తపస్సు జేయుదురు. "శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అని చెప్ప బడినది. కావున శివయోగి శరీరము తోడనే సర్వ సిద్ధుల పొందును.

శివయోగి ఔపచారిక దేహము గలవాడై యున్నను, ప్రపంచమును స్వస్వ రూపముగ తెలియు చున్నందున, మాయా సంబంధ శూన్యుడై నందున అకాయు డనియే పిలువ బడును. శివోపచారమునకై దేహము గలిగియున్నను, కామక్రోధాది వికారముల విడనాడి నందున, దేహాభిమాన శూన్యత్వము గలిగినందున, అహంకార జనిత భ్రాంతి రహితమైనందున, ఇంద్రియ జనిత దుఃఖ ములు లేనందున అకాయుడనే యన బడును

అకాయుడగు శివ యోగి ప్రకృతిని జయించి తన వశము నందుంచు కొన్నందున, మాయామార్గమును మీరినందున సచ్చిదానంద రూపుడైన పర కాయుడనియే చెప్ప బడును. జ్ఞానానందములచే ప్రకాశించు చున్న పరబ్రహ్మ మెవని శరీరమై యున్నదో, ఆపరకాయ శివయోగికి ప్రకృతి సంబంధ శరీరముచే ప్రయోజనమేమియు లేక యుండును. ఆత్మ జ్ఞానము గలిగి నంతనే శరీరసంబంధ
81 సంసార దుఃఖము నాశనమగును

పరబ్రహ్మ శరీరియైన శివయోగికి ఏధర్మాచారము సమ్మతమగుచున్నదో

ఆధర్మాచారము సర్వ జన కళ్యాణ సమర్థమగును

అహింసాసత్యమస్తేయం బ్రహ్మచర్యం దయా క్షమా
దానం పూజా జపోధ్యాన మితి ధర్మస్య సంగ్రహః ॥

హింస జేయ కుండుట, దొంగిలింపమి, సత్యము బలుకుట, బ్రహ్మచర్యము చేత ఇంద్రియ నిగ్రహము గలిగి యుండుట, దయ, క్షమ, దానము, శివపూజ, పంచాక్షరీమహామంత్ర జపము, శివధ్యానము, ఇవియే ధర్మములు. ఈ ధర్మములు శివాగమములందు శివునిచే చెప్పబడినవి. ఇవియేఆచరణ యోగ్యములు. ధర్మమే జనుల భోగమోక్ష ప్రాప్తికొరకు కారణమై యున్నది. యోగియు తాను నిస్పృహుడైనను ధర్మ మార్గమును విడువ కూడదు. లౌకికులు జ్ఞానుల ఆచారమును జూచివారివలెనే వర్తించెదరు. కనుక యోగులు లోకసంగ్రహము కొరకైన ధర్మాచరణ చేయుచుండ వలెను. శివుడు సదాచారప్రియుడు కావున సదాచారము చేతనే పూజింప బడును. సదాచారము లేక శివ ప్రసాదము సిద్ధించదు.

ధర్మాచార సంపన్నుడైన శివ యోగి యొక్క శివభావనయే భావాచారమన బడుచున్నది. ఈభావము మనోవ్యాపార స్వరూపమై యుండవలెను. భావ యుక్తమైన శివపూజాదికర్మ అత్యంత పవిత్రమైనది. కావున ఆచార ధర్మమును భావ సహితముగ ఆచరింప వలెను.

భావాచార సంపన్నుడైన శివయోగి యొక్క జ్ఞానపూర్వక ఆచారమే మానవోద్ధారము కొరకు జ్ఞానాచార మన బడుచున్నది పర తత్వ ప్రకాశము పరిపూర్ణ శివాద్వైత జ్ఞానము నెవడవలంబించి ప్రవర్తించునో, అదే జ్ఞానాచార మనబడు చున్నది. నిర్వికల్పము, నిష్కలము, శివనామకమైన పరబ్రహ్మమందు సమస్త జగత్తును అభేదజ్ఞానము చేత యోజించు వాడే జ్ఞానాచారి యనబడును శివాద్వైత జ్ఞానమే నిజమైన జ్ఞానమని జ్ఞానుల మతము. శివజ్ఞానము ఆణవాది మలసంబంధ రహితమైనది. మోక్షమును గలుగ జేయునట్టిది. కావున శుద్ధాచారము గలవాడు, శుద్ధ భావము గలవాడు, జ్ఞానియు, సర్వత్ర ఒకే విధమైన తేజస్సును జూచు వాడు, శివాద్వైత జ్ఞానాగ్ని చేత ప్రకృతిజన్య దేహనాశము గావించువాడు, అగు శివయోగి జీవన్ముక్తుడై లౌకికుల వలె వ్యవహరించును అనగా మహేశ్వరస్థలోక్త శివయోగి భేదరహితుడుగాన జీవన్ముక్తుడే యనబడును.

# లింగ ప్రసాది స్థలము.

జ్ఞానాచార సంపన్నుడైన శివయోగి తన శరీరమును చూపించు నంతటి వాడై ప్రాకృత జనులననుగ్రహించు చున్నందున, కాయానుగ్రహుడన బడును. అనగా శరీరియయ్యు శివయోగి సకల మానవుల ననుగ్రహించు చుండును. శివయోగి దర్శనము చేత, ఇంద్రియ వివేకము చేత, ప్రాణులకింద్రియానుగ్రహము గలుగు చున్నందున, తత్వజ్ఞులు దీని ఇంద్రియానుగ్రహమందురు. శ్రోత్రాది సర్వేంద్రియములకు స్వస్వ విషయములందు సంబంధము గలుగు చున్నందున ప్రీతి గాని, ద్వేషము గాని, ఉత్పన్నమగు చున్నది. కనుక శివయోగి ఈ రెండిటిని విడువ వలయును. ఇంద్రియ బహిర్వ్యాపారము (దుఃఖరూపమగు) ప్రపంచ మును ప్రకాశింప జేయుచున్నది. ఇంద్రియ వృత్తి అంతర్ముఖమై శివుని యందు సంబంధము గాగ అదియే మోక్షకారణమగు చున్నది. బాహ్యేంద్రియ సంగ శూన్యమైన మనస్సు చేత అంతర్ముఖుడై క్షణము శివుని జూచువాడు, క్షణము బాహ్యేంద్రియముల చేత బాహ్య విషయముల ననుభవించు వాడు, శివుని యందు మనస్సును లయించిన శివయోగి సమస్తేంద్రియములచే కూడి యున్నను ఇంద్రియ శూన్యుని వలె యుండి లోపైట శివునే జూచు చుండును.

ఇంద్రియ వ్యాపారమును శివుని యందు సంబంధించి, దేహాభిమానము వదలిన మహాత్మునకు జరామరణములుగాని, క్షుధాతృష్ణలుగాని యుండ కుండ ఉండును. సర్వత్ర స్వేచ్ఛాచారుడైన శివయోగి అంతర్బాహ్య ప్రవృత్తి చేత ఇష్ట ప్రాణ రూప శివ లింగమును అంతర్బహిరంగము లందు పూజించు వాడై నందున శివసుఖము ననుభవించును.

మనుష్యుల శరీర ధారణమునకు ప్రాణము ముఖ్యమై యున్నది. ఇట్టి ప్రాణమునకు కారణుడైన శివుడాధార భూతుడై యుండును. రేచక పూరక కుంభకములను యోగము చేత శివయోగి ఇంద్రియముల తోడ ప్రాణమును మనస్సునందు సంయోగము జేసి శాంతబుద్ధి గలవాడగును. అప్పుడు మనస్సు సంకల్ప వికల్ప ప్రవృత్తులను మాని శాంతమగును. మనస్సు శాంతమై నంతనే ఆ యోగికి శివుని కన్న వేరైన దేదియు గాన్పించదు.

వినష్ట వాసనా కర్మము చేతను, ప్రాణవ్యాపార నాశము చేతను, శివివు

యందు సమరస భూతమైన ఇంద్రియ వ్యాపారము గలిగి అచలుడై యున్నందున నిజమైన శివయోగి యన బడును.

ఈసర్వానుగ్రాహకుడు పరశివ స్వరూపుడైన శివయోగి యొక్క శివ లింగ పూజయందు దేహాభిమాన త్యాగము కాయార్పణమన బడును. కనుక శివయోగి రూపము శివ స్వరూపమే. అతడు ఇంద్రియ సుఖమును విషయ సుఖమును శివుని యందు సమర్పించి తాను నిర్మలుడగును. ఇంద్రియ సంబంధ విషయ సుఖమును శివుని యందు సమర్పించుటయే కరణార్పణ మన బడును. అహంకార మమకార రూపము చేత ఉన్మత్తములైన మనో బుద్ధి చిత్త (అంతఃకరణ) రూప గజములను ఎవడు శివరూప బంధన స్తంభమునందు బంధించునో, అతడు సర్వ సిద్ధుల పొందిన జ్ఞానియని తెలియ వలెను. ఇంద్రియ వశీకరణమే నివృత్తి యన బడును. శివయోగి సర్వేంద్రియములను సుఖసాధన మైన శరీరమును శివపూజాంగ భావముచేత తెలియువాడై మోక్షమునొందును.

శివలింగ విషయమందు భావముల సమర్పణమేది గలదో, దానినే శివరహస్యజ్ఞులు భావార్పణమందురు. సర్వ ప్రాణుల బంధమునకు గాని, మోక్ష మునకు గాని, మనస్సే మూలకారణమైనది. మనస్సు శుద్ధమైన మోక్షము, అశుద్ధమైన దుఃఖమయ సంసార ప్రాప్తి యగును. "శివోహం" నేను శివుడనను స్వస్వరూపానుభవ యోగమే భావ శుద్ధి యన బడుచున్నది. "నాహంశివః" నేను శివుడను గాను. అను విపరీత భావము గలుగుటచే సంసార దుఃఖనివృత్తి యెట్లు గలుగును? కలుగదనియే భావము. ఉపభోగము జేయు నట్టి జీవుడు ఉపభోగమునకు యోగ్యమైన వస్తువు, ఉపభోగించ ప్రేరేపింప జేయు శివుడు, మరియు చరాచరాత్మక జగత్తు మొదలగు వాటిని శివస్వరూపముగ భావించు వాడు పారమార్థిక దృష్టి చేత శివుడే యగును.

ఎల్లప్పుడు ఎవడు శివయోగి వలన పారమార్థిక శిక్ష పొందునో, ఆ శివ యోగి ప్రసాదముచే మోక్షము నొంద గోరునో, జ్ఞాన వైరాగ్యాది గుణముల చేత శ్రేష్ఠుడనబడు తన గురువు యందు మనోవాక్కాయములచే పూజాధ్యాన స్తోత్ర రూపాది కర్మలచేత స్థిరభావము గలవాడగునో, యమనియమాద్యష్టాంగ యోగనిష్ఠుడై సత్యవాదియై, సమలోష్ఠ కాంచనుడై, గురు శివులందు సమ బుద్ధి గలిగి యుండునో, అతడే శిష్య శ్రేష్ఠుడన బడును. అనగా గురుశివులందు

భేదము కల్పించ గూడదు. ఇతడు సద్గురు కృపాకటాక్షమునకై జేయు నదియే గురుశుశ్రూష యనబడును. శ్రీగురుమూర్తి శిష్యునకీజ్ఞానము చేత సంసార దుఃఖ నాశము గావించునో, ఆతత్వమును బోధించును. సచ్చిదానంద స్వరూపుడైన శివుడే శ్రేష్ఠ మైన తత్వము. శివుడే నిత్యుడు. "శివోహం" భావమును నమ్మి శివేతర భావమును వదలుము. అర్థాత్ సర్వమును శివ స్వరూపముగా భావించుము. అని శివాద్వైతమును గురువు శిష్యునకు బోధించును. ఇట్టి గురూపదేశవాక్యామృతాస్వాదనముచేత శివాద్వైత జ్ఞానరూప ఫలమును సంపాదించుకొనిన శిష్యుడు సర్వులకు సేవ్యుడగును.

నేను శివుడనో కానో యను సంశయ పాశము నుండి విడివడిన వాడు మోక్షదాయక మగు శివజ్ఞానమునందు ధృఢమగు మనస్సు గలవాడు, మహా సంసారమునకు మూలభూతమగు అజ్ఞానమును కృపాదృష్టిచేత నివారించు వాడు సచ్చిదానంద స్వరూపుడు, ఉపమాతీతుడు, శివసంబంధముగల పరాత్పరపథము నందు ఆత్మను లయము జేసిన వాడు, విశ్వ వైభవమును దెలిసిన వాడు, అగు శివయోగి సర్వుల చేతను పూజనీయుడని తెలియ వలయును.

## లింగ ప్రాణ లింగ స్థలము

శ్రీగురూపదేశము చేత జీవ భావమును త్యజించి, ఎప్పుడు శివతత్వము ననుభవించునో అప్పుడాతడు ఆత్మ యనబడును. అణురూపమైన ఆత్మ ప్రాణులఅంతఃకరణము నాశ్రయించి, ఆణవాది మలత్రయ సంబంధముచేత ప్రాచీన కర్మ పాశ బద్ధుడగును. ఈపాశబంధమే ఆత్మనుసదా సంసారము నందు ముంచు చుండును శరీర రహితుడైనను, సర్వత్ర వ్యాపకుడు, సర్వ వ్యాపకుడైనను నిర్లిప్తుడు, ఐన ఆత్మ, మాయామయ శరీరము నందున్నవాడై, జననమరణరూప సంసారము నందు దిరుగు చుండును. దేహము ఆత్మ గాదు. విటికన్నిటి కన్న ఆత్మ భిన్నమై యున్నదని తెలిసి అపరిచ్ఛిన్న పరబ్రహ్మము చేత స్వస్వ రూప జ్ఞానమెప్పుడగునో, అప్పుడే ఆత్మ ప్రాప్తి యగును

ఆత్మ దేవ యక్ష గంధర్వ రాక్షస మానవ పశు పక్ష్యాదులలో ఏదియు
82 గాదు. జంగమ స్థావరముల్లో ఏదియు గాదు. ఐనను ఆయా శరీర సంబంధము వలన ఆయా నామములచే ప్రకాశించు చుండును జీవులు నానావిధ ప్రాచీన కర్మ విపాకము వలన దేవతిర్యఙ్మనుష్యాది నానావిధ యోనులందు జన్మించుచు,

నానావిధాకృతులచే కూడినవై, నానా విధ బుద్ధులచే చంచలమై, నానా విధ శాస్త్రమార్గ ప్రవిష్టములై, నానావిధ సంకల్ప భూయిష్టములై, అస్వతంత్రములై, కించిజ్జ్ఞములై, కించిత్కర్తృత్వ భూయిష్టములై, శివపరమాత్మునకు క్రీడారూపము లగుచున్నవి. తమ తమ కర్మాను గుణముగా పరమేశ్వరునిచే ప్రేరితులైన జీవులు, స్వర్గమును గాని, నరకమును గాని, పొందు చున్నవి. స్వర్గనరక ఫలానుభవానంతరము అల్పావశిష్ట మైన ఆకర్మ ఫలము ననుభవించుటకు పునః గర్భనరకమున బుట్టుచురు చత్తురు. చచ్చి పునః పుట్టుదురు. పునః చత్తురు. ఇదే రీతిగ విశ్రాంతి యే మాత్రము లేక ఘోర సంసారము నందు సదా దిరుగు చుందురు. ఆణవాది మల బద్ధము, దుఃఖమయము, ఐన జీవత్వము (జీవభావము) శ్రీ గురు బోధ చేత తొలగి జ్ఞానశక్తి ప్రకాశించును. శ్రీ గురు బోధ చేత జీవభావ మెప్పుడు తొలగునో, అప్పుడు జీవ భావ శూన్య మైన ఆత్మకు నిశ్చయమైన అంతరాత్మ భావము గలుగును. మమత, అహంకారము, ఉపాధి లేని యీఆత్మ దేహముందున్నను, యోగసాధన చేత ఎల్లప్పుడు శివునే జూచు చుండును. మరియు శివజ్ఞాన సంబంధము చేత ఆనంద మయ మగును.

సంసారవ్యాధకు మూలమైన అజ్ఞానము శివాద్వైత జ్ఞానముచేత నష్టము గాగ, ఈఅంతరాత్మకు పరమాత్మునియందు సామరస్యము గలుగు చున్నందున పరమాత్మ యందు సమరస భూతమైన ఈఅంతరాత్మ పరమాత్మ యన బడును. విశ్వ మాయా విలక్షణమైన పరమాత్మ సర్వత్ర ప్రకాశమానమై, స్వయంజ్యోతి స్వరూపమై ప్రకాశించు చుండును. ఇతనికి దేహాభిమాన ముండదు. తనను అపరిచ్ఛిన్న జ్ఞానాకాశ స్వరూపుడనియు, అద్వితీయుడనియు, ఆనంద స్వరూపుడనియు, శివస్వరూపుడనియు భావించును. సర్వము స్వస్వరూపముగను. శివ స్వరూపముగను భావించును. ఇతడు నేను వేరు, శివుడు వేరు, జగత్తు వేరు, అను భావమును నిరాకరించి నందున, ఇంద్రియ వికారముల నుండి విడుదల గలిగినందున ఈతని మనోభావము నిర్భావమన బడును. భేదశూన్యమైన మహాజ్ఞానము నందు జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ రూప త్రిపుటీ మయ ప్రపంచము శూన్యమైనందున నిర్భావాగమ స్థల సంపన్నుడైన ఈశివ యోగి విషయమందు భేద జ్ఞానము నష్ట మైనందున ఇది నష్టాగమ మన బడు చున్నది. భేదము నష్టము గాగ నేను కర్తను గాను. తెలియు వాడనుగాను. దేహము గాను. నిరంజ

కుడ నని తెలియు శివయోగికి శివాద్వైత జ్ఞానమే గలుగు చున్నది.

శివుడు సృష్ట్యాది పంచ కృత్యములకాదికారణు డగును. సర్వాధి భూతు డైన ఆపరశివుని ప్రసాదము చేత వికార రహితుడైన శివయోగి ఆది ప్రసాది యన బడును. అనేక జన్మ పరిశుద్ధుడు, దేహాద్యభిమాన శూన్యుడు, నిర్మల చిత్తుడు, ఐన శివయోగి మోక్షము ననుగ్రహించుటకై శివుడు ప్రసన్నుడగును. శివ ప్రసాద సంపత్తి చేత శివస్వరూపమును పొందిన శివయోగి ఈ చరాచర ప్రపంచమును శివునకన్యమని తెలియ కుండును.

భూమ్యాది శివాంతమైన సర్వ పదార్థముల లయమున కాశ్రయమైన శివుడు అంత్యుడన బడును. శివసాక్షాత్కారమే ప్రసాదమన బడును. ఆప్రసాద మును బొందిన ప్రసాది అంత్య ప్రసాది యనబడును. దేవమనుష్య పశు పక్ష్యాది వ్యవహార కల్పన మాయ చేత ఉత్పన్న మగు చున్నది. పర తత్వమందు ఆ మాయ లీనము కాగ మనుష్యాది కల్పన గూడా నష్టమగుచున్నది సచ్చిదా నంద పరశివతత్వ ప్రత్యక్షముచే మాయ నష్టమగుచున్నది. పరశివ తత్వము శివ రూపుడైన శ్రీగురువు వలననే తెలియ బడు చున్నందున సద్గురువు సేవ్యుడగును ఇట్టి గురూపదేశానుభవమే ప్రసాద మన బడును. శ్రీగురువే పరతత్వము: పర తత్వమే శ్రీగురువని, తెలిసి గురు శివులందు భేదము గల్పింప గూడదు. సచ్చి దానంద స్వరూపుడైన శివుని ప్రకాశింప జేయు జ్ఞానామృతముచే తృప్తి జెందిన శివయోగికి భోజ్య వస్తువులచే ఫలమేమి:? పరమానంద స్వరూపముగు ముక్తి యే తృప్తి యన బడును. నిత్య తృప్తుడు, శివైక్య జ్ఞాన సంపన్నుడు, దేహభ్రాంతి రహితుడు, ఐన శివయోగికి పూజాది కర్మలచే గాని, ధ్యానాదులచే గాని, ప్రయోజనమేమియు లేదు.

## లింగ శరణ స్థలము.

చిత్క్రియా దీక్షచే ప్రాప్తమైన పరద్వైత జ్ఞానము గలదో దాని చేతనే గురు శిష్యుల ఆనందైక్యమే దీక్షాపాదోదక మన బడును. పాదశబ్దము ఆనంద మన బడును. ఉదక శబ్దము జ్ఞాన మన బడును అథవా పాదమనగా గురువు; ఉదక మనగా శిష్యుడు. శిష్యమస్తకాఘ్రాణ దీక్షావిశేషముచేత గురుశిష్యుల ఐక్యము చెప్ప బడినది. బ్రహ్మజ్ఞాన ప్రకాశకుడైన శివయోగి పరమానంద స్వరూప

మునుపొంది భేదమునెక్కడను జూడకుండును. దేశకాలాది విచ్ఛిత్తిశూన్యము, నిత్యనిర్మలము, అగు బ్రహ్మానందమును శివయోగి పొంది అన్యము నేదియు కోరకుండును.

గురుశిష్య స్వరూపైక్య జ్ఞానము శిక్షాజ్ఞాన మన బడును. ఆగురుశిష్య సామరస్యమే శిక్షా పాదోదక మన బడును నిత్యానందముచే తృప్తి జెందిన శివయోగికి క్షణిక సుఖములందు ఇచ్ఛ గలుగదు. సంసార భ్రాంతి యుండదు.

ఎవడు సద్రూపపరబ్రహ్మ సామరస్య సంపత్తిచే ఉత్పన్నమైన ఆనందము గలవాడో, అతడే జ్ఞాన గురువన బడును. అట్టి గురువు తోడ గల శిష్యుని సామరస్యమే జ్ఞానపాదోదక మని జ్ఞానుల మతము నిత్యానంద రూపకమైన, సజ్జన రూపకమైన, నిర్మలమైన, జ్ఞాన తేజస్సు నుండి మనస్సును లయింప జేసిన శివయోగికి స్థూల ప్రపంచ కల్పన గలుగ కుండును. బ్రహ్మ విష్ణ్వాది దేవతలు అత్యల్ప సుఖదాయకులై తోచు చుందురు.

అగ్ని చేత కాల్చ బడిన బీజములు ఎట్లు అంకురించవో అట్లే శివ జ్ఞాని చేయు కర్మలాతని పునర్జన్మ కారణములు గాకుండును.

పరిపూర్ణ బ్రహ్మానందముననుభవించు చున్న శివయోగికి పుణ్య పాప రూప నానావిధ భోగ ఫలముల గలిగించు కర్మ బాధ యుండదు.

శివయోగికి భావము చేత సంబాధముండదు. శివయోగి యందు నేను జ్ఞాతృవును; ఇది జ్ఞేయమనుభేదవ్యవహారము నిలువదు.

ఘటోపాధి విశిష్ఠమైన ఆకాశము స్వస్వరూపము చేత ఎట్లు పరిపూర్ణ మగునో, అట్లే శరీరమందు గల ఆత్మ తన సచ్చిదానంద రూపముచేత పరి పూర్ణమై ప్రకాశించు చున్నది. మజ్జామాంసాది సప్త ధాతువులచే నిర్మితమైన ఈ శరీరము శివరాజధాని యన బడుచున్నది. ఇందు సూక్ష్మాకాశము చేత శోభించు చున్న హృదయ కమలమంతఃపురమగు చున్నది. ఆ అంతఃపురమందు సచ్చిదానంద స్వరూపుడు, ప్రకాశమయుడైన శివుడు స్వచ్ఛమగు జలమునందు కన్పించు ఆకాశము వలె ప్రత్యక్షముగా కన్పించు చుండును. ఉపాధి దూర మైన ఘటాకాశము స్వభావతః అవిచ్ఛిన్నమైనట్లు హృదయాకాశ మధ్య గల సమస్తోపాధుల నుండి దూరమైన, చిత్స్వరూపమైన పరశివుని అపరిచ్ఛిన్న ముగ భావించ వలెను పరాత్పరుడు, చిత్ప్రకాశ స్వరూపుడు, ఐన శివుడొక్కడే

సమస్త ప్రాణులహృదయ కమలమును ఆశ్రయించి పరిమితుడై ప్రకాశించు చుండును. ఐనను శివుడు సర్వత్రవ్యాపకుడై యున్నందున భిందాకాశమనియు, విభువనియు తెలియబడును. ఆత్మస్వరూపుడైన శివుడు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్త్యాది భేదములచేత విశ్వవ్యాపకుడగును.

బ్రహ్మాండ పిండాండములందు గల ఆకాశమెట్లు భిన్నమై యుండదో, అటులే శివయోగి ఆత్మకన్నను పరమాత్ముడు భిన్నుడుగాకుండును. శివయోగి ఆత్మ పరమాత్మ ఈరెండును ఒక్కటే యైయున్నను అభేదమునే జ్ఞానులు మహాకాశ స్థలమనెదరు. ఘట మఠము లందు గల ఆకాశమెట్లు భిన్నము గాకుండునో, అటులే బ్రహ్మాండ పిండాండములందుగల ఆత్మభిన్నముగాకుండును.

అనిర్దేశ్యము, ఉపమాతీతము, వాఙ్మనస్సుల కగోచరము, సర్వతోముఖ యుక్తము, ఉత్పత్త్యాది క్రమయోగ శూన్యము, స్వానుభవ ప్రమాణ గమ్యము సూర్యచంద్రాది సమస్త తేజోవస్తువుల ఉత్పత్తికి స్థానభూతము, పరమాకాశ స్వరూపమైన శివనామక పరబ్రహ్మము లింగమన బడుచున్నది. ఇట్టిలింగమును విడచి చరాచర ప్రపంచ ముండదు. సమస్త చరాచరప్రపంచము శివుని ఆధారమునందేయుండి శివస్వరూప మగుననియేభావము. యోగులు ఏపరమాకాశము నందు లయమును పొందు చున్నారో, అవ్యక్తమగు ఆపరమాకాశమును జ్ఞానులు చిదానంద జ్యోతిర్లింగమని చెప్పుచున్నారు. పరమానంద రూప జ్ఞానమే సర్వోత్కృష్ట మైనది. సంశయము లేని మునులు అట్టి జ్ఞానమునే పరమాకాశమనిచెప్పుదురు. పత్రపుష్ప శాఖాదులు వృక్షస్వరూపముచేత ఎట్లు భిన్నమగుచున్నవో అటులే చరాచరాత్మకమైన జగత్తు పరమానందరూప శివస్వరూపముచేత భిన్నముగాకుండును. చరాచరాత్మకమైన ఈ జగత్తు శివునకు అభిన్నమై, శివునివలెనే సత్యము, నిత్యము యైయున్నదని భావము.

నిష్కలంకము, నిరాకారము, నిత్యము ఐన పరశివతేజస్సు నందు చిత్తవృత్తిని లయము గావించిన శివయోగిశక్తి కూడ, శివశక్తి వలెనే జ్ఞాన విశిష్ట, క్రియాస్వరూపమై యున్నదని చెప్పబడును. పరమేశ్వరుడుసర్వజ్ఞుడు, సర్వకర్తృ
83 సర్వ వ్యాపకుడై యుండును. శివయోగి అట్టి శివుని సామరస్య ధ్యానము చేత ఆవిధమైన శివస్వరూపుడై ప్రకాశించును. శివయోగియందు శ్రోత్రాది సర్వేంద్రియముల వ్యాపారము గలిగియున్ననూ, అతడు అంతర్ముఖమైన మనస్సు

చేత శివుని సాక్షాత్కరించు వాడై సంతోషపడును. ఇదియే క్రియా ప్రకాశము. తరంగాదులు సముద్రముకన్న భిన్నముగానట్లు బుద్ధి మొదలైన సర్వభావములు ఆత్మకన్న భిన్నముగావు. ఇదియే భావప్రకాశ మనబడును. విషయ నిర్లిప్తుడైన శివయోగికి శివభావము దృఢముగాగ ఏఏభావము లుత్పన్నముగు చున్నవో ఆ భావములు శివస్వరూపము లనబడుచున్నవి. అద్వితీయమైన శివస్వరూప భావము కర్మలను నాశము గావించును. శాంతిని బొందించును. అవిద్య (అజ్ఞానము) నావరించ నీయ కుండును.

ముక్తుడైన శివయోగి జ్ఞానసంబంధము స్వాభావికమై జ్ఞేయశూన్యమైనది మహాజ్ఞానియైన శివయోగి జ్ఞానము ఉపాధి రహితమైనందున జ్ఞేయాది త్రిపుటి భేదశూన్యమైన దనిభావము. ఉపాధివిశిష్టమైన జ్ఞానము ఆత్రిపుటి భేదమును ఉల్లంఘించకుండును సమస్తోపాధి శూన్యమైన బ్రహ్మజ్ఞానము ఉత్పన్నముగాగనే సర్వము జ్ఞానస్వరూపమై గనబడుచుండును. అందువలన మోక్షమునకు మూలకారణీభూతమైన శివాద్వైతజ్ఞానమునను భవించు శివయోగి ఎప్పుడు జననమరణ రూపమైన సంసారముచేత లిప్తుడు గాకుండును. నిత్యుడు, శుద్ధసత్త్వగుణ విశిష్టుడు, సర్వశ్రేష్ఠుడు, వాసనారహితుడు, హేయకలాశూన్యుడు, సర్వమునకు మిగిలినస్థానము గలవాడు, చరాచర ప్రపంచస్వరూపుడు, యైన పరశివునియందు శివేతరజ్ఞాన శూన్యతచేత మనస్సునులయము గావించిన విశ్వవ్యాపకుడైన శివయోగి విశ్వభేదమును దూరీకరించినవాడై తానేతానై ప్రకాశించు చుండును.

## లింగ ఐక్యస్థలము

శివయోగి ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయాది వ్యవహారమును లయము గావించి బ్రహ్మసాక్షాత్కారమునుపొంది స్వస్వరూపమునందుండును. శివాద్వైత జ్ఞానముచేత పోగొట్ట బడిన అంగ లింగ రూప జీవేశ్వర భేదాభినివేశముగల, పూర్ణజ్ఞానప్రకాశమును, సాక్షాత్కరించుకొన్న శివయోగికి సంసారబంధము గలుగదు. చిత్స్వరూపుడైనశివుడే సాక్షాత్కరించగ పృథ్వీతత్త్వముగాని, జలతత్త్వము గాని, తేజస్తత్త్వముగాని కనపడకుండును. సమస్తతత్త్వములు పరశివుని వలననే ఆవిర్భవించుచున్నందున సర్వము శివస్వరూపమై తోచుచున్నవి. ఆణవాది మలత్రయదూరుడైన శివ యోగి సత్ చిత్ ఆనందములకు సముద్ర స్వరూపమై స్వప్రకాశమైయున్న శివునియందు శబ్దాది సకల విషయములను సమర్పించి పరి

శుద్ధమైన ఆ విషయములను శివప్రసాదరూపముచేత ఉపభోగించును. సర్వ్వ లంను ఏమాయ ప్రకాశించుచున్నదో, ఆమాయ ఓదనస్వరూపమైనది. ఈఓదన స్వరూపమైన మాయయే చిచ్ఛక్తి విశిష్టమహా లింగస్వరూపము నందు అడగి యుండునో ఆమహాలింగస్వరూపమే శిష్టోదనమనబడును మాయాపాశబద్ధమైన ఈజగత్తు జ్ఞానముచేత ఆక్రాంతమైనందున స్వస్వరూప ప్రకాశమునందు ఆ మాయాతత్త్వమొకటి నిలుచును. అఖండసచ్చిదానందరూప పరబ్రహ్మస్వరూపుడు జితేంద్రియుడు, జీవన్ముక్తుడు శివయోగి విషయమునందు మాయదాసీ భావ మును పొందుచున్నది. జగన్మోహనా కారమై, నానావిధశక్తియుక్తమై, ప్రతి బంధరహితమై యున్నమాయ శివుని యందు సామరస్యముపొందిన శివయోగి యెదురుగ నిలుచుటకు గూడ సమర్థము లేకయున్నది. కనుక శివయోగి విష యములను తనయందే అడగించినవాడై శాంతుడైయుండును.

శివునియందు సామరస్యమును పొందిన శివయోగియందు చరాచరప్రపం చము లయము పొందు చుండగ, ఆశివయోగి విదేహియై చరాచర ప్రపంచ వినాశకుడగును. ఆకాశమునందుత్పన్న మగుచున్న మేఘములు ఆకాశమునందే లయమును పొందుచున్నట్లు. స్వస్వరూపానుభవియైన శివయోగి యొక్క ఆత్మ యందు ఉత్పన్నమగుచున్న శబ్దాది విషయములు ఆత్మయందే లయము పొందు చున్నవి. జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడుఅవస్థలకన్ననూ శ్రేష్ఠమైన తుర్యావ స్థను పొందిన శివయోగికి ప్రమాణ జ్ఞేయ జ్ఞానములతోయేమి ప్రయోజనము? అతని స్తుతి ధ్యానములు దూరమగును. అతడు పునః ప్రపంచమును జూడ కుండును. అన్య స్వరూపమును అన్య వస్తువును, అన్యవిషయమును తెలియ కుండును. అంతయు స్వస్వరూప మనియే యెంచును.

అనంతకోటి బ్రహ్మాండముల సృష్టిస్థితి లయమునకు ఆధార భూతమైన ఏ విమర్శశక్తి రూపజ్ఞానవిశేషము (తత్స్వాత్మకమైన శివుడే నేనను జ్ఞానవిశేషము) గలదో అదేభాండస్థల మనబడును విమర్శనామక పరాశక్తియు, సమస్తతత్త్వ ములకు సాక్షిభూతమైనదియు, విశ్వమును ప్రకాశముజేయు నంతటిదై యుండి సర్వతోముఖమై ప్రకాశించుచున్నది చరాచరాత్మకమైన జగత్తు దేనియందు అణగుచున్నదో, సచ్చిదానంద స్వరూపమైన పరమాత్ముడు దేనియందు ప్రత్య క్షమై ప్రకాశించుచుండునో అదేవిమర్శశక్తి యనబడును. శివయోగి "శివోహం

రూప పరాహంతే” యనుఅక్రమణముచేత విమర్శశక్తి వికాసముగలవాడై సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వవ్యాపకుడు, సర్వసాక్షి భూతుడు, మహేశ్వరుడగును. విమర్శ శక్తిరూప జ్ఞాన విశేష పాత్రయందు సమస్తతత్వములనుంచి ఆనందించుచున్న జీవన్ముక్తుడు, తన స్వరూపమునకు వేరైన వేరేయొక స్వరూపమును జూడకుండువాడై స్వస్వరూపము నందుండును.

సమస్తభువనాండముల సృష్టిస్థితిలయములకు కారణీ భూతమైన విమర్శ శక్తిరూప జ్ఞానవిశేషము ఏపరబ్రహ్మమునందు ప్రకాశించుచున్నదో ఆపరశివ బ్రహ్మమే భాజనమనబడును. చిత్ర విచిత్రమైన విశ్వసృష్టిని గావించు విమర్శ నామక పరాశక్తి దేని యందు అవినాభావము చేత ప్రతిష్ఠితమై యున్నదో ఆ బ్రహ్మమే విశ్వభాజన మనబడును. సమస్తవస్తువులను ప్రకాశింపజేయు చంద్రిక చంద్రునియందెట్లు స్థిరమైయున్నదో అటులే విమర్శనామకశక్తి ప్రకాశస్వరూప పరశివబ్రహ్మమునందు స్థిరమైయున్నది. చంద్రునివదలి చంద్రిక, చంద్రికనువదలి చంద్రుడుండనట్లు శివశక్తులు కూడ అవినాభావము చేత స్థిరమైయున్నవి.

అతివిశాలమైన వృక్షమునందుగల పత్రశాఖాదులు తద్వృక్షబీజమునందు ఎట్లు సూక్ష్మరూపము చేయున్నవో, అటులే చరాచరాత్మకమైన ఈ సమస్త ప్రపంచము పరమాత్ముని హృదయ (విమర్శశక్తి) రూపబీజమునందు సూక్ష్మ రూపముచే యుండును. ఇంద్రియ గోచరమైన స్థూలప్రపంచము లయించినను, అదిపరమేశ్వరుని యందు అతి సూక్ష్మ రూపముచేత యుండుటవల్ల, అద్వైతులు చెప్పునట్లు ఈప్రపంచము మిథ్య గాక సత్యమై యుండుననియే భావము.

“అ” కారము శివుడు “హ” కారము శక్తియనబడును. అకార హకార రూప శివశక్తి స్వరూపమైన పరబ్రహ్మము అహం యను పదమునందు నెలకొనియున్నది. “అహం” యనగ శివశక్త్యాత్మక బ్రహ్మమనియే భావముచిచ్ఛక్తి మూలాహంకారరూపము చేతను, సూక్ష్మ జగద్రూపము చేతను ఎవనియందు ప్రకాశించుచున్నవో ఆ శివయోగియే పరబ్రహ్మ స్వరూపుడని తెలియువలెను.

జీవన్ముక్తుడైన శివయోగికి సాంసారిక కర్మ ఫలముల పుణ్య కర్మసిద్ధమైనదేవత్వము, పుణ్య పాప మిశ్రమైన మనుష్యత్వము, పాపమయమైన తిర్యగ్జాతిత్వము యుండదు. ఆకాశము ఉపాధిసంబంధము చేత ఘట మఠాదులందు భిన్నభిన్నమై కన్పడుచున్నను నిజముగా అదిభిన్నము గాకుండునటులే పరబ్రహ్మ

ఉపాధి సంబంధము చేత దేవ దానవ మానవాది నానారూపమై తోచుచున్నను వస్తుస్థితియందు భిన్నము గాకుండును. ఒక్కటిగానే యుండును. అప్రమేయమగు చిత్స్వరూపము "ఏకమేవాద్వితీయం" యను శ్రుతివాక్యాభి ప్రాయాను సారమగు అద్వితీయవైభవ యుతమైన పరబ్రహ్మమునందు సామరస్యమును పొందిన శివ యోగి, తనను గాని తనకన్న భిన్నమైన ఏపదార్థమును గాని తెలియ కుండును. అద్వైత వైభవముగల ఏవస్తువునందు సామరస్య యోగముచేత జీవాత్మునకు భేదముండకుండనో నేను నీవు అను భ్రాంతికూడ యుండకుండును. సంయోగ వియోగములు, జ్ఞేయకల్పన, జ్ఞాతృకల్పన, బంధము, మోక్షము, గాని. నేను దేవుడను, నేను మనుష్యుడను, యను అభిమానముగాని, సుఖముగాని దుఃఖము గాని, జ్ఞానముగాని, అజ్ఞానముగాని, నేను శ్రేష్ఠుడను నేను కనిష్ఠుడను యనే భావముగాని, ఊర్ధ్వ భాగముగాని, అధో భాగముగాని, పశ్చాద్భాగముగాని, పురో భాగముగాని, బహిర్భాగముగాని అంతర్భాగముగాని, లేకుండునో, అట్టి చరాచరప్రపంచస్వరూపము, చిత్స్వరూపము, ఆనందస్వరూపము, సత్యస్వరూపము, శాశ్వతము, నిర్మలము, పరాకాశస్వరూపము ఐన పరబ్రహ్మము నందు సామరస్యమును పొంది పరబ్రహ్మస్వరూపులైన శివయోగులకు, తాముతమకన్య మైన వస్తువులు యను పరిజ్ఞానము యొక్క పరిహాస ప్రసంగము గలుగకుండును.

ఈ జీవన్ముక్తుడైన శివయోగి నేనున్నానను భావమునుండి నేను లేనను భావమునుండి దూరుడగు చున్నందున ఇతడు భావా భావాకలనుండి ముక్తుడై ప్రకాశించును. పరస్పరాపేక్షచే కూడిన అస్తి నాస్తి రూప భావముల వివేచనముగలయే భేదజ్ఞాను పరబ్రహ్మస్వరూపుడైన శివయోగియందుండకుండ నో ఆ భేదజ్ఞాన శూన్యతను ప్రతిపాదించు స్థలమును జ్ఞాన శూన్య స్థలమనియెదరు. "జ్ఞానంబంధః" యను శివసూత్రమునందుగల "జ్ఞాన" పదమునకు భేదజ్ఞానమని తెలియునట్లు, ఇక్కడ జ్ఞాన శూన్య స్థలమునకు భేద జ్ఞాన శూన్య మనియే తెలియవలెను. భేదజ్ఞాన శూన్యతయందు స్థూలప్రపంచభూతములు. సూర్యాది గ్రహాణములు, అశ్విన్యాది నక్షత్రములు, దేవతలు, మనుష్యులు, పశు పక్షులు అథవా వేరేవస్తువు లేవియు యుండవు నీవునేనను భేదజ్ఞానముకూడ యుండదు. కేవల సచ్చిదానంద స్వరూపము, అద్వితీయము, నిర్వికల్పమైన పరబ్రహ్మము మహాకాశస్వరూపమై ప్రకాశించు చుండును. జ్యోతిర్లింగ స్వరూపము, చిత్స్వ

స్వరూపము ఐన స్వప్రకాశమునందు సమరసభావమును పొందిన శివయోగికి భేద జ్ఞానము నశించును నీరు నందునీరు, అగ్ని యందు అగ్ని ఏకీభవించు నట్లు పర బ్రహ్మస్వరూపమహాలింగమునందు ఆత్మను లయింప జేయుటయే ఐక్యము. ఇట్టి లింగైక్యునకు జీవ భావము గలుగ కుండును. ఇదియే శివాద్వైత (లింగాంగ సామరస్య) సిద్ధాంత రహస్యము. ఈరహస్యమునే ప్రతివీరశైవుడు తెలిసి భక్తాది ఐక్యాంతషట్స్థలములను పొందిముక్తుడుగావలెను.

ఈషట్స్థల శాస్త్రము శ్రీ రేణుక గణేశ్వరునిచేత అగస్త్య ఋషీశ్వరునకు బోధింపబడినది. ఇది సర్వసిద్ధాంతములందు ఉత్తమోత్తమమైనది. వేద వేదాంత తాత్పర్య స్వరూపమైనది. కర్మజ్ఞానముల సామరస్యము గలిగించు నది. శివాద్వైత ప్రతిపాదకమై, వీరమాహేశ్వర గ్రాహ్యమైనది. ఈరహస్య శాస్త్ర శ్రవణమాత్రమున సర్వ పాపములు నశించును.. ఇందనంత విషయములు విపులముగా ప్రతిపాదింప బడినవి.

ఈ గ్రంథాభిప్రాయమునే ఇంతవరకు విపులీకరించి యుంటిని. ఇందు గల భ్రమప్రమాదముల గణింపకుందురు గాక యని ప్రార్థన,

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఇతి వీరశైవాచార పరాయణ, కాసుల మల్లప్ప పుత్ర

డా॥ కె. యమ్. రుద్రప్ప విరచిత,

శ్రీవీరశైవ సిద్ధాంత శిరోమణి యందు షట్స్థలములను

పదియవ ప్రకరణము సమాప్తము.

